

చెన్నపట్టణము, నవంబరు ౧౯౩౧

సంపుటము ౮ | ప్రజోత్పత్తి సంవత్సరము కార్తీకమాసము | సంఖ్య ౧౧

# వీర పూజ

విద్వాన్, కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు

శ్రీల కిరవయి సకలసుఖముల
    కాలయంబయి కీర్తికాంతకు
కేళిగృహమగు తెలుగుదేశము
    లీల గానముసేయరా?

ఆంధ్రవీరుల కర్హపూజల
    నాచరింపక యాంధ్రభువి నీ
రంధ్రసంపద లొంది సుఖపడి
    రాజిలంగలనో?

దివ్యకీర్తి గడించి శాశ్వత
    దివ్యధామము గన్నపూర్వుల
భవ్యచరితము పాడుటే యు
    వ్వాదిపూజ యగుౕ.

శాతవాహనచక్రవర్తి య
    శంబుమీరగ నిల్పె రాజ్యము
తెలుగునాటను జన్మమంది వి
    దిగ్దిగంతరసీమలౕ.

ఆంధ్రరాజ్యం బఖిలదిక్కుల
    నావరించి యనాహతప్రభ
మగధభూముల మాఱుమ్రోగిన
    మహిమ మఱచితిరో?

యుద్ధమల్లుడు విజయవాటిక
    శుద్ధశైవమతంబు నిల్పి ప్ర
సిద్ధసమయము తెలుగునాట ని
    బద్ధమణికాదో?

రాజరాజనరేంద్రుని సభా
  ప్రాంగణంబున భారతాంబుధి
తెలుగుపలుకుల వెల్లివిరిసిన
  తెరగు దలపరొకో?

నన్నపార్యుడు తణుకుజమ్మని
  జన్నమొనరిచి భరతచరితము
తెన్ను దెలిపిన తెనుగుకైతల
  తేట మఱచితిరో?

అలకదుపుల విడచి యాకట
  సోలివచ్చిన మగని సూతయు
జాలి తలపక నులుకమంచము
  చాచె నొకబాల.

ఆలమందున రాతిథాకకు
  దాళలేక రుదెంచినాడని
పాలువిరిచి కుమారు దూతెను
  ప్రౌఢ యొకజనని!

మొక్కవోవని ధీరమున గడు
  వెక్కసంబగు పగఱ మూకల
నుక్కడంచిన ఖడ్గతిక్కన
  నోపిపాడరుగా!

మనుమసిద్ధినృపాలు మానము
  మనుగడయు గణపతినరేంద్రుని
వలన గాచిన తిక్కమంత్రికి
  వలదె మ్రొక్కులిడన్?

తెలుగుదేశము తెలుగుజాతియు
  తెలుగుభాషయు దీప్తినొందగ
తెలుగుభారతమును రచించెను
  దిక్కయజ్వకథా!

కాకతీయుల ప్రాభవము లో
  కైకవిదితం బయి వెలింగిన
ప్రాకటం బగు కాల మేదెస
  బాఱిపోయినదో!

గణపతికి దగు పత్ని రుద్రమ
  ఘనమసీమాశౌర్యసంపద
జనుల నేలిన చరిత మాంధ్రుల
  మనము బోయదుగా!

రంగధాము ప్రసాదముం గని
  రామచరితము ద్విపదగూర్చిన
రంగనాథుని నతని సుతులను
  రాదె వినుతింపన్!

ఆదికావ్యం బాంధ్రభాషను
  ననువదించిన భాస్కరుని మది
పాదుకదలని భక్తి గొలువగ
  బాడియగు మనకున్.

భాస్కరుడు సకలార్థివారిజ
  వారమున కన నెగడె రాయన
భాస్కరున కిల దాత లెవ్వరు
  వత్తురే యెనయై?

పాల్కురికి సోమనకవీంద్రుడు
  మేల్కవితలో శైవతత్త్వము
గీల్కొలిపి హృత్తమ మడంచిన
  కీర్తిగొని చనిరోన్.

కొండవీటను రెడ్డినృపులు
  ద్దండబలసాహసము లొలయగ
దండిమంగలై ధరణి నేలిన
  తతి తలంప రొకో.

లీల శ్రీశైలాగ్రమున బా
    తాళగంగకు నేకసోపా
నాళిగూర్చి వేమభూపతి
    హరుని పద మొందెఁ.

శంభుదాసుని వలన హరివం
    శంబు కృతిగొని యన్న వేమన్న
జంభభేదను డజరకీర్తియు
    శర్వపద మొందెఁ.

లలితవ్యాఖ్యానంబు శాకుం
    తలమునకు నిడి కాటవేముం
డెలమి ఖండాంతరుల పొగడిక
    లెసఁగ వెలుఁగొందెఁ.

సాటిలేని పరాక్రమము పల
    నాటివీరులయందె కలదని
చాటిచెప్పిన బాలచంద్రుని
    చరిత మరచితిరో?

పొంగిపొరలిన విభుత రాజక
    ళింగగంగమహీశ్వరుండు తె
లుంగుకవులను గారవించు కె
    ఱుంగరొకో మీరల్.

దక్షవాటీ భీమలింగని
    కుక్షివలన జనించి కవులకు
సాక్షిసుండై నెగడు భీమన
    బ్రస్తుతింప దగుఁ.

ఎలమి నష్టాదశపురాణము
    లెఱిగి నాచనసోమ సత్కవి
యలవరించిన యాంధ్ర హరివం
    శాఖ్య కృతి గనరో?

సర్వసంగపరిత్యాగము
    సర్వరాజ్యధురంధరత్వము
ధర్మ కర్మ ప్రవచనము మా
    ధవునకే చెల్లుఁ.

పదను బాయని భక్తిరసమున
    యదుపతికి నభిషేక మొనరుచు
పదవి పోతన సుకవికే యల
    వడియె నిలలోనఁ.

భాగవతము పరాత్పరుని పద
    భాగముగ నర్పణ మొనర్చిన
భోగవిముఖుడు పోతనార్యుడు
    పూజ్యుఁ డెల్లెడలఁ.

రామనరపతి ప్రేమ గోరి మ
    హీ మహేంద్రుల ధిక్కరించిన
భూ మహితు డగు పోత సుకవికి
    పోల్కి లే దిలలోఁ.

కనుల గాటుకనీరు గార్చెడి
    కమలగర్భుని రాణివాసము
తనియ నెక్కటి ప్రతినగొన పో
    తన్నకే తగియెఁ.

సింగభూపతి సర్వవిదు డను
    గంగ నీ వని చెప్పధైర్య మి
లంగలదె పోతనకద క్కాక
    లాతికవి కెందుఁ?

రాజు రాణువ నంపినంత వ
    రాహరూపము నొంది రాముడు
తేజమొలసి యదల్చి పోతన
    దేర్చి కాచెకదా!

పోతనార్యుని భాగవతమును
బూతిమతిని బఠించు నాంధ్రుల
కాతతప్రథ సకలసంపద
లవియ చేకూరెఁ.

వివిధభూముల దిరిగి భాషలు
వివిధములు గడియించి కైతలు
వివిధరీతుల శ్రీనాథుడు
వినిచె లోకులకుఁ.

దండిమగ లగు పండితుల కు
ద్దండభీతి జనింప గాశీ
ఖండము నయఃపిండముగ నే
కవియొనర్చు భువిఁ.

నైషధీయచరిత్ర భాషా
యోష కుత్తమభూషగా నిడి
యాషధము పండితుల కిచ్చిన
యాఢ్యు డెవ డిలలోఁ?

భూభృదావళి మెచ్చగా గన
కాభిషేకము దేవరాయమ
హీభృదాస్థానమున బొందగ
నర్హు డెవ్వ డిలఁ?

ఎంచదగు పాండిత్యగరిమను
మించు డిండిమభట్టు నోరిచి
కంచుఢక్కను బగులగొట్టిన
ఘను డెవం డిలలోఁ?

ఎట్టనక శ్రీనాథుపదముల
బట్టి భజియించెడి జనములకు
నెట్టి సత్పదవైభవంబు ల
భించునో యహహా!

విష్ణునకు మఱురూపమగు శ్రీ
కృష్ణరాయమహీధవుండు జ
యిష్ణు డాతని చరితములు ప్రథ
విష్ణుగేయములో.

భువనవిజయసభాంతరంబున
నవనవోన్మేషమ్ముతో స
త్కవుల గోష్ఠిని దవిలి యుండుట
తలపుబాయ దోగిఁ.

కటకమాదిగ గల్గు భూముల
బటుతరపరాక్రమము మెఱయ న
ఘటితఘటనాదక్షుడై జయ
కంబముల నిల్పెఁ.

ఉదయగిరి భేదించి మాడుగు
సదయతను దహియించి కటకము
మృదుగతిని జేకొన్న యాతని
మేలు మఱచితిరో?

ఆకులంబన నెఱుగకయ క
న్యాకుమార్యగ్రంబు మొదలుగ
నా కటకపర్యంతభువి నత
డశ్రమత నేలెఁ.

తేనెలొలికెడి తెలుగుభాషకు
భూనభోఽంతరసీమలం దెన
గానరాదని చాటిచెప్పిన
ఘనుఁ డతడుగాడే?

తెలుగునాటికి తెలుగుజాతికి
తెలుగుభాషకు సాటిగానీ
యిల నొకండును లేదనుచు నెలు
గెత్తి చాటడొకో?

ముక్తికాంతను గవయుటకు నే
యుక్తులును సరిగావనుచు నా
ముక్తమాల్యము నిచ్చి రంగని
భక్తి ప్రకటించెన్.

విష్ణుభక్తుల చరితములు ప్రథ
విష్ణులగు నాంధ్రులకు దెలుపగ
విష్ణుచిత్తీయము రచించిన
వీరు మఱచెదరో?

సమ్మతిని శ్రీ కృష్ణరాయని
కిమ్మహితల మెల్ల గూర్చిన
తిమ్మరుసు మంత్రీశ్వరున కిల
దీటురా డెవడున్.

రాజపరమేశ్వరుడు కృష్ణధ
రావరుం డతివినయమున న
ప్పాజియని పిలువంగ బ్రబలిన
యాఖ్యు డాతడు కా.

దుష్టకవులకు గుండె లదరగ
శ్రేష్ఠకృతుల రచించి మించిన
యష్టదిగ్గజములకు నీడగు
నాంధ్రకవి కలడే.

ఏరునుం గనలేని తెరువుల
చారుకవితల గూర్చు పింగళి
సూరనకవీంద్రునకు సరియగు
వారు లే రిలలోన్.

వాణి రాణియటంచు బల్కిన
జాణయగు పినవీరభద్రుని
మానితంబగు మహిమ దెలియక
మనకు జయ మగునో!

పరహితాచరణుండు కాకో
దరము నం గుటిముల్లు వెఱికిన
పరహితాచార్యుం డనగ ధ
న్వంతరియ కాడో!

నాదమే పరతత్త్వ మదియు య
నాది యంతవిరహితమని స
మ్మోదమున నెఱిగించె త్యాగయ
కృతులమూలమునన్.

రాగభోగము లొందగోరక
రామభజన మొనర్చుటే పర
యోగమని యెలుగెత్తి చాటెను
త్యాగరా జిలలోన్.

భూనభోంతరసీమలం ద
జ్ఞానదుఃఖము నొందుజంతుల
ప్రాణముల నెలయించునది యీ
గానరసమె కదా!

కీర్తిశేషుల చరితములు దుః
ఖార్తి శమనము లనుచు; క. సా.
మూర్తిశాస్త్రి రచించె నీకృతి
పూర్వపుణ్యమునన్.

బంధములు వాయంగ నాంధ్రుల
కంధకారి విరించివంద్యుని
గంధిజామాతను భజించుట
ఘనశుభప్రదమహా.

# కతిపయశబ్దార్థశబ్దస్వరూపవిచారము

వేదము వేంకటాచలముగారు

౮-వ వ్యాసము

రెండవ వ్యాసమునందు-ఆంధ్రభాషకు గల శబ్దస్తోమములో పెక్కుమాటలు ఇతరభాషలనుండి వచ్చియున్నవని చెప్పుచు, ఆయాభాషల నామనిర్దేశముకూడ చేసియుంటిమి. ఆయాభాషలను గురించి మనవారి బోధలో కొన్ని యసాధువులగు నభిప్రాయము లుండుటచేత, నాభాషలలో నొక్కొకటిని పేర్కొని యత్కించిద్వివరము వ్రాయవలసియున్నది. అయినను ఆవివరమును ఇంకొక వ్యాసమునకు నిలిపి తఱచుగ వాడబడుచుండునవియు, ఆవశ్యకములును నయిన పదముల కొన్నిటిని ఈవ్యాసమునందు విమర్శింతము.

## ౧౮ హిందువులు

భరతఖండనివాసులలో నధికసంఖ్యగలవారు హిందువులు. ఈనామముచే నిర్దిష్టులెవరని యందఱకును తెలిసినవిషయమే-ఈపేరెట్లు కలిగినది? ఇది యేభాషలోనిది? లోకమంతయు వ్యాపించియున్నది. దీని కొక పర్యాయపదమును లేదు. ఇతరులు ఈనామముతో మనను పేర్కొనుటయే గాక, మనమును మననామముగ నీశబ్దమునే వాడుచున్నారము. ఇప్పటికి దాదాపు ముప్పదిసంవత్సరములక్రింద, నెల్లూరునాస్తవ్య లొక విద్వాంసులు ఆకాలపు వార్తాపత్రికలలో నీశబ్దపు విచారమును జేసియుండిరి. 'అపౌరుషము నాద్యమ్మ'నను శాస్త్రము నాధారపఱచి, 'హిడి గత్యా'మని కాబోలును ఆరంభించి, యిది కేవలసంస్కృతపదమని వాదించినారు. వారు చెప్పినది పొరపాటు.

సంస్కృతమునందు సింధుశబ్దము గలదు. ఇది సముద్రమునకు వాచకము. నదియను నర్థముగూడ గలదు. నదీశబ్దపర్యాయముగ గాక ఈపదమును గోదావరీ,కృష్ణా, అన్నట్లు నదులకు పేరుగ కూడ వాడుట కలదు. కొన్ని శాఖల నల్పనదులకుగూడ నామముగ వచ్చియున్నది. ఆర్యావర్తమున పశ్చిమభాగమున సింధునదియని సుప్రసిద్ధమయిన నది గలదు. ఆనది ప్రవహించు దేశమునకును ఆనామమే కలిగినది.

కావుననే 'దేశే నద విశేషేఽబ్ధౌ సింధుర్నా సరితి స్త్రియా'మని యమరుడు. మాలవరాజ్యములో నొక యల్పసరిత్తునకుగూడ సింధువను నామనిర్దేశము కలదు. ఈనదిని పేర్కొని, పూర్వమేఘమునందు ౩౦-వ శ్లోకమునందు యక్షుడు మేఘునాతకు కొన్ని సందర్భములను చెప్పియున్నాడు. దానికి ముందుండు శ్లోకమునందు (29) 'నిర్వింధ్యా' అను నదియొక్క వృత్తాంతమును చెప్పినాడు. 30-వ శ్లోకమున ప్రథమపాదమునకు రెండు పాఠము లున్నట్లు తెలియవచ్చినది. మల్లినాథ సూరి అంగీకరించిన పాఠ మిట్లున్నది: "వేణీభూత ప్రతను సలిలా సాత్వతీతస్య సింధుః"—పాఠాంతరము :—

"..............తా మతీతస్య సింధుః". మల్లినాథ సూరి లోకోత్తరుడగు విద్వాంసుడు. ఆయన దాక్షిణాత్యుడు— మాలవరాజ్యములోని నదులసంగతి వారికి తెలియలేదు. ఈమాటను దోషారోపణముగా చెప్పలేదు. ఈశ్లోకవ్యాఖ్యానములో వారు పొరపడినారని చెప్పుటవలన వారి యశస్సింధువాహినికి లోటు గలుగదు. నాకును దీనివలన నెక్కుడు గలుగదు. ౩ - వ వ్యాసమునందు మన విద్వాంసులకు కొంచెము భూగోళ పరిచితి కావలసియున్నదని చెప్పితిని. అందుల కుదాహరణముగ నీవిషయమును చెప్పుచున్నాను. కానిచో నీ ప్రశంస యప్రస్తుతము. మాలవరాజ్యమునందు సింధువను పేరు గల చిన్న నది యొకటి గలదని చెప్పితిని. నిర్వింధ్యయు నీ'సింధువును' ('చంబల్') చర్మణ్వతీ అను గొప్ప నదికి ఉపనదులు. ఈచిన్న నదిని ప్రాచీన నవీనభూగోళ

పరిస్థితిని తెలియపఱచు పటములలో ఈపేరుతో చూడ వచ్చును. పాఠాంతరము నంగీకరించిన వ్యాఖ్యాతలు హిందుస్థాన వాస్తవ్యులు. వారికి మాలవరాజ్యమునందలి సింధునదియునికి తెలిసి యుండవలెను. కాళిదాసు మాలవరాజ్యమున పుట్టి పెరిగినవాడుగనో, లేక నచ్చట పెరిగినవాడుగనో యుండును. పూర్వమేఘములో స్థల నిర్దేశములకు సంబంధించిన మఱియు మాలవరాజ్య స్తోత్ర పాఠము కవి హృదయముగ నుండినది. కావుననే మేఘదూతను 'వక్రః పన్థా యదపి' అను నవతారికతో సధ్యానమునకు త్రిప్పినాడు. మల్లినాథుడు పాఠభేదము నూదివేసి యొకరగొట్టినాడు. 'తా మతీతస్యేతి పాఠ మాశ్రిత్య సిన్ధుర్నామ కశ్చి న్నదః కాశ్మీరదేశే ఽస్తి- నదీతు కుత్రాఽపి నాస్తీత్యుపేక్ష్య మిత్యాచక్షతే—' అందుచేత ౨౯-వ శ్లోకమునందు చెప్పబడిన నిర్విన్ధ్యా అను నదీప్రసక్తియే తిరుగా ౩౦-వ శ్లోకమునందు చేయ బడినట్లు భావించి వ్యాఖ్యానముచేసినాడు. పాఠాంతర ములో 'అతీతస్య' అనుదానికి 'నిర్వింధ్యను దాటినవానికి' అని యర్థము. నిర్వింధ్యను దాటి సింధునదిని చూడగల వనుట. మల్లినాథసూరిపాఠములో 'అతీతస్య' అనుదానికి 'కాలాతీతస్య' అని సమన్వయము చేయవలసినట్లు తట స్థించినది.

దీనికి ఆధారముగ మూలమున వ్యంజక మేమియు లేదు. కాలాత్యయ ముండినచో ౨౯-వ శ్లోకమునందే సూచింపబడియుండును. మఱియు 'కాలాతీత'మనుట యెట్టిది-'ఆషాఢస్య ప్రథమదివసే'అని ఉపోద్ఘాత ప్రకర ణముననే తెలిపియున్నారు. పిమ్మట ఏకాదశినాడు గాని చాతుర్మాస్యల కారంభము లేదు. ఆషాఢము గతించి, నభోమాసముప్రక్రమించినపిదప వర్షర్తువు. మేఘుడును వెంటనే ప్రయాణసన్నాహము జేసినవాడు. ఇట్టిసన్నివేశములో కాలాతిక్రమణ మెట్టిది. ఇదియును గాక నిర్వింధ్యను చేరునప్పటికి మేఘునికి కాలాతిక్రమణ మయియుండగలదని ఆషాఢప్రథమదివసమునందే యక్షు డు ఎట్లు తెలిసికొనగలిగెను. వ్యాఖ్యానము సరియైన యెడల యక్షోక్తి అవధారణవాచకముగ నున్నదే గాని సందేహమున కేమి, ఊహావితర్కములకేమి, అవకాశము లేదు.

మఱియు 'సింధుః' అనుదానికి నదీమాత్రమని యర్థముచేసి, డిత్థడవిత్థాదివలె, రూఢమయిననామము కాదని భావించి, పూర్వోక్తనిర్వింధ్యాప్రశంసనే కవి పునరేవ చేయుచున్నాడని తీర్మానించిరి. కాగా ౨౯-వ శ్లోకములో యక్షుడు మేఘునినిర్వింధ్యకు చేయమని చెప్పినది గాక, వ్యాఖ్యాత ౩౦-వ శ్లోకములో కాలాతి క్రమణప్రాయశ్చిత్తార్థము, మేఘుని తిరుగా నిర్వింధ్యా సేవ చేయుమన్నాడు. 'అధిక స్యాఽధికం ఫలం.' ఒక సందర్భము వ్యాఖ్యాతమనస్సుకు రాలేదు. ౨౯-వ శ్లోకమునందలి వర్ణనము జూడ నీ నిర్వింధ్య యనునామె, యువకులు చెప్పుమాటగ, 'పిప్పళ్లబస్తా' వలె నున్నట్లు తెలియును. మఱియును, ఉద్రేకము గలిగి హావభావ చేష్టితములవలన నీమేఘునికి మరులుగొలుపు ప్రయత్న ములో నున్నట్టున్నది. ఇట్లుండ, నా నిర్వింధ్యయే, ఉత్తరక్షణములో [౨౯-వ శ్లోకములోని హితోప దేశము చరితార్థమయినపిదప] ఈ మేఘునిమీది బహు కాలపు వలవంతచే వంగవరుగువలె శుష్కించి, పంచమా మదవావస్థలో పడి, మాటపలుకు లేక ప్రాణములు నేత్ర గతములుగా, చావుకు సిద్ధమై యున్నదట. ఇదియు నసంభావ్యము. 'ప్రమాదో ధీమతామపి'. ఈప్రమాదము నకు కారణ మేమి? ఈమహనీయునికి మాలవరాజ్యపు భూమి పరిస్థితులు తెలియకపోవుటయే. భూగోళ విశేష ములు ఆకాలపు విద్యలలో చేరలేదు. 'ప్రకృత మను సరామః'—క్రీస్తుశకమునకు అయిదువందల సంవత్సర ములకు ముందు పారసీక చక్రవర్తులు భరతఖండము నందలి పాశ్చాత్యభాగమును అనగా కాశ్మీరము, పాంచా లము, సింధుదేశము, ఈభూములను వశముచేసికొని ఏలు చుండిరి. (౩-వ వ్యాసమును చూచునది.) ఈ మాగాణ మునకు సింధునదిని తూర్పు ఎల్లగ నిశ్చయించిరి. సంస్కృతమునందలి సింధుశబ్దము ప్రాచీన పారసీకము నందు హింటు అని యుండును. సంస్కృతమున సకార మున్నచోట్ల అవెస్తభాషలో హకార ముండును. సం-

స్కృతపు సకారము ఆభాషలో దన్త్యజకారముగ నుండును. అవెస్తవేదములోని శ్రౌషసూక్తమునందు ఈ మనసింధునదము పారసీకరాజ్యమునకు తూర్పు మేరగ చెప్పబడియున్నది. ఆవాక్య మిట్లున్నది: "ఉష్ట ఇరె హింద్వో దఓిష తఇరెనిగ్నె" అనగా పూర్వదిశయం దుండు సింధునదివద్దనుండిఓ పశ్చిమమున 'సీవా' అను రాజధానివఱకు నని యర్థము. ఆకాలపు పారసీక ప్రభువులు తమ యేలుబడిలోని భరతఖండ భాగమునకు 'హిందు' దేశమని సింధునది నామమును వాడుచుండిరి. [గోదావరిజిల్లా, కృష్ణాజిల్లాఅని వాడుకలోనుండునట్లు.] ఈవల ఆభాగములు యవనుల, అనగా గ్రీకుల, పరిపాలనలో జేరినవి. వారు ఈపారసీకశబ్దమయిన హిందుపదమును స్థిరపఱచుకొని, ఆర్యావర్తమున కంతయును ఆ నామధేయమును చెప్పుచు వచ్చిరి. దేశనామమునే వాస్తవ్యులను నిర్దేశించుటకు గూడ వాడుచు వచ్చిరి. మనవారిని ఈయవనులు 'హిండోయి', 'ఇండోయి' అని పేర్కొనుచుండిరి. గ్రీకులవలన రోమనులును, వారివలన నితరయూరోపియనులును, ఈశబ్దమును మనదేశమునకును, మనకును నామముగ వాడుట యేర్పడి స్థిరపడి పోయినది. హిందువులు—ఇండియా......

## ౧౯. యవనులు

సంస్కృతగ్రంథములలో ప్రాచీనములగు వాటియందు ఈయవనశబ్దము వచ్చినచోట నంతయు గ్రీకులని యర్థము. ఈశబ్దము సంస్కృతమా లేక తదితరమా? ఈ విషయము రామాయణమును జెప్పిన మహర్షికి తెలిసియుండినది. వసిష్ఠవిశ్వామిత్రోపాఖ్యానమున గాధేయుని సైన్యముల నెదుర్కొనిపోరుటకు వసిష్ఠునిశబల ప్రతియోధులను సృష్టిచేయబూనినది. అపుడు ఆశబలయొక్క యోని దేశమునుండి పుట్టినవా రయినందున వీరు యవను లయిరి; అంతకు ముందు వీరి సృష్టి లేదు. 'యోనిదేశాచ్చ యవనా శ్శకృద్దేశా చ్ఛకాః స్మృతాః.'

ఈనిర్వచనము వాల్మీకిమహర్షికి స్వతసీవ తోచినది గాదు. రామాయణము జెప్ప సంకల్పించినపుడు, వేధ పంపున నారదుడు వచ్చి భూతభవిష్యద్వర్తమానము నంతయు వాల్మీకిమహర్షికి ఎఱింగించినసందేశములో చేరియుండవలెను. కాకుండిన నీనిరుక్తరహస్యము పరమేష్ఠికిదప్ప ఇతరుల కెట్లు తెలియును? ఈనిర్వచనము ఇతరభూములయందలి జనములకును, యవనులకునుగూడ తెలియనందున, ఈనామధేయము నన్యథా సమర్థించియున్నారు. గ్రీకుదేశమునం దొక చిన్నభాగమునకు పురాతనమున 'ఇయోనియా'అని నామముగ నుండినది. అక్కడి జనులకు ఇయోనీః అనినామము. ఈ గోత్రజ్ఞులు గ్రీకుదేశములోని ఇతరగణములవారికన్న కడు మేధావంతులని ప్రసిద్ధి గాంచినవారు. వీరు మిక్కిలి వృద్ధిజెంది ఆసియామయినరు సముద్రతీరములయందుకూడ జేరి, గొప్పపట్టణములను నిర్మించి, స్వరాజ్యపరిపాలన చేసికొనుచునచ్చిరి. వాణిజ్యమునందు, విద్యలయందు, కళలయందు, శిల్పవిన్యాసములయందును, సమధికులుగ నుండిరి. 'ఏఫీసస్'అను నగరమునందు ధ్యానా, జానా, జ్ఞానా, అనునామము గల'జ్ఞానప్రసూనాంబకు' వీరు నిర్మించిన దేవళము ఈప్రపంచములోని సప్తమహాద్భుతములలో నొక్కటిగా చెప్పబడుచుండినది. ఈగణమువారు అలెగ్జాండరుకుముందు ఆసియాలో విశేషించి తెలియవచ్చినవారు. అలెగ్జాండరుకన్నముందు ఒకపారసీకచక్రవర్తి కొందఱు గ్రీకులను పట్టి తెచ్చి కాశ్మీరోత్తరభూములలో నివేశింపజేసినాడని ౩-వవ్యాసములో చెప్పియుంటిమి. ఇట్లు నివాసితులలో నీగణమువారు చేరియుండిరి. కాగా కాశ్మీరపాంచాలాదిదేశములవారు ప్రథమమున వీరిని, పిమ్మట గ్రీకుల నందఱిని, యవనులు అని వైకృతోక్తిగ పేర్కొనుచుండిరి. ఇట్లీయవనశబ్దమునకు పుట్టుక కలిగినది.

మధ్యఆసియాలో యవనులు క్రీస్తుశకమునకు ఈవల ఒకశతాబ్దములోపల నస్తమించి పోయిరి. భరతఖండమునందు, కాశ్మీరము, పాంచాలము, సింధుదేశము ఈభాగములయం దుండిన యవనులు హిందువు లయిపోయిరి. అటుపిమ్మట వీరికి పేరు ఊరు లేకపోయి, ఆర్యావర్తమునందలి జనులు ఈచరిత్ర విషయములను సంపూర్ణముగ మఱచిపోయిరి. ఇట్లు కొన్నిశతాబ్దములు జరిగిన పిదప

ఈయవనశబ్దమునకు పునర్జన్మము కలిగినది. అయినను మొదటిరూపము పునర్జన్మములో రాదు గనుక, ఈ రెండవరూపమునందు యవనము అనగా అరాబియా అని అర్థము ఏర్పడినది. అది యిప్పటికిని వాడుకలో స్థిరపడి యున్నది. మాతరగతివారము బాల్యములో పాఠశాలలో విద్యార్థులముగా నుండినప్పుడు 'యవనము అనగా అరాబియా' అని మాకు ఒజ్జలు చెప్పుచుండుటయు, మేము కంఠపాఠము చేయుచుండుటయు జరుగుచుండినది. మఱియు పండితులకు తెలిసియుండినది ఈ యర్థమే అయినందున, ప్రాచీనగ్రంథములలో నెక్కడ గాని యవనశబ్దము తటస్థించినయెడల అరాబియా, అరబులు అని యర్థము చెప్పుచుండిరి. ఇది కేవలము అనర్థముగ పరిణమించినది.

దీనికి కారణము 3-వ వ్యాసమునందు, ఈజిప్టు దేశమును క్రీస్తుశకము ఆరంభకాలమున రోమనులు ఆక్రమించిరనియును, పిదప రెండుశతాబ్దముల లోపల తురుష్కులు ఆసియా అంతయును వశపర్చుకొనిరనియును, వారి ప్రభుత్వము ఈభూభాగములలో పైగాంబరు మహమ్మదుగారి నిర్యాణమునకు జరుగుచువచ్చిన దనియును, చెప్పియుంటిమి. ఈవల ఆతావులయందు మహమ్మదీయుల ప్రభుత్వము ఏర్పడినది. ఈ యన్నికాలములయందును పశ్చిమసముద్రముమీద భరతఖండముతో వాణిజ్యము నిరంతరము జరుగుచునే వచ్చినది. ఈవర్తకము విశేషించి అరబ్బీదేశపు సాంయాత్రికుల స్వాధీనములో నుండినది. అరాబియాదేశమునకును ఈజిప్టునకును నడుమ నుత్తరదక్షిణములుగ నొక దీర్ఘమయిన సముద్రశాఖ వ్యాపించియున్నది. ఈ సింధుశాఖ దక్షిణభాగమున అనగా అరాబియాలో నిరృతిభాగమున అరాబియాలో చేరినదయిన 'యమన్' అను మండలము గలదు. రోమనులకాలములోనేమి ఈవలనేమి ఈ 'యమన్' దేశస్థులు ప్రబలమయిన వర్తకవ్యాపారములను చేయుచుండి మహైశ్వర్యములో నుండిరి. వారి ప్రతినిధులు నిరంతరము భరతఖండపు పశ్చిమపురేవు స్థలములలో నుందురు. పశ్చిమసముద్రముమీది వాణిజ్యమంతయు నించుమించుగ వీరి చేతులలో నుండినది.

కాగా నీ'యమనులు' మనవారికి సామాన్యముగ తెలియ వచ్చిరి. దేవుడు అనుపదము దేముడు అని గ్రామ్యముగ నేర్పడినట్లు, యమనులు అనునది యవనులు అని మాఱినది. కావున యవనులు అనగా అరాబియావారు, యవనము అనగా అరాబియా, అని పండితపరంపరశిక్షలో నేర్పడిపోయి ప్రాచీనసంస్కృతగ్రన్థములలో కూడ యవనశబ్దము తటస్థించినచోట్ల దానికి ఆధునికముగ నదే అర్థము చెప్పబడుచున్నది. ఈయమనులు మనవారికి తెలియవచ్చి, మనభాషలలో నీశబ్దము చేరినకాలమునకు, ఈయమనులు మహమ్మదీయు లయియుండిరి. కాగా యమను లనునది అరాబియాదేశపు మహమ్మదీయుల నిర్దేశమయి, ఈవల మహమ్మదీయసామాన్యవాచకముగ పరిణమించినది. మహాకవిజగన్నాథపండితరాయకృతియగు భామినీవిలాసమునందలి యీక్రిందిశ్లోక ముదాహరణముగ నుపచరించును.

"యవనీ నవనీతకోమలాంగీ, శయనే చేన్మమ భామినీ భవిత్రీ, అవనీతలమేవ సాధు మన్యే,న వనీ మాఘవనీ వినోదహేతుః". ఇచట యవనీ అన్నది ఢిల్లీ పాదుషాకూతురు, లవంగీ.అను బాల. పాదుషా మొగలయి ప్రభువు. అరబ్బీవారు కాదు. మఱియు పండితరాయల కృతులయందు తాత్కాలికపు భరతఖండవాస్తవ్యులగు మహమ్మదీయులను చెప్పుటకు తఱచుగ యవనశబ్దమును వాడుచువచ్చినాడు. ద్వితీయయవనశబ్దపు వ్యుత్పత్తి తెలిసియుండదు. ఈపండితరాయడు గొప్పపారసీవిద్వాంసుడు. శ్రుతధరుడు. వీరినిగుఱించిన వివరము మహానీయుడు కావలివెంకటరామస్వామిపండితుని 'Biographies of the Dekhan poets"(౧౮౨౯)లో చూడవచ్చును.

## ౨౦ అసురులు

అసురశబ్దము సంస్కృతమునందు అనేకార్థములను పొందియున్నది. వీటిలో సుప్రసిద్ధమైయుండునది దైత్యనామపర్యాయము. ఈశబ్దము ఒకకాలమందు ప్రశస్తమగు నర్థమునందు నిలిచియుండి, ఈవల జఘన్యముగ పరిణ

మించినది. వేదములలో కొన్ని భాగములయందు ఈ ప్రాశస్త్యము కానవచ్చుచున్నది.

౧. ఋగ్వేదము, ౧-వ మణ్డలము, ౬-వ అనువాకము.

త్వయా న్నస్మభ్య మసుర ప్రచేతా

రాజ న్నేనాంసి శిశ్రథః కృతాని.

ఇచ్చట నసురశబ్దార్థము 'అనిష్ట క్షేపణ శీలః' అన్నారు.

౨. ఋగ్వేదము, ౧-వ మణ్డలము, ౭-వ అనువాకము.

విసుపర్ణో అన్తరిక్షా ణ్యఖ్యత్

గభీరవేపా అసుర స్సునీథః.

ఇచ్చట నసురశబ్దమునకు 'శత్రూణాం నిరసితా' అని యర్థము చెప్పినారు. ప్రాణముల నిచ్చువాడని కూడ చెప్పిరి.

౩. ఋగ్వేదము, ౧-వ మణ్డలము, ౭-వ అనువాకము.

హిరణ్యహస్తో అసుర స్సునీథః

సుమృళీకః స్వవా యా త్వర్వాఙ్

అపసేధ న్రక్షసో యాతుధానాన్

అస్థా ద్దేవః ప్రతిదోషం గృణానః.

ఇచ్చట నసురశబ్దమునకు ప్రాణముల నిచ్చువా డని యర్థము చెప్పిరి. [ఈఋక్కులో మూడవపాదము నందలి 'రక్షసో యాతుధానాన్' అను పదములను వక్ష్యమాణ రాక్షసశబ్ద విచారవిషయమై గమనింతురని ఎచ్చరిక.]

౪. ఋగ్వేదము, ౨-వ మణ్డలము, ౧-వ అనువాకము.

త్వ మగ్నే రుద్రో అసురో మహో దివః.

ఇచ్చటకూడ అసురశబ్దమునకు పైయర్థమునే చెప్పినారు.

౫. ఋగ్వేదము, ౨-వ మణ్డలము, ౩-వ అనువాకము.

దేవా విశ్వస్య భువనస్య గోపాః

దీర్ఘాధియో రక్షమాణా అసుర్యమ్.

ఇచ్చట నసుర్య మనగా మేఘమునందలి యుదక మన్నారు. అసుర అనగా మేఘ మనియును, అసుర్యం తత్సంబంధి యుదక మనియు చెప్పిరి. అసు=ఉదకమును, ర=ఇచ్చునది, కావున మేఘమని.

౬. ఋగ్వేదము, ౨-వ మణ్డలము, ౪-వ అనువాకము.

ఈశానా దస్య భువనస్య భూరే

ర్నవాఉఉయోష ద్రుద్రా దసుర్యం.

ఇచ్చట నసుర్యశబ్దమునకు బలమని యర్థము చెప్పినారు.

౭. ఋగ్వేదము [౭-౭౩-౭(?)]

దేవా శ్చిత్తే అసుర్య ప్రచేతసః

యజ్ఞియం భాగ మానశుః.

౮. తైత్తిరీయసంహితా (కృష్ణయజుర్వేదము)

౧ వ కాణ్డము, ౪ వ ప్రపాఠకము, ౩౯ వ అనువాకము.

అగ్నే రనీక మప ఆవివేశ

అపాం నపా త్ప్రతిరక్ష న్నసుర్యం

దమేదమే సమిధం యక్ష్యగ్నే.

ఇచ్చట—'అసుర్యం' అనుదానికి 'అసురైః క్రియమాణం యజ్ఞవిఘాతం (ప్రతిరక్షన్=ప్రతినివారయన్-)' అన్నారు. ఈతావుల నసురశబ్దమునకు—పరదేవత యని యును, అసుర్యశబ్దమునకు—దైవ్యం అనియును చెప్పిన సమంజస మగును. అపాం నపాత్ ప్రతిరక్ష న్నసుర్యం అన్నచోట యజ్ఞవిఘాతము ననియును అసురుల కృత్యము ననియును చెప్పవలసినట్లు కనుపడలేదు. అసుర్య మనగా—తమ పరదేవతారాధనకు సంబంధించిన విషయ మనుట యొప్పును. వీరి పద్ధతులలో చేరిన ఇష్టాపూర్తములు, దేవయజనాదికమును.

వేదములోని అసురశబ్దమునకు ఈక్రింద వివరించిన యర్థములను కొందఱు నైఘంటికులు లక్షించి యున్నారు. పరమాత్మ, విరాడ్రూపము, దైవ్యము, సూర్యుడు—లౌకిక సంస్కృతమునందును కొంత వేదమునందును దైత్యనామముగ రూఢమయి దేవద్వేషులను తెలుపును.

ఈపదమునకు సంస్కృతకోశముల వ్యాఖ్యలయందును నిఘంటువులయందును వ్రాసియుండు రూపనిష్పత్తి, వ్యుత్పత్తి, వీటిని పరిశీలించుట ముఖ్యమయి యున్నది.

౧. అ + సురా......=సురను (సారాయిని) త్రాగనివారు. ఇచ్చట ప్రథమవర్ణము, నఞర్థకముగా భావింపబడినది. [ఆహో! మద్యమును త్రాగువారు యోగ్యులు, దేవత లయిరి. దానిని త్రాగకూడదను నియమము గలవారు అయోగ్యు లయిరి.]

౨. అ + సుర = అనగా సురలకన్న నితరులు. సురలు కానివారు. ఇక్కడను అకారము నఞర్థకము.

3. అస్యన్తి దేవా నిత్యసురాః - అసు క్షేపణే- దేవతలను తన్ని తఱుముువారు.

౪. యజ్ఞభాగా న్నిరస్యన్త ఇతివా, యజ్ఞభాగములవలన త్రోయబడినవారు.

౫. అసూన్ ప్రాణాన్ రాన్తి గృహ్ణం తీతివా; రా ఆదానే-ప్రాణములను గొనువారు.

౬. అసుషు రమన్తేవా - దేవతల, లేక సురుల, ప్రాణముల (తో) యందు క్రీడించువారు.

౭. బృహదారణ్యకోపనిషద్భాష్యము నందు, అసురశబ్దమునకు చెప్పిన నిర్వచనము స్వేష్వేవ అసుషు రమణాత్ - సురేభ్యోవా అన్యత్వాత్ - అనియున్నది. దేవతలును అసురులును ప్రజాపతియొక్క ప్రాణములు, వాక్కు, మొదలగు తత్త్వములనియును, అందులో దేవతలనునది శాస్త్రజన్యజ్ఞానమును, కర్మమును, స్వీకరించిన ప్రాణావతత్త్వములనియు; అసురులు స్వాభావికప్రత్యక్షజనితజ్ఞానమును, కర్మమును, స్వీకరించిన తత్త్వములనియు చెప్పినారు. కావున నీయిరుతెగలును అంతస్తత్త్వవిశేషవాచకములే కాని మూర్తిమన్తములయి జంగమకోటిలో చేరిన ప్రాణివిశేషములు కావనుట. ఇట్టిసందర్భములో 'స్వేష్వేవ అసుషు రమన్తే' ఇత్యాదికమునకు అర్థము కనపడలేదు. మఱియు వేదములయందును ఇతిహాసాదిగ్రన్థములయందును చెప్పబడిన అసురులుగాని, దేవతలుగాని మిథ్యాకల్పన అని యేర్పడును. ఇట్టి వాటికి భాష్యకర్తలుగాని యితరులుగాని వ్యుత్పత్తులను వెదకుట వృథాప్రయాసము.

ఇట్టి వ్యాపరబహుళ్యమువలన యాథార్థ్యము తెలియలేదని యేర్పడుచున్నది. ఈసమాధానములలో నొకటియయినను ప్రశస్తార్థమునందు జెప్పబడిన వైదికోక్తియగు 'అసుర'శబ్దమునకు సరిపడజాలదు.

అవెస్తశ్రుతులయందలి అసురశబ్దమును మాతము. సంస్కృతమునందలి 'సకారము' అవెస్తభాషయందు హకారముగ నుండు నంటిమి. అట్లే ఆభాషయం దీశబ్దము 'అహుర-'అని యున్నది.

అవెస్తశ్రుతులయందు ఒకపరాత్పరవ్యక్తియందు నమ్మకము తెలియుచున్నది. ఆమతము ద్వైతసిద్ధాన్తములో చేరినది. ఆ'పర'రూపము ననుచరించుచు ఇతర దేవతలు, అమాత్యప్రాయులు, అధికృతులు గలరు.

శ్రాషుడు, వృత్రఘ్నుడు-ఇత్యాదులు.

ఆ'పర'రూపమునకు అహుర అనియును, అహురమజ్దాః అనియును నామములు. అహురశబ్దమున కర్థము ప్రాణములను ఊడబెఱుకువాడని కాదు. ప్రాణముల నిచ్చువాడని యర్థము. 'అహురమజ్దాః' అనుపదములో, మజ్దాఃఅనునది సంస్కృతమునందలి మేధాశబ్దము. సర్వజ్ఞుడని యర్థము. [మేధాపక్షిణామూర్తి.]

మజ్దాః = మేధా అయినవిధమున నే- అవెస్తశబ్దము 'నజ్ద్' (Nazd) అనునది సంస్కృతమున 'నేదీయస్' అని యుండును. [రెంటికిని ఒకటేయర్థము.]

అవెస్తశ్రుతియందు భగవంతునిగూర్చి జరథుస్త్రఋషిచేసిన యొకప్రశ్న ఇట్లున్నది.

"క్వ నరగ్ం ఇరిస్తనగ్ం తనూం బరామ?
"అహురమజ్ద క్వ నిదథామ?"

"చనిపోయిన నరులదేహములను ఎక్కడకు కొనిపోవుదుము. ఓ. సర్వజ్ఞుడవయిన అసురుడా! ఎచట నుంతుము?"

వేదములలోని భాష (ముఖ్యముగ ఋగ్వేదములోనిది) సంస్కృతము కాదు. తత్పూర్వ రూపము. అప్పటికి వ్యాకరణశాస్త్రము పరిష్కరింపబడ లేదు. కావున నే ఈవల స్థిరపడిన వ్యాకరణమునందు వైదికపద ప్రక్రియనుగూర్చి వేఱుగ సూత్రములు ఏర్పడియు, అదు గడుసుకు 'బహుళం ఛన్దసి', 'వా ఛన్దసి' అని ఎచ్చరిక

చేయబడుచునువచ్చినది. శ్రుతులను జూచిన ఋషులంపజేపాండిత్యమును సమానమనిగాని, అత్యుత్తమ మనిగాని చెప్పుటకు లేదు. ఇట్టివిశేషములు లోకమునందలి యన్ని భాషలయందును గలవు. వేదములు పూర్ణములగువఱకు వ్యాకరణము లేర్పడి, భాష సంస్కరింపబడి, లౌకికసంస్కృత మారంభమయి, ఈవల వృద్ధిజెందినది. కాలక్రమమున వేదములలోని కొన్ని యపూర్వశబ్దములును, వాక్యసరళి, పదములకూర్పు శక్తియును ఉత్పన్నములయిపోయి, లౌకికసంస్కృతమున చేరకుండుట తటస్థించినది. అట్టిశబ్దముల యర్థవిశేషములు ఈవలివారికి తెలియకుండుట సహజము గదా. వేదభాష్యములు ఆధునికములు. ఈభాష్యము లుపక్రమింపబడుటకు అనేక శతాబ్దములకు ముందే ఆవేదములభాష చాలవఱకు అస్తమించిపోయినది. నిలిచినవఱకు లౌకికసంస్కృతములో రూపుమాఱిపోయినది. ఈ భాష్యములను రచియించినవారు వారికాలమందు అద్వితీయులగు విద్వాంసులు. అయినను వారికి సాధనసంపద తక్కువ. విశేషించి మీమాంసాదర్శనములను, పాణినీయవ్యాకరణమును, నిరుక్తమును, ఆధారపఱచుకొనుచుండిరి. అయినను, కడు ప్రాచీనములయి ఈవల నాశము జెందిన పదములను ఈసహాయసంపదవలననే సమన్వయించుతెఱగు కలుగదు. ఏలనగా బ్రాహ్మణముల కాలముననేమి, పాణిన్యాదుల కాలముననేమి, మీమాంసకుల కాలముననేమి, నైరుక్తుల కాలముననేమి వైదికశబ్దముల కనేకముల కర్థమును వ్యుత్పత్తియును తెలియక ఊహలచే సాధింప యత్నించుట కానవచ్చుచున్నది.

కాగా భాష్యకర్తలు అనేకస్థలములయందు అర్థము తెలియక సందర్భానుసారముగ ఊహలు చేసి వ్రాయుచువచ్చిరి. శబ్దములయొక్క నిజమయిన యర్థము ఇదమిత్థమని యట్టితావుల తెలిపి వ్రాయుట కాదు. ఇట్టివే అసురశబ్దార్థములు. ఇట్టిపరిస్థితిలో నీభాష్యములయందు అనేకములు అపార్థనిర్ణయములు గలవు. సందర్భానుసారమనుటలో అధునాతనసందర్భములే అనుసరించి రెండువేలసంవత్సరముల క్రిందకూడ నిట్టిసందర్భముల యుండినవని భావించి చేయబడిన యూహలవలన తప్పులు చేరకయుండవు.

క్రీస్తుశకమునకు ముందు రెండువేలసంవత్సరముల కాలమప్పుడు బాబిలోనియాగణములనుండి కొందఱు చీలిపోయి పారసీకరాజ్యమునకు వాయవ్యాంతమున నొక క్రొత్తప్రభుత్వమును స్థాపించుకొనిరి. (3-వవ్యాసమును చూచునది.) వీరు కొన్నిశతాబ్దములు తగ్గలో నుండి క్రమక్రమమున వృద్ధిజెంది వేయిసంవత్సరములు నిరంకుశులయి, ప్రతిపక్షభయంకరులయి, దిగ్విజయములు చేయుచు ప్రభవించియుండిరి. వీరు తమ భగవంతుని 'అషుర్', 'అష్షుర్' అను నామముతో నిర్దేశించియుండిరి. ప్రథమము వారు నిర్మించిన రాజధానికి భగవద్దర్పణముగ 'అష్షుర్' అని పేరుపెట్టిరి. తమ రాజ్యమును, భూములను 'అషుర్యా'అని చెప్పుచుండిరి. తద్ద్వారా తమ పేరును 'అషుర్యులు' అని వాడుచుండిరి. ఇతరుల ఉచ్చారణలో నీషకారము సకార మయినది. కాగా వీరిదేవుడు అసురుడు. వీరలు అసురులు.(3-వ వ్యాసమును చూచునది.) బాబిలనువారును, వారికి ఆకాలములయందు పశ్చిమమున ఆసముద్ర ముండినవారును, వీరిజ్ఞాతివర్గములవా రయి అసురగణములో చేరినవా రయిరి. ఆర్యశాఖలో చేరిన సాంస్కృతికులయు పారసీకులయు పూర్వులు ఒకకాలమందు ఈయసురగణములతో మిశ్రమయియుండిరని చెప్పియుంటిమి. పృథివ్యప్తేజోవాయ్వాకాశముల కధిదేవతల నీయార్యులు భావించి కొల్చుచుండిరని చెప్పితిమి. ఒక మెట్టు అధికముగ నెక్కిపోయి యట్టి చిఱుత దేవతలపయి అధికృతుడును, ఈప్రపంచమునకు సృష్టిస్థితిలయకారకుడును, జ్ఞానస్వరూపుడును నగు మేధామూర్తి పరాత్పరరూప ముండునని భావించుటకు కొంత కాలము చెల్లినది. అట్టిప్రబోధ ఈయసురుల నిగమము వలన కలిగినది. అంతట నీసాంస్కృతికులును, పారసీకులును భగవన్నామమయిన యీయసురశబ్దమును తమ భాషలలో చేర్చుకొనిరి. అట్లు కొంతకాలము సాంస్కృతికుల శ్రుతులలో నీశబ్దము పూజ్యార్థమునం దుండినది.

కాలక్రమమున నీయార్యశాఖలవారి శక్తిసామర్థ్యములు తగ్గుటయు, అసురుల ప్రభావము హెచ్చు

టయు తటస్థించిన పిదప, పరస్పరము బద్ధవిరోధము సంభవింపగా, ఆకాలములయందు అసురులకును. దేవతలకును నిరంతరము యుద్ధములు జరుగుచుండుటయు, జయాపజయములు కలుగుచుండుటయు సంభవించి,యీ విశేషములు వేదములలో నగుపడుచుండినవి. ఈ ద్వేషములు కారణముగా సాంస్కృతికులు అసురశబ్దము తమ విరోధులనామమై అనుదినము వాడుకలో నుండుటచే భగవన్నామముగ వాడుటను నిలిపివేసినారు. అట్టి కాలములయందు సాంస్కృతికులును, పారసీకులును దేవతలు; విరోధులు అసురులు. పారసీకులు ఈ యసురశబ్దమును స్వీకరించినది మొదలు వారి ద్వైతసిద్ధాంతములకు అనుకూలించియుండుటచే, దీనినే స్థిరముచేసికొని కడవఱకు భగవన్నామనిర్దేశముగ వాడుచుండిరి. ఇట్లుండ, కొంత కాలమునకు ఈ సాంస్కృతికులకును, పారసీకులకును వైషమ్యము సంభవించి ప్రబలినది. అంతట ఈ పారసీకులు 'అహురమజ్దాః' లేక 'అహుర' (అనగా అసుర) అను పరదేవతను ఆరాధించువా రగుటచేతను, ఆయసురశబ్దము అంతకు ముందు ప్రసిద్ధముగ నిరువురులకును విరోధులను అసురులను చెప్పునదిగా నుండుటచేతను, సాంస్కృతికులు ఈక్రొత్తవిరోధులను, ఈ భ్రాతృవ్యులను పూర్వతరవిరోధులతోపాటు నిరసించి, అసురశబ్దముచే వీరినిగూడ నిర్దేశించుట కారంభించి, తమ్మును తాము పూర్వవత్ దేవతలని చెప్పుకొనుచుండిరి. దాని శేషమే భూసురశబ్దము. ఇట్టి సామర్థ్యము అహురమజ్దభక్తులకు ఉండకపోలేదు గనుక వారును వెంటనే ఈదేవశబ్దమును రాక్షసులు పిశాచములు అను నర్థమునందు వాడుట కుపక్రమించిరి. కాగా అవెస్త శ్రుతులయందును, ప్రాచీన నవీనపారసీవాణియందును, దేవశబ్దమునకు పిశాచమనియు రాక్షసుడనియు అర్థము స్థిరపడిపోయినది. ఇప్పటికిని పారసీయందును హిందూస్థానీభాషయందును దేవ్ అనగా భూతము, పిశాచము, రక్కసి అని యర్థము. మన దేవులను నిర్దేశించుటకయి 'దేవ్‌తా'అని హిందుస్థానీలో చెప్పుదురు.

వేదము లాదిగ మనకుగల గ్రన్థదర్శనముల వలన తెలియునది, ఈయసురులు దేవగణములు, దేవయోనులు కారు. దేవయోనిగణములో పఠింపబడలేదు. వీరు మన దేవతలకన్న నధికులు, పూర్వజులు; సపత్నీమాతబిడ్డలు. దేవతలవలెనే వారికిని హవిర్భాగములకు అధికారము గలదు. కాని, దేవతలు దాయద్వేషముచే లేకుండ జేసినారు. వీరిగురువు శుక్రాచార్యుడు. బృహస్పతికన్న తక్కువవాడు కాడు. విద్యలయందును నాగర్యము నందును దేవతలకన్న పూర్వులును, అధికులును. శౌర్యపరాక్రమములయందు దేవతలు వీరితో సమానులు కారు. కాగా నెప్పుడుగాని వీరిని తొలగించుకొనుటకు విష్ణుమహేశ్వరు లడ్డుపడవలసి యుండినది. వీరి స్త్రీలు దేవతాస్త్రీలకన్న యోగ్యురాండ్రు. కావుననే త్రిపురాసురులను జయించుమార్గము లేదని యేర్పడగా, దేవర్షి నారదుడు వారిస్త్రీలకు దుర్బోధనలు చేసి దురాచారములను నేర్పినయెడల, నా యసురులు జయ్యులగుదు రని హితోపదేశము చేసి, అట్లు నారదుడే స్వయముగ పోయి కావించినపిదపనే ఈశ్వరుడి రథము సాగినది.

ఈయసురుల నిగమములు, ఆగమములు, శ్రౌతస్మార్తప్రక్రియలును, దేవతలకు కలయట్టివే. వీరు తఱచుగ మన గణములో చేరిన మహేశ్వరారాధనతత్పరులు. బాణాసురుడు, హిరణ్యకశిపు, వృత్రాసురుడు, త్రిపురాసురులు: వీరి సంగతి విపులముగా తెలిసియే యున్నది. వీరల తపస్సుచే సంతుష్టుడై మన బ్రహ్మదేవుడే వీరలకు అపూర్వవరదానములను చేయుచు వచ్చినాడు. మనదేవతలవలెనే వీరును యజ్ఞయాగాదికముల నభిమానించువారు. స్వాధ్యాయ బ్రాహ్మణమునందును, శ్రుతులయం దితరతావులయందును తెల్లము.

"సహావై దేవానాం చాసురాణాం చ యజ్ఞౌ ప్రతతా వాస్తాం| వయగ్ం స్వర్గం లోక మేష్యామో వయ మేష్యామ ఇతి......"

"దేవతలును, అసురులును, ఉభయగణముల వారును, యజ్ఞముచేయుట కుపక్రమించిరి. మేము స్వర్గమునకు పోయెదము; మేము పోయెదము అని పరస్పరము స్పర్థించిరి." దీనివలన ఉభయ గణములవారును చేయబూనిన యజ్ఞము ఒకటే అని తెలియును. మఱియును

ఆయజ్ఞమువలని ఫలమయిన స్వర్గమును ఒకటే అని యేర్పడుచున్నది. కానిచో స్పర్ధ యేల? ఈ రెండువిషయములపట్ల భేద ముండినయెడల స్పర్ధకు అవకాశ మేమి? ఎవరి కుచితమయిన యజ్ఞమును వారు ఆచరించి, ఎవరికి నియతమయిన స్వర్గమును వారు పొందుదురు. ఒకరికి మఱియొకరు అడ్డుపడరు.

ఒక కాలమందు సూర్యోపాస్తి ప్రపంచమంతయు ప్రబలియుండినది. సూర్యుడే సృష్టిస్థితి లయ కారకుడగు భగవంతుడని నమ్ముచుండిరి. దీనికి కారణము చెప్పబడియున్నది.

"అప్రత్యక్షా స్సర్వదేవాః ప్రత్యక్షో భగవా నయమ్;
సర్వే దేవాః కాలవశాః, కాలకాలో(రో)దివాకరః."

"ఇతరదేవత లందఱును కంటికి కగపడువారు కారు. సూర్యభగవానుడు ప్రత్యక్షమగువాడు.

ఇతరదేవతలందఱును కాలమానమునకు లొంగినవారు; దివాకరుడా-కాలమును చేయువాడు, కాలము నుపసంహరించువాడు."

ఈయసురులును సూర్యోపాస్తి చేయుకాలమందు వారి భగవన్నామమయిన యసురశబ్దమును సూర్యునికి వాచ్యముగ చెప్పినారు. అట్లే ప్రాచీన సంస్కృతమునందును అసురశబ్దమునకు సూర్యుడను అర్థముకూడ గలదు.

అసురశబ్దమునందలి ప్రథమవర్ణము నఞర్థకము గాదు. అకారమును లోపింపచేసి, సురశబ్దము చేర్పబడినదని యొకనైఘంటికులు చెప్పియున్నారు. అట్లు కాకపోయినను సురశబ్దమునకును, అసురశబ్దమునకును ఏలాటి సంబంధమును లేదు.

౨౧ రాక్షసులు

శబ్దసిద్ధి లోకంబునం దెలియు నని చెప్పి సూత్రకారు లిట్లు వచించియున్నారు: 'లోకో౽నవ్యాదృశశ్చ నిత్యశ్చ.' ఇది నిజము కాదు. పదముల రూపము, అర్థము, ప్రయోగమును ఏభాషయందు గాని అన్నికాలములయందును ఒక్కతీరుననే యుండుట కనము. ఇందుల కుదాహరణముగ నసురశబ్దమును, రాక్షసశబ్దమును కనవచ్చును. రామాయణము వ్రాయుకాలమున కే ఈశబ్దముయొక్క సరియైన యర్థము మబ్బులో చేరిపోయినది. ఈవలకూడ నట్లే. రాక్షసశబ్దమును అసురశబ్దమును పర్యాయపదములుగ వాడుట సామాన్యమయినది. 'అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహేగృహే' అను మాట యథార్థము కాదు. రాక్షసులును అసురులును ఒకగణమేఅని భావించి చెప్పబడినది. రాక్షసులకు అగ్నిహోత్రములుగాని, వేదములుగాని లేవు. వారు యజ్ఞవిధ్వంసకులు. రావణుడును రాక్షసుడయిపోయినాడు. కుబేరునివలె రాక్షసాధిపుడయ్యును రాక్షసుడు గాడు. ఈరాక్షసులు దేవగణములోనివారు కారు. దేవయోని గణమువారు. ఆగణములోకూడ జఘన్యులు. కోశజ్ఞులకు తెలిసియుండినది.

అమరుడు:—"విద్యాధరో౽ప్సరోయక్షరక్షోగన్ధర్వకిన్నరాః, పిశాచో గుహ్యకస్సిద్ధో భూతో౽మీ దేవయోనయః." మఱియు, రాక్షసశబ్దమునకు ప్రతిసంస్కృతములను చెప్పువాడై యీక్రింది శ్లోకములను వ్రాసినాడు. "రాక్షసః కౌణపః క్రవ్యాత్క్రవ్యాదో౽స్రప ఆశరః, రాత్రించరో రాత్రిచరః కర్బురో నికషాత్మజః; యాతుధానః పుణ్యజనో నైరృతో యాతురక్షసీ."

దీనివలన నీపర్యాయపదములలో చేరకూడనివి చేర్చియున్నారని చెప్పవచ్చును. అనగా పురాతనమున నీసాంస్కృతికులు ఎవరిని రాక్షసులని నిర్దేశించుచుండిరని విస్మృతమయి, కేవలము అపలక్షణములు గలవారినందఱిని ఈగణములోనే చేర్చిరని కానవచ్చుచున్నది. అయినను ఈపదగ్రామములో కొన్నిశబ్దములవలన పూర్వజ్ఞానమును సూచింపవచ్చును.

కౌణపః—అనగా శవములను, మృతకళేబరములను, ఏకి తినువాడు. లోకమునందు కొన్నితావుల నిప్పటికిని మానుషాదులు గలరు గాని, ఈకృత్యము మనవారికి తెలిసిన రాక్షసులది కాదు. పిశాచములదిగా నుండవచ్చును. పిశాచగణ మన్నచో రాక్షసేతరముగా పఠింపబడియున్నది.

క్రవ్యాత్—అనగా మాంసమును తినువాడు—ఇది యొకతప్పు కాదు. పురాతనమున తిననివా రెవరు? ప్రాయము లందఱును తినుచుండిరి. ఋషులు, శ్రోత్రియులు, ఆహితాగ్నులు, అందఱును పిశితాశనులే. కావుననే 'మహోక్షంవా మహాజంవా శ్రోత్రియా యోపకల్పయేత్' శ్రాద్ధమునందు నిమన్త్రితులకు మాంసమును పెట్టి మద్యము నిచ్చుచువచ్చిరి. కావుననే ఈగలను తోలు శ్రాద్ధ 'మన్త్రము' యిన "మక్షికాశ్చ యద్యాప్యస్వరోప్యధితోరిప్తమస్తి । యద్ధస్తయోశ్చమికుర్య న్నభేషు సర్వాతా తేష్వపి దేవేష్వస్తు."

మద్యమన్త్రములు ౧. "విశ్వేదేవాః! మధు మధు సంపన్నం" 'అస్తు సంపన్నం—' "(యజమానస్య) పితృపితామహప్రపితామహాః! మధుమధు సంపన్నం" 'అస్తు సంపన్నం'—

౨. "విశ్వేదేవాః! భుక్త్యనంతరం ఇయం సన్తృప్తిః" 'అస్తు తృప్తిః.' '(యజమానస్య) పితృపితామహప్రపితామహాః! భుక్త్యనంతరం ఇయం సన్తృప్తిః' 'అస్తు తృప్తిః.'—

౩. "వాజేవాజే వత వాజినో నో ధనేషు, విప్రా అమృతా ఋతజ్ఞాః। అస్య మధ్వః పిబత, మాదయధ్వం, తృప్తా యాత పథిభి ర్దేవయానైః."

ఇట్టిభోజనమువలనను, పానమువలనను భోక్తలు మఱలిపోవునపుడు కాలూనక పడిపోవుదురను భీతిచే, యజమానుడు వారిని ఎచ్చరించును. 'ఆసీమాన్త మను వ్రజేయం'. దానికి వారు దయార్ద్రహృదయులయి 'మానువ్రజ' (మా + అనువ్రజ) అని చెప్పవలెను. బ్రాహ్మణులకు భోజ్యములగు మాంసములను నిర్దేశించుచు స్మృతులయందు విస్తరింపబడియున్నది.

'యుగాంతరోఽయం విషయః.'—కాండమను గాక, రాక్షసులకు క్రవ్యాదులని పేరు పెట్టినవా రెవరో వారి వృత్తాంతము, రాక్షసుల విషయమును యుగాంతర మే. 'క్రవ్యాత్' అను దాని యర్థము పచ్చిమాంసమును తినువా డనుట.

అస్రపః—రక్తమును త్రాగువాడు. పురాతనకాలమున యుద్ధమందు జయింపబడిన శత్రువు రక్తమును కొన్నిగణములలో కొందఱుమాత్రము కాదాచిత్కముగ త్రాగుచువచ్చిరి. అట్లు చేయుటచే ఆశత్రువు కుండిన దేహబలము త్రాగినవానిని చేరునని భావము. వాయుసుతుడు, భీమసేనుడు, యుధిష్ఠిరునికి, బృహదశ్వుడు, ఋషి, చెప్పినట్లు దేవసముడైన యనుజుడు, పునర్ద్యూతమున నోటుపడి, వివాసితుడయి, యరణ్యవాసమునకు పోవునపుడు, దుశ్శాసనుని రక్తమును పానముచేయునట్లు ప్రతినచేసి యుద్ధమునందు తనచేసిన ప్రతిజ్ఞాపూరణం బాచరించెను (కర్ణపర్వము). ఇది కేవలము ఘోరము యిన విషయమని తేటతెల్లమగుట, ప్రక్షేపకులు దీనిని స్త్రీవిలాపపర్వమునందు సవరించుటకయి భీమసేనునిచే బొంకులు బొంకించిరి. ఈవిలాపపర్వమునందు 'అనార్య జనసేవితం' అను గాంధారీవాక్యమును 'అసురభంగి' అని యాంధ్రీకరణము చేసి యున్నది. ఇది పొరపాటు. పయిన చెప్పినట్లు అసురశబ్దమును రాక్షసపర్యాయముగ వాడియున్నది. అకారయతియును, చిన్నమాటయును కావలసియుండి యీశబ్దము చేరినది. అసురులు శత్రువుల రక్తపానమును జేసినవారు కారు. మన 'అసురుడు' నరసింహు కాపనిని జేసినవాడు. అసురశబ్దపర్యాయపదములో నస్రపులని లేదు.

౨౨. యాతుధానః—యాతు-అభిచారిక చర్యలను చేయు క్షుద్రమంత్రప్రయోక్త. శూన్యము, తోడుబోతు, కాతపడి, చిల్లంగి అను నిట్టి ప్రయోగములను చేయువాడు. వీటికి ఇంగ్లీషులో Black magic అందురు. ఇప్పటికిని వీటియందు నమ్మకమును, ఇట్టిప్రయోగములును కలిగియున్నవి. వేదములలో నాభిచారిక ప్రయోగములకు కొంత గ్రన్థము సమర్పితమయ్యున్నది. అపౌరుషము గదా! అట్లుండగా దీనియందు తప్పేమి? యాతుశబ్దము ఈయర్థమునందే అన్తే శ్రుతియందు వృత్రఘ్న సూక్తమునందు ప్రయుక్తమై యున్నది. అధునాతన పారసీభాషలో జాదు అని నిలిచియున్నది. పుణ్యజనః అనునది విపరీతలక్షణముగ చెప్పబడినది. అపుణ్యజనులు అనగా పాపిష్ఠు లనుట.

౨౩. నైరృతః, ౨౪. నికషాత్మజః, ౨౫. కర్బురః,(౨౬. కిమ్మీరః)–ఇవియును రాక్షసనామపర్యాయపదములు. వీటివలన నీ సాంస్కృతికులకును పారసీకశాఖవారికిని ప్రథమమున తెలియవచ్చిన రాక్షసు లెవరని యేర్పడగలదు. నైరృతశబ్దము నిరృతి శబ్దమునుండి యుత్పన్నమయినది. నిరృతి యొకదిక్కునకు లేక విదిక్కునకు పేరు. ఆదిక్కునకు పాలకుడు లేక అధిపతికిని పేరు. దక్షిణదిశకును పశ్చిమమునకును నడుమనుండు శాఖ.

రాక్షసులకు ఈనామ మిడుటకు కారణము, ఆ పేరు పెట్టినవా రుండు మండలమునకు వీరు నిరృతి పార్శ్వమున నివసించు వారుగ నుండవలెను. తురుష్క-ఆసియా అను భూభాగమునకు ఉత్తరమునను రష్యాదేశమునకు దక్షిణముగను అనగా ఈరెంటికి నడుమ, నల్లసముద్రమని (Euxine) Black Sea యొకసముద్రము గలదు. ఈసముద్రపు టుత్తరభాగమున 'క్రిమియా'అని, భూగోళపటములలో తెలియవచ్చు ద్వీప మున్నది. ఈసముద్రములో నిరంతరమును ఆకాశము దట్టమయిన పొగమంచుతో మందారముగ నుండును. ప్రకంపనములు, ఝంఝూవాతములు, అంధతమస్సులును, దైనందినవిషయములు. పోతవణిక్కులయోడలు తఱచుగ పగులుచు జనచ్ఛేదము జరుగుచునేయుండును. ఈక్రిమియాయందునను, ఆసముద్రపు దీవులయందును, దక్షిణతీరములను, ప్రత్న కాలమున నివసించుచుండినవారు కిమ్మీరులనువారు. బహుక్రూరకర్ములు. నాగరకతలో మిక్కిలి తక్కువవారు. సుఖించుచుండు సమీపరాజ్యముల జనపదములపైబడి దోచుకొనుచుందురు. సముద్రవాణిజ్యమును అరికట్టి దోపిడి చేయుచుందురు. స్త్రీలను చెఱపట్టుదురు. అన్యదేశీయులను, నౌకాభంగములలో హతశిష్టులను, కొనిపోయి తమదేవతయగు భద్రకాళికి నరబలి యిత్తురు. వీరియందు భూతదయ, పశ్చాత్తాపము ననునిట్టి భావములు మృగ్యములు. ఆర్యశాఖలవారు ప్రథమము రష్యాదేశపు దక్షిణభాగమున నుండిరని కొందఱు విద్వాంసు లభిప్రాయపడియున్నారని 3-వ వ్యాసమునందు చెప్పితిమి. ఈగ్రంథకర్త యభిప్రాయము నట్లే. అట్లుండినచో నిశ్చయముగ నీక్రూరకర్ములు ఆర్యగణములవారికి నిరృతిభాగమునం దుందురు. కాగా వారికి ప్రథమము తెలియవచ్చిన రాక్షసులు నైరృతులయిరి. పిదప రాక్షససామాన్యవాచక మగుట సులభసాధ్యము. ఈనైరృతులను ప్రప్రథమమున నార్యశాఖలలోనివారే. ఆర్యులలో నెక్కువ నసతిగలవారికి దాసవర్గముగ నుందురు. బహిష్కృతులయి, లేక పలాయితులై వేఱుభూమిని జొచ్చి స్వతంత్రులయిరి. వీరి పూర్వచరిత్రమును దేవయోనిశబ్దము తేటపఱచును.

## ౨౩ నికషాత్మజః.

ఈగణములకు పూర్వపితామహుడు, బైబిలులో చెప్పబడిన, 'అష్కినాక్ష్'అను నాతడు. ఈతడి పేరు కొన్నిస్థలనిర్దేశములలో పూర్వోక్తసముద్ర దక్షిణభాగమున నిలిచియుండినది. ఈనల్లసముద్ర మనుదానికి ప్రథమనామము ఈరాక్షసపితామహుని నామమువలన కలిగినది. ఆనామము తఱల మాఱుచువచ్చి యూరోపులో కొన్నిరాజ్యములలోను ఇంగ్లీషుమండలములలోను నల్లసముద్రమని వాడబడుచున్నది.—ఇరులుక్రమ్మ సముద్రమనుట.

అష్కినక్ష్ లేక అష్కినాక్ష్ లేక అష్కనాక్ష్ అను నామములో అష్ అనునది తదర్థకవర్ణకము. ఆ కినక్ష్ అని యర్థము. తత్ అనునది వాడుకలో విడిచిపోయినది. మిగిలిన శబ్దభాగము నికష. అని ఆర్యుల వాణిలో వృషోదరాదిగ మాఱివచ్చినది. కాగా వీరు నికషాత్మజులు.

## ౨౪ కర్బురులు

ఇది రాక్షసనామముగ నున్నది. సరే. కర్బురశబ్దమునకు వేఱుఅర్థము కలదు. 'చిత్రకిమ్మీర కల్మాషశబలైతాశ్చ కర్బురే' అని అమరుడు. ఇందులో రెండు మాటలుముఖ్యము,కిమ్మీరః-కర్బురః:-కిమ్మీరశబ్దమునకు రూపాంతరము, కిర్మీర, కిర్మిర అనియును గలదు. మఱియు నీ కర్బుర కిమ్మీరశబ్దములు గ్రీకుభాషయందు కూడ గలవు. వాటినికూడ నీటీకలో చేర్చుకొనవల

యును. గ్రీకుభాషలో కర్బురశబ్దము కెర్బెర అని యుండును. దీనికి ఏకవచనమునందర్థము: ఒక యమ కింకరుడు, శ్వరూపమున యమలోకద్వారమును కావలి కాచువాడు (కాలభైరవుడు). ఈశబ్దమునకు పేఱొక యర్థము అంధకార మని కలదు. బహువచనమునందు కిమ్మీరశబ్దమునకు బదులుగా ప్రయోగింపబడియున్నది.

కిమ్మీరశబ్దము గ్రీకులో బహువచనాన్తము. ప్రథమమున ఐతిహాసికములలో సముద్రాన్తమందు నిరంతరాంధతమస్సున కొందఱు గణములు నివసించుచుండిరని వారి నామముగ చెప్పబడినది. ఈవల కొంతభూగోళజ్ఞానము వృద్ధియయినపిదప, క్రింద చెప్పబడిన నికషాత్మజుల పేరుగ వాడుకలో నిలిచినది.

సంస్కృతమున నీ కిమ్మీర-కర్బురశబ్దములు వర్ణసాంకర్యమువలన కలిగినరంగునకు పేరుగ చెప్పబడినవి. వర్ణశబ్దము రంగునుండి జాతినామముగ మాఱినట్లు, కర్బుర, కమ్మీరశబ్దములును, ఒకరాక్షసగణమునకు నామమై రంగులను పేర్కొనుట యేర్పడినది. దురాచారవంతులగు క్రూరకర్ములను ఈజాతి ఆజాతి యనక సాహచర్యమువలన నేమి, ఔపమ్యమువలన నేమి, వేయ్వులవలన నేమి-ఈరాక్షసగణములో చేర్చి నిర్దేశించుచుండుటచే రంగునకుంబలె నీరాక్షసగణమునకును వర్ణసాంకర్యము. రాక్షసపర్యాయపదములలో కర్బురశబ్ద మువలక్షణము, కిమ్మీరశబ్దమునుగూడ చేర్చుకొనుచున్నది. మహాభారతమున వనపర్వారంభమున భీమసేనుడు యుద్ధము చేసి చంపినది కిమ్మీరుడను రాక్షసుని. ఇచట కిమ్మీరు డనునది ఆరక్కసి రూఢినామము కాదు; ఆగణములోనివా డనుట. మఱియు పయిజెప్పిన నల్లసముద్రపు భూములలో ప్రాతకాలములయం దుండిన వారు కిమ్మీరులని చెప్పబడి రంటిమి. కావుననే క్రిమియాఅని పైజెప్పబడిన ద్వీపమునకు ఆనామము సిద్ధించుట [కిర్మిరియా=క్రిమియా-వికృతి. మఱియు, ఈరాక్షసుల భావయందు కిమ్మీరులన శ్రేష్ఠులగువా రని యర్థము. ఆసముద్రపు దక్షిణతీరమున, మధ్యభాగమున, అఖిరూసియా అను తావున పురాతనమున నొకగహ్వరమును చూపింతురు. అక్కడి స్థలపురాణములో నీగహ్వరమార్గము పాతాలమునకు పోవుననియును, పూర్వయుగములో, హీరక్లిస్ (Heracles) అనుదేవసముడు, సింహబలుడు, ఆమార్గమున పాతాలమును తేరి అచ్చట నుండిన కెర్బరస్ అను కాలభైరవుని కట్టివేసి యీగహ్వరద్వారము నుండ నీభూమికి ఈడ్చుకొని వచ్చెననియును ఇతిహాసము కలదు. ఇట్టిసందర్భములలో ఈ రెండుపదములును రాక్షసనామపర్యాయము లగుట తెల్లము.

క్రీ. శ. ముందు ఏడునూఱుల సంవత్సరముల కాలమందు, ఈకిమ్మీరులు తమ నెలవుల విడిచి దక్షిణముగ, ససంఖ్యాకులయి, మిడుతలదండువలె వ్యాపించి, అసురులు మొదలగువారి రాజ్యములమీద పడి, రాష్ట్రవిప్లవమును విలయమును కలుగజేసి, జనపదములను 'పరశురామప్రీతికి' సమర్పించి, జనములను యమప్రీతికి సమర్పించి, స్త్రీలను తమ ప్రీతికి స్వీకరించి, పరుల సొమ్ము తమ సొమ్ముగ భావించి, యొకశతాబ్దము బాధపెట్టిరి. అప్పటికి పరాజితు లందఱును ఏకమయి వీరిని తఱుమగొట్టగలిగిరి. ఇట్టిపనులు ఇప్పటికిని దండయాత్రలలో జరుగుచునేయున్నవి. కడపటి జర్మనుయుద్ధమునందు జరిగియున్నవి. ఒరులు ఇట్టిపనులను చేసినచో నవి రాక్షసకృత్యములు. మనము చేసినపుడు అవి మన శక్తిపరాక్రమములను తెలియజేయు విజయోత్సాహలక్షణములు. కావున వీరిని అయ్యయిదేశస్థు లందఱును, ఆకాలపువారు, వారిగ్రన్థములలో రాక్షసులనుగ చెప్పుచుండిరి. బయిబిలులోని గాగ్-మగాగ్ అనువారును-మన పురాణములలోని మధు-కైటభులును - అవెస్త్రకులయందలి కయధులు కాఇధ్యులును వీర[వీరును వీరి గురువులగు కుళుత్థగణముల వారును]. దీనినిగుఱించిన వివరము మధుకైటభశబ్దముల వ్యాఖ్యానమందు వక్ష్యమాణము.

ఈవ్యాసము నిచట నిలుపవలసియున్నది. ౨-వ వ్యాసమునందు మ్లేచ్ఛ, మధుకైటభ, కాత్యాయనీ శబ్దముల వివరము వ్యాఖ్యాతమగును.

కాత్యాయనీశబ్దముతో పండిత శబ్దమును కూడ చేర్చుకొందును. కారణము పురాతనకాలమున నీకాత్యాయనులకును పండితులకును మిక్కిలి నేస్తము కలిగియుండినది. కావున జోడు వీడగొట్టుట సరికాదు.

# ప్రభాత స్తవము

జి. జాషువగారు

సంజకెంజాయలలో జలకంబు సవరించి పరతెంచు సూర్యబింబంబులోన
పదునారుదినములు పరువువచ్చిన నిండు చంద్రుని ధవళహాసములలోన
పూలతోఁటలతోడ ముద్దుముచ్చట సెప్పి చెరలాడు మొలకతెమ్మెరలలోన
నీలమేఘంబుల నెఱియలలోఁ గుల్కి పరువెత్తు మెరుపుగర్భములలోన
హాయిగాఁ బవ్వళించి బ్రహ్మాండములను - బల్కరించుచునున్న దివ్యస్వరూప!
హృదయమును జీల్చి పూజ లర్పించుకొందు-నందుకొనిపొమ్ము; వ్యవధి లేదనక రమ్ము!

పిట్టలఁ బీచుపీచు మనిపించుచు వేగుపోలంతి దోసిటం
బట్టె గులాబిగుత్తుల, నభంబునఁ బుప్పొడిదుమ్ము రేఁగ, నీ
విట్టి నిసర్గపూజలకుఁ దృప్తి వహింతువొ; నా స్తవంబులోఁ
బట్టముఁ గట్టుకొందువొ? కృపానిధి, గుండెలు గుమ్మరించెదన్.

ఈతొలికోడికంఠమున నే, యినబింబము నిద్రవోయెనో
రాత్రి, తూర్పుకొండ లభిరామము లైనవి, దీని వక్రపుం
గూఁతల మర్మ మేమి? కనుఁగొమ్మని యల్లన హెచ్చరించి, ప్రా
భాతసమీరపోతములు పైకొనియెన్ దొలిసంజకానుపుల్.

వేగురుఁ జుక్కతో నిలిపివేసిన నీ రచియించు లేఖకున్
గాగితమైన యాకసమునన్ జిరునవ్వులు గుమ్మరించుచున్
డాఁగెద వేల? యర్థవచనంబున, నేమని వ్రాసి కొంటివో
నాగతి కమ్మలోనఁ గరుణానిధి, చిత్తము విహ్వలించెడిన్.

ఆ నిదురించు పెద్దపులి యాస్యబిలంబున నెన్ని జంతువుల్
బోనములై యదృశ్యమయిపోయెనో! రేపటిభుక్తికిన్ దయా
హీన,మృగంబు లేపొదలయం దవుగాము లెఱుంగ కింపుమై
మేనులు వాల్చెనో! యెఱిఁగి మిన్నక చూచుచు నంగలార్తువా?

ప్రకృతిపదార్థజాండములపై, నుదయాస్తమయంబులందు, నీ
యకలుష పాణిపద్మము రహస్యముగా లిఖియించి పోవు టా
క్కాకసమయాన నేను కనుఁగొందునుగాని, గ్రహింపఁజాల నెం
దుకు సృజియించినాఁడవొ ననున్ ఘనుఁడా యసమగ్రబుద్ధిగన్!

---

# గాంధి మహాత్ముని లండను చిత్రములు



౧. గాంధిమహాత్ముడు, కాంటర్బరీ మతగురువు డీను జాన్సనుగారు (P. P. B.)




౨. గాంధిమహాత్ముడు, ఆగాఖాను, శ్రీమతి సరోజినీదేవి — రిడ్జిహోటలు (G. S. A.)

# తెలుఁగు ముద్రాక్షర విలేఖనము

యం. యస్. వెంకయ్య గారు

[Telugu Type-writing]

"తెలుఁగులిపియుఁ దత్సంస్కరణమును*" అను నావ్యాసముయొక్క చిట్టచివర టైపు రైటరు విషయమై వ్రాసెదనంటిని. ఆవిషయమునుగూర్చిన వ్యాసమే యిది. ముందు నే వివరింపఁబోవు విషయములు పాఠకమహాజనులకుఁ జక్కఁగా బోధపడుటకై ముద్రాక్షరవిలేఖనయంత్రముల (Type-writers)లోని భేదములను, ఆయంత్రముల ప్రధానభాగములయందలి విశేషములను నించుక వర్ణించెద.

ముద్రాక్షరవిలేఖనయంత్రములలో ముద్రాక్షరశలాకా యంత్రము (Type bar Machines) లనియు, ముద్రాక్షరచక్రయంత్రము(Type wheel Machines) లనియు నిరుదెఱంగులు గలవు. ముద్రాక్షరశలాకాయంత్రములందు వరుసగా నమర్పఁబడిన యినుపశలాకల(Bars) చివరభాగములయందు ముద్రాక్షరము లమర్పఁబడియుండును. అట్టిశలాకలు కాగితమును నొక్కునపు డక్షరములు ముద్రింపఁబడును. ప్రతిశలాకకును అగ్రభాగమున నొక కుంచిక (Key) యమర్పఁబడి, యాకుంచికయొక్క శిరోభాగమున నాశలాకకొనయందుఁగల యక్షరముయొక్క రూపము చిత్రింపఁబడియుండును. అట్టిశలాకలలోని యక్షరములలో మన కావశ్యకమయిన యక్షరమునకుఁ జెందినకుంచికను నొక్కినచో, వెంటనే యాయక్షరమునకు సంబంధించినశలాక తివ్వున నెగసి కాగితమును నొక్కిపట్టి యక్షరవిన్యాసము నొనరించును. ఈశలాక లన్నియుఁ గుంచికలను నొక్కునప్పుడు అక్షరముద్రణమునకై మధ్యభాగమున చేర్పరుపఁబడిన యొక ప్రత్యేక స్థలమునకు వచ్చి చేరునట్టు లర్ధచంద్రాకారముగా నమర్పఁబడియుండును. ముద్రాక్షరచక్రయంత్రములలోఁ బైఁగనినట్టు లక్షరములు శలాకలచివరభాగమున నమర్పఁబడియుండవు. అందొక యూఁగులాడెడి (Oscillating) చక్రము, ఖండవృత్తాకారము (Segment)గా నమర్పఁబడియుండును. ఆచక్రముయొక్క యంచున ముద్రాక్షరములు గూర్పఁబడియుండును. అట్టి యంత్రమునందలికుంచికలలో మనకుఁ గావలసిన యక్షరమునకుఁ జెందినదానిని నొక్కుదుమేని, వెంటనే మనము కోరినయక్షరము ముద్రణస్థానమునకు వచ్చునట్టు లాచక్రము గిఱ్ఱునఁ దిరుగును. అదేసమయమున నందులకై యేర్పరుపఁబడిన యొకచిన్న సుత్తె స్వస్థానమునుండి కదలి వచ్చి యాయక్షరమువీఁపు మోఁదుకొని ముద్రణ మొనరించును.

ఈరెండురకములగు యంత్రములలో ముద్రాక్షరశలాకాయంత్రములే విశేష ప్రచారములో నున్నవి. ఇఁక నిట్టియంత్రములయందలి ప్రధానభాగములలో మనము మొట్టమొదట తెలిసికొనఁదగినది కుంచికాఫలకము (Key Board). సామాన్యముగా నాంగ్లభాషా ముద్రాక్షర విలేఖనయంత్రముల (English Type-writers) లోఁ గుంచికాఫలకములు మూఁడురకములుగా నేర్పరుపఁబడియున్నవి. ఎట్లనఁగా:—

(౧) ఒక్కొకయక్షరమున కొక్కొకకుంచిక చొప్పున నేర్పఱచుపద్ధతి. దీనినే "Duplicate arrangement of Upper and Lower case" అందురు. ఈపద్ధతికిఁ జెందినకుంచికాఫలకముయొక్క ప్రతిరూపము(Facsimile) నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడ. చూడుఁడు ఒకటవ చిత్రము:—

* ఈవ్యాసము ౧౯౩౧-వ సం. ఆగష్టునెల ౮-వ తేదిని భారతీపత్రికలోఁ బ్రచురింపఁబడియున్నది.

8. 11- 3 ఉగ్రా




చిత్రము ౧.

ఇందు మొత్తము ౮౪ కుంచిక లున్నయవి. ఇట్టి పద్ధతినే యోస్టుయంత్రము(Yost No. 10)ను, స్మిత్తు ప్రీమియరు (Smith Premier No. 10) యంత్రమును నిర్మింపఁబడియున్నవి.

(౨) రెండురెండక్షరముల కొకకుంచికచొప్పున సేర్పఱచుపద్ధతి. దీనినే "Shift-key arrangement of Upper and Lower case" అందురు. ఈపద్ధతికిఁ జెందినకుంచికాఫలకముయొక్క ప్రతిరూపము (Facsimile) నీక్రింద నిచ్చుచున్నాఁడ. చూడుఁడు రెండవ చిత్రము:—




చిత్రము ౨.

ఇందు మొత్తము ౪౨ కుంచిక లున్నవి. ఇట్టి పద్ధతినే రెమింగ్టనుయంత్రములును (Remington Nos. 7, 10 & 11), యోస్టు (Yost No. A 15) అండరువుడ్డు (Underwood No. 5), యల్. సి. స్మిత్తు అండు బ్రదర్సు (L. C. Smith & Bros. No. 2) మున్నగుయంత్రములును నిర్మింపఁబడియున్నవి.

(౩) మూఁడుమూఁడక్షరముల కొకకుంచిక చొప్పున సేర్పఱచుపద్ధతి. దీనినే "Double shift-key arrangement of Upper and Lower case" అందురు. ఈపద్ధతికిఁ జెందినకుంచికాఫలకముయొక్క ప్రతిరూపము నీక్రిందఁ జూపుచున్నాఁడ. చూడుఁడు మూఁడవచిత్రము:—




చిత్రము ౩.

ఇందు మొత్తము ౨౮ కుంచిక లున్నవి. ఇట్టి పద్ధతినే యెంపయరు (Empire) యంత్రము, ఇంపీరియలు (Imperial) యంత్రము, ఆలివరు (Oliver) యంత్రము, హామ్మండు (Hammond) యంత్రము, విల్లియమ్సు (Williams) యంత్రము, కరోనా (Corona) యంత్రము మున్నగుయంత్రములు నిర్మింపఁబడియున్నవి.

పైఁగనినట్లుల కుంచికాఫలకములను మూఁడురకములుగా సేర్పఱచుటయందలి ముఖ్యోద్దేశము సాధ్యమైనంతవఱకుఁ గుంచికలసంఖ్యను తగ్గింపవలయుననుటయే. ఇందు మొదటిరకమున ౮౪ కుంచిక లున్నవిగావునఁ బ్రతికుంచికకును నొక్కయక్షరముచొప్పున ౮౪ అక్షరము లిందు ముద్రింపఁబడియున్నవి. రెండవ రకమున ౪౨ కుంచికలున్నవి. ప్రతికుంచికకును రెండక్షరములచొప్పున ౮౪ అక్షరము లిందు ముద్రింపఁబడియున్నవి. మూఁడవ రకమున ౨౮ కుంచిక లున్నవి. ప్రతికుంచికకును మూఁడక్షరములచొప్పున ౮౪ అక్షరము లిందు ముద్రింపఁబడియున్నవి. చూడుఁడు. ఇట్లు కుంచికలసంఖ్య తగ్గింపఁబడినను, అక్షరములసంఖ్యమాత్ర మన్నిరకములలోను సమానముగనే యున్నది. పైఁజెప్పఁబడిన యీ మూఁడురకములగు కుంచికాఫలకములును "Universal standard key-boards"అని పిలువఁబడుచున్నవి. హామ్మండు (Hammond) మున్నగు ముద్రాక్షరచక్ర

యంత్రములలోని కుంచికాఫలకములు "Ideal key-boards" అని పిలువఁబడుచున్నవి. ఇది యాంగ్లభాషా ముద్రాక్షరవిలేఖనయంత్రములలోని కుంచికాఫలకనిర్మాణపద్ధతి. ఇఁక, దీనికి సన్నిహితసంబంధముగల పరివర్తన కుంచిక(Shift-key)నుగుఱించియించుక తెలిసికొనవలెను.

పైని వర్ణింపఁబడిన మూఁడురకములగు కుంచికాఫలకములలో మొదటి రకపుఁగుంచికాఫలకముతోఁ గూడిన యంత్రములయందు ఒక్కొకకుంచిక కొక్కొక యక్షరముచొప్పున నక్షరము లిముడ్పఁబడి యుండుటచే నట్టియంత్రముల నెల్లరును జాల తేలికగా వాడుకొనవచ్చునుగాన నావిషయమై విశేషించి యిట వ్రాయుటనవసరము. రెండవరకపుఁగుంచికాఫలకమునందు ఒక్కొకకుంచికకు రెండురెండక్షరములచొప్పునను, మూఁడవ రకపుఁగుంచికాఫలకమునందు ఒక్కొకకుంచికకు మూఁడుమూఁడక్షరములచొప్పునను నక్షరము లిముడ్పఁబడి యుండునుగదా! ఇట్టిచమత్కారపు యంత్రనిర్మాణపద్ధతికిఁ బరివర్తనకుంచిక(Shift-key)యే జీవగఱ్ఱయై యొప్పారుచున్నది. ఈకుంచికను నొక్కిపట్టినచో వాహనము (Carriage)ను దన స్వస్థానమునందుండి స్థలాంతరమునకుఁ— అనఁగా నించుకయుపరిభాగమునకుఁ—బోవునట్టు లొనరించుచున్నదిగాన నిది పరివర్తనకుంచికయనఁబరఁగుచున్నది. రెమింగ్టను మున్నగుయంత్రములయందుఁ బ్రతికుంచికకును రెండురెండక్షరము లిముడ్పఁబడి యున్నందున నాయంత్రములకుఁ బరివర్తనకుంచిక కూడఁ జేర్పఁబడియున్నది. ఆపరివర్తనకుంచిక కుడివైపున నొక్కటియు, ఎడమవైపున నొక్కటియు నుండునట్టు లేర్పఱుపఁబడియుండును. ఇట్టు లేలచేయఁబడి యున్నదందురా? కుంచికాఫలకమునఁ గుడివైపునందలి యక్షరములను నొక్కవలసినప్పు డెడమచేతివ్రేలితో నెడమవైపునందలి పరివర్తనకుంచికను నొక్కిపట్టుటకును, ఎడమవైపునందలి యక్షరములను నొక్కవలసినప్పుడు కుడిచేతివ్రేలితోఁ గుడివైపునందలి పరివర్తనకుంచికను నొక్కిపట్టుటకును ననుకూలించుటకనియే. ఇయ్యది యేకపరివర్తనకుంచికాపద్ధతి (Single shift-key arrangement) నాఁబరగును. ఇట్టి పరివర్తనకుంచికయొక్క సాయముంగొని కుంచికాఫలకమునందలి యక్షరములలో మన కిష్టమువచ్చినదానిని ముద్రింపవచ్చును. ఎట్టులనఁగా: పైఁగనిన కుంచికాఫలకములలో రెండవరకపుఫలకమును (చిత్రము ౨) నుదాహరణముగాఁ దీసికొందము. ఇందు అక్షరములుఁగల కుంచికలలోఁ గ్రిందిభాగమునఁ జిన్న యక్షరములు (Small letters) ను, పైభాగమునఁ బెద్దయక్షరములు(Capital letters)ను నమర్పఁబడియున్నవి. అంకెలుమున్నగు నితరకుంచికలయందుఁ గ్రిందిభాగమున నంకెలుమున్నగునవియును, పైభాగమున విరతులుమున్నగు నితరచిహ్నములును నిముడ్పఁబడియున్నవి. ఈకుంచికాఫలకమునందలి చిన్న యక్షరములును, (Small letters) అంకెలు మున్నగునవియును కేవలము అక్షరములకుంచికలను నొక్కిపట్టినంతమాత్రముననే ముద్రింపఁబడును. పెద్దయక్షరములు (Capital letters), విరతులు మున్నగునవి వ్రాయవలసినప్పుడు పరివర్తన కుంచిక (Shift-key) ను నొక్కచేతివ్రేలితో నొక్కిపట్టుకొనిన యనంతరము, అక్షరములకుంచికలను వేఱొక్కచేతివ్రేళ్లతో నొక్కినచో మనము కోరిన యక్షరములను ముద్రింపవచ్చును. హామ్మండు (Hammond), విల్లియమ్సు (Williams), కరోనా(Corona) మున్నగుయంత్రములందుఁ బ్రతికుంచికకును మూఁడుమూఁ డక్షరము లిముడ్పఁబడియుండునని చెప్పియుంటిని గదా! ఇట్టియంత్రములకు రెండురెండు పరివర్తనకుంచిక లమర్పఁబడియుండును. ఆపరివర్తనకుంచికలు కుంచికాఫలకమున కెడమప్రక్క నమర్పఁబడియుండును. చూఁడుడు మూఁడవచిత్రము. కొన్ని యంత్రములందుఁ గుడివైపున రెండును, నెడమవైపున రెండును నుండులాగున నమర్పఁబడి యుండుటయుఁ గలదు. అట్టిపరివర్తన కుంచికలసాయంబున కుంచికాఫలకమునందలి యక్షరములలో మనకిష్టమువచ్చినదానిని ముద్రించుకొనవచ్చును. ఎట్టులనఁగా: పైఁగనిన కుంచికాఫలకములలోని మూఁడవ రకపుఫలకము (చిత్రము 3) నుదాహరణముగాఁ దీసికొందము. ఇందక్షరములకుంచికలలోఁ గ్రిందివైపునఁ జిన్న యక్షరములును, (Small letters) పైభాగమునఁ బెద్ద యక్షరములును, (Capital letters) అంతకు

పై భాగమున నంకెలు, విరతులు(Punctuation marks) మున్నగుచిహ్నములును నిముద్పఁబడియున్నవి. ఈకుంచి కాఫలకమునందలి చిన్న యక్షరము (Small letters) లను ముద్రించుటకుఁ బరివర్తనకుంచికను నొక్కి పట్టవలసిన యావశ్యకత లేదు. కేవలము కుంచికలను నొక్కినంత మాత్రమున నవి ముద్రింపఁబడును. పెద్ద యక్షరము (Capital letters)లను ముద్రింపవలయునన్నఁ బరివర్తనకుంచికలలోఁ గ్రిందివైపున నుండువానిని నొక్కి పట్టవలయును; అంకెలు, విరతులు (Punctuation marks) మున్నగుచిహ్నములు ముద్రింపవలసినప్పుడు పైవైపునందలి పరివర్తనకుంచికలను నొక్కి పట్టవలయును. ఈపరివర్తనకుంచికల నుపయోగించువిధము రెండవరకపుకుంచికాఫలకమునందలి పరివర్తనకుంచికలకుఁ జెప్పఁబడినట్టులే యని యెఱుంగనగును. దీనినే ద్విపరివర్తనకుంచికాపద్ధతి (Double shift-key arrangement) యందురు. ఇప్పుడు మనము పరివర్తనకుంచిక (Shift-key) యను నేమిటో కొంత తెలిసికొంటిమి. ఇఁక నిట్టికుంచికలతోఁ గూడిన యంత్రభాగము చలించుట కాధారమైన వాహనము(Carriage)ను గుఱించి యించుక తెలిసికొనవలసినది యెంతయు నావశ్యకమైయున్నది.

అక్షరముద్రణమునకును, ముద్రణార్థ ముంపఁబడు కాగితమును వహించుటకును, ఒక్కొక్క యక్షరముగా ముద్రించునపుడు క్రమముగా నొక్కొక మెట్టు(Degree) వంతున నాకాగితమును గుడివైపునుండి యెడమవైపునకుఁ దీసికొని పోవుటకును, ఆవశ్యకమైనచో మఱల నాకాగితమును గుడివైపునకు నొక్కొక మెట్టు (Degree)వంతునఁ దీసికొని వచ్చుటకును నుపయోగించెడి స్తంభిక (Cylinder) మున్నగువానిని వహించుచు, నవి చలించునట్టులఁ జేయుట కుపకరించెడి యంత్రభాగము వాహన (Carriage) మని వ్యవహరింపఁబడుచున్నది. ఈయంత్రముయొక్క పశ్చాద్భాగమునం దెడమవైపున నమర్పఁబడిన యొకప్రధానము ధనువు (Main spring) కుంచికనుగాని, వ్యవధానశలాక (Space-bar) నుగాని నొక్కిపట్టినప్పు డీవాహనమును గుడిప్రక్కనుండి యెడమప్రక్కకుఁ బోవునట్టు లొనరించుచున్నది. ఈప్రధానధనువునుండియొక్క యుక్కవాఱుతీసికొనిపోఁబడి వాహనముయొక్క కుడివైపునందలి చివరభాగమునకు లంకవేయఁబడి యుండును. అందువలన నెల్లప్పుడును ప్రధానధనువుయొక్క బలముచే వాహనము లాగఁబడుచున్నది. ఈవాహనము వేగముగాను, కొలతప్రకారము నడచుటకుఁ దగినట్టు లోకకొలత లేర్పరుపఁబడిన (Graduated)చట్ట మీవాహనముయొక్క యధోభాగమున నమర్పఁబడియుండును. ఈకొలతచట్ట మొక పండ్లచక్రముమీఁదుగా గమనాగమనముల సల్పుచుండును. ఈచక్రమునే పినియను వీల్ (Pinion wheel)లందురు. ఈకొలతచట్టముయొక్క పశ్చాద్భాగమున చలనకారియగు పండ్లచక్ర మొక్కటి యమర్పఁబడి యుండును. దీనిని ఎస్కేపుమెంటు వీల్ (Escapement wheel) అందురు. ఈచక్రము నెల్లప్పుడును నొక్కి పట్టుకొని యుండు యంత్రభాగమునకు "శునకములు" (Dogs) అని పేరిడఁబడియున్నది. అందు రెండుశునకములు గలవు. ఒకటి కఠినశునక (Rigid dog) మనియు, రెండవది స్వేచ్ఛాచారి(Loose dog)శునకమనియుఁ బిలువఁబడును. స్వేచ్ఛాచారిశునకము కఠినశునకమునకన్నను యంత్రచాలకుని(Operator)కి సమీపమం దుండును. ఈరెండుశునకములు నొకే శ్రేణియందే యుండును. చలనకారియగు పండ్లచక్రము (Escapement wheel) నుండి విడఁదీయునప్పు డీస్వేచ్ఛాచారిశునకము కొంచెముగా నెడమప్రక్క కగసి వెంటనే పండ్లచక్రముయొక్క వేఱొకపంటిని నొక్కి పట్టుకొనును. ఇట్లు చలనస్వభావముగలదిగాన నిది స్వేచ్ఛాచారిశునకమని చెప్పఁబడుచున్నది. యంత్రముయొక్క వెనుకప్రక్క కుంచికాశలాకలకుఁ జెందినమీటలు (Levers) అమర్పఁబడి యుండును. ఈమీటలన్నియును శలాకలమూలమున డోలాయంత్ర (Rocker mechanism) మునకు లంకె వేయఁబడి యుండును. ఈడోలాయంత్రమునకుఁ బై భాగముననే పైఁగనిన శునకము లమర్పఁబడియున్నవి. ముద్రాక్షరకుంచికనుగాని, వ్యవధానశలాకనుగాని నొక్కి పట్టినప్పుడు, కుంచికాశలాకకుఁ జెందినమీటగాని, వ్యవధానశలాకకుఁ జెందిన మీటగాని చలనమొందుచున్నది.

అదేసమయమున సర్వసామాన్యమగు నొకప్రధాన శలాక (Universal bar) గూడ చలనమొంది డోలా యంత్రమునకు చలనము గలిగించుచున్నది. ఇట్లు డోలా యంత్రము చలించునప్పుడు చలనకారియగు పండ్లచక్రమును నొక్కిపట్టుకొనియుండిన స్వేచ్ఛాచారిణునకము కదలి కొంచె మెడమప్రక్క కెగయుచున్నది. కుంచికగాని, వ్యవధానశలాకగాని నొక్కిపట్టఁబడినప్పుడు స్వేచ్ఛాచారిణునకము స్వస్థానమునందుండి కదలి కొంతవ్యవధానము గలిగించుటవలన ప్రధానధనువునకును, పండ్లచక్రమునకును లంకెవేయఁబడిన యుక్కువాఱు వాహనమునకుఁ జలనము గలిగించుచున్నది. వాహనమును మనము నిలిపినస్థలమునుండి కదలనీయక యుంచుటకును, కదలించుటకును నుపకరించున దీస్వేచ్ఛాచారిణునకమే యనవలయును. ప్రధాన శలాక, (Universal bar) డోలా యంత్రము, (Rocker mechanism) ప్రధాన ధనువు(Main spring) అనునీయంత్రభాగములవలననే వాహనమునకుఁ జలనశక్తి గలుగుచున్నది. ఇఁక వ్యవధానశలాక(Space bar) నుగుఱించి కొంచెము తెలిసికొనవలసియున్నది.

ముద్రాక్షరవిలేఖన మొనరించునప్పుడు శబ్దములకు మధ్యమగాని, అక్షరములకు మధ్యమ గాని కొంచెము స్థలము వదలిపెట్టవలసి యుండినచో, నాకార్యమును సాధించుటకై యొకసాధన మేర్పఱుపఁబడియున్నది. అయ్యది కుంచికాఫలకమునకుఁ గ్రిందిపైపున నొకనిడుపాటిచట్టమువలె నమర్పఁబడియుండును. దానిని నొక్కిపట్టినఁ గ్రమముగా నొక్కొక్కనొక్కున కొక్కొక్కయక్షరమునకు వలసినంతస్థలమును (Space) వదలుచుండును ఇయ్యది వ్యవధానశలాక (Space-bar) యన నొప్పుచుండును. ఇఁక దీనివలెనే యుపయోగకరమగు పూర్వస్థలదర్శిని (Back-space)ని గుఱించి కొంత తెలిసికొనవలసియున్నది.

ముద్రాక్షరవిలేఖన మొనరించునప్పు డక్షరములు ముద్రింపఁబడినవెంటనే యవి యెడమప్రక్కకుఁ దొలఁగిపోవుచుండునుగాన, నేదేని యొక్క యక్షరముక్రింద నొకగీటుగాని, ఒత్తక్షరముగాని వ్రాయవలసియున్నను, లేక యట్టియక్షరముపైన నేదేని స్వరవర్ణముయొక్క రూపాంతరముగాని నుఁజిహ్నముగాని వ్రాయవలసియున్నను, నాముద్రితమైన యక్షరమును మఱలఁ బూర్వముండిన స్థలమునకుఁ దేవలసియుండును. ఇట్టికార్యమును సాధించుటకై యొకకుంచిక యమర్పఁబడియుండును. దానిని నొక్కిపట్టినచో వెంటనే ముద్రితాక్షరము పూర్వముండినస్థలమునకు వచ్చిచేరును. ఇట్టికుంచికనే పూర్వస్థలదర్శిని (Back-space) * యందురు.

ఇట్లు ముద్రాక్షరవిలేఖనయంత్రభేదములనుగుఱించియు, ఆయంత్రములయందలి ప్రధానభాగములనుగుఱించియుఁ గొంతస్థూలవర్ణన మొనరించితిని. ఇంతకన్న నీయంత్రమునుగుఱించి విపులముగా వర్ణించుట కిది యవసరముగాదు. ముద్రాక్షరవిలేఖనసంబంధమగు పాఠ్యగ్రంథము (Text book) వ్రాయునంతటిభాగ్యము మన తెలుఁగున కేర్పడినప్పుడు చూచుకొందము. ఇఁక నిట్టిపద్ధతిని తెలుఁగునందు ముద్రాక్షరవిలేఖనయంత్రమును నిర్మించువిధానమును వ్రాయఁగడంగెద.

"తెలుఁగులిపియొఁ దత్సంస్కరణమును" అను నావ్యాసమునందుఁ దెలుఁగులిపియొక్క సంప్రదాయమునుగుఱించియు, నాలిపి కావశ్యకములగు వలంతిమార్పులనుగుఱించియుఁ గొంత సూచించియున్నాఁడను. ఇప్పుడాసంస్కృతమగు తెలుఁగులిపిని ముద్రాక్షరవిలేఖన యంత్రమునం దిముడ్చుపద్ధతిని సూచించుటకునై మొదట కుంచికా(Key-board)ఫలకనిర్మాణమునుగుఱించి కొంత విశదీకరించుచున్నాఁడను. చూడుఁడు. నాల్గవ చిత్రము:—

* ఈ కుంచికసాయము లేకయే ముద్రితాక్షరములు దమంతట తామే స్వస్థానమును జేరునట్లు లొక సులభమైన పద్ధతి గనిపెట్టఁబడి యున్నదని తెలియుచున్నది. అయ్యది వాస్తవమే యైనచో నిఁక శ్రమయొక్కడిది?

LEFT — HAND RIGHT — HAND




*By M.S. Venkayya.*

చిత్రము ౪.

పరివర్తన కుంచికారహితంబగు తెలుఁగు కుంచికా ఫలకము.

[చతురంగుళీ పద్ధతి]

ఈకుంచికాఫలకమును యోస్టు ౧౦-వ నెంబరు (Yost No. 10) యంత్రపుపద్ధతి నేర్పఱచితిని. ఇందు ౧౨౮ కుంచిక లమర్పఁబడియున్నవి. ప్రతికుంచికకును నొక్కొయక్షరముచొప్పున ౧౨౮ అక్షరము లిందిముద్రఁబడి యున్నవి. ఇట్టికుంచికాఫలకముతోఁ గూడినయంత్రమును వాడుకొనుటయం దెట్టిశ్రమము నుండదు. పరివర్తనకుంచికను నొక్కిపట్టవలసిన యావశ్యకత యుండదు. కాని, యిందు కుంచికలసంఖ్య యధికముగానున్నందున, ముద్రాక్షరవిలేఖకుల(Typists)కు శ్రమము గలిగించునని కొందఱు తలంపవచ్చును. అది వట్టిభ్రమ. ఇట్టి పద్ధతిని నిర్మింపఁబడిన యాంగ్ల భాషాయంత్రములు దేలికగా వాడఁబడుచునే యున్నవి. యంత్రప్రయోగమునందలిసౌలభ్యాసౌలభ్యములు యంత్రచాలకుని(Operator) నేర్పరితనమును, నభ్యాసపటిమను బట్టియుండును. ఇఁక నీకుంచికాఫలకమునందలి విశేషములఁ గొంత వివరించెద.

ఇం దొక్కొక వరుసయందును ౧౬ కుంచికల చొప్పున ౮ వరుసలుగాఁ గుంచిక లిముడ్పఁబడియున్నవి. ప్రతివరుసయందును ౮ కుంచికలు కుడివైపునను ౮ కుంచికలు ఎడమవైపునను నున్నవి. ఈ కుంచికలను నొక్కవలసినప్పుడు కుడివైపునందలి కుంచికలను కుడిచేతిలోని నాలుగువ్రేళ్లను గొనియును, ఎడమవైపునందలి కుంచికలను ఎడమచేతిలోని నాలుగువ్రేళ్లను గొనియును నొక్కవలయును. అనఁగా వ్రేలొక్కటికి రెండు కుంచికలుచొప్పున నాలుగువ్రేళ్లకును (౪ X ౨=౮) ఎనిమిది కుంచికలు స్వాధీనము గాఁగలవు. ఇట్లు చేయియొక్కటికి నెనిమిది కుంచికలుచొప్పున రెండుచేతులకును (౨ X ౮=౧౬) పదునాఱు కుంచికలు స్వాధీనము గాఁగలవు. ఈకుంచికాఫలకమునందు అధోభాగమునందలి కుంచికలకుఁ గ్రిందను, ఉపరిభాగమునందలి కుంచికలకు మీఁదను చిన్నచిన్న యంకెలు ముద్రింపఁబడియున్నవి. అందుఁ గుడివైపునందు ౧-వ అంకెల క్రింది కుంచికలను గుడిచేతి జుట్టనవ్రేలితో నొక్కవలయుననియు, ఎడమవైపునందలి ౧-వ అంకెల క్రిందికుంచికలను ఎడమచేతి జుట్టనవ్రేలితో నొక్కవలయుననియు,

ఇట్టులే కుడియెడమలయందలి ౨-వ అంకెలక్రిందికుంచికలను కుడియెడమచేతులలోని నడిమివ్రేళ్లతోడను, మూఁడవ అంకెలక్రిందికుంచికలను ఉంగరపువ్రేళ్లతోడను, ౪-వ అంకెలక్రిందికుంచికలను చిటికెనవ్రేళ్లతోడను నొక్కవలయుననియు నెఱుంగవలయును. ఇదేపద్ధతిని ఒక్కొక వరుసయందలి కుంచికలను నొక్కవలయును. వ్యవధానశలాకను మాత్ర మెల్లప్పుడును కుడిచేతి బొటనవ్రేలితో నొక్కుచుండవలయును. ఇట్టి పద్ధతిని ముద్రాక్షరవిలేఖన మొనరించుటను అంగుళీ విన్యాస (Fingering) మందురు. ఇందుఁ బ్రతిహస్తమునందును నాలుగువ్రేళ్లుపయోగింపఁబడుటవలన నిది చతురంగుళీ విన్యాసపద్ధతి (Four finger method) నాఁబరఁగును. ఈయంగుళీవిన్యాసప్రణాళికయొక్క ముఖ్యోద్దేశము వ్రేళ్లకు శ్రమము లేక కుంచికాఫలకమునం దీమూల నామూల నుండెడికుంచికలను దేలికగా వాడుకొనుటయే.

ఈకుంచికాఫలకమునందు మొదటివరుసలో అంకెలు మున్నగు చిహ్నములును, రెండవవరుసలో హ, ఝ-ఇత్యాద్యక్షరములకు వలసిన కొన్ని విశేషరూపములు, అనుస్వారము, విరతులు మున్నగుచిహ్నములును, మూఁడు-నాల్గు-ఐదు-ఈవరుసలలో వ్యంజనాక్షరములు, స్వరవర్ణములరూపాంతరములు మున్నగునవియును, ఆఱు-ఏడు-ఎనిమిది-ఈవరుసలలో ఒత్తులు, స్వరవర్ణములు మున్నగునవియును నమర్పఁబడియున్నవి. ఈయొత్తులలోఁ గొన్నింటికిఁ బ్రక్కనను, గొన్నింటికిఁ బైనను, గొన్నింటికిఁ గ్రిందను బింద్వాకారపు రేఖ (Dotted lines) లుంపఁబడియున్నవి. అవి యొత్తుల నుపయోగించువిధమును సూచించుచుండును. ఎట్టులనఁగా: లంబరేఖ (Vertical line) కుఁ గుడిప్రక్క నుండెడియొత్తు వ్యంజనాక్షరమునకుఁ గుడిప్రక్క వ్రాయఁబడవలయుననియును, ఎడమప్రక్కయందలి యొత్తు వ్యంజనాక్షరమున కెడమప్రక్క వ్రాయఁబడవలయుననియును, తిర్యగ్రేఖ (Horizontal line) కుఁ గ్రిందివైపున నుండెడి యొత్తు వ్యంజనాక్షరమునకుఁ గ్రిందిభాగమున వ్రాయఁబడవలయుననియును, పైన నుండెడియొత్తు లేక స్వరవర్ణపు రూపాంతరము వ్యంజనవర్ణమునకుఁ బైభాగమునఁ జేర్పఁబడవలయుననియును నెఱుంగవలయును. ఈనూతనాక్షరముల గుణితమును "తెలుఁగులిపియుఁ దత్సంస్కరణము" అను నావ్యాసమునందు విశదీకరించి యున్నాఁడఁ గాన నిట వ్రాయక మానుచున్నాఁడ. మచ్చునకు "ఓం నమః శివాయ" అనువాక్యము నెట్లు ముద్రాక్షరవిలేఖనము సేయవలయునో ఈక్రింద వివరించుచున్నాఁడను. చూడుఁడీ క్రింది యైదవచిత్రమును:—

**A. ఓం నమః శివాయ.**

**B. ఓం నమః శివాయ.**

చిత్రము ౫.

ఇందు "ఓం నమః శివాయ" అనువాక్యము A, B అని రెండురకములుగా వ్రాయఁబడియున్నవి. అందు A లో వ్యంజనాక్షరములతో స్వరవర్ణములరూపాంతరములు గలియువిధము బోధపడుటకై వ్యంజనవర్ణములకును, స్వరవర్ణములరూపాంతరములకును నడుమ నించుక స్థలము వదలిపెట్టఁబడియున్నది. B యందు వ్యంజనాక్షరములతో స్వరవర్ణములరూపాంతరములు చక్కఁగాఁ గూడుకొనినయనంతర మేర్పడురూపములు స్పష్టపఱుపఁబడియున్నవి. ఇఁక నీయక్షరములను ముద్రాక్షరరచన సేయుపద్ధతి నాలకింపుఁడు.

ఈకుంచికాఫలకమునందలి యాఱవ వరుసలోఁ గుడిప్రక్కచివరను గల ఓ-అనునక్షరపుఁగుంచికను మొదట నొక్కవలయును; అనంతరము రెండవవరుసలోఁ గుడివైపునందలి మూఁడవయక్షరమగు ం-అనుకుంచికను నొక్కవలయును; ఆపైని వ్యవధానశలాకను నొక్కి కొంతస్థలము (Space) వదలవలయును. అంత నైదవ వరుసలో నెడమప్రక్కయందలి మొదటియక్షరమగు న-కారముయొక్క కుంచికను నొక్కవలయును. దానికిఁ దలకట్టు గావలసియున్నదిగాన, వెంటనే యైదవవరుసలోఁ గుడిప్రక్కయందలి మొదటియక్షరమగు తలకట్టునకుఁ జెందినకుంచికను నొక్కవలయును. ఆపైని మ-కారమును వ్రాయవలయును. కుంచికాఫలకమునందు మ-అనునక్షరము గనిపించదు. ఇప్పు డేమి చేయవలయును?

ఫలకమునందు నాల్గవ వరుసలో నెడమప్రక్కయందలి నాల్గవ యక్షరమగు వ-కారమునకుఁ జెందిన కుంచికను మొదఁ నొక్కవలయును; వెంటనే రెండవ వరుసలోఁ గుడి ప్రక్కయందలి మూఁడవయక్షరమగు కొమ్ముతలకట్టునకుఁ జెందిన కుంచికను నొక్క వలయును. ఇట్లు చేసినచో మకారము ముద్రిత మగుచున్నది. అటుమీఁద రెండవ వరుసలోఁ గుడిప్రక్కయందలి రెండవయక్షరమగు విసర్గమునకుఁ జెందిన కుంచికను నొక్కవలయును. ఆపైని వ్యవధానశలాకను నొక్కి కొంతస్థలమును వదల వలయును. ఆపినుక నాల్గవవరుసలో నెడమప్రక్కయందలి మొదటియక్షరమగు శ-వర్గమునకుఁ జెందిన కుంచికను నొక్కవలయును; వెంటనే పూర్వస్థల దర్శిని (Back space) ని నొక్కిపట్టి, యాపై నైదవవరుసలోఁ గుడి ప్రక్కయందలి రెండవయక్షరమగు గుడికిఁ జెందిన కుంచికను నొక్కవలయును. ఇట్లు చేసినచో శి-అనునక్షరము ముద్రితమగుచున్నది. అనంతరము నాల్గవ వరుసలో నెడమప్రక్కయందలి నాల్గవ యక్షరమగు వ-కారము నకుఁ జెందిన కుంచికను నొక్క వలయును; వెంటనే యదేవరుసలోఁ గుడిప్రక్కయందలి రెండవ యక్షరమగు దీర్ఘమునకుఁ జెందినకుంచికను నొక్క వలయును. ఇట్లు చేసినచో వా-అను నక్షరము ముద్రింపఁబడును. ఇఁక య-కారమును వ్రాయవలసియున్నది. కుంచికా ఫలకమునందు య-అను నక్షరము గనఁబడదు. ఏమి చేయవలయును? రెండవవరుసలోఁ గుడిప్రక్కయందలి మూఁడవ యక్షరమగు ౦-నకుఁ జెందినకుంచికను నొక్కవలయును; వెంటనే నాల్గవవరుసలోఁ గుడిప్రక్క యందలి రెండవ యక్షరమగు కొమ్మునకుఁ జెందినకుంచికను నొక్కవలయును; ఆపై నైదవవరుసలోఁ గుడిప్రక్క యందలి మూఁడవయక్షరమగు కొమ్ము తలకట్టునకుఁ జెందినకుంచికను నొక్కవలయును. ఇట్లు చేసినచో య-అను నక్షరము ముద్రింపఁబడుచున్నది. ఇఁక నైదవ వరుసలోఁ గుడిప్రక్కయందలి యొనిమిదవయక్షరమగు బిందువునకుఁ జెందిన కుంచికను నొక్కవలయును. ఇప్పుడు పై పటమునఁగనిన "ఓం-న-మః-శి-వా-య." అను నక్షరము లెట్లు ముద్రాక్షర విలేఖన యంత్రమూలమున వ్రాయఁబడవలయుననుట తేటపరుపఁబడినది. ఇదేరీతిని గుంచికా ఫలకమునందలి యన్ని యక్షరములను ముద్రింపవలయును. ఇది యొక్కొకయక్షరమున కొక్కొక కుంచికనొప్పున చేర్పఁబడు "Duplicate arrangement of Upper and Lower case" అను పద్ధతిని నిర్మింపఁబడిన తెలుఁగు కుంచికాఫలకము. ఇఁక రెండవరకపుఁ గుంచికా ఫలకనిర్మాణమును వివరించుచున్నాఁడను. చూడుఁడాఅన చిత్రమును:—




*By M.S.Venkayya.*

చిత్రము ౬.

ఏకపరివర్తనకుంచికాయుతంబగు తెలుఁగు కుంచికాఫలకము.

[చతురంగుళీ పద్ధతి]

ఈకుంచికాఫలకమును రెమింగ్టను ౧౦-వ నెంబరు (Remington No. 10) యంత్రపద్ధతి నేర్పఱచితిని. ఇందు నాలుగువరుసలుగాఁ గుంచిక లమర్పఁబడియున్నవి. మొదటివరుసయందు ౧౪ కుంచికలును, రెండవ వరుసయందు ౧౬ కుంచికలును, మూఁడవ వరుసయందు ౧౬ కుంచికలును, నాల్గవవరుసయందు ౧౬ కుంచికలునుగాఁ (౧౪ + ౧౬ + ౧౬ + ౧౬ = ౬౨) చేరి మొత్తము ౬౨ కుంచిక లమర్పఁబడియున్నవి. ప్రతి కుంచికకును రెండక్షరములచొప్పున (౬౨ × ౨ = ౧౨౪) ౧౨౪ అక్షరము లిం దిముడ్పఁబడియున్నవి. చూడుఁడు: ౧౨౭ కుంచికలలో నిముడ్పఁబడిన యక్షరము లిం కెట్లు ౬౨ కుంచికలలో నిముడ్పఁబడినవో. ఇట్టి కుంచికాఫలకముతోఁ గూడిన యంత్రమునకుఁ బరివర్తనకుంచిక యుండి తీరవలసియున్నది. ఈపరివర్తన కుంచికయొక్క ప్రయోగము నుగుఱించి యీవఱకే కొంత విపులముగా వ్రాసియున్నాఁడను. ఇంకనుగల మఱికొన్ని విశేషములను ముందు వ్రాయవలసియున్న దిగాన,నిట మానితిని. ఇఁక నీకుంచికాఫలకమునందలి విశేషములను గొంత తెలిసికొనవలసి యున్నది.

ఇందుఁ బ్రతికుంచికయందును ఒక యక్షరము పైనను, ఒక యక్షరము క్రిందును జిత్రింపఁబడియున్నది. వ్యంజనాక్షరపుఁ గుంచికలలో నాయా వ్యంజనాక్షరమునకుఁ జెందినవయొత్తు ఆయావ్యంజనాక్షరమున కుపరిభాగమునఁ జిత్రింపఁబడి యున్నది. స్వరవర్ణపుఁ గుంచికలలో నాయా స్వరవర్ణమునకుఁ జెందిన రూపాంతరమాయాస్వరవర్ణమున కధోభాగమునఁ జిత్రింపఁబడియున్నది. ఇట్లక్షరముల నిముడ్చుటయందలి ముఖ్యోద్దేశము వ్రాఁతయందుఁ దఱచుగా వచ్చెడి యక్షరముల కప్పుడప్పుడు పరివర్తన కుంచికను నొక్కిపట్టవలసిన శ్రమను లేక చేయుటయే. ఈకుంచికలలోఁ గ్రిందిభాగమున సూచితమైన యక్షరము లన్నియు నూరక కుంచికలను నొక్కినంతమాత్రముననే ముద్రింపఁబడుననియును, పైపైభాగమున సూచితమైన యక్షరము లన్నియును బరివర్తన కుంచికను నొక్కిపట్టుకొనిన యనంతరము నొక్కినచో ముద్రింపఁబడుననియును సెలవీయంగవలయును. కుంచికాఫలకమును జాగ్రత్తతోఁ బరిశీలించిన నేయే కుంచికలలో నేయేయక్షరము లిముడ్పఁబడి యుండునది తేటపడఁగలదు. ఈ కుంచికాఫలకమునందుఁ గూడ నింతకుఁ బూర్వము చెప్పియుండునట్టులే యంగుళీ విన్యాస (Fingering) మొనరింపవలయును. ఇయ్యది "Single shift-key arrangement of Upper and Lower case" అను నేకపరివర్తనకుంచికాపద్ధతిని నిర్మింపఁబడిన తెలుఁగుకుంచికాఫలకము. దీనినే మఱియొక్క విధముగాఁ గూడ నిర్మింపవచ్చును. చూడుఁ డేడవ చిత్రమును:—




*By M.S.Venkayya.*

చిత్రము ౮.

ఏకపరివర్తనకుంచికాయుతంబగు తెలుఁగు కుంచికాఫలకము.

[చతురంగుళీ పద్ధతి]

ఈఫలకమునందుఁ గుంచికలన్నియును నాల్గు వరుసలుగా వరుసయొక్కటికి ౧౪ కుంచికలచొప్పున (౪ X ౧౪=౫౬) ౫౬ కుంచిక లమర్పఁ బడియున్నవి. ప్రతికుంచికకును రెండక్షరములచొప్పున (౫౬ X ౨= ౧౧౨) ౧౧౨ అక్షరము లిందిముడ్పఁబడియున్నవి. ఇందు(దీర్ఘ)ా, ం, ఛ, శ, ఢ, ఠ, ధ, ఫ, భ, ౯, ౩, ఁ-అను నీ ౧౨ అక్షరములు తీసివేయఁబడినవి. ఈయక్షరముల నన్నింటి నిందలి యితరవర్ణములఁ గొనియే ముద్రించు కొనుమార్గము వేఱొకటి యిందేర్పరుపఁబడియున్నది. అదెట్టులందురా? చెప్పెదను వినుఁడు. ఈఫలకమునం దుఁగల ర-కారమునే (ం) సున్నగా వాడుకొనవచ్చును. ఈర-కారముయొక్క పొట్టయం దొకబొట్టు పెట్టినచో నదియే శ-గా మార్పుఁ జెందును. ద-కారమునకుఁ గ్రింది భాగమున నొక చిన్నలంబరేఖయును, పొట్టయం దొక బొట్టును బెట్టినయెడల నదియే ధ-గా మార్పుజెందును. ఇట్టిపని కుపయుక్తమగు బొట్టు మొదటివరుసలోఁ గుడివైపునందలి మూఁడవయక్షరమగు విసర్గమునకుఁ బైనఁ జేర్పఁబడియున్నది. చ, డ, ద, ప, బ-అనునీయక్షరములకుఁ గ్రిందివైపున లంబరేఖల నుంచినచో ఛ,ఢ,ధ,ఫ,భ-అనునక్షరములుగా మార్పుఁజెందును. ఈకార్యమున కుపయుక్తమగు లంబరేఖ మొదటివరుసలోఁ గుడివైపునందలి మొదటియక్షరమగు ౯-కారమునకుఁ బైన నిముడ్పఁబడియున్నది. ఔ కారచిహ్నముపై ౩-అనునంకెగాఁ గూడ వాడుకొనవచ్చును. ా, (దీర్ఘ) ౯, ఁ-అనునీమూఁ డక్షరములు నీఫలకమునం దుండవు. ఈపద్ధతివలన ౬ కుంచికలు తగ్గింపఁబడినవి. ఇందును అంగుళీవిన్యాసము (Fingering) యథాపూర్వమే. అంకెలు వినా ౫౬ వర్ణములతో నొప్పారు నీతెలుఁగులిపి యంకెలు, విరతులు మున్నగువానితో సహా ౫౬ కుంచికలలో నిముడ్పఁ బడియుండుట యీకుంచికాఫలకమునందలి విశేషము. ఈయేకపరివర్తన కుంచికాపద్ధతి నింతకన్నను గుంచికలను తగ్గించుటకు సాధ్యము గాదు. అట్లు తగ్గింపవలయు నన్న వేఱొకపద్ధతి నవలంబింపవలసి యున్నది. మాఁడుఁడు ఎనిమిదవ చిత్రమును:—




*By M.S.Venkayya.*

చిత్రము ౮.

ద్విపరివర్తనకుంచికాయుతంబగు తెలుఁగు కుంచికాఫలకము.

[త్రిరంగుళీ పద్ధతి]

ఈకుంచికాఫలకమును ఎంపయరు (Empire) యంత్రపద్ధతి నేర్పఱచితిని. ఇందు నాల్గు వరుసలుగాఁ గుంచిక లమర్పఁబడియున్నవి. మొదటివరుసయందు ౧౦ కుంచికలును, రెండవ వరుసయందు ౧౧ కుంచికలును, మూఁడవ వరుసయందు ౧౧ కుంచికలును, నాల్గవ వరుస యందు ౧౦ కుంచికలునుగాఁ (౧౦ + ౧౧ + ౧౧ +

౧౦-౪౨) చేరి మొత్తము ౪౨ కుంచికా లమర్పఁబడి యున్నవి. ప్రతికుంచికకును మూఁడక్షరముల చొప్పున (౪౨ × ౩=౧౨౬) ౧౨౬ అక్షరము లిందిముద్రింపఁబడి యున్నవి. పూర్వుఁ డిది ప్రాతపొత్తు రెమింగ్టను (Remington No. 10) ౧౦-వ నెంబరు యంత్రము నందలి కుంచికాఫలకమునకు మున్నను, అక్షరములుమాత్ర మన్నియు నిం దిమిడిపోయినవి. ఇట్టి కుంచికాఫలకముతోఁగూడిన యంత్రమునందు రెండుపరివర్తన కుంచిక లుండుట యావశ్యక మైయున్నది. ఈకుంచికాఫలకము నందు మొదటివరుసయందలి కుంచికలలో అంకెలు, విరతులు మున్నగుచిహ్నములును, రెండవ, మూఁడవ, నాల్గవ వరుసలయందలి కుంచికలలో వ్యంజనవర్ణములును వానికిఁ జెందినవొత్తులును, స్వరవర్ణములును వానికిఁ జెందిన రూపాంతరములును నిముద్రింపఁబడియున్నవి. ఇందు నానావ్యంజనవర్ణములకుఁ జెందిన యొత్తులును, అచ్చుల రూపాంతరములు నానావ్యంజన స్వరవర్ణములకుఁ జెందిన కుంచికలకుఁ బ్రక్కనుండెడి కుంచికలయం దమర్పఁబడియుండును. ఎట్టులనఁగా: ఉదాహరణముగా నాల్గవ వరుసయం దెడమప్రక్కగల మొదటి కుంచికను దీసికొందము. ఇందుఁ గ్రిందిభాగమున వ-కారమును, పైభాగమున డ-కారమును, దాని కుపరిభాగమున త-కారమును నిముద్రింపఁబడి యున్నవి. ఈ కుంచికకుఁ బ్రక్కనే గల కుంచికయందుఁ గ్రింది భాగమున ౖ-వత్తును, పైభాగమున ం-వత్తును, దానికిఁ పైభాగ ౼-వత్తును నిముద్రింపఁబడియున్నవి. ఇట్టులే యితరములగు కుంచికలును సమర్పఁబడియున్నవి. కుంచికాఫలకమును బరికీలించి చూచినచో నందలియక్షరము లన్నియు విస్పష్టము గాఁగలవు. ఇందుఁ ద్ర్యంగుళీవిన్యాసపద్ధతి(Three finger method) నవలంబింపవలయును. ఇయ్యదిద్విపరివర్తనకుంచికాపద్ధతి(Double shift-key arrangement of Upper and Lower case) ని నిర్మింపఁబడిన తెలుఁగు కుంచికా ఫలకము. పరివర్తనకుంచికల సాయమున నిట్టి త్ర్యక్షరయుత కుంచికలలోని యక్షరములను ముద్రించుపద్ధతి కొందఱికి వింతగాఁ దోఁపవచ్చునుగాన, నావిషయము నిట మఱల నొక్కమాఱు వివర్ణనపూర్వకముగా స్పష్టీకరించు టెంతయు నావశ్యక మైయున్నది. మూఁడుఁడు: తొమ్మిదవ చిత్రమును:—




SIDE ELEVATION OF SHIFT-KEYS ETC.,

చిత్రము ౯.

ఇందు ద్విపరివర్తన కుంచికలయొక్కయు, వాహనము(Carriage)యొక్కయుఁ, బైఁగనిన నాలుగవ రకపుఁగుంచికాఫలకములో నధోభాగమునం దెడమ ప్రక్కఁగల మొదటికుంచికయొక్కయుఁ బార్శ్వన్యాసము (Side Elevation) చిత్రింపఁబడి యున్నది. ఇఁక నీకుంచికల నెట్లుపయోగింపవలయునో యించుక విచారింతము: ఈకుంచికలలో C-అనుదానియందు వ, డ, త-అనునీమూఁడక్షరము లిముద్రింపఁబడి యున్నవిగదా. అందు వ-అనునక్షరమును ముద్రింపవలయునన్నచోఁ బరివర్తనకుంచికను నొక్కవలసిన పనియుండదు. కేవలము C-అను నీయక్షరపుకుంచికను O-అనుస్థలమునకు దిగునట్లు నొక్కినంతటనే ఆయక్షరమునకుఁ జెందిన E-అనుశలాక తివ్వన నెగసి D-అనుసిలిండరునందు P-అను స్థలమును జేరి శలాకచివఱను F-అనుస్థలమునందుఁ గల వ-కారమును ముద్రించును. ఇట్లు ముద్రింపఁబడునప్పుడు

సిలిండరు యథాస్థానమునందే యుండును. ఇఁక నీకుంచికయందుఁ బై భాగమునఁ గల ద-అను నక్షరమును ముద్రింపవలయు నన్నచో, A - అను పరివర్తన కుంచికను O - అనుస్థలమునకు దిగునట్లు మొదట నొక్కి పట్టవలయును. అట్లు నొక్కినచో D-అను సిలిండరు z -అను మీఁటమూలమున A-అను స్థలమున కెగయును. అప్పుడు C-అను నక్షరపుఁ గుంచికను O-అనుస్థలమునకు దిగునట్లు నొక్కినచో E-అను శలాకలో G-అను స్థలమునందలి ద-కారము సిలిండరులో P-అను స్థలమున దగిలి ముద్రితమగును. C-కుంచికలో ద-కారమునకుఁ బైగల త-కారమును ముద్రింపవలయు నన్నచో నిట్టులే మొదట B-అను పరివర్తన కుంచికను O-అను స్థలమునకు దిగునట్లు నొక్కిపట్ట వలయును. అప్పుడు D-అను సిలిండరు B-అను స్థలమున కెగయును. వెంటనే C-అను నక్షరపుఁగుంచికను O-అను స్థలమునకు దిగునట్లు నొక్కినచో E-అను శలాకలో H-అను స్థలమునందలి త-కారము సిలిండరులో P-అను స్థలమునఁ దగిలి ముద్రితమగును. ఇట్టులే యన్నికుంచికలలోని యక్షరములను బరివర్తనకుంచికల నొక్కిపట్టుచు ముద్రింపవలయును. ఇయ్యది ద్విపరివర్తన కుంచికలతోఁ గూడిన కుంచికాఫలకమునందలి యక్షరములను ముద్రించుపద్ధతి. ఇఁక నేకపరివర్తన కుంచికాయుత మగు కుంచికాఫలకమునుగొని యక్షరములను వ్రాయువిధమును గొంత విశదీకరించెదను. చూడుఁడు ఆఱవచిత్రమునందలి కుంచికాఫలకమును.

మచ్చునకు బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు, రఘురి, సౌందర్యవల్లి అనుపదములను దీసికొని మొదట "బ్రహ్మ" అనుపదమును వ్రాయుదము. ఈకుంచికాఫలకములో నాల్గవవరుసయం దెడమప్రక్కఁగల నాల్గవకుంచికను బరివర్తన కుంచికను నొక్కిపట్టుకొనిన వెనుక నొక్కినచోఁ గుంచికలోఁ బైవైపునందలి బ్రకారవడి ముద్రితమగును; అనంతరము కుంచికాఫలకములో మూఁడవవరుసయం దెడమప్రక్క నెనిమిదవ కుంచిక యగు బ-కారమును నొక్కి ముద్రింపవలయును. కుంచికలో నిది క్రిందియక్షరము గాన, దీనికిఁ బరివర్తన కుంచికను నొక్కనక్కఱలేదు. ఇట్టులే కుంచిక లన్నింటిలోఁ గ్రిందివైపునఁగల యక్షరములను ముద్రించుకొనవలయునని తెలియఁదగును. ఇప్పుడు బ్ర-అనునక్షరము ముద్రింపఁబడినది. ఇఁక గుంచికాఫలకమున మూఁడవవరుసలో నెడమవైపునందలి నాల్గవకుంచికలోని క్రిందియక్షరమగు వ-కారమును నొక్కవలయును; అంత ఫలకమున రెండవవరుసలోఁ గుడిప్రక్కయందలి యాఱవకుంచికలోఁ గ్రిందియక్షరమగు హ-కారమునకుఁ జెందిన ప్రత్యేక చిహ్నమును నొక్కవలయును. ఇట్లు చేసినచో వ-కారము హ-కారముగా మార్పునొందుచున్నది. ఆపైని ఫలకమున నాల్గవవరుసలోఁ గుడిప్రక్కయందలి యాఱవ కుంచికలోఁ గ్రిందియక్షరమగు ్మ-వత్తును నొక్కవలయును. ఇప్పుడు "బ్రహ్మ" అనుపదము ముద్రాక్షరములతో వ్రాయఁబడినది. ఇఁకను రెండవదగు "విష్ణువు" అనుపదమును వ్రాయుదము.

ప్రథమమున నిప్పుడు కుంచికాఫలకములో నెడమప్రక్క మూఁడవవరుసయందలి నాల్గవకుంచికలోఁ గ్రిందివైపునందలి వ-కారమును నొక్కవలయును. అనంతరము ఫలకమున నాల్గవవరుసలోఁ గుడిప్రక్కయందలి రెండవయక్షరమగు (ి) గుడిని నొక్కవలయును. దీనికిఁ బూర్వస్థలదర్శిని యనుకుంచికయొక్క సాయము గావలసియున్నది. ఇప్పుడు వి-అనునక్షరము వ్రాయఁబడినది. ఇఁక ఫలకమునందలి రెండవవరుసలో నెడమప్రక్కఁ గల నాల్గవకుంచిక యగు ష-వర్ణమును నొక్కవలయును. అనంతరము నాల్గవవరుసలోఁ గుడిప్రక్కఁగల మూఁడవ కుంచికయగు కొమ్ముతలకట్టును నొక్కవలయును. ఆపైనిఁ బూర్వస్థలదర్శినిసాయమున ఫలకమునందు మూఁడవవరుసలోఁ గుడివైపున నాల్గవకుంచికలోఁ బైభాగమునందలి ణ-వత్తును బరివర్తనకుంచికను నొకవ్రేలితో నొక్కి పట్టుకొనినపిమ్మట నొక్కవలయును. ఇప్పుడు ష్ణ-అనునక్షరము వ్రాయఁబడినది. ఆవెనుక ఫలకమున మూఁడవ వరుసలో నెడమప్రక్కఁ గల నాల్గవకుంచికలోఁ గ్రిందియక్షరమగు వ-కారమును నొక్కవలయును; అంత నాల్గవవరుసలోఁ గుడిప్రక్క నాఱవకుంచికలోఁ బైభాగమునందలి కొమ్ముతలకట్టును బరివర్తనకుంచికను

నొక్కిపట్టుకొనిన పిమ్మట నొక్కవలయును. ఇప్పుడు "విష్ణువు"అనుపదము ముద్రాక్షరములతో వ్రాయఁబడినది. ఇఁక మూఁడవదగు "మహేశ్వరుఁడు" అనుపదమును వ్రాయుదము.

మొదట కుంచికాఫలకమున మూఁడవవరుసలో నెడమ ప్రక్క నాల్గవకుంచికయగు మ-కారమును నొక్కవలయును; అంత నాల్గవ వరుసలోఁ గుడిప్రక్కయందలి మూఁడవ కుంచికలోఁ గ్రిందిపైపునందలి కొమ్ముతలకట్టును నొక్కవలయును. ఇప్పుడు మ- వ్రాయఁబడినది. అనంతరము, మూఁడవవరుసలో నెడమప్రక్కఁగల నాల్గవకుంచికలోని క్రిందియక్షరమగు వ-కారమును నొక్కవలయును; ఆవెంటనే ఫలకమున నాల్గవవరుసలో గుడిప్రక్కయందలి నాల్గవకుంచికలోఁ గ్రిందిపైపునందలి (ె) ఎత్వమును బూర్వస్థలదర్శిని సాయమున ముద్రింపవలయును; అంత, మూఁడవ వరుసలోఁ గుడిపైపునందలి రెండవకుంచికలోని క్రిందియక్షరమగు దీర్ఘమును నొక్కవలయును; ఆపైని రెండవవరుసలోఁ గుడిప్రక్కయందలి రెండవ కుంచికయందుఁ గ్రిందిపైపున గల దీర్ఘచిహ్నమును నొక్కవలయును. ఇప్పుడు హే- అను నక్షరము వ్రాయఁబడినది. ఇఁక ఫలకమున మూఁడవ వరుసలో నెడమప్రక్క మొదటికుంచికలోఁ గ్రిందిభాగమునందలి శ-వర్ణమును నొక్కవలయును; ఆపైని నాల్గవవరుసలోఁ గుడిప్రక్క మొదటి కుంచికలోఁ గ్రిందిపైపునందలి అకారచిహ్నమగు తలకట్టును నొక్కవలయును; అంత మూఁడవవరుసలో నెడమప్రక్కఁగల నాల్గవకుంచికలోఁ బైపైపునందలి (్వ) వావత్తును బరివర్తన కుంచికసాయమున నొక్కవలయును. అప్పుడు శ్వ-అను నక్షరము వ్రాయఁబడుచున్నది. ఆవెనుక నాలుగవ వరుసలో నెడమప్రక్క నాల్గవకుంచికలోఁ గ్రిందిపైపునఁగల ర-కారమును నొక్కవలయును; అంత నదేవరుసలోఁ గుడిపైపునఁగల మూఁడవ కుంచికలోఁ గ్రిందిపైపునందలి కొమ్ముతలకట్టును నొక్కవలయును. అపిదప మొదటి వరుసలోఁ గుడిపైపునందలి మూఁడవకుంచికలోఁ గ్రింది భాగమునఁగల (ఁ) అర్ధానుస్వారమును నొక్కవలయును. ఆవెంటనే మూఁడవ వరుసలోఁ గుడిప్రక్క రెండవకుంచికలోఁ గ్రిందిపైపునఁ గల డ-కారమును నొక్కవలయును; అపైని నాల్గవవరుసలోఁ గుడిప్రక్క మూఁడవకుంచికలోఁ గ్రిందిభాగమునఁ గల కొమ్ము తలకట్టును నొక్కవలయును. ఇప్పుడు "మహేశ్వరుఁడు" అనుపదము ముద్రాక్షరములతో వ్రాయఁబడినది. ఇఁక "ఝరి" అనుపదమును వ్రాయుదము.

ఇందు మొట్టమొదట ఫలకమున నాల్గవవరుసలో నెడమప్రక్కఁగల నాల్గవకుంచికలోని క్రింది యక్షరమగు ర-కారమును నొక్కవలయును; అనంతరము నాల్గవవరుసలోఁ గుడిప్రక్కయందలి మూఁడవ కుంచికలోఁ గ్రిందిపైపునందలి కొమ్ము తలకట్టును నొక్కవలయును; ఆవెంటనే మొదటి వరుసలోఁ గుడిప్రక్కయందలి రెండవ కుంచికలోఁ గ్రిందిపైపునందలి ఝ-కారమునకుఁ జెందిన ప్రత్యేకచిహ్నమును నొక్కవలయును; అప్పుడు ఝ-కారము ముద్రితమగును. అపైని నాలుగవ వరుసలో నెడమప్రక్కయందలి నాల్గవకుంచికలోఁ గ్రిందిపైపునందలి ర-కారమును నొక్కి, ఆవెంటనే యదేవరుసలోఁ గుడిప్రక్కన రెండవ కుంచికలోఁ గ్రిందిభాగమునందలి(ి) గుడిని బూర్వస్థలదర్శిని సాయముంగొని నొక్కవలయును. ఇప్పుడు "ఝరి" అనుపదము ముద్రాక్షరములతో వ్రాయఁబడినది. ఇఁక "సౌందర్యవల్లి" యనుపదమును వ్రాయుదము.

మొదట ఫలకమున మూఁడవ వరుసలో నెడమ ప్రక్కఁ గల రెండవ కుంచికలోఁ గ్రిందిపైపునందలి స-వర్ణమును నొక్కవలయును; అంత మొదటి వరుసలోఁ గుడిపైపున మూఁడవ కుంచికలోఁ బైభాగమునందలి స-వర్ణమునకుఁ జెందిన ప్రత్యేకచిహ్నమును*

* ఈచిహ్నమునే ప, ఫ, వ, స-అనునీవ్యంజనాక్షరములకు దీర్ఘముగాని, ఔకారముగాని చేర్పఁబడవలసినపు డావర్ణములశిరోభాగముల నంటునట్లుగ ముద్రింపవలయును. ముద్రాక్షరమంజూషలో నీయక్షరములకుఁ జేర్పవలసిన యీచిహ్నము వేఱుపద్ధతి నిముడ్పఁబడియున్నది. అయ్యది "తెలుఁగులిపియుఁ దత్సంస్కరణము" అను నావ్యాసమున దేటపరుపఁబడియున్నది.

పూర్వస్థలదర్శినిసాయమున బరివర్తనకుంచికను నొక్కి పట్టుకొనినయనంతరము నొక్కవలయును; వెంటనే రెండవ వరుసలోఁ గుడిప్రక్క చివఱను గల కుంచికలోఁ గ్రిందిపైపునఁ గల ౌకారచిహ్నమును నొక్కవలయును. అప్పుడు సౌ-అనునక్షరము ముద్రింపఁబడును. అనంతరము మొదటివరుసలోఁ గుడిపైపునందలి రెండవకుంచికలోఁ గ్రిందిభాగమునందుఁ గల (ం) అనుస్వారమును నొక్కవలయును. ఆపైన నాల్గవ వరుసలో నెడమ ప్రక్కఁ గల రెండవ కుంచికలోఁ గ్రిందిపైపునఁ గల ద-కారమును నొక్కవలయును; ఆవెంటనే యదేవరుసలోఁ గుడిపైపునందలి మొదటి కుంచికలోఁ గ్రిందిపైపునందలి తలకట్టును నొక్కవలయును. అమీఁదట నదే నాలుగవవరుసలో నెడమపైపునందలి నాలుగవకుంచికలోఁ గ్రిందిభాగమునఁ గల ర-కారమును నొక్కవలయును; అంత నదే వరుసలోఁ గుడిప్రక్క మొదటి కుంచికలోఁ గ్రిందిపైపునందలి తలకట్టును నొక్కవలయును. ఆవెంటనే అదేవరుసలోఁ గుడిపైపున నైదవ కుంచికలోఁ గ్రిందిభాగమునఁ గల (్య) కియ్యవడిని నొక్కవలయును. ఆపిమ్మట మూఁడవవరుసలో నెడమప్రక్కఁ గల నాల్గవకుంచికలోఁ గ్రిందిభాగమునఁ గల వ-కారమును నొక్కవలయును. దానికి నాల్గవవరుసలోఁ గుడిప్రక్క మొదటికుంచికలోఁ గ్రిందిభాగమునఁ గల తలకట్టును జేర్పవలయును. ఆపైని మూఁడవవరుసలో నెడమప్రక్క నాలవకుంచికలోఁ గ్రిందిపైపునఁ గల ల-కారమును నొక్కవలయును; దానికి నాల్గవవరుసలోఁ గుడిప్రక్క రెండవకుంచికలోఁ గ్రిందిపైపునఁ గల (౨) గుడిని పూర్వస్థలదర్శినిసాయముంగొని చేర్పవలయును; ఆవెంటనే మూఁడవ వరుసలో నెడమప్రక్క నాలవ కుంచికలోఁ పైభాగమునఁ గల (౧) లావత్తును బరివర్తన కుంచికను నొక్కిపట్టుకొనిన యనంతరము పూర్వస్థలదర్శినిసాయముంగొని ల-కారమునకుఁ గ్రింద ముద్రింపవలయును. ఇప్పుడు "సౌందర్యవల్లి" అనుపదము ముద్రాక్షరములతో వ్రాయఁబడినది. ఈతీరుననే యన్ని కుంచికలలోని యక్షరములను ముద్రింపవలయునని యెఱుంగవలయును. పైఁ జేర్కొనఁబడిన "బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు, ఝురి, సౌందర్యవల్లి" అను నీపదముల నీక్రింది పదపచిత్రమునఁ బ్రదర్శించియున్నాఁడను. వానిని బరిశీలించిన నీశబ్దములలోని యక్షరము లెట్లు వ్రాయఁబడినవనుట తెల్లముగాఁగలదు.

**A. బ్రహ్మ విష్ణువు మహేశ్వరుఁడు**

**B. బ్రహ్మ విష్ణువు మహేశ్వరుఁడు**

**A. ఝురి సౌందర్యవల్లి**

**B. ఝురి సౌందర్యవల్లి**

చిత్రము ౧౦.

పైఁ జేర్కొనిన నాల్గువిధములగుఁ దెలుఁగుకుంచికాఫలకములలోఁగల మఱికొన్ని విశేషముల నిటసూచించుచున్నాఁడను. ౬, ౭, ౮ ఈపటములయందలి తెలుఁగు కుంచికలలో ఏ-ఓ లుండవు. ఈకుంచికాఫలకములలో రెండవవరుసలోఁ గుడిప్రక్క చివఱ నుండెడి ౌ-కార చిహ్నమున కుపరిభాగమునందలి లంబరేఖను ఎ-ఒ-లకు పైనిఁ జేర్చికొనినచో ఏ, ఓ-లగును. ౫, ౬, ౭, ౮ ఈ చిత్రములందలి కుంచికలలో ౮-ఎనిమిది యను సంకేతము సూచించుకుంచిక యుండదు. ్క-కావత్తునే దానికి బదులుగా వాడుకొనవలయును. ౧-గావత్తు, ౨-తావత్తు ఈ రెండును వ్యంజనాక్షరములకుఁ బ్రక్కన వ్రాయఁబడు వొత్తులుగా నుండియుండిన, నవియే ౧, ౨-అను సంకేతములుగాఁగూడ వాడుకొనుట కుపకరించి యుండెడివి. అట్లవి లేకపోవుటచే నీరెండంకెలకును బ్రత్యేకముగాఁ

గుంఛిక చేర్పఁబడవలసివచ్చినది. ౪, ౬, ౮ ఈ పటము లందలి కుంచికాఫలకములలో (.) బిందువు, (,) వాక్యాంశ బిందువు, (:) న్యూనబిందువు, (?) ప్రశ్నార్థక చిహ్నము, (!) రాగచిహ్నము అను నీ విరతులు మాత్రమే యుండును. (;) అర్ధబిందు వుండదు. ఈచిహ్నము గావలసియున్నచో ముందట (:) న్యూన బిందువును ముద్రించి, యా పైగ వాక్యాంశబిందువును ముద్రింపవలయును. అట్లొనరించినచో (;) అర్ధబిందువు ముద్రింపఁబడును. ఎనిమిదవ చిత్రమునందలి కుంచికాఫలకములో (;) అర్ధబిందువు గూడఁ జేర్పఁబడియున్నది. ౪, ౬, ౭ ఈ చిత్రములయందలి కుంచికాఫలకములలో (*) తారకము చేర్పఁబడియున్నది. ౭వ చిత్రమునందలి కుంచికాఫలకములో (†) బాకుగూడఁ జేర్పఁబడియున్నది. ఈనాల్గురకములగు తెలుఁగుకుంచికాఫలకములయందలి ర్-యను సంకేతమే వలపల గిలుకగాఁ గూడ వాడుకొనవలయును. ఈసందర్భమున నీవలపల గిలుకనుగుఱించి నాలుగుమాటలు వ్రాయవలసి యున్నవి. కొందఱు వలపలగిలుకను వాడుటను మానివేయుచున్నారు. వా రందలి సౌకర్యము నెఱింగినట్టులఁ గన్పట్టదు. మాడుఁడు. భర్గః, ఆర్ద్రః, శార్ఙ్గః, ఆర్ద్రి అనునిత్యాదిపదములను వ్రాయునప్పు డందలి సంయుక్తాక్షరములు దొంతికుండలఁ బేర్చినట్టు లేర్పడుచున్నవి. ఈ శబ్దములనే భర్గః, ఆర్ద్రః, శార్ఙ్గః, ఆర్ద్రిః అని యిట్టుల వ్రాసికొనినచో నట్టులుండవు. ముద్రణమునందును, ముద్రాక్షరవిలేఖనమునందును గూడ పని చాల తేలిక యగును. ఇట్లింతయు నుపయోగకరమగు నీ (ర్) వలపలగిలుకను వాడకుండుట చాల విచారకరమగు విషయముగా నున్నది. ఇఁకనైన మనవా రిద్దానిని యథాపూర్వముగా నుపయోగింతురుగాక. ఈపైని వివరింపఁబడినరీతినిఁ దెలుఁగుకుంచికాఫలకములను నాల్గురకములుగా నిర్మించుకొనవచ్చును. అందు మనకిష్టమైనదానిని ముద్రాక్షరవిలేఖనయంత్రమునం దిముడ్చుకొనవచ్చును.

మనదేశమందలి నాగరి, గురుముఖి, గుజరాతి, ఉర్దు- ఇత్యాది ఔత్తరీయలిపులయందును, ఆంగ్లమునందును ముద్రాక్షరవిలేఖనయంత్రములు నిర్మితములై ప్రచారమునం దున్నవి. పైఁగనిన నాగరి, గుజరాతి మున్నగు లిపులయందును గూడఁ దెలుఁగునందువలె వ్యంజనాక్షరములకుఁ గ్రిందను, ప్రక్కను ఒత్తులను జేర్చి వ్రాయుపద్ధతి గలదు. ఆంగ్లమునందుఁ గూడ హలన్తచిహ్నమునుబోలు వ్యంజనాక్షరముల కుపరిభాగమున నుంచి క్, చ్, ట్, త్, ప్ (క్, చ్, ట్, త్, ప్) అని యిట్లు వ్రాయఁబడుచున్నది. చూడుఁడు: తేలిక యగులిపియని తలంపఁబడు దీనికి నీకష్టము దొలంగినది గాదు. ఉర్దులిపి కుడిప్రక్కనుండి యెడమప్రక్కకు వ్రాయఁబడునదిగా నుండుటవలన, దానికి యంత్రమునే వేఱువిధముగా నిర్మింపవలసి యుండునుగదా? ఇట్టి భాషలకెల్ల ముద్రాక్షరవిలేఖనయంత్రములు నిర్మింపఁబడినవనఁగా నిఁకఁ జెప్పవలసిన దేమున్నది? దీనినిబట్టి యాలోచించినచో నీముద్రాక్షరవిలేఖనయంత్రము లాయాభాషకుఁ దగినట్టు లేర్పఱుపఁబడుచున్నవని తెలియక పోదు. విషయ మిట్టులుండఁగాఁ గొందఱు సంప్రదాయ విరుద్ధముగా నీతెలుఁగులిపిని మార్చి క్రొత్తమార్గ మొనరించి, యిట్లు చేసిననే ముద్రాక్షరవిలేఖనయంత్రనిర్మాణము సాధ్యమగునని చెప్పుచున్నారు. కొందఱు అసలుకీ తెలుఁగులిపియే పనికిరా దనియు, దానిస్థానమున లోకోత్తరమై వెలయు రోమకాక్షరములను వాడుకొనినచో వైపురైటరు చేయింపవలసినపనికూడ లేక పోవునని యుఁ జెప్పుచున్నారు. చూచితిరా? ఈసలహా యెట్టులున్నదో!

కొంద ఱింగ్లీషుకుంచికాఫలకము నాదర్శముగాఁ దీసికొని యందెన్ని కుంచిక లున్నవో యన్నియే కుంచికలలో నీతెలుఁగక్కరములను గూడ నిముడ్చుకొనవలయు ననియు, నంతకన్నఁ గుంచిక లెక్కువైనచో యంత్రము నిర్మించుటకు సాధ్యముగా దనియుఁ, గుంచిక లెక్కువుగానుండినచో ముద్రాక్షరవిలేఖకుల (Typists) కుఁ జాల శ్రమము గలుగుననియు, నింక నిట్టివెన్నియో శంకలకుఁ బాలగుచున్నారు. కొందఱు "అబ్బో! తెలుఁగునం దక్షరము లెక్కువ. ఒత్తులుమున్నగున వెన్నియో యున్నవి. ముద్రాక్షరవిలేఖనయంత్రనిర్మాణ మేనాఁటికిని సాధ్యముగాదు. లిపియందలియొత్తులను

దీసి పాఱనూకవలయును. అఱవమునందువలె నొత్తులు లేక వ్రాయుపద్ధతి నీతెలుఁగునకుఁ గూడ నేర్పఱుపవలయును. అప్పుడే యీ తెలుఁగునకు ముద్రాక్షరవిలేఖనయంత్రనిర్మాణము సాధ్యమగును. లేనిచో నది గగనకుసుమమే" అని యిట్లు తలంచుచున్నారు. ఇట్లు తలంచుట కేవలము భ్రమయే యనవలయును. ముద్రాక్షరవిలేఖనయంత్రనిర్మాణసౌలభ్యమునకై యక్లిష్టలేని తెలుఁగువర్ణమాలయందలి యక్షరములను తగ్గించి సంప్రదాయవిరుద్ధముగా లిపిని సంస్కరింపఁ బూనుదురేని లిపికిని, భాషకునుగూడ జలాంజలి నొసఁగవలసినదే. ఇంగ్లీషుయంత్రమునందువలెనే తెలుఁగుముద్రాక్షరవిలేఖనయంత్రమునందుఁ గూడ ౪౨ కుంచికలే యుండితీరవలయునని నిర్బంధపఱచుట యేమి న్యాయము? లిపికిఁ దగినట్టులుగదా యంత్రమును నిర్మింపవలయును. మా నుఁడు: అఱవభాషకు వర్ణములు ముప్పదియేగదా! కాని, దానిముద్రాక్షరవిలేఖనయంత్రమునందు మాత్రము ౪౬ కుంచికలు గావలసివచ్చినది. ఏల? ఆలిపియందలి కొన్నిలోపములనుబట్టియే. ఉదాహరణముగా ఆ-కార, ఊ-కార రూపాంతరములఁ దీసికొందము. ఆకార రూపాంతరము రెండురకములుగా ◌ా, ◌ு-అని యిట్లు వ్రాయఁబడుచున్నది. ఊ-కారరూపాంతరము మూఁడురకములుగా ◌ு, ◌ு, ◌ூ-అని యీతీరున వ్రాయఁబడును. ఇట్లు వ్రాయఁబడుటమాత్రమే గాక, ఈరూపాంతరములలోఁ గొన్ని ప్రత్యేకముగాఁ జేయించుకొని వ్యంజనాక్షరములతోఁ జేర్చుకొనుటకుఁ గూడ సాధ్యము గాకపోయినవి. అందువలననే [illegible], [illegible], [illegible]-(ణా, ఝా, నా) అనునీయక్షరములను, [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible] - (కు, చు, ఘు, టు, ణు, తు, ను, ము, రు, లు, ళు, ఱు, ఉు, ను) అనునిత్యావ్యక్షరములను ప్రత్యేకముగాఁ జేయించి కుంచికలలో నిముడ్చుకొనవలసి వచ్చినది. [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible] (కూ, చూ, టూ, మూ, రూ, లూ, ళూ, టీ) అనువక్షరములనుగూడఁ బ్రత్యేకముగాఁ జేయవలసినట్టు లేర్పడినది. [illegible], [illegible], [illegible], [illegible] - (జూ, పూ, యూ, వూ) ఈయక్షరములయందలి ఊ-కారరూపాంతరము మాత్రము ప్రత్యేకముగాఁ జేయించుకొని తెలుఁగునందలి యొత్తులవలె నీయక్షరముల క్రిందు ముద్రించుకొనవలసినట్లు లేర్పడినది. ఇంకను నిట్టిలోపము లెన్నియో యున్నవి. కావుననే, అఱవవర్ణమాలయం దక్షరములు ముప్పదియే యైనను గుంచికాఫలకమునందు మాత్రము ౪౬ కుంచికలు గావలసివచ్చెను. చూచితిరా! ఇందును గుంచికాఫలకము లిపికిఁ దగినట్టులే నిర్మింపఁబడినది. ముప్పది యక్షరములు గల యఱవలిపికే ౪౬ కుంచికలు గావలసివచ్చినప్పుడు, ౫౬ అక్షరములు గల తెలుఁగునకు ౭౨ కుంచికలు గావలసియుండుట యొకవింతగాదు గదా? ఈయఱవకుంచికాఫలకముగూడ నేకపరివర్తనకుంచికాపద్ధతినే నిర్మింపఁబడియున్నది.

పైనఱవమునందుఁ జేర్కొనినట్టిలోపములు, లేక స్వరవర్ణముల రూపాంతరము లన్నియుఁ జక్కనిపద్ధతి నేర్పఱుపఁబడి యున్నందున, మన తెలుఁగులిపి ముద్రాక్షరవిలేఖనయంత్ర నిర్మాణమున కెంతయు ననుకూలించియే యున్నదనుట కుపొంగవలసి యున్నది. ఈ తెలుఁగునకు ముద్రాక్షరవిలేఖనయంత్రము నిర్మించుటయం దేర్పడినచిక్కు కుంచిక (Keys) లెక్కుడుగా నుండుటవలనను, ఒత్తులను ప్రత్యేకచిహ్నము లుండుటవలనను గాదు. మఱియును, మనము ప్రస్తుతము ముద్రణమునందు వాడుచుండెడి తలకట్టు, దీర్ఘము, ఒత్వము, ఓత్వము, ఔత్వము మున్నగువానియందలి సూక్ష్మములగు కొన్నిలోపములే యనవలసియున్నది. ఆ స్వల్పలోపములను బ్రాచీనశాసనములందలి లిపి నాధారముగాఁ జేసికొని సవరించి, ముద్రాక్షరవిలేఖనయంత్ర నిర్మాణయోగ్యమగునట్టు లొనరించి యీ విషయమును సమగ్రముగా "తెలుఁగులిపియుఁ దత్సంస్కరణమును" అను నావ్యాసమునందు స్పష్టపఱచి యున్నాఁడను. అట్లీలిపి సంస్కరింపఁబడినందువలననే తెలుఁగునకు ముద్రాక్షర విలేఖనయంత్ర నిర్మాణము సాధ్యమగు నని చెప్పఁగల్గితిని. ఇవు డీవ్యాసమునఁ దెలుఁగు (Telugu Key-board) కుంచికాఫలకమును నాలుగు రకములుగా నిర్మింపవచ్చునని విశదీకరించి చూపియున్నాఁడను. కుంచికలయందుఁ బ్రదర్శింపఁబడిన యక్షరములను ముద్రించుపద్ధతిని గూడ

## విన్నపము.

ఆర్య మహాశయులారా,

ఈనూతనాక్షరముల సౌందర్యమును జూడుఁడు. ఈవర్ణములు మీనేత్రేంద్రియముల కానంద మొనఁగూర్చుచుండలేదా? ఇట్టియక్షరములతోఁ దెలుఁగునందు ముద్రాక్షరవిలేఖనయంత్రములు నిర్మింపఁబడుటకు మీరేల యంగీకరింపరాదు?

ముద్రాక్షరవిలేఖనయంత్రములు నిర్మింపఁబడినచో మీయుత్తరములను రమణీయముగా ముద్రాక్షరములతో వ్రాసికొనవచ్చును. మీరు వ్రాయఁదలంచిన వ్యాసములనుగాని, గ్రంథములనుగాని చేతికి శ్రమము లేక తేలికగాను శీఘ్రముగాను ముద్రాక్షరములతో వ్రాసికొనవచ్చును. ఇట్టియంత్రనిర్మాణమువలన భాష కెంతయో లాభ మొనఁగూడఁగలదు.

కావున, భాషాభిమాను లెల్లరు నాయీవిన్నపము నాలకించి, వెంటనే యీనూతనాక్షరములతోఁ గూడిన ముద్రాక్షరవిలేఖనయంత్రనిర్మాణమునకుఁ జేయూఁత నొసంగవలయునని సవినయముగాఁ బ్రార్థించుచున్నాఁడను. చిత్తగింపవలయును.

ఇట్లు,
బుధవిధేయుఁడు,
యం.యస్. వెంకయ్య.

*By M.S. Venkayya.*

చిత్రము ౧౧

నిదర్శనపూర్వకముగాఁ జేటపఱచి యున్నాఁడను. ఈ కుంచికాఫలకములకుఁ దగినట్టులు యంత్రములను మనము నిర్మించుకొనవచ్చును. అది యొక కష్టమైన పని గాదు. ఇఁకఁ దెలుఁగునందు ముద్రాక్షర విలేఖనయంత్ర నిర్మాణము సాధ్యము గాదనువారి వాదము నిలువఁజాలదు. తెలుఁగున ముద్రాక్షరవిలేఖిన మొనరించినచో లిపి యెట్టు లుండునో తెలియుటకై పదునొకండవ చిత్రమునఁ గొంతవిషయమును వ్రాసి ప్రదర్శించి యున్నాఁడను. దాని నోపికతోఁ జదివి మాడవలయు నని పాఠక మహాశయులను వేఁడుకొనుచున్నాఁడ.

మహాశయులారా! "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" అని వాసిగాంచి, వ్రాలు ముత్తెపుసరుల వలె నొఱుచుఁ, బలుకు లతిలలితములై వీనుల నలరించుచు, నసమాన యై యొసలారుచుండెడి నీతెలుఁగుబాసకు ముద్రాక్షరవిలేఖనయంత్రము లేకపోయెనను నెడి యొక కళంకమా? అట్టికళంకమును వారించుటకు సర్వవిధములఁ జాటుపడుట త్రిలింగభాషామతల్లీ ప్రియపుత్త్రుల మగు మనకు విధియైయున్నది. ఇకనైన మనవార శ్రద్ధారూప మగు నిద్రమండి మేల్కాంచి శ్రద్ధాళువులై ముద్రాక్షర విలేఖనయంత్రనిర్మాణమునకును, ఈనూత్న ముద్రాక్షర నిర్మాణప్రచారములకును దోడ్పడి, యీ భాషా సేవను మనుష్యులమువనే పూర్తియగునట్టు లొనరించి, త్రిలింగ భారతీకృపాపాత్రులై వెలయుదురు గాక!

శ్రీమతీ త్రిలింగభాషా విజయతే తమామ్.

[సర్వస్వామ్యములు వ్యాసకర్తవి]

---

# మధ్యమ

పాటిబండ మాధవశర్మగారు

౧

నవవికచారవిందసుమనస్సమసుందరమైన యీశరీ
రవిలసనమ్ము లెంత మధురమ్ములొ! మామకహృన్మధువ్రతం
బవధివినాకృతప్రమదమై, యవశాన భవన్మధూళికా
నవరుచు లానుపొంగి పెలుచన్ బయిపాటున వేగిరించెడున్!

౨

కలకల నూఱఁ బద్ధయవి గావలె నీవిరియల్గుచాలు నా
కొఱకయి! తుంటవింట గుదిగూర్చి తెగంబడి వేయు నీ రతీ
వరుఁడు మనోహరీ! యొకలవమ్మునుఁ గన్తిపడంగఁబోను; జ
ర్జరితవపుర్వినిస్సృత నిరంతరరక్తనదుండ నయ్యునన్!

౩

జలజల రాలు నీ రుధిరశైవలినీస్పృశదంకురమ్ములన్
జెలియ! భవత్పదాంబుజము చెంగట నొక్కెడ మేని రాల్పఁగాఁ
గలిగినఁ జాలు; నా పడిన కష్టము సార్థక మైనయట్ల నే
తలఁచెద నింతకాలమును తాళిన యర్థము లబ్ధ మాటకున్!

౪

అయుతముగా స్రవించు నసృగాపగ; లీచ్యుతరక్తమైన నా
మెయిబిగువుం దొలంగి పుడమిన్ బడిపోవఁగ నున్న దోసి! ఓ
ప్రియసఖ; నీమృణాళయుగళీమృదుబాహులు సాఁచి భ్రంశసం
శయహతమున్ రహఃప్రణయచాలిత మీతనువున్ గ్రహింపవే!

౫

అసువులమీఁది యాస వెనుకాడుచునున్నది; తేనె లూరు ఈ
కుసుమము లింతగా పగలు గొన్నవి నాపయి విక్రమించె; ప్రే
యసి! ననుఁ జేర్చుకొమ్ము బిగియారుకవుంగిట; నాకు నీదు ని
శ్వసనపరీమళ మ్మనుభవ మ్మగుతన్ దుది యూర్పుకేనియున్!

౬

నను వధియింప కోయి మదనా! తెగ నేతువు గాక! ఈచిరం
తనమధురార్ద్రిమా తనువునన్ గొనయూపిరి యుండునంత ద
న్కను తెగ నేయు; మప్పుడయినన్ బడవేయుము నన్ను నాప్రియాం
గన కవుఁగింట; పుత్తు తుదికాలము నాప్రియురాలికౌఁగిటన్!

‘ మధుకణములు ’ నుండి.

---

# "ఏమనుకున్నా సరే"

'కళ'

నాకు భావకవిత్వాలంటే మహాకోపం, దానికి తగ్గట్టు నాకు భావకవిత్వం చెప్పే స్నేహితు డొక డున్నాడు. ఒకరోజున ఆస్నేహితుడు ఒకచిన్న పద్యం రాశానని తీసుకొచ్చాడు. విని మరీ కేకలేడ తాను గాని వినిపించుకోకుండా మొండివాదనలోకి దిగను. ఎందుకంటే, భావకవిత్వాలలోకూడా భావమున్న కవిత్వ మక్కడక్కడ అరుదుగా కనబడుతూవుంటుంది. నా స్వభావం బాగా ఎరుగుండటంవల్లనే మావాడు నాదగ్గ రకు తీసుకురాగలిగాడు. "ఏమోయి, టాగూరు! ఏంపని మీ దొచ్చావు? ఏమైనా కొత్తభావా లుద్భవిం చాయా యేమిటి? మహోత్సాహంగా వచ్చావు?" అన్నాను. మావాడు చిన్న స్మైలింగు (smiling) చేసి తల వేలేసు కూర్చున్నాడు.

స్నేహి—నే నొక చిన్నపద్యం రాశానోయి! అది మాపిద్దామని వచ్చా. "అయితే చదువు" అన్నాను. కాని నాకు వళ్లు మండుతోంది. పాండిత్యం లేనివాళ్లం దరు భావకవు లయ్యారని.

స్నేహి—ఇదుగో చదువుతున్నా వినూ.

ఆగభీరనిశా స్నిగ్ధ నీచికాభ్రపటలి డాగి
భావకవికుమారహృదయ కుహర మేరుశిఖరి దూగి
ప్రణయ పవనహారిణమృదులగీతికలను దొప్పదోగి
మధురతరసుగానడోల మాయమైతె సుందరీ!...

* * * * *

కటికిచీకట్లు వాల్గువైపుల గ్రమ్ముకొనిరా
చుక్క రొక్కటిమాత్రము మినుక్కుమినుక్కుమనుచు
నాహృదయసీమ మెలచిన యాశాలతాంత మనగ
మెరయుచున్నది.........

* * * * *

నాతి, నీయుదాసీన ప్రఘాతంబువలన
కకలకకలంబులైన నాగుండియల్
మరల నీవు నీప్రణయామృతంబుచేత
నొకటిగా చేయవా?.........

* * * * *

"నాయనా, దీ న్నేవృత్త మంటారు? ఇలాంటి గణాలు ఏ అప్పకవీయంలోనూ చూడలేదే! యతీ, ప్రాసా, ఏ అర్థాన్నం అక్కర్లేదా ఏమిటి నాయనా! మాట్లాడవు" అన్నాను.

స్నేహి—భావం చూడవోయి, గణమో గణమో అని గందరగోళపడతా వేమిటి?

"అర్థాన్నం. గణయతిప్రాసలు లేనిదే కవిత్వ మేమిటి? ఇక అర్థమంటావా. కరిమ్రింగిన వెలగపండు సెందుకూ కొట్టడం, దాల్లో యేంవైనా వుంటేగా తిన డానికి? అస లిదేవృత్తమో చెపుమా!"

స్నేహి—అవృత్తాలూ గిత్తాలూ ఎవడికా వాలి. స్వారస్యం ప్రధానంగాని ఏవృత్తమైతే నేం? చెవులకి హాయిగా వుండటానికి కర్ణాటకరాగాల్లో హిందూస్థానీస్వరా లెన్ని వేయటం లేదు! సుఖమా లేక శాస్త్రమా మనకు కావలసింది?

"ఏంవిటి నాయనా, నీపద్యంలో వున్న సుఖం? ముక్కు తిమ్మన్నలాటి మహాకవులంతా ముద్దులు మూట గట్టేటట్టు పద్యాలు రాస్తే అవన్ని మట్టిగొట్టుకు పోతు న్నాయా! నేటికాలానికి కావ్యకన్యక నేడిపించటానికి మీరు బయల్దేరారా ప్రబుద్ధులు! హోరున ఏడుస్తోందే మీ బాధ పడలేక! ఏదో కవి ననిపించుకుందామనేనా నీసరదా? ఇన్ని మేగజైను (Magazines) లుంటే దేల్లోనైనా ఏమూలనో పడకపోతుందా అనా నీ దిలా సా? ఇలా వరసపెట్టి వంద పేజీల పుస్తకం రాస్తే ఎవరు బాధపడుతారు, మాకొద్దు బాబూ అని పుస్తకం పారేసి పరుగెత్తుతారు కాని?"

స్నేహి—ఏమిటయ్యా! అలా అంటావు. మూడు రోజులు నిద్రాహారాలు మానుకొని ఆలోచించి రాస్తేను!"

"నాయనా! ఎందుకంత కష్టపట్టం. ఈ భావ తరంగాలకోసమేనా మూడురోజులు ఆలోచించటం! అయితే దాని కర్థ మేమిట్లోకూడా సెలవిద్దూ, విని సంతోషిస్తాను."

స్నేహి—ఇప్పుడు దాని కర్థమంతా ఎలా తేలుతుంది? వాళ్లో చాలా గాఢుంది. దాని అర్థం, రాసిన కవి ఎన్నడూ చెప్పడు. ఎవరంతట వాళ్లర్థం చేసుకోవలసిందే. అయినా అంత సులభంగా అందరికీ అర్థమూ కాదు. దా న్నర్థంచేసుకోడానికి రసగ్రహణశక్తి ఎంతుండాలి! ఆశక్తి ఎంత వుంటే అంత అర్థమవుతూ వుంటుంది.

"పైగా యిదొకటా! నాలు గర్థంలేని ముక్కలేవో రాసి నాకు రసగ్రహణశక్తి లేదంటావూ? నీ మొహం. దాల్లో ఏంవుంది? హరిణమృదుల గీతిక లేమిటి? ఆనా లెవరంట? ఒకటిగా చేయడ మేమిటి నీతలకాయ! ఒకదాని కొక ఏమన్నా పొసుగుతోందీ."

స్నేహి—నీ కంత అలాటప్పగా కనబడుతోందేం! అసలు కవైతేనే గాని దీని అర్థం గ్రహించలేడు. భట్టుమూర్తి గనక వింటే బావురు మనవలసిందే! తిక్కన తిరిగి చూడకుండా పారిపోడూ? ముక్కుతిమ్మన్నకు ముచ్చెమటలు పట్టకపోవా? నీవేమో మహా ఆక్షేపిస్తున్నావు. అలాంటి కవు ల్నందరినీ గజగజలాడించే కవిత్వం భావకవిత్వమంటేను. తెలిసిందా! ఇది నాచురల్ (Natural) కవిత్వం. గణయతిప్రాసలతో అష్టదిగ్బంధనం చేసి ఆర్టిఫిషల్ (Artificial) గా తయారుచేసింది మునపటివాళ్ల కవిత్వం. ఫౌంటంతట అవే నోటి వెంబడి వుప్పొంగుతాయి భావాలు—ఈకవిత్వంలో.

"మరగల్లాగనా?" అని నే ననేసరికి మ్మాడు ప్రళయకాలరుద్రుడులాగా లేవడానికి సిద్ధమయ్యాడు.

"ఆగవోయి—అలా కంగారుపడతా వేమిటి? దీల్లో వున్న మంచిచెడ్డలు చెప్పమనేగా నీవు నాదగ్గిరికి తీసుకొచ్చింది? విమర్శిస్తామంటే కోప మెందుకు నీకు? అయితే, వాళ్ల ఖర్మం కాల మునపటికవు లంతా ఇది వినేసరికి నువ్వు చెప్పిన స్థితి కొస్తా రంటావు? ఒక విధంగా వస్తే రావచ్చు. 'ఇదేం కవిత్వంరా బాబూ' అని వాళ్లుకూడా హడిలిపోతా రంటానికి సందేహం లేదు. నాయనా, ఏమిటో రసంరస మంటావు! ఏంరసంవుంది దీల్లో? నీరసం తప్ప నా కేం కనిపించటంలేదు. అయితే బాబూ, మీవంటి ప్రబుద్ధులు తిక్కనకాలములోకూడా వుంటే వుండొచ్చు. ఈమిడిమిడి కవిత్వం నిలిచేది కాదు కనుక అప్పుడే అంతరించి, శుభ్రమైనవే వో నిల్చాయి. అదీగాక ఇప్పుడు ప్రతిఅడ్డమైనవాడికీ కవి ననిపించుకోవాలని సరదా. అంచేత ఏవెఱ్ఱిమొఱ్ఱి వ్యాసమో, ఏభావకవిత్వపు పద్యాలో మొదలెట్టడం! ఏముంది! కాగితం కలం చల్లగా వుంటే సరి. అవును కాని, ఇకెప్పుడూ నాదగ్గిరికి తీసుకురాకు; మీకవిత్వమంటే నాకు వళ్లు మండుతోంది."

స్నేహి—(ఆమట్టున లేచి) నీదగ్గిరికి నే నెన్నడూ తీసుకురాను. ఈపద్యం అర్థమయ్యే మొహం కాదు నీది. కనుక నాకు శలవు బాబూ! మాకవిత్వానికున్న ప్రతిష్ఠకూడా చెడకొడతావు.

"ప్రతిష్ఠఅంటూ వొక టుంటేగా చెడగొట్టడానికి" అని నే నంటూండగానే వాడు కోపమొచ్చి లేచి పోయాడు. పీడ వదిలిం దనుకొని మనస్సు చికాగ్గా వుండటంచేత పక్కను ఒక మేగజైను వుంటే తీసి ఒకటిరెండు పేజీలు తిరగేసి చూసేటప్పటికి, అక్కడా యిలాంటి పద్యాలే ప్రత్యక్షమైనాయి. నేను లేచినవేళ మంచిదికాదు. లేకపోతే యేమి టీగోల! తల మంటెత్తుకొస్తాం దనుకొన్నాను. కాని నవ్వుకూడా వచ్చింది. వక్కసారిగా కొంతమంది మనుష్యులకు మతి చలించిం దనుకున్నాను. నిద్ర రావటంచేత పక్కమీద పడుకున్నా.

* *······* *

నేనూ నాస్నేహితుడూ అరణ్యప్రాంతాలకేసి వెళ్లాము. అక్కడ చిన్నకొం డొక టుంది. ఎక్కడ నుంచో కొంచె మేదుపు వినిపిస్తోంది. ఎక్కడా? అని

పైకి చూశాము. కాని మాకేమీ కనపడలేదు. పోనీ చూద్దామని మెల్లిగా యిద్దరమూ లోండకెళ్ళాము. చూసేసరికి చక్కని పిల్ల పదహారేళ్లది కూచుని ఏకధారగా శోకిస్తోంది. వాళ్లో పుస్తకాలుమాత్రం ఏవో వున్నాయి. దగ్గిరి కెళ్లి "ఏమిటమ్మా! అలా ఏడుస్తున్నావు"అని అడిగాం.

"నాయనా, మీ కెందుకు నాఘోరి! నే చెపితే మాత్రం చెప్పినట్లు చేసేవా ళ్లున్నారుగనుకనా?" అన్నది.

"ఏమిటమ్మా నీకొచ్చిన కష్టం? చెప్పమ్మా, సాధ్యమైతే ప్రయత్నిస్తాము" అన్నాడు మావాడు.

"నాయనా! ఇప్పు డొకకొత్తకవులు బయలుదేరారు నాప్రాణానికి! నాఅవయవఖండనం చేస్తున్నారు. వాళ్లకు నే నేమపకారం చేశాను? వాళ్లకేసి నే నెన్నడూ చూడనైనా లేదే! నేటికాలాని కిలాంటి కవులు బయలుదేరారుగదా అని విచారంగా వుంది. ఏవో నాలుగుముక్కలు ఇష్టమొచ్చినట్లు వ్రాస్తే నిండుతుం దనుకుంటున్నారు! ఇలాంటివి రాయొద్దని చెప్పి బోధించేవా డెవడూ లేకుండాపోయాడు. యతీ లేదు. ప్రాసా లేదు. గణమూ లేదు. చివరికి దానికి పేరు కూడా లేదు. అన్నీ సలక్షణంగాఉంటే నా కానందం గాని, అన్నీ తీసేస్తే నాకు విచారం కాకేమిటి" అంది.

"నాకూ అలాంటికవులంటే కోపమేనమ్మా. ఏంజెయ్యను తల్లీ! చెపితే వినిపించుకునేవా ళ్లెవరూ లేరు. అమ్మా! మీవాళ్లో ఆపుస్తకా లేమిటి" అని నే నడిగాను.

"ఇది భారతం, రెండవది భాగవతం. మీ రింత చక్కగా రాసి నన్ను మన్ననచేస్తే ఈసువర్ణయుగంలో, లోకపీకుడుకవిత్వం రాసేవాళ్లు పుట్టారుగదా అని ఈ పుస్తకాలు చూసుకుంటూ కాలక్షేపం చేస్తున్నాను" అంది. "అలాగా అమ్మా!"అని యిద్దరం సాష్టాంగదండ ప్రణామం చేశాము.

"తల్లీ! వీడుకూడా ఆలోకపీకుడుకవిత్వంగాడే" అని చూపించాను. మా 'టాగూరు'కు ప్రాణాలు లేవు; గజగజ వణికిపోతున్నాడు. నేనే, పడిపోతాడేమోనని పట్టుకు నుంచున్నా. అప్పుడు ఆవిడ కళ్లెత్తి చూసింది, చూసేటప్పటికి మరింత హెచ్చయింది మావాడికి భయం. కాని ఆవిడ మళ్లీ ఒకమారు చూసింది. అప్పుడు ఆసోగలైన కళ్లల్లోంచి రెండు నీటిబిందువులు జారి పడ్డాయి. వెంటనే "కాటుకకంటినీరు" అన్నపద్యం జ్ఞాపకంవచ్చింది నాకు. "నువ్వొక్కడవు మానేసినా మానేయడమే. ఆతల్లి అల్లా విలపిస్తోంది, ఇక నే నెన్నడూ వచ్చీరాని కవిత్వం చెప్పనని చెంప లేసుకో" అన్నాను మావాడితో. ఆవిడకూడా అంగీకార సూచకంగా తల పంకించింది.

"వేసుకో వేమిరా చెంపలు" అని గద్దించాను. మావాడు చేతులు నలుపుకుంటూ—

"అయితే, నేను కవి ననిపించుకోటం ఎలాగ?" అన్నాడు మెల్లిగా నసుగుతూ.

"ఒరే నీ కేమన్నా మతి పోయిందా ఏమిటి? నే చెబుతూంటే వినిపించుకోవేం? మరేం పరవాలేదు. నీ పద్యరత్నాలు వచ్చి దేశాన్నేమీ ఉద్ధరించటం లేదు. నీఅభావకవిత్వం ఫెదర్‌వెయిట్ పేపరు (Feather-weight Paper) మీద పేజీకి రెండున్నరపంక్తులు పెట్టి గ్రంథాలు అచ్చువేయించిపోతే నీ ఎవడుకొంటాడు, అసలు డబ్బులే కేడుస్తుంటే దేశం? కనుక నే చెప్పినట్లు చెయ్యి" అన్నాను. మావాడు సందేహించటం మొదలు పెట్టాడు. నాకు వళ్లు మండుకొచ్చింది.

"ఏమిట్రా ఆమొండితేవం?" అని గట్టిగా చెవి పట్టుకొని మెలిపెట్టాను. ఎందుచేతనో చప్పున మెలుకువొచ్చింది? చూస్తినిగదా ఆపట్టుకున్నది మావాడి చెవి కాదు నాతొడే! బిగించి పట్టివుంది. మంటెల్లాలిస్తుంది! ఎఱ్ఱగా కందిపోయింది. నవ్వూ వచ్చింది; ఏడుపూ వచ్చింది. మెల్లిగా లేచెళ్లి బల్లమీద వేసలై నుంచే రాసుకొన్నాను. అంత వళ్లు తెలియని ఉద్రేకం ఉండకూడదు. ఎప్పటికైనా ప్రమాద మనుకున్నాను. నాకల భావకవులకి తెలియపరిస్తే వుపయోగ మేమైనా వుంటుందేమోనని వెఱ్ఱినమ్మకంతో బయలుపెట్టాను.

ఈమాత్రానికి మానేసేవా డెవడు? నేనే ఈవిషయమై ఉపన్యాసా లివ్వదలుచుకున్నాను. కొద్దిరోజుల్లో బయల్దేరుతాను. ఆసరస్వతీదేవి అల్లా ఏడుస్తుంటే నామనస్సు నీరై పోయింది. నాకొచ్చిన కలబాటి కల ఇంకోడి కెవడికొచ్చినా వాడికి హృదయం-హృదయమంటే పాషాణ హృదయంకాదు, దయార్ద్రహృదయం- అంటూ వుంటే యీవిషయమై గట్టిగా ప్రయత్నించక మానడు. ఆకల నాకే వచ్చింది కనుక గట్టిగ ప్రయత్నించదలచుకొన్నాను. మీ కెవరికన్నా అబ్జెక్షన్ (Objection) వుంటే తెలియబరచకోరుతాను. ఇంకా దాని విషయమాలోచిస్తో కూర్చున్నా. అంతట్లో వెనుకనుంచి నవ్వు వినపడ్డది. తిరిగి చూసేసరికి నాభార్య కాఫీకప్పు తీసుకొచ్చి నిల్చుంది.

"ఏం, భావకవిలా గలా ఆలోచిస్తున్నారు? కవితాప్రపంచంలో వున్నారా ఏమిటి?" అంది.

"ఏమలా అంటున్నావు? నీకూ నవ్వులాటగానే వుందా భావకవులంటే?" అన్నాను.

"నీకూ అని వత్తి పలుకుతున్నారు. నేను మనిషిని కా ననుకున్నారా యేమిటి?" అంది.

---

## బిచ్చగాఁడు

వడ్లమూడి వేంకటరత్నముగారు

వేకువ నిద్ర మేలుకొని వెంటఁ బరున్న ప్రియాంగనామణిన్
సోఁకున మేలుకొల్పి కలజోలెలు నెంగిలిచట్లు చింపివో
కోకలకావడిన్ గదిమి కుట్టల మూఁపునఁ జంక నాలితోఁ
గైకొని యీఁగతిన్ నకనకంబడి పాఱుదు వేమి యెంచితో.

నీతో నున్న జనంబు మేలుకొనిరన్ నీకంటె ముం దేగి యా
యీతల్లుల్ దయఁ బెట్టు బిచ్చములు తామే కొందు రంచేమొ నీ
శాతాంగిన్ బసిపాపల న్నయనకంజాతాసులం గూడి గయా
ప్రాతఃకాలమ పర్వులెత్తెద వహో ప్రారబ్ధసంరంభముల్.

దైవవశంబునం దెరువు దాఁటఁగఁ దోడగు పీనిమీఁద నీ
కీవిధి నోర్వలేమి యయొ యిర్వురు నేకపథానువర్తన
ప్రావనతీర్థు లిర్వురు నిరంతనితాంత దరిద్రతా ప్రియం
భావుకమూర్తు; లైన నినుఁ బల్కఁగ నేమిఫలంబు సెప్పుమా!

నీకై యాత్మఁ దపించి కోరి కవిసెన్ నిర్నిద్రతారుణ్యరే
ఖై కాకంపితలోక దైన్యసతి యారా యెంత ప్రేమంబో! నీ
వో! కాలంబడుదాని కాదరువు నీ నూహించి నిస్సత్త్వతా
వ్యాకోచంబగు సంతతిం గనెద వాహా యెంత యౌదార్యమో!

కలిమి సమస్తకిల్బిషసఖంబు యమాలయరాజమార్గ ము
జ్జ్వలగుణవైరి; లేమి నిరపాయసుఖప్రసవం బటంచుఁ బె
ద్దలు వచియింత్రు కొంద; ఱది తథ్య మెఱుంగఁగరాదు మాకు నీ
పలుకులఁ దెల్పువిూ యనుభవంబు నదెంత సుఖంబొ మిత్రమా.

తమ యస్తోక విశాలసంపదలు వ్యర్థంబౌ కులం బింక నం
తము నొందు న్నతుఁ డొందు లేమి నని చింతావహ్నిచేఁ గ్రాఁగి ని
త్యము దానవ్రతనిష్ఠలం గుములు సర్థాఢ్యాళి కీ కిట్టి నీ
కమితంబౌ ప్రజ నేలనో యొసఁగ నౌరా ధాత చిత్తం బెదో?

తెమలనివగ యగ్గిఁ గుమిలి చివికినమేను చూపఱ కెద వంత మోపుచుండ,
కలిగిన కుండప్రాఁతలనెల్లఁ గట్టిన కావడి మూఁపును గాఁగిలింప,
నిండుచూలై కాలు నేలాన లేని యెమ్ముల ప్రోవు చెలి నెత్తిమూట రాఁగ
నూఁచకాల్నేతులు నూఁదపొట్టల నిసుంగుల మూఁక మెల్లనఁ గునిసి నడువఁ
బయన మొనరింతు గదవోయి బాటసారి - యుండుచోటను బండక యుండఁ బోక
పండుచోటను, కడుపు చేపట్టుకొనుచుఁ - గానిదేశాల నిట్లు నీకసటు లేమొ.

కీఁతి నెల్లరుఁ గలవారిని-నుతియింతురు వన్నె చిన్నె నుడువులతోడఁ
సతతం బెదుటను గల నీ-గతి యింతయుఁ దలఁపఁబోరుగా యది యేమో!

కలగ్రహముల నిర్జీవం-బుల నర్థంబులను నష్టపోషకముల వి
చ్చలవిడి మెచ్చించుదు రాఁ-కలి నటమటఁ బొగులు నిన్నుఁ గానర యూరా!
దయసేయఁగా నీ కుదయమయ్యెనే యంచు నొడ్డారముగ నాడు నొక్క యింతి
కొలు చింటిలో నిండుకొనియుండెఁ బో యంచుఁ దటవటించును నొక్క తలిరుఁబోఁడి
కూర్చుండ లేదు నీకొఱకుఁ దీరిక నంచు నుడుకులాడుచు దాడివెడలు నొకతె,
యింటట నేగుమా యింట నెవ్వరు లే రటంచుఁ బైఁ బడి తుటారించు నొకతె
యొడలు పంచవె యంచు బిట్టుఱుము నొకతె, - యెంత మిడికిన ఫలము నీకింతె కాదె
యూర కరవైరి చేత పొమ్మనెడువార - లయిన నీ వేలనోయి యిట్లలమటింప?

పండుగపబ్బమంచుఁ గనుపండువుగాఁ బచరించి యిండ్లు మే
నిండ నలంకృతు ల్దిఱిమి నీటుగఁ గుత్తుకబంటి మెక్కుచుఁ
మండెడిపొట్టతోడఁ గడమాలిన యాసను నూట లూరుచుఁ
దండకుఁ జేరు నిన్న దయుతం గసరఁ మది యెట్టు లుండునో.

ఒకకాలంబున ధర్మమం చగతికవ్యూహంబు పోషింప ను
త్సుకతం బొందెడు దేశ మిప్పు డిటులన్ శోషించుట ల్గాంచి నీ
వ కుమారిల్లుట గాదు మాయెదయు నత్యాయాసముం బొందు నెం
తకు నెంతైన దటంచు నక్కటకటా దైవంబు కన్గట్టునే.

'కుత్తుకబంటిగాఁగఁ దెగఁ గూరి యనేకరసాన్నశాకముల్
మత్తిలి పేదవాని సొదమాట దలంప రదెంత యార్చినన్
విత్తనమే న్విదిర్వరు గణింపరు ధర్మము నుంత, చూచి యు
న్మత్తుగ నోర్విదల్తు రిల భీతిలి పాఱ' నటంచు నేలనన్.

వారి ననంగ నేమి కలవారలు వేర్గలవారిలోన నె
వ్వారికి తక్క యాడినన వారక డొక్కయు నాడు నిప్పు డే
వారలు మేలు మీఱి నినుఁ బల్కుదు రీవె మఱొక్కవర్తనన్
నేరిచి స్వేచ్ఛగా మనుట నేరుపు గాదె తలంపు మాత్మలోన్.

గౌరవ మించుకేనియును గల్గకపోయినఁ బోవుఁగాక యె
వ్వారును దూఱకేని పెరవారలఁ గాంచిన జంకకేని వే
సారిన మందుటాఁకలిని సైఁచుట కేనియు నుండఁ గాదె నీ
వారయు మోయి బిచ్చమున నొనొకొ యిం దొకటేని యెన్నఁడేన్.

నీయీవర్తన సాంఘికోన్నతికి నెంతే శృంఖలారూప మం
చాయూదేశమహానుభావు లొగిఁ దా రాలోచన ల్సేసి యీ
యాయావారము మాన్పఁ బూని రిఁక నీ వద్దానిఁ బోవీడి సం
ఘాయాసంబుఁ దొలంగఁజాలు నొక మేలౌవృత్తిఁ గైకోఁదగున్.

ఒందువిధమునఁ గడవక యుండునట్టి-చీఁకు ముదుసలి యాదిగాఁ జివుకువారి
కొసఁగి యక్షయపాత్ర నీ వొండువృత్తి-గొని సుఖంబున స్వేచ్ఛగా మనుట దగదె!

నవసుధావృష్టిచేఁ గువలయంబును నలరఁగఁజేయు చల్లనిరాజు నీకు
కడలేని మగఁటిమి నడరారు జగముచుట్టం బాదరించు మిత్రంబు నీకు
తన్నాశ్రయింప సేదను దీర్చి ఫల మిచ్చు ధరణీజపతియ యాదరువు నీకు
కనరాక వెల చెప్పఁగారాక చెదరని పసమీఱునట్టి దంబరము నీకు
కీడులో మేలటంచును నాడునటుల ప్రకృతియే సంతతంబును రక్ష నీకు
ప్రకృతి యుత్సంగతలమె విశ్రాంతి నీకు-ప్రకృతిదేవికి గారాబుపట్టి వీవు.



3. మహాత్మగాంధిగారు, లంకాషైరు మిల్లుపనివాండ్లు (P. P. B.)




౪. లాలన (స్త్రీమరులో) (P. P. B.)

# శబరి



చింతా దీక్షితులుగారు

౪

[పంపాపుష్కరిణి దక్షిణపుగట్టు. చాతకముని ఆశ్రమము. పూరిల్లు. అరుగు విశాలము. దానికి మధ్య నెగడు. నెగడులో పుల్లలు. పొగ నెమ్మదిగా వస్తోంది. ఎర్రని జుట్టూ, బిరుసుగడ్డమూ, మీసమూ కలవాడు చాతక ముని. కృష్ణాజినము దట్టీవలె కట్టుకొన్నాడు. నలభై సంవత్సరముల వయస్సు. స్థూలకాయుడు. నెగడిముందు పద్మాసనం వేసి కూర్చున్నాడు, ఒంటికి బూది రాచు కున్నాడు. ఇర్రి యథాప్రకారం బట్ట కట్టుకొంది. తలలో పువ్వులు. మెడలో దండలు. జుట్టు ముడి వేసు కుంది. ముప్పై సంవత్సరములు వయస్సు. పూర్వపు చురుకు లేదు. అరుగుచివర ఆకాశంకేసి చూస్తూ కూర్చుంది.]

చాతకుడు

ఏమిటి చూస్తున్నావు ఇర్రీ!

ఇర్రి

చూడ్డం లేదు. ఆలోచిస్తున్నా!

చాతకుడు

నాతో ఆలోచించకూడదూ?

ఇర్రి

కూడ కేమి? పన్నెండుసంవత్సరాలైనది హనుమంతుడు శ్రీరామచంద్రునిగురించి చెప్పి. ఇంతకాలము కనిపెట్టుకు ఉన్నాను. నాఆటల మీదా, నా పాటల మీదా విరక్తి కలుగు తోంది. హనుమంతుడు చెప్పినమాటకు తథా వతు ఉంటుందా?

చాతకుడు

హనుమంతుడు, మాట తథావతుమనిషి. కాడు.

ఇర్రి

శ్రీరామచంద్రుడు నిజంగా వస్తా డంటావా?

చాతకుడు

రావడ మెందుకు పోవడ మెందుకు? ఎప్పుడూ మన మనస్సులలో ఉండేవాడు!

ఇర్రి

మనస్సులో ఉంటాడా ఎప్పుడూ?

చాతకుడు

మనస్సులో అనిమాత్రం ఎందు కన వలెను. మనమే అతడు, ఆతడే మనము.

ఇర్రి

నీమాటలు నా కర్థంకావు చాతకా!

చా త కు డు

మీది భక్తిమార్గం. నాది జ్ఞానమార్గం. మీకూ మాకూ ఏలాగ సరిపడుతుంది?

ఇ ద్రి

ఏముటో నీ దంతా ఒకగొడవ. నే నడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పవు.

చా త కు డు

అఖండసచ్చిదానందమయు డైన నిర్గుణబ్రహ్మ అవాఙ్మానసగోచరుడు. నిర్గుణబ్రహ్మ జిజ్ఞాసే మోక్షసాధనము.

ఇ ద్రి

పాటలు పాడితే శ్రీరామచంద్రుడు సంతోషిస్తాడా?

చా త కు డు

ఇంద్రియములు జయించి, మనస్సు చిక్కబట్టి, నాసికాగ్రముపై దృష్టి నిలిపి...

ఇ ద్రి

పోనిద్దూ ఆగోలంతాను! చాతకా, నాకు చిన్న తనంలో ఆటలూ, పాటలూ, హనుమంతుడూ, పక్షులూ, అన్నీ కావలసి వచ్చాయి. ఇప్పుడు నామనస్సు వాటిమీదికి వెళ్లడము లేదు. మన స్సేదో గోలగా ఉంటోంది. హనుమంతుడు మాయ చేశాడో మంత్రం చేశాడో శబరిలాగ అయిపోతున్నా నేను.

చా త కు డు

శబరి తపఃప్రభావాన్విత. ఆవిడ ముందు నీ వింకా పసిపిల్లవు.

ఇ ద్రి

ఒక్కమారు శ్రీరామచంద్ర మూర్తిని చూస్తేనా? హనుమంతుణ్ణి అడుగు తాను, ఉండు, వస్తున్నాడు.

[హనుమంతుడు ప్రవేశించును. పూర్వమువలెనే ఉన్నాడు. మీసము నల్లగా పెద్దదిగా ఉన్నది. అర్ధచంద్రాయుధము వెనక తగిలించి ఉంది. కొంచెం ఒళ్లు చేశాడు. 3౦ సంవత్సరముల వయస్సు.]

హ ను మ ం తు డు

న న్నేమిటి అడుగుతా నంటున్నావు?

ఇ ద్రి

శ్రీరాముడు వస్తాడా అసలు, హనుమా?

హ ను మ ం తు డు

వస్తుంటేనే! జనస్థానంలో నివసిస్తూ, ఋషితపస్సులకు అంతరాయాలు కల్పించే దుష్ట రాక్షసులను పధ్నాలుగు వేలమందిని వధించినాడు ఒంటరిగా ఆమహాశూరుడు.

ఇ ద్రి

ఎంతగొప్ప వీరుడు?

హ ను మ ం తు డు

ఇంకా కొన్నిదినాలలో ఇక్కడికి ఆమహాపురుషుడు వస్తాడని శబరి చెప్పింది.

ఇ ద్రి

శబరి ఎలాగ ఉంది?

హనుమంతుడు

గాలిలో ఆడే రావాకులాగ ఆడిపోతోంది. కొడుకును చూడ్డానికి వేచిఉండే తల్లి ప్రేమకన్న, భర్తకోసం వేచి ఉండే భార్య ప్రేమకన్నా ఈవిడప్రేమ ఎన్నోరెట్లు అధికంగా ఉంది.

చాతకుడు

హనుమంతా, రాత్రిళ్లు ఋశ్యమూకవనమునుంచి వచ్చి ఏనుగులు ఈపంపాసరస్సునంతా కలిచి వేసి పద్మాల నన్నింటినీ లాగి పారవేస్తున్నవి. వాటి సంగతి కొంచెం చూడ్డూ!

హనుమంతుడు

శబరి ఆసంగతి చెప్పిం,దయ్యా అప్పుడేను. శ్రీరాములవారు వస్తున్నారు గనక పంపకు ఏనుగులు రాకూడదు అని శాసించింది. ఇప్పుడే ఆఏనుగులమందలను దూరముగా తోలివేసి వస్తున్నాను. అవి ఇంక ఈ ప్రాంతాలకు రావు.

ఇంద్రి

ఇంకా ఏమి చేశావు హనుమా?

హనుమంతుడు

రాముడు వచ్చేవేళకు జింకలమందలు ఈప్రాంతాలకు రాకుండా చేయ మని శబరి చెప్పింది. వాటిని దూరముగా ఇంకోవనములోకి తోలివేశాను.

చాతకుడు

జింకలు ఏమి అపకారము చేశాయి?

ఇంద్రి

జింకవేషం వేసుకునే కదా మారీచుడు శ్రీరామచంద్రమూర్తిని మోసం చేయగా ఒకదుష్టరాక్షసుడు వచ్చి సీత నపహరించాడు.

హనుమంతుడు

ఆకారణముచేత జింకలను చూస్తే రాముడికి కలిగే మనోవ్యథ తప్పించడానికి అలాగ చెప్పి ఉంటుంది.

ఇంద్రి

సీత జ్ఞాపకం వస్తుంది కాబట్టి మనోవ్యథా?

చాతకుడు

అదే ఆమె అభిప్రాయమై ఉండవచ్చు.

ఇంద్రి

అయితే సీతలాగ పాడే యీపక్షులూ, సీతను తలపునకు తెచ్చే యీపువ్వులూ, ఈ పల్లూ, ఈవైభవమూ, రాముడు చూస్తే సీత జ్ఞాపకం వచ్చి మనోవ్యథ కలగదా?

చాతకుడు

అదేమో?

హనుమంతుడు

సీత జ్ఞాపకము రావడమూ, రాకపోవడమూ కాదు ప్రస్తుతాంశం. ఆమాటకు వస్తే సీతను శ్రీరాములవారు తలవని గడియ ఉండదు. సీతకోసం కన్నీరు కార్చని గడియ ఉండదు. అయితే తనకూ సీతకూ వియోగం కలిగించినవారిమాట తలపునకు

వస్తే కలిగే మనోవ్యథా, కోపమూ వేరు. సీతను పోలే పక్షులూ, పువ్వులూ, పళ్లూ తలపునకు వస్తే కలిగే మనోవ్యథలో సంతోషచ్ఛాయ లుండవచ్చును. అంచేత జింకలను తరుమ మని చెప్పి ఉంటుంది శబరి.

ఇ ర్రి

అవును హనుమా, అవును. నీవు చెప్పిన మాట సరి. అయితే హనుమా, సీతను అపహ రించిన రాక్షసుని శ్రీరాముడు ఒక్క మాటు చంపి వెయ్యకుండా యింకా ఊరుకొన్నా డేమి? నీ వైతే ఈపాటికి పంపా సరస్సులో ఊరదొక్కి ఉందువు.

హ ను మ ం తు డు

అంత చులాగ్గా అయ్యేపని కా దది. శ్రీరాములవారు అవతరించడం రాక్షససంహా రముకొరకే. ఆయన చేసే ప్రయత్నా లన్నీ అందుకే. అయితే ఇర్రీ, నీ పాట లన్నీ పక్షు లకు చెప్పి ఉంచావా?

ఇ ర్రి

ఆ. శబరికీ చెప్పాను. పక్షులకీ వచ్చును.

చా త కు డు

పూర్వం చక్కనిపాటలు పాడేది ఇర్రి. ఇప్పుడు మా ఆశ్రమంలో ఒకపాటైనా పాడ్డం మానుకొంది. ఇర్రీ, ఒకపాట పాడవూ?

ఇ ర్రి

నాపాట లన్నీ ఇప్పుడు ఒకరికొరకే. వారిదగ్గిరే నాపాట లన్నీని. అయితే హను మా! శ్రీరామచంద్రుడు వచ్చినప్పుడు... ఆకాశంమీద నల్లటిమబ్బులు క్రమ్ముకొని ఉన్నప్పుడు, బారులు కట్టి తెల్లటికొంగలు పరుగెత్తుతూ ఉంటే ఎం చక్కుండేది. మనము చిన్నప్పుడు వాటిని చూచి ఎంతో ఆనందిం చాము. శ్రీరామచంద్రుడు వచ్చినప్పుడు కొంగలను బారులు కట్టి ఎగరమని చెప్పితే శ్రీరాముడు చూచి సంతోషపడడూ?

చా త కు డు

వాటికూతలు కర్ణకఠోరముగా ఉంటవి.

ఇ ర్రి

నో రెత్తకుండా మాట్లాడ కుండా వెళ్ల మని చెప్పుదాము.

హ ను మ ం తు డు

శబరితో చెప్పి చూదాము. ఏ మం టుందో.

చెప్పుదాము హనుమా, చెప్పుదాము. తప్పకుండా శబరి ఒప్పుకుంటుంది.

హ ను మ ం తు డు

ఒప్పుకో వచ్చు. అయితే......పంపాసర స్సులో ఋశ్యమూక పర్వతము నుంచి పడే యే రులు శ్రీరాముడు వచ్చేటప్పటికి గంతులు వేస్తూ, పాటలు పాడుతూ ఉండాలని శబరి చెప్పింది. దేమిటి సాధనం?

ఇ ర్రి

అప్పుడు మంచివాన కురుస్తే సరి.

హ ను మ ం తు డు

ఎలాగ కురుస్తుంది?

చాతకుడు

శబరి సంకల్పం చేసుకుంటే అది సిద్ధించి తీరుతుంది.

ఇంద్రి

అదుగో, అదుగో, శబరి వస్తోంది, సొర కాయబుర్ర చేత్తో పట్టుకొని.

[శబరి ప్రవేశించును; వయస్సు ౭౦ సంవత్సరములు. తల నెరిసింది. ఒళ్లు ముడతలు పడ్డది, కొంచెం గూను వచ్చింది. కాషాయ వస్త్రము మొలకు చుట్టుకొన్నది. ఒకమారు తనలో నవ్వు కొంటున్నది. ఒకమారు బిక్కమొగము వేస్తున్నది. ఎప్పుడూ శ్రీరామ స్మరణ చేసుకొంటున్నది.]

శబరి

ఉన్నారా నాయనలారా యిక్కడ! ఇక్కడున్నారా! నానాయన వస్తున్నా రమ్మా! జటాయువుకు దహనసంస్కారం చేసి వస్తున్నారు! నానాయన ఒక్కడే; నాతండ్రి ఒక్కడే; నాతల్లిని ఎత్తుకు పోయాడట దుర్మార్గుడు రాక్షసు డెవడో! నాతల్లి ఎంత దుఃఖపడుతోందో! నాతండ్రి ఎంత దుఃఖపడుతున్నాడో!

[అని ఏడ్చును.]

ఇంద్రి

పర్ణశాల వదలిపెట్టి త్వరత్వరగా వస్తున్నా రన్నమాట.

శబరి

నాతల్లి నాసీతమ్మ, ఎంత దిగులుపడిందో; ఎంత బెంగట్టుకుంటుందో; ఎంత దుఃఖిస్తుందో; నారామచంద్రుడి కింతకష్టము కలగనా! నా శ్రీరాముడి కింత దుఃఖం రానా! నాతండ్రికి, నాతల్లికి—అయ్యో, అయ్యో! [ఏడ్చును.]

హనుమంతుడు

ఊరుకో తల్లీ; అది అంతా లీల సుమా! అవతారకార్యము నిర్వహించడానికి సీతాపహరణముకూడా ఒకవ్యాజమే. కాకపోతే దుష్టసంహార మెట్లా జరుగుతుంది?

శబరి

అదీ ఒకవ్యాజమేనా; నాయనా, అదీ ఒకవ్యాజమే? అవును. కాకపోతే నారామచంద్రుడికి అపకారం చెయ్యగలిగినవా రున్నారా? అయితే నాయనా, శ్రీరామచంద్రుడికి దుఃఖం లేదూ?

హనుమంతుడు

మానవుడులాగ నటిస్తున్నాడు కాబట్టి దుఃఖంకూడా నటించవలసి ఉంటుంది. లేకపోతే ఆయనకు దుఃఖ మేమిటి శబరీ?

శబరి

అవునటే ఇంద్రీ. హనుమంతుడు చెప్పిన మాట నిజమేనా? చాతకమునీ! హనుమంతుడు చెప్పినమాట నిజం కాదూ? నిజం కాదూ? లేకపోతే నారామచంద్రుడికి దుఃఖ మేమిటి?

ఇంద్రి

హనుమ చెప్పినమాట నిజమే శబరీ! హనుమ బుద్ధిమంతుడు.

శ బ రి

నిజమేనమ్మా; అది ఒక వ్యాజము; అవును, అది ఒక వ్యాజము. నాతల్లి సీతమ్మకు దుఃఖం లేదు. అంతా ఆరామచంద్రుడిలీల! లీల!

చా త కు డు

సుఖదుఃఖాలూ, శీతోష్ణాలూ, వృద్ధిక్షయాలూ, మొదలైనద్వంద్వాల కతీతుడు, పరమేశ్వరుడు.

శ బ రి

అవును నాయనా, అవును. నారామచంద్రమూర్తి జటాయువుకు అగ్నిసంస్కారం చేసి.........నాతండ్రి గాదూ, నాజటాయువు. సీతమ్మతల్లిని ఆదుర్మార్గుడు తీసుకు వెళ్ళుతుంటే అడ్డంగా వచ్చి ముక్కుతో చీల్చి రెక్కలతో కొట్టాడు నాతండ్రి జటాయువు! రెక్కలు సరికాదుట నాయనా, ఆదుర్మార్గుడు. అప్పుడు సీతమ్మవార్త నారాముడికి చెప్పాలని కొనజీవంతో నిలిచి ఉన్నాడట జటాయువు. నారామచంద్రుడికోసం ప్రాణత్యాగం చేశాడు. ఎంత పుణ్యాత్ముడో!

హ ను మ ం తు డు

శ్రీరామపాదసేవ చేసేవా రందరూ ధన్యాత్ములే కదా అమ్మా.

ఇ ం ద్రి

శబరీ! శ్రీరామచంద్రుడివార్తలు ఇంకేమైనా తెలిశాయా?

శ బ రి

నాతండ్రి, నాదేవుడు, దుష్టసంహారం చేస్తున్నాడమ్మా, చేస్తున్నాడు. శూర్పణఖ ముక్కూ చెవులూ కోయించాడు తమ్ముడిచేత. ఖరదూషణ త్రిశిరస్కులను వధించాడు నాతండ్రి. వేలకొద్ది రాక్షసులను చంపి లోకాన్ని ఉద్ధరిస్తున్నాడు నానాయన; శిష్టరక్షణముకూడా చేస్తున్నాడు! కరుణామయుడు నారామచంద్రుడు. అత్రిమహామునికి దర్శనమిచ్చాడు. శరభంగమహర్షికి స్వర్గసోపానాలు చూపించాడు. నాతండ్రి మహర్షుల తపస్సుల కంతరాయాలు లేకుండా చేస్తున్నాడు. ఇంక వస్తాడు నాతండ్రి, నాదగ్గిరికి; వస్తాడు నన్ను చూడడానికి, నన్ను పోషించడానికి, నాతండ్రి; నాతండ్రిని చూడడానికి నాకళ్లు కాయలు కాస్తున్నవి. నాతండ్రీ, లక్ష్మణుడూ దక్షిణాభిముఖులై వస్తున్నారట. [ఆ ముక్కలే గొణుగుకొనును.]

హ ను మ ం తు డు

శ్రీరామచంద్రులు వస్తున్నారని యీ ప్రాంతాల రాక్షసులు కొందరు లంకవైపుకు నిన్న పరిగెత్తుకు పోతుండగా చూచాను.

ఇ ం ద్రి

వాళ్లను పట్టుకొని చీల్చివేయ లేకపోయావా!

హ ను మ ం తు డు

అది శ్రీరాములు చేయవలసినకార్యము.

శ బ రి

నాతండ్రు లిద్దరూ నారబట్టలు కట్టుకొన్నారట. కొండలంతేసివిండ్లు,కొండలంతేసి— విన్నావా హనుమంతుడూ, కొండలంతేసి, విండ్లు పట్టుకొన్నారట. నాకేసి వస్తున్నారట శ్రీరామచంద్రుడు. ఆకాశమువంటి శరీరము వాడు! పావురాలు మేఘాలవంటి శరీరమన్నవి. మేఘాలవంటి శరీరం. నాచిన్నతండ్రికి లక్ష్మణస్వామికి బంగారమువంటి శరీరం. ఈముళ్లల్లో,ఈరాళ్లల్లో, ఈ కొండల్లో తిరగడంవల్ల కాళ్లు ఎంతనొప్పులు పెడుతున్నాయో నాతండ్రికి! నేను దగ్గి రుంటే కాళ్లు పడుదును. దారి బాగుచేద్దును. నాతండ్రి నడవడానికి పువ్వులు దారిలో చల్లుదును. నా కంతటిపుణ్యమా?

హ ను మ ం తు డు

అంతకంటె పుణ్యం చేసుకున్నావు కాబట్టే శ్రీరాముడు నీ ఆశ్రమానికే వస్తున్నాడు.

ఇ ర్రి

అవును శబరీ!

శ బ రి

అవును నాయనా, వస్తున్నాడు. నాతండ్రి నాకోసం వస్తున్నాడు......పాడుజింక! మారీచుడు జింకలాగ రాకపోతే నాశ్రీరాముడికి ఈకష్టా లుండకపోవును గదా! నాతండ్రికే కష్టాలు! నాతల్లికే కష్టాలు! నాకైనా వచ్చాయి కావు. అయ్యో!

హ ను మ ం తు డు

జింకలమందలను దూరముగా తరిమివేశాను శబరీ.

శ బ రి

ఒక్కటీ లేకుండా తరిమావా?

హ ను మ ం తు డు

ఒక్కటీ లేకుండా తరిమాను.

ఇ ర్రి

అవును, ఒక్కటీ లేకుండా; నా జింకను కూడాను.

శ బ రి

నాతండ్రే,నాచిట్టితల్లే; ఆలాగ శ్రీరామ కార్యాలు చేస్తూ ఉండండమ్మా! మీకూ శ్రీరామ చంద్రుని దర్శన మవుతుంది.

హ ను మ ం తు డు

ఏనుగులను ఇంకో అడవిలోకి తోలేశాను.

శ బ రి

మంచిపని చేశావు. పంపాజలము అతి నిర్మలముగా ఉండాలి. నా రామ చంద్రుడు స్నానం చెయ్యవద్దూ; నా రామచంద్రుడు ఈ జలమేగా తాగేది. అన్ని పద్మాలూ నవ్వుతూ వుండాలి, అన్ని సెలయేళ్లూ గంతులువేస్తూ పాటలు పాడుతూ ఉండాలి, అన్నిహంసలూ దూరంగా ఈదుతూ ఉండాలి, నారామచంద్రుడు స్నానం చేసేటప్పుడు.

ఇ ర్రి

అదిగో పావురాలు, అదిగో, వసంత కోయిల పిల్లపాటలలాగ గాలిలో ఈదుకు ఎలాగ వస్తున్నారో!

శ బ రి

[పైకి చూచి చప్పట్లు కొట్టుతూ] రండి; నాచిన్నిపక్షులు, రండి. మీకోసం మంచి మంచి గింజలు జాగ్రత్తచేసాను; అదిగో ఆ గట్టుమీద కూచుని రెక్కలు ముక్కుతో సవరించుకోండి. నాతండ్రులు నా రామచంద్రుడూ లక్ష్మణుడూ కుశలమా?

పా వు ర ము లు

కుశలమేనమ్మా! కాని శ్రీరామచంద్రులవారి దుఃఖానికి మేర లేదు. లక్ష్మణుడు ఎంత ఓదార్చినా ఊరుకోక ఆయన అస్తమానం 'నాసీత, నాసీత' అని విలపిస్తున్నారు.

శ బ రి

అయ్యో, అయ్యో, ఎంతకష్టం వచ్చిందమ్మా, నారామచంద్రుడికి; ఎంతకష్టం వచ్చిందమ్మా! ఎలాగ నారామచంద్రుడిదుఃఖం పోవడం? ఎలాగా? లక్ష్మణుడు ఓదార్చినా ఊరుకోడం లేదేం? నాసీతమ్మను ఆ దుర్మార్గుడు ఎత్తుకుపోతే ఎవరు చెప్పితేమాత్రం ఎలా ఊరుకోగలడు? హృదయం దహించుకుపోదూ? నాతల్లి సీతమ్మ ఏమియాతన పడుతోందో, తలచుకుంటే — అమ్మయ్యో! అయ్యో! నాతల్లీ! నాతల్లీ! ఎన్నిపాట్లు వచ్చాయమ్మా నీకు, నాసీతమ్మ తల్లీ.

పా వు ర ము లు

దక్షిణముగా శ్రీరామలక్ష్మణులు బయలు దేరి త్రోవలో కుంజవంత పర్వతముమీద వికృతాకారముతో ఉన్న దనువనే కబంధుని రాక్షసుణ్ణి సంహరించారు. అప్పు డొక వింత జరిగింది.

శ బ రి

ఇంకోరాక్షసుని సంహరించారా నారామచంద్రులు? దుర్భర దుఃఖసముద్రంలోమునిగి ఉండిన్నీ అవతార కార్యము చక్కబెట్టుతున్నారు. నాతండ్రి దక్షిణబాహువు దుర్మార్గులకు హాలాహలము కాదూ!

ఇ ర్రి

ఏమి టావింత?

పా వు ర ము లు

శ్రీరాములవారి దక్షిణబాహువు కబంధుని విషయంలో మొదట హాలహాలమై తరవాత అమృతమైనది.

శ బ రి

ఆలాగా పక్షుల్లారా! ఆలాగా! చూచారా హనుమంతుడూ, ఇర్రీ! నాతండ్రి ఎంత దయామయుడో! ఎలాగ అమృత మైనదమ్మా చెప్పండి చెప్పండి!

పా వు ర ము లు

కబంధుని వధింపగానే అతనిలోనుంచి ఒక దివ్య తేజశ్శాలియైన గంధర్వుడు పైకి వచ్చి శ్రీరామమూర్తికి నమస్కరించి శబరి ఆశ్రమానికి వెళ్లమని దారి చూపించి అంతర్హితు డయ్యాడు.

హ నుమంతుడు

శబరికి శత్రువులంటూ లేరు. అంతా రామమయమే.

ఇ ర్రి

అంచేతే రాక్షసుడుకూడా శబరికి ఉపకారం చేశాడు, శ్రీరామచంద్రుని ఆవిడ ఆశ్రమానికి వెళ్లమని చెప్పి, కాదు హనుమా ?

శ బ రి

నా ఆశ్రమానికి దారే! అమ్మయ్యో! నాతండ్రి సమీపిస్తున్నారు! వస్తున్నారు. పదమూడేళ్ల బట్టీ కనిపెట్టుకు ఉంటే నేటికి నాతపస్సు ఫలించింది. నా గురువుగారు నా కెంత ఉపకారం చేశారు! హనుమా, ఇర్రీ, వస్తున్నారు నాయనగారు, పదండి. పదండి సన్నాహాలు చేద్దాము, పదండి. నాయనగారికి దుఃఖోపశమనం కలగడానికి మార్గాలు వెదుకుదాము పదండి!

పా వు ర ము లు

శ్రీరాములవారు రేపు మీ ఆశ్రమము చేరుకుంటారు లక్ష్మణసహితముగా.

శ బ రి

ఇంక మీరు వెళ్లండి; వెళ్లి గింజలు తిని పంపాజలము తాగి శ్రమ తీర్చుకోండి. రేపు రాములవారు వచ్చినప్పుడు ఆ నాతండ్రి కెదురుగా ఆకాశంమీద మొగ్గలు వెయ్యండి. నా తండ్రి చూచి సంతోషిస్తాడు.

పా వు ర ము లు

అలాగే నమ్మా! శ్రీరామసందర్శనం రోజూ చేస్తూ ఉండడమువల్ల మామనస్సులు ఆయన అధీన మైపోయినవి. ఆయన్ని చూడకుండా ఉండలేము.

[పావురములు వెళ్లును.]

శ బ రి

నాకు కాళ్లూ చేతులూ ఆడడం లేదు. నారామచంద్రుడి కాళ్లమీద పడేదాకా ఓపిక ఉంటుందా ? నాయిష్టదైవతారాధన చేసేదాకా దేహము నిలుస్తుందా? విన్నావా హనుమా! ప్రకృతిలో ఉండే మాధుర్యమంతా నాయిష్టదైవతానికి ధారపొయ్యాలి. మానవ హృదయంలో మాధుర్యమంతా నాయిష్టదైవతానికి అర్పించాలి. నా హృదయాధినాథుడు, నా రామచంద్రుడు, నా తండ్రి, నా నాయన, నే నంటే ఎంత పేక్షో! నాకోసం వస్తున్నాడు. హనుమా, ఇర్రీ, పదండి సన్నాహం చేద్దాం, పదండి. చాతకమునీ, నీవుకూడా రావూ ?

చా త క ము ని

నేను నేడు యోగ సమాధిలో ప్రవేశిస్తున్నాను. సమాధినుంచి లేచేటప్పటికి ఎంత కాలం పట్టుతుందో.

శ బ రి

ఇర్రీ, నే చెప్పిన పను లన్నీ చేశావూ ?

ఇ ర్రి

పక్షులకు పాటలు నేర్పాను. నేనూ హనుమా కలిసి రాముడు నడిచే బాటంతా పువ్వులు చల్లుతాము.

శ బ రి

ఎలాగ చల్లుతా రమ్మా!

ఇ ౦ద్రి

బాటకి రెండుపక్కలా బంతుల్లాంటి ఎర్రని కదంబపుష్పాలు పరుస్తాము. మధ్య పారిజాత పుష్పాలు పరుస్తాము.

శ బ రి

పరిచిన తరవాత పారిజాతాలు తొక్కకండమ్మా. శ్రీరామమూర్తి పాదాలే గాని ఇంకెవరిపాదాలూ వాటిమీాద పడకూడదు. వనంలో చెట్లన్నీ పూలగుత్తులతో వంగి ఉన్నవి. అవే నా శ్రీరాముడికి పుష్పతోరణాలు.

హ ను మ ం తు డు

అమ్మా, శబరీ, కపిలధేనువులచేత లేత పచ్చిక తినిపించి పంపాజలము తాగిస్తున్నాను చాలకాలమునుంచి. నాటిపాలు సిద్ధము చేసి ఉంచుతాను! శ్రీరాములవారిమాట విన్నప్పుడల్లా అవి పొదుగులలోంచి పాలు కారుస్తున్నవి.

శ బ రి

నే చెప్పినట్లు చేశావు నాయనా; కపిల గోవులేనా? పవిత్రముగా ఉంచావు గదా! రేపు పాలు తే. తామరదొప్పలో పోసి తీసుకురా, నా నాయన కిద్దాం.

ఇ ౦ద్రి

చిలుక లన్నింటికీ ఉత్తరువు చేశాను.

శ బ రి

మాఅమ్మే! నే చెప్పడం తడవు! శ్రీరాములంటే విూ కెంత అపేక్షమ్మా! మంచి తియ్యటిపళ్లు, దోరపళ్లు, తెమ్మని చెప్పావా?

ఇ ౦ద్రి

పంపాతటాలమీాద పెరిగిన చెట్ల పళ్లు మంచిమంచివి కోసి దోరపళ్లు ముక్కున కరుచుకొని రమ్మని చెప్పాను.

శ బ రి

తెల్లవారేసరికి తీసుకురా అమ్మా, వాటిని. శ్రీరాములవారి కిద్దాము.

ఇ ౦ద్రి

శబరీ, నల్లటి మబ్బులమధ్య కొంగలు బారులుగా పరుగెత్తితే బాగుండదూ? అవి మాట్లాడవులే.

శ బ రి

నాచిట్టితల్లి; నాచిట్టితల్లి కడుపులో ఎంత మంచి ఊహాలో! అలాగే చేయించమ్మా, శ్రీరాముడు సంతోషిస్తాడు.

ఇ ౦ద్రి

శబరీ, నే నింకోమాట చెప్పనా?

శ బ రి

చెప్పు తల్లీ, చెప్పు. ఎందు కమ్మా, అంత సందేహం? నారామచంద్రుణ్ణి ఎలాగ ఆరాధించాలో ఎలాగ ఆదరించాలో ఆలోచించావా ఏమిటి?

ఇర్రి

రాములవారు వస్తున్నారు కాబట్టి మతంగ వనంలో కాకులేమీ ఉండకుండా చేస్తే బాగుండదూ?

శబరి

ఎందుకమ్మా ఎందుకూ? అలాగు చేస్తే నాతండ్రి సంతోషిస్తాడా?

ఇర్రి

రాములవారూ సీతామ్మవారూ చిత్రకూటంలో ఉండగా ఒకకాకి—ఇంద్రుడి కొడుకుట—వచ్చి, సీతామ్మవారికి అపచారం చేసిందిట.

శబరి

నాతల్లికి అపచారమే. నాతల్లికే. నాతండ్రి చూస్తూ ఊరుకొన్నాడా? నీ కెవరు చెప్పారు ఈ మాట ఇర్రీ?

హనుమంతుడు

పక్షులు చెప్పకొంటూ ఉంటే ఇర్రి విన్నది శబరీ. అప్పటినుంచి నీతో చెప్పవలెనని అనుకుంటూ ఉంది.

శబరి

అలాగా! చెప్పు ఇర్రీ, చెప్పు. తరవాత ఏం జరిగింది?

ఇర్రి

రాములవారు సీతమ్మ అవస్థ చూచి కాకిమీద కోపించి ఒక దర్భ అభిమంత్రించి వేశారుట!

శబరి

నాతండ్రే! నాతల్లికి అపచారం చేస్తే నాతండ్రి ఊరుకుంటాడా? పాడుకాకి! నాతండ్రి దక్షిణ బాహువులో హాలహాలమూ అమృతమూ ఉన్నవన్న మాట ఎరగదు కాబోలు!

ఇర్రి

ఆదర్భను చూచి కాకి పారిపోయి ఇంద్రాదిదేవతల నందరినీ శరణు వేడుకొన్నది.

శబరి

నాతండ్రి కోపిస్తే ఎవరు శరణియ్యగలరూ?

ఇర్రి

ఎవరూ ఇయ్య నన్నారు. అప్పుడు తిరిగి మళ్లీ వచ్చి శ్రీరాములువారి పాదాలమీద పడి శరణు వేడుకొన్నది.

శబరి

వేడుకొన్నదీ! వేడుకోక ఏమి చెయ్యగలదు నాతండ్రి శ్రీరాముడు కోపించితే! నాతండ్రి దయాసముద్రుడు కాడూ?

ఇర్రి

అప్పుడు రాములవారు దానిని రక్షించారు. కాని రాములవారు ప్రయోగించిన దర్భకు తిరుగు లేదు. కాబట్టి దాని కుడికన్ను మాత్రం బలిగా తీసుకొన్నది.

శబరి

నాతండ్రి ఎంత మంచివాడో చూశావా హనుమా, చూశావుటే ఇర్రీ! నాతల్లికి అప

చారం చేసిన దుష్టునుకూడా రక్షించాడు నాతండ్రి. ఎంత మంచివాడో, ఎంత కరుణామయుడో!

ఇ ర్రి

ఏం శబరీ? కాకుల్ని లేకుండా చేస్తే బాగుండదూ?

శ బ రి

బాగుంటుందమ్మా, బా గుంటుంది. ఎంత పొరపాటు వచ్చిందో చూశావా హనుమా! ఈసంగతి నాకు తెలియనే తెలియదూ. రాములవారు ఇక్కడ కాకులను చూచినట్లయితే సీతకు జరిగిన అపచారం సంగతి జ్ఞాపకం వచ్చి ఎంత దుఃఖించేవారో! ఎంత పొరపాటు!

హ ను మ ం తు డు

ఇర్రి వాటిని వనములో ఉండకుండా తరిమి వేస్తుందిలే శబరీ.

శ బ రి

ఇర్రీ, తరిమి వేయించమ్మా, తరిమి వేయించు. నాకు తోచిం దే కాదూ. నాచిట్టితల్లికి తోచింది. ఎప్పుడూ రాములవారిని గురించి ఆలోచిస్తూ ఉండండమ్మా, మరిచిపోకండి.

హ ను మ ం తు డు

తెల్లని అంచుల మేఘాలు శ్రీరాములవారికి గొడుగుపట్టాలని చెప్పావుకాదూ, శబరీ!

శ బ రి

పడతాయిలే నాయనా, పడతాయి. వాటిసంగతి నే చూస్తా! ఇర్రీ, మధువుమాట మరిచిపోలేదు కదా.

ఇ ర్రి

లే దమ్మా శబరీ. తుమ్మెదలతో చెప్పాను, మందార మాలతీ పద్మ పుష్పములనుంచి మాత్రమే మధువు గ్రహించి చక్కనిపట్టు కట్టి వాటిలో భద్రము చేయమని. అవి ఆరీతిగా భద్రము చేసినవి. ఎప్పుడు శ్రీరాములవారు వస్తారు, ఎప్పుడు మధువు అనుభవిస్తారని ఎదురు చూస్తున్నవి.

శ బ రి

ఆమధువు అరటాకుదొప్పల్లో పోసి, తే. నా రామచంద్రుడి కర్పిద్దాము.

హ ను మ ం తు డు

శ్రీరాములవారి ఒంటికి రాయడానికి పుప్పొడి భద్రం చేశావా ఇర్రీ?

శ బ రి

చేసింది నాయనా, చేసి నా కిచ్చింది. ఇర్రీ, చెప్పడం మరిచాను. వసంతచందనం తీసుకు వచ్చి రేపు శ్రీరాములవారికి గంధం తీయవులే.

హ ను మ ం తు డు

వసంతచందనం మతంగవనములోది నీవు జాగ్రత్త చేశావుగా శబరీ!

శ బ రి

జాగ్రత్త చేశాను నాయనా; రావే, ఇర్రీ, నీ కిస్తాను.

ఇ ర్రి

మంచిమంచి రంగురంగుల పుష్పాలతోనూ, తులసి దళాలతోనూ దండలు కట్టమ

న్నావు కాదు శబరీ? జాజులూ మల్లెలూ మం దారాలూ పద్మాలూ తులసి దళాలూ సిద్ధం చేసి కట్టవద్దూ?

శ బ రి

మన మిద్దరమూ కలిసి కడదాము. మరి చిపోకుమా, హనుమా! నాతండ్రికి మంచి సిం హాసనం తయారు చెయ్యి. చుట్టూ కేళాకూ ళులు. వాటిలోంచి పైకి చిమ్మే జలధారలు. కేళాకూళులమధ్య ఉన్న ఆసనాలు రెండూ. నాతండ్రి కొకటీ, నాచిట్టితండ్రి కొకటి. నేను దానిచుట్టూ అలికి ముగ్గులు పెడతాను.

హ ను మం తు డు

ఆలాగే శబరీ, ఈరోజు అన్నీ సిద్ధముచేస్తాను

శ బ రి

పదండి సన్నాహం చేద్దాము. రావే ఇఱ్రీ, పాటలు పాడుకొందాము నాతండ్రిమీద. తీరా వచ్చి, పాటలు మరిచి పోతామేమో! రా హనుమా, సర్వమూ సిద్ధము చేతాము.

పదండి, నా కూనల్లారా పదండి!
వస్తున్నారు, నా శ్రీరామచంద్రులు!
వస్తున్నారు, నాపాలిటి కల్పవృక్షము!
వస్తున్నారు, నా బంగారుమూట!
దయచేస్తున్నారు, నా యిష్టదేవులు!

దృష్టి చెదరకూడదు. మనస్సు చలించ కూడదు. ఆవేశము, భక్తి తప్ప ఇంక దేనికీ మనస్సులో తా వుండకూడదు. ఏ మవుతుం దో? నాతండ్రిగారు, నా చిన్ననాయనగారు దయచేస్తున్నారు పదండి. హనుమా, పదండి. రా ఇఱ్రీ, రా, నాతండ్రి శ్రీరాములు దయ చేస్తున్నారు! శ్రీరాములు!

---

# పడవ బాట

ఐ. రామచంద్రరావుగారు

ఒడుకు దుడుకూ లేక పడవసాగాలీ.
వడివడిగా నడసిపోవాలి
ఎన్నెన్నిగుండాలో మెన్నెన్ని మర్మాలో
యీమాయజలధిలో!
వుయ్యాలో వుండె పసిపాప నవ్వాలి.
పైపైన నెగిరేటి పచ్చినై పోవాలి.

నానీడ నే జూచి నవ్వుకోవాలి.
పొద్దు గూకక మునుపె వొడ్డు సేరాలి
నల్లన్ని గాలిలో సన్నన్ని జల్లులో
తెల్లన్ని ముసుగేసి తేలిపోవాలి.
పయిట సరిగా దిద్ది పయనమవ్వాలి
అంతలో నింతలో వోడినో సూడాలి.
చుక్కానిమలిపేసి చుక్కనై పోవాలి.

---

# దయ్యము*

వేలూరి శివరామశాస్త్రిగారు

శ్రీనారాయణరావు నిజామురాష్ట్రమునందలి ఘనేపూరు జమీందారు. అతనికి అరబ్బీ, ఉరుదు భాషలే కాక యింగ్లీషుకూడ చెప్పగా వచ్చును. మాతృభాష యగు తెలుఁగు విషయమున అతనికి హిందూ ముస్లిం యూనిటీ చాల నెక్కువ. దాని కేమి? ఆయన పెద్ద స్పిరిచుయలిస్టు. అనఁగా దయ్యాల శాస్త్ర మెఱిఁగినవాఁడు.

వర్ణవిభాగము హిందూదేశ పతనమునకు కారణమని పెద్దపెద్ద లందఱు ఒకరూల నెత్తికి నేలకు కొట్టుకొనుచుండఁగా నారాయణరావు దయ్యములలోఁగూడ వర్ణవిభాగము కలదని కనుఁగొని వర్ణవిభాగము అసలు సృష్టిలోనే కలదని నిర్ధారణచేయ మొదలుపెట్టెను.

ఆయనకన్న దొడ్డ పరిశోధకురాలు ఆయన భార్య మాలతి. ఆమె యెప్పుడును ముక్కు మూసికొని ప్లాంకెట్ (ముక్కాలిపీట) ముందరనే కూరుచుండును. ఆమె ఆహ్వానింపఁగనే దయ్యములు తయారు. 'దయ్యములుగూడ నిన్నే వలచిన' వని నారాయణరా వనును. 'మీరుఁగూడ మా fair sex (స్త్రీల) లోనికి రం' డని మాలతి యనును. 'రాను రాను; నేను దయ్యముల లోనికి పోదు'నని మగఁ డనును. 'ఇపు డేమి తక్కువ?' అని భార్య యనును.

మాలతి ముక్కాలిపీట యెప్పుడును మ్రోఁగుచునే యుండును. ఆమెగది ఒక టెలిగ్రాఫు-ఆఫీసు.

ఆమె దాసీజన మంతయు ఆమెకంటె పెద్ద స్పిరిచుయలిస్టులు. మాలతికి దయ్యములు ముక్కాలిపీట మీఁద సంజ్ఞారూపముగమాత్రమే కనఁబడును. దాసీకల కన్నులకే అవి కనఁబడి తప్పించుకొనిపోవుచుండును.

'జ్వరము సోఁకి నేను మేడవసారాలో పడుకొని యుంటిని. చక్కనిచీర కట్టుకొని రూకంత బొట్టు పెట్టుకొని ఒకదయ్యము నాపక్కనుండియే రివ్వన వెళ్లెను' అని అచ్చి వాడ యంతయు మోఁగిపోవునటులు చెప్పెను.

'అప్పైతాఁ మాలతీ బీగమ్ కాదుగదా' అని రసూల్ సాహె బడిగెను.

'అరే, బిగ్గఱగా అనకు! దెబ్బలు తినకు!' అని అచ్చి అనెను.

మాలతి దాసీకలలో ఫాతిమా బీబీ యొకతె. తురక దయ్యములుకూడ నున్నవని అది పరిశోధన చేసి నిశ్చయించెను. ఫాతిమా యిపుడు రెండవతూరి పెండ్లాడుటకు ప్రయతించుచుండెను. ఫాతిమాబీబీ గతించిన భర్త అంపకారి. అంపకోఁతలో చేకుమూను విఱిగి అతనిపైఁ బడెను. అతఁడు వెంటనే మరణించెను. అతఁడు మరణించినపిదప రెండేండ్లకు ఫాతిమా ఆగోతి ప్రక్కగాఁ బోవుట తటస్థించెను. ఫాతిమాకు అంతయు గుబులుకు వచ్చెను. దానికాళ్లు వడఁకెను. చెమట పోసెను. 'ఇంకను నాస్తా కాలేదా?' అని తప్పఁద్రాగి అంపముతో అతఁ డొకతూరి ఫాతిమా వెంటఁ బడెను. ఇపు డా స్వరూపము దానికి గోచరించెను. గోచరించుట యేమి, అంపముతో వెనుకకు రానే వచ్చెను. ఫాతిమా కెవ్వన కేక పెట్టెను. విఱుచుకొని పడెను. బందుగు లందఱు ప్రోగయిరి. తురకమంత్రములు పెట్టించిరి. లాభము లేకపోయెను. హిందూమంత్రములు పెట్టించిరి. కొంచెము తెలివి కలిగెను. అపుడు మాంత్రికు లందఱు తురక దయ్యములకు హిందూ చెప్పుదెబ్బలును, హిందూదయ్యములకు తురక చెప్పుదెబ్బలును ఉపయోగించుట లాభకారి యని గుర్తించిరి. కొంతవడికి ఫాతిమాకు తెలివి

*ఇందలి ప్రధానాంశమునకు స్వర్ణలతాదేవితోపాటు నేనును ఒక అజ్ఞాతరచయితకు చాలఋణగ్రస్తుఁడను.

వచ్చెను. ఆమె 'తనభర్త దయ్యమై తనను పట్టుకొనె'నని చెప్పెను. నమ్మకముకొఱకు తనచేతిమీద అంపపు గుఱుతులుగూడ ఆమె చూపెను. అందుచేత ఫాతిమా అందఱికిని జూపెను. అభియముతో ఫాతిమా నెవరును పెండ్లాడ లేదు.

'ఆడువారికంటె మగవారికి ప్రేమ యెక్కువ. చచ్చినను రుస్తుంసాహెబు ఫాతిమాను వదలలేదు. మాచి తిరా ఫాతిమా పెండ్లాడఁదలఁచినది!' అని హైస్కూలు లోని సైకాలజిస్టులు సారాంశము తేల్చిరి.

ఈతురక దయ్యముగూడ మాలతిబల్లమీఁది కెక్కె ను. తాను ఫాతిమాను అంపముతో కోపించినటులుగూడఁ జెప్పివైచెను. మాలతి ఫాతిమాకు ఆ సంగతి చెప్పినపుడు ఫాతిమా లోలోపల నవ్వుకొని 'అమ్మ' అని చేయి చూచుకొనెను.

ఈదయ్యమే కాక పట్నములో నున్న దయ్యములు చాలవఱకు మాలతి ముక్కాలిపీటమీఁదఁ గాని, నారాయణరావు ముక్కాలిపీటమీఁదఁ గాని అధిష్ఠించుచునే యుండును. ప్రతిదినము కొందఱు భక్తులు అచటికి వత్తురు. చనిపోయిన తమబంధువులను మాలతికి విన్నవింతురు. ఆమె దయ్యముల నాహ్వానించి వారికి ఇష్టము లగు వస్తువులు ఫలానా అని చెప్పును. వారా మొక్కు బడులు చెల్లించి పరితృప్తి చెందుచుందురు.

ఇదివఱకు దేవతలకే దేవళములు కలవు. ఇపుడు దయ్యములకు ఈమేడ ఒక క్రొత్తదేవళ మాయెను.

నారాయణరావు కుమారుఁడు కాంతారావు. అతఁడు ఉస్మానియా యూనివర్సిటీలో ఎల్. ఎల్. బి. పరీక్ష నిచ్చెను. అతని కాడిగ్రీతో చేయవలసిన పని అంతగా కానిపింపలేదు. కావున ఆడిగ్రీకూడ ఆదేవళమున ఒక ఉత్సవవిగ్రహముగా నుండెను.

కాంతారావు చిన్న స్పిరిచ్యులిస్టు. అతఁ డిపుడు పశువులకును, దయ్యములకును ఉండు సంబంధమును పరిశోధించుచుండెను. ఇంతియ కాక దివ్యజ్ఞానసమాజము వారి కూట్ హూమీగారితో సంభాషింప ప్రయత్నములు చేయుచుండెను. వీని యన్నిటికంటెను నాటకములలో వేషములు వేయుటయం దతని కభిరుచి మెండు. నాట్య మిపు డతని కభిమానశాస్త్రము; దయ్యాలశాస్త్రము దానితరువాత.

ఇటు లీకుటుంబమునకు ఇహలోకసంబంధము కంటె పరలోకసంబంధ మెక్కువ. సత్యప్రపంచము కన్న భావనాప్రపంచమున వారికి మనసు. మాట లాడుచు మాటలాడుచు వారు పరలోకమునకుఁ బోయి వచ్చుచుందురు. వారు నమ్మి నమ్మింతురు. మోసపడిరేని పరిశోధనలను ముగింపరు. ఇతరుల యాక్షేపణములకు అంతగా విచారింపరు.

మొహరము పండుగలలో ఈ దయ్యాలచర్చ చాల యెక్కువగ వచ్చెను. నారాయణరావు దయ్యములను గుఱించి ప్రతిదినము ఉపన్యసించుచుండెను. అసలే అతనిది బొంగురుగొంతుక. బిగ్గఱగా నుపన్యసించుటచే అతనిగొంతుక పగులఁగొట్టిన కంచాయెను.

నారాయణరావు ఒకరాత్రి అందఱను విందునకు పిలిచెను. విందు ఇంగ్లీషుపద్ధతిలో జరుగుచుండెను.

వచ్చినవారిలో వినాయకరావు మాటకారి. అతఁడు కొంచెము బ్రాంది పుచ్చుకొని, 'మీకుమారుఁడు కాంతారావు కవఁబడఁ డేమి? దయ్యమయిపోలేదుగదా?' అనెను.

నారాయణరావు సీసా ఖాళీ చేసి, 'దయ్యమై మిమ్ములనే లంకించుకొనినటు లున్నాఁడు' అని బొంగురునవ్వు నవ్వెను.

'ఇంకను కాంతారావుకు పెండ్లిచేయలే దేమండీ?' అని వెంకోబారా వనెను.

'మంచిదయ్యము నొకదానిని మాబీగంసాహెబా దర్యాప్తు చేయుచున్న'దని నారాయణరా వనెను.

అందఱును నవ్విరి.

నారాయణరావు 'ఔర్ ఏక్ షీషీ లెకావ్' అని బోయికి అజ్ఞాపించెను.

ఈసారావలననే దయ్యము లెక్కువై పోవుచున్న వని అనుకొనుచు బోయి సీసాకొఱకుఁ బోయెను.

మాధవరావు దిట్టముగా త్రావి యిటు లనెను— 'శశశమీవృక్షముమీఁద పపప పాండవు లస్త్రము లుంచుటచే చెట్లకును దయ్యములకును సంబంధము జజజగద్విదితము.'

'శేష్! ఇది యొక క్రొత్తసారాంశమే.' అని నారాయణరావు నోటు బుక్కులో వ్రాసికొనెను.

'దయ్యములకే కాదు; దేవతలకును సంబంధము కలదు. రామకృష్ణ పరమహంసకు గంగయొడ్డున ఒక మఱ్ఱిక్రింద గొప్పసమాధి సిద్ధించెను. ఆయన ఆవలికి రాఁగనే ఆచెట్టు కొమ్మ ఫెళ్లున విఱిగి క్రిందఁ గూలెను.' అని వ్యాసారావు అనెను.

'కాదండీ! అది షైతాన్ మహత్తే!' అని నారాయణరా వనెను.

'మీరు మానవుల రాజ్యమే కాక దయ్యాలరాజ్యమునుగూడ పరిపాలించుచున్నా' రని హెడ్‌మాస్టరు క్వయాంసాహెబు అనిరి.

అందఱకును కొంచెము కొంచెముగా మత్తు తల పైకి ఎక్కఁజొచ్చెను. ఎవరి యిండ్లకు వారు వెళ్లి పోయిరి.

నారాయణరావు తూలుచు గోడ పట్టుకొని మెట్లెక్కి మేడపైకి వెళ్లెను. ఎల్లపుడును మూసియుంచఁబడు కాంతారావు గదితలుపు తెఱవఁబడియుండెను. అతఁ డందు ప్రవేశించెను. దీపము తేగంటవలె నుండెను. కాంతారా వచట లేఁడు. ఆరాత్రి నాటకము. చాల వేషములు మంచముమీఁదఁ బడియుండెను. నారాయణరావు ఒక్కొక్క వేషమునే తీసి పరిశీలించెను. రాజువేషములు, రాణివేషములు, విదూషకవేషములు, రకరకాల దయ్యాలవేషములు. అతఁడు ఆదయ్యములవేషములలో ఒకవేషమును ఏఱుకొనియెను. అటు ఇటు చూచి 'కిక్' అనుకొనియెను. ఆవేషమును తొడుగుకొనియెను. నిలువుటద్దమునఁ జూచుకొనియెను. 'కిక్ కిక్' అనుకొనియెను.

మెల్లగా వసారాలోనికి వచ్చి మాలతిగదిగోడకు చెవి ఆనించి ఆలకించెను. ఫాతిమా మాలతికి తల దువ్వుచున్నటులు గ్రహించెను. వడివడిగా మేడ దిగి చదువుల గదిలో కుర్చీమీఁదఁ గూరుచుండెను. ఈ కిటికీ ప్రక్కనుండి ఫాతిమా వెళ్లఁగనే ఈవేషముతో మాలతికడకు వెళ్లి తమాషా చేసి దయ్యములు వట్టిభ్రమ యని నిరూపింతు ననుకొనెను. తాను ఆడవలసియున్న నాటకమంతయు సాంగోపాంగముగా ఆలోచించుకొనుచు ఒకకుర్చీమీఁదఁ గూరుచుండెను. అతఁడు ఇటులు ఆలోచించుకొనుచుండఁగా మత్తు ఒకమణుఁగు బరువుతో అతని తలమీఁద నెక్కి కూరుచుండెను. అతఁడు కుర్చీ ముందరిబల్లమీఁద తల యాన్చి కునికిపాటులు పడెను. ఆకునికిపాటులు మెలమెల్లగా నిద్రలోనికి దారి తీసెను.

మేడమీఁద ఫాతిమాబీబీకి పని యయిపోయెను. మెల్లగా మేడమెట్లు దిగి వచ్చెను. అది చదువులగది తలుపులు కొంచెము తెఱచియుండుట చూచెను. దీపపు క్రీనీడ కడపమీఁద పడుచుండెను. అది లోపల తొంగి చూచెను. గడబిడపడెను. 'క్యారే సర్వప్పా! హింతా హింతా ఫాద్దు ఫోలే దర్వాజా దొంగావాలాకు హప్పా సెప్తావ్?' అని మరల తొంగి చూచెను. దీపపు వెలుఁగున దయ్యము బల్లమీఁద పడుకొని యుండుట స్పష్టముగా కనుఁగొనెను. ఫాతిమా ఉలికిపడెను. ఒకడుగు వెనుకకు వేసి 'ఆరే షైతాన్' అని మేడమీఁదికి పరువెత్తుకొని పోయెను.

ఫాతిమా ఇటులు త్రొక్కుడుపడుటచే గడియ గర్రు మని మోఁగెను. నారాయణరావు మేలుకొనెను. ఫాతిమా 'షైతాన్'అని అఱచుట అతఁడు వినెను. భయపడెను. గోడలు తడుముకొనెను. కల్లుమత్తు నెత్తికెక్కుటచే నతనికి తిన్నగా స్పృహ లేదు. ఆతని కెదుటనే నిలువుటద్ద ముండెను. అతనికి అందు వికారపు దయ్యపురూపు కానిపించెను. అతఁడు బయటికి వచ్చుచు 'దెయ్యం' అని వయ్యపు టఱపు అఱచెను. అతఁ డిటు లఱచునపుడు ఫాతిమా మేడమీఁదికి పరుగెత్తుచు 'బేగం సాహెబా! ధెయ్యమ్'అని కూలఁబడెను. నారాయణరావు అదియు మఱియొక దయ్యపు




౫. కార్యవ్యగ్రు డగు మహాత్ముడు, నిద్రించుచున్న మీరాబాయి (P. P. B.)



౬. గాంధిమహాత్ముడు, చార్లీ చాప్లిను (G. S. A)

పరాక్రమ మనుకొనెను. మేడమీఁదికిఁ బోవ భయ పడెను. గత్యంతరము లేక రోడ్డుమీఁదికి పరుగిడెను.

మేడమీఁదినుండి మాలతి చూచి—'దయ్య మదిగో రోడ్డుమీఁద! అదిగో ముందు! ముందు!' అని అఱచి వసారాలో కూలెను.

అచ్చి వచ్చి చూచి కెవ్వన కేక పెట్టి మూర్ఛిల్లెను.

నారాయణరావుగుండెలు టువ్వుటువ్వు మనెను. 'మాలతిని పట్టుకొనక ఈ షైతాన్ నన్ను పట్టుకొను టేమి? అమ్మో! దెయ్యమ్ దెయ్యమ్' అనుచు రోడ్డుమీఁద పరువిడెను.

అతని దసలు పెద్దగొంతుక. మఱియు బండ గొంతుక. అందులో బొంగురుపోయెను. ప్రకృతము ప్రాణభయము. సారామత్తుచే సగము మెలఁకువ, సగము నిదుర; సగము తెలివి, సగము తెలివి తక్కువ. ఇట్టి అతని ఈ ప్రకృతధ్వని మనుజులదియు, జంతువులదియు, పక్షులది యుఁగూడఁ గాకుండెను. ఆవేసమువలన ఆధ్వని సరిగా నుండెను.

'ధెయ్యమ్, ధెయ్యమ్.'

రోడ్డుమీఁద బండిలో వచ్చుచు తొంగి చూచి మెహరున్నీసా! ఒక బట్టలఅంగడి యెదురుగా క్రిందఁ బడెను.

ఆప్రక్క మేడమీఁద నున్న మౌలానా ఇక్బల్ సాహెబు—'బేటీ బేటీ! అందర్ లేవ్! ఆకే హిందూదెయ్యం! అమ్మాయిని ఇంటిలోనికి తీసికొని పో! ధర్వాజా ముయ్యి, దర్వాజా ముయ్యి!' అనెను.

మాకా ఆ అంగడివాఁడు పీరుసాహెబు. అతఁ డొక పెద్ద బట్టల వర్తకుఁడు. మెహరున్నీసాను ప్రేమించు చున్నాఁడు.

కాని మౌలానాకు ఇసుమంతయు ఇష్టము లేదు. మౌలానా తన మేడ యెదురుగా నున్న యతని యంగడిని గూడ ఎత్తివేయింపఁ జూచుచుండెను. ఇట్టి స్థితిలో ఈదయ్యము!

పీరుసాహెబు దయ్యమును దూరదూరముగాఁ జూచి బిక్కుబిక్కు మనుచుండెను. బండివాఁడు 'జా జల్దీ' అని ఈల యిచ్చెను. పీరుసాహెబు మెహరున్నీసాను రెండుచేతులతో నెత్తుకొనిపోయి తలుపులు మూసికొనెను. బండివాఁడు బాడుగ అడుగకయే పాఱి పోయెను.

దయ్యము కొంచెము భయపడి ముందరికి నడచెను.

మొహరములో బలి యిచ్చుటకు ఆవొకటి అచట కట్టఁబడి యుండెను. దానిచుట్టును మహమ్మదీయులు పలువురు పరివేష్టించియుండిరి. మౌలానా ఇక్బల్ మాటలు వారికి వినిపించెను. అప్పటి నుండియు వా రందఱును దారిచేసి పొంచిపొంచి చూచుచుండిరి. వారి కపుడు ఆదయ్యపు ముఖము కాని పించెను.

'ఆక్ షైతాన్!'

'ధెయ్యం ధెయ్యం.'

అందఱును కాళ్లు విఱుగఁ ద్రొక్కుకొనిరి. ఈ త్రొక్కులాటలో పలుపు తెంచుకొని ఆవుదారిని ఆవు పాఱిపోయెను. దయ్య మాపాకను సమీపించు వఱకు అచట నొకపిట్టయేని లేదు. ఒకఁడుమాత్రము కాళ్లీడ్చుకొనుచు పాఱిపోవుచుండెను.

'జోరా, దయ్యము నన్ను గట్టిగా లంకించుకొన్న' దని నారాయణరావు గబగబ పరుగెత్తఁ దొడఁగెను.

మఱునాఁటి ప్రొద్దున ఆసుపత్రిలో షేక్ అలీ సాహెబు విఱిగిన మడమకు కట్టు కట్టించుకొనెను. హాకీము విఱుగుటకు కారణ మడిగెను. 'రాత్రి హిందూదయ్యము మాయింటఁ బడెను. అందఱు పాఱి పోఁగా నేను దానిని తఱిమితఱిమికొట్టితిని. దయ్యము తోఁక ముణఁచినది. నే నింటికి వచ్చువఱకు కాలు విఱిగియుండెను' అని షేకలీ చెప్పెను.

'దయ్యము తోఁక ముణఁచుచో ఆవేల బలి యీయఁబడ లేదు?' అని హాకీ మడిగెను.

'హిందూముస్లిం యూనిటీ! గాంధి మమ్ములను దేవురించాడుగా! అందుకని మేమే విడిచిపెట్టితిమి.'

'ఆ! ఎంత యూనిటీ! కాని నీమడమలో ఎముకకు యూనిటీ కష్టము!' అని హాకీ మనెను.

నారాయణరా వొకగల్లీలో పడెను. అచట నొక దొంగ రెంచితో తలుపు నూకు (గొ)లు తీయుచుండెను. హఠాత్తుగా వానిముందర ఈదయ్యము!

దొంగచేతిలో రెంచి క్రిందఁబడి కప్పు మనెను.

దాని నెత్తి తననెత్తిమీఁదికి విసరునేమో యని దొంగమీఁదికి నారాయణరావు పరుగెత్తఁ దొడఁగెను. 'దయ్యం తనమీఁద పడనే పడె' నని దొంగ పరుగెత్తెను. దయ్యమునకు భయము తగ్గెను.

'నేనే దొంగ ననుకొంటిని. ఈరాత్రి దొంగదయ్యమొకటి నన్ను మ్రింగవచ్చెను. అమ్మో, ఎంత దయ్యమనుకొంటివి? నా మెడ నోటిలో పెట్టుకొనునదే! ఎటులు తప్పెనో నే నెఱుఁగను. చావుపరుగు పరుగెత్తితిని. రేపటినుండి ఇక దొంగతనము చేయను' అని ఆ దొంగ తన భార్యతో అనెను.

'ఇక దొంగతనము చేయనిచో మన కెటులు గడచును?' అని భార్య యనెను.

'ఇంకా దొంగతనమే?' అని ఆదొంగ భార్యను బట్టుకొని యేడ్చుచు, 'పగటిపూఁట ముష్టియెత్తుకొందము, రాత్రి వద్దుసుమా!' అనెను.

నారాయణరావు ఆదొంగను తప్పుకొని పేరము దీసెను. అక్కడికి సీమాంతము. గోరీలదిబ్బయు, శ్మశానమును ఆదాపుననే.

శ్మశానమున ఒకపెద్ద మఱ్ఱిచెట్టు కలదు. దాని మీఁది నడిరేయిని దయ్యములు బావురు గీవురు మని పోట్లాడుచుండునని వాడుక. కావున అది దయ్యాల మఱ్ఱి అయిపోయెను.

నాటి సాయంకాలము హైస్కూలులో పెద్ద విద్యార్థులు కొందఱు ఆ మఱ్ఱికడకు నడిరేయి ఎవరును వెళ్లలేరనియు, మఱికొందఱు 'ఆ, వెళ్లలే కేమనియు తగవులాడిరి.

ఖాదర్‌సాహెబు రొమ్ము విఱిచి 'నేను వెళ్లెద' ననెను.

'పందెమెంత?'

'పదిరూపాయలు.'

'సరే గాని ఆమఱ్ఱిరొట్ట ఒకబుట్టెడు కోసికొని రావలెను.'

'బుట్టెడు కాదు; తట్టెడు తెత్తును.'

'మంచిది.'

పందెమిటులు ఫైసలాయెను. ఆనడిరేయిని ఖాదరు ఒకబుట్టతో మఱ్ఱిని మిఱ్ఱి చూచుచు మెల్లమెల్లగా సమీపించుచుండెను. అతని వెనుకనే మన దయ్యము!

అప్పుడే చంద్రుఁ డస్తమించియుండెను. భీకరమయిన గాంభీర్యమువలె ఆ శ్మశానమును చీఁకటి యావరించెను. మఱ్ఱిమీఁద గబ్బిలములు గీవురు గావురు మనుచుండెను. ఖాదరు గుండెలు కొంచెము కొట్టుకొనియెను. అతఁడు ధైర్యము తెచ్చుకొని ముందు కొక యడుగు వేసెను. వెంటనే రెండడుగులు వెనుకకుఁ బడెను.

నారాయణరావు గబ్బిలముల మ్రోఁతకు భయపడెను. ముందర బుట్టతో నున్న మనుష్యుఁడు మసకమసకగా కానిపించుచుండెను. అతఁడు దయ్య మనుకొని 'దెయ్యం దెయ్యం' అని బిగ్గఱగా అఱచెను. స్తబ్ధమైన ఆశ్మశాన మంతయు ఆయఱపుతో గాండ్రిల్లెను. ప్రక్కనున్న దిప్ప ప్రతిధ్వనించెను.

ఖాదరు వెనుదిరిగెను. వెనుకనే దయ్యము!

అతఁ డొకసంగునఁ బడి ఉడాయించెను.

పదిరోజులవఱకును అతఁడు బడికి పోలేదు. సహాధ్యాయులు ఇంటికేఁ బోయి భోగట్టాచేసిరి. మంచము మీఁదనుండి అతఁడు లేచుటలేదు. 'సైతాన్, సైతాన్' అని కలవరింతలు.

ఈయలుకులతో పరుగులతో నారాయణరావు మత్తు కొంచెము వదలఁదొడఁగెను. తా నపుడు శ్మశా

నము ముందు ఉన్నటులు అతఁడు గ్రహించెను. వెంటనే వెనుదిరిగెను.

ఒక యరగడియ నడిచి ఒకసందునఁ బడెను. ముందు ఒకమనుష్యుఁడు పోవుచుండెను. నారాయణరావు వడివడిగా నడచి ఆతని వెనుకకుపెళ్లి 'బాబూ'అనిపిలిచెను.

బాబూ అను ఆస్వరము కేయి వికారములుగా నుండెను. కాంతారావు వెనుదిరిగి చూచి త్రుళ్లిపడెను.

కాంతారావు నాటకమున వేషము వేయుటకు వెళ్లెను. నాటకమధ్యమున 'విపరీత–దయ్యము! అమ్మగారు, అచ్చి, ఫాతిమ అందఱును స్పృహతప్పి పడిపోయినారు. దొరగారు ఎచటికో పాఱిపోయిరో యేమో! వారి పత్తా లేదు. ఆదయ్యము బజాఱునఁ బడ్డది. వచ్చునపుడు జాగ్రత్తగా రావలెను' అని రెండుమాఱులు కబురువచ్చెను. ఆ రెండు పిలుపులకును అతఁడు కదల లేదు గాని మూఁడవ పిలుపుతో మఱి ఆఁగ లేదు.

'బాబూ! భయపడకు!'

'ఇంటిలో అందఱును అయిరి. ఇఁక నామీఁదికి వచ్చుచుంటివా?'అనిఅనుకొని అతఁడుఉఱుకఁదొడఁగెను.

'బాబూ! నేనే! సైతాన్ కా పహరావ్! ధెయ్యం వేసమ్!'

'నమ్మించి పడఁదోయుదువా? దయ్యాలరీతి నాకు తెలియదనుకొంటివా?అమ్మ పుట్టిల్లు మేనమామకు తెలియదు!' అనిఅనుకొనుచు కాంతారావు దూసినఅమ్మాయెను.

ముందు కాంతారావు; వెనుకనే-నారాయణరావు.

కాంతారావు 'అమ్మో దయ్యము!'—బిగ్గన అఱచెను.

నారాయణరావు 'బిగ్గఱగా అఱవకు!' అనెను

కాంతారావు 'నీయుండ మెయ్య!' అనెను. నారాయణరావు నవ్వెను. ఆవికారపు నవ్వునకు కాంతారావు బెదరిపడి మఱింకొంచెము వడిగా పరుగిడెను.

మేడమీఁద దీపములు కానవచ్చుచుండెను. అప్పటికి అందఱును మూర్ఛనుండి లేచిరి. ఈపిలుపు విని మేడమీఁద చూచుచు నిలువఁబడిరి.

కాంతారావు 'అరే పహరా జవాన్! తుపాకి తుపాకి!' అనిఅఱచి ఇంటిముందు అలవకుఁ గట్టిన ఇనుప తీఁగెలుమూఁకఁబోయి పైతీఁగమీఁదచిక్కువడివేలబడెను.

కొడుకు కింద నున్న సైడ్డుకాలువలో పడిపోవునేమో యని నారాయణరావు ఎగిరి అతనిని బట్టుకొని తానును వేలాడెను.

అబ్బాయిని దయ్యము మింగనే మింగెనని మాలతి గోలకత్తెను. కాంతారావు దయ్యమును తప్పించుకొనుటకు ఒడలు విదిలించుకొనెను. పడిపోవునను భయముచే నారాయణరావు గట్టిగాఁ బట్టుకొనెను.

పహరా జవాను రసూల్ సాహెబు తుపాకితో గుఱి చూచుచుండెను.'కొట్టు కొట్టు! మారో మారో!' అని మేడమీఁదినుండి అఱపులు!

నారాయణరావు గొంతుక చించుకొని 'కొట్టకు కొట్టకు!' అనెను. అతఁడు అటులు అనుటకు చాల ప్రయత్నము చేయవలసివచ్చెను. కుమారుని పట్టుకొనిన పట్టును కొంచెము వదలవలసివచ్చెను. ఆనడుమ కొడుకు విదిలించుకొనెను. దాన కాంతారావును నారాయణరావును సైడ్డుకాలువలోఁ బడిరి. నారాయణరావు దయ్యపువేషము మడఁచిన ఇనుపతీఁగె చివర బట్టుకొని కొంత చినిఁగి ఊడి తీఁగమీఁద వ్రేలాడెను. తుపాకి గుండు నారాయణరావు తలమీఁదుగా వెళ్లి తీఁగమీఁది దయ్యపువేషమునుండి దూఱిపోయెను.

'సైతాన్ మర్ గయా! సైతాన్ మర్ గయా!' అని పారావాఁ డఱచెను. 'ఫాతిమా! నీవు పోయి చూచి రా!' అని మాలతి అనెను.

'హచ్చీ కీ ఘంఘండీ!' అని ఫాతిమా యనెను. ఇంతలో సైడ్డుకాలువలో స్నానము చేసి తండ్రి కొడుకు లొకరి నొకరు చూచికొనుచు ఒడ్డెక్కిరి.

'ఇదియేమి ఇదియేమి?' అని కాంతారావనెను.

'నే నీనాఁడు పరిశోధన చేయుటకు దయ్యాల మర్రికడకు వెళ్లితిని. నే నీదయ్యపు వేషముతో కొన్ని పరిశోధనలు చేసితిని. పరిశోధనల ఫలితములు మెల్లగా తెలుపవలసియున్నవి' అని కాలుచున్న దయ్యపువేషమును ఆర్పి పోలీసులు దరియాప్తు చేయక ముందే నారాయణరావు మేడమీఁదికి పరుగెత్తెను.

# సుయోధన నిర్వేదము

సోమంచి వాసుదేవరావుగారు

తెలియ కిట్లు పలికితివి గాని పాపకర్ముం డటంచు నన్నుఁ గ్రూరబుద్ధి
నీచతముఁడవైన నీ విట్లు పలుకక యెందురీతిఁ బలికెదో కృష్ణ!

ఘనతరదర్పదుర్దము నఖండపరాక్రమమూర్తి సంగరా
వనితల విక్రమప్రజితభార్గవరాముని బ్రహ్మచర్య వ
ర్తన రమణీయసచ్చరితు ధర్మవిదున్ దతదాంతిశాంతు శాం
తనవు శిఖండికారణమునన్ దుదిముట్టఁగఁ జేసి తచ్యుతా!

క్రతురిపుదేశికత్వమునఁ గార్ముకవేదము నభ్యసించి భూ
పతివితతిన్ సమస్తము నభంగకుఠారమహోగ్రధారఁ ద్రుం
చి తతపరాక్రమంబున నజేయుఁ డనం జను జామదగ్న్యునిన్
ధృతి ననిఁ గెల్చె భీష్ముఁ డతనిం గెలువన్ సురలున్ సమర్థులే?

మత్తకోకిల! పేడి ముంగలఁ ద్రోయుచున్ భుజవీర్యసంపదఁ జూపుచున్
గ్రీడి యస్త్రపరంపరామహనీయుఁడై వడిఁ దాఁక మో
మోడి పోడిమి వీడి యయ్యపరోర్విభృద్ధరి కేగు నా
వేఁడివెల్గువిధాన భీష్ముఁడు భీష్మవృత్తిని వీడెఁ గా.

పాడియె భీష్మునంతటి యభంగపరాక్రమమూర్తి కెవ్వఁడున్
పేడిని ముందు ద్రోసి మఱి వెన్వెనుకన్ దెగఁ బాఱి పోరఁగా
నాఁడుఁదనంబు గాక యరయన్ మఱి పేడియ కాఁడె క్రీడి; తా
నేడ, సురాపగాతనయుఁ డేడ గణింపఁగదే జనార్దనా!

వేవురు పార్థు, లెన్నఁ బదివేవురు కృష్ణులు వచ్చినన్ బల
శ్రీవిభవున్ నదీసుతు నజేయు ననిన్ గెలువంగ శక్యమా
నే వనజాక్ష! తంత్రి మొకటేన్ బొనరించినఁ గాక; యిట్టిదా
మీవిజయంబు ధర్మయుతమే? మది నుబ్బఁగ నేల పాండవుల్.

ధనురాచార్యుఁడు ద్రోణుఁడే యనఁ దదుద్యత్ప్రాభవోన్నత్యముల్
వినుతిం జేయఁగ నేల? భారతధనుర్విద్యామహత్త్వంబు లా
తనిచేఁగా ఉదయించె; నాఘనుఁడు కాఁడా యన్నిటం జూడ భీ
ష్మునకుం దుల్యుఁ డఖండవిక్రమకళాస్తోకప్రభావుం డనిన్.

అమహనీయునైన నయు మారఁగఁ జంపఁగఁ జేసితో కృష్ణా? యు
ద్ధాముని ధర్మనందనుని దథ్యవచోరచనావిభూషణ
స్తోముని జంద్రికాసితయశోరమణీయు నసత్య మాడఁగా
నేమిటఁ జేసి తయ్యది గణింపఁగ ధర్మమె నీకుఁ గేశవా!

వినుము రథస్థుఁడైన తఱి వీరశిఖామణియైన కర్ణుతో
నని యొనరించి గెల్వఁగ సురాసురకోటికినైన శక్యమే?
మనమున నించుకేని యనుమానము మాని యధర్మవృత్తిఁ బా
ర్థునిఁ దగఁ బంచి తెల్ల విరథుండగు కర్ణుని నేసి చంపఁగన్.

గురునకు నాపగాసుతునకుం గడు నెక్కుడు గాదె కర్ణశౌ
ర్యరమ భుజాబలాతిశయ మాతని నాజి జయింపఁగా సురా
సురులకునైన శక్యమె? యశోరమణీయచరిత్రుఁ డాతనిన్
విరథత నున్నయత్తఱి వివేకుల రీతియె యేయఁగా హరీ!

బలమహనీయ సర్పముఖబాణము దూణముదాఁటి కీలలన్
వెలువడఁజేసి మృత్యుముఖభీషణమై చనఁగా శతాంగ మ
గ్గలత నడంగఁజేసితివి గాని హరీ, యటు గాక యున్న స
య్యలుఁగు పృథాకుమారుని యమాలయమున్ జొరనీక తక్కునే?

నీధర్మేతరవృత్తి నేమనుచు వర్ణింతున్ సరోజాక్ష! దు
ష్పాధప్రక్రియ ద్వంద్వయుద్ధమున నా శైనేయ భూరిశ్రవుల్
యోధాగ్రేసరు లిర్వురున్ బెనఁగ మాయోపాయదుర్బోధ నీ
వాధన్విన్ గురువంశమౌక్తికము నేయం జేయవా పార్థుచేన్?
అతిరథశేఖరుండగు శ్రుతాయుధు నయ్యమదండసన్నిభో
ద్ధతగదయున్ గడంక భగదత్తుఁడు వైచిన వైష్ణవాస్త్రమున్

ధృతిమెయి నాఁగి పార్థునకు నేమియు నాపద దాఁకనీక చే
సితి పతిపక్షపాతకృతచిత్తుఁడ! సారథు లుర్వి నిట్టిరే?

క్రీడిప్రతిన నెఱపఁ గృత్రిమతమముఁ గల్పించి సైంధవుని వధించి తకట!
దాన నీవు పాండుతనయులు శౌర్యవిరాజమానులౌదురా ముకుంద?

నన్ను గదారణంబునను నాభికిఁ గ్రింది శరీరభాగమం
చెన్నక పెందొడల్ విఱుగ నేయఁగఁజేసి తధర్మవృత్తిమై
చన్నె ముకుంద నీ కిది? నిజంబుగ దుష్టుఁడ నౌదు నేన; యై
న న్నయమార్గవేదివ యనంజను నీ కిటు నేఁత పాడియే.

మదిఁ జింతించిన వారు నే మొకటి గామా నీకు? మారీతి సం
పదకై పోరక యుండి రయ్య, భువి నెవ్వారైన? నీరీతి దు
ర్మద మేపారఁగ మధ్యవర్తి యనుపేరం జొచ్చి వంశంబు నె
ల్ల దయాహీనత నిర్నిమిత్తముగఁ గూల్పంజేయువా రుండిరే?

అన్నిట నేనె కా కడు సమర్థుఁడ నంచు మదిం దలంచి నీ
వెన్ని యధర్మకార్యములొ హీనత నాక పొనర్చి వంశమం
త న్నశియింపఁజేసితిగదా ధర యింకిట నేమి జుట్టుకో
నెన్నితొ జుట్టుకొమ్ము, నయహీనులు గారె యకీర్తికాముకుల్.

అని నర్జును సారథ్యమ్ఘొనరించెద నాయుధములు పూనంగా నొ
ల్ల నటంచుఁ బల్కియు నదీతనయునిపైఁ గవిసితివి రథాంగధరుఁడవై.

ఈయుద్ధంబున కెల్ల కారణము నీవే కావె గోవింద! కౌం
తేయవ్రాతమునందు నాహవసముత్సేకంబు గాన్పింప ద
య్యో! యీసంగరభూమిఁ జచ్చిన నృపవ్యూహంబు లెక్కింపనౌ
నే? యీకర్మఫలంబు నీద యగుఁ జుమ్మా! వంశవిధ్వంసకా!

అల జరాసంధుతో నడరి పల్మాఱు పెంపఱఁ బోరి పాఱెడు పిఱికితనము
తోడిరాజులలోనఁ బోడిమి సెఱుచు సింహాసనసత్వము లేమి నగు కొఱంతి

యతి దుర్నయంబును నన్యాంగనాపరాయత్తమై తనరు నున్మత్తవృత్తి
లోకనాశకమైన భీకరసమరంబు గలిగింపఁజేసిన కటికితనము
మొదలుగాఁగల యవగుణంబులు గలట్టి-నిన్ను నక్కట! వేఱ నిందింప నేల?
జగము నిందించుఁ,గృపయు లజ్జయును లేక-యిటులు కాలులు ప్రేలెదవేల కృష్ణ?

పాడి దొఱంగి యుద్ధమున బల్లిదులౌ గురుపతియోధులన్
వాఁడిమగంటిమిం దనరువారల నీగతిఁ జంపు నీకునన్
ప్రీడ యొకింత లేదె యిటు ప్రేలఁగ? నీ కెటువంటి వాఁడ నే
బోడిమి మించు నాదివిజభూమి వసించెదఁ గీర్తిఁ గాంచెదన్.

అఖిలాగమంబులు సాంగంబుగా నేర్చి విబుధసన్నుతు లంది వెలసినాఁడ
వైష్ణవప్రముఖదివ్య మఖంబు లొనరించి దేవసంతతిఁ బ్రీతిఁ దేల్చినాఁడ
సకల ప్రజానురంజనమున రాజరా జను ప్రతిష్ఠాపూర్తి నలరినాఁడ
పరినృపాలక గర్వపరిభంజన విహార మొనరించి నృపధర్మ మూఁదినాఁడ
భవ్యసామంతరాజ సేవావిశేష-పాత్రతాగౌరవ సమృద్ధిఁ బడసినాఁడ
నింక నని మిత్రబాంధవోపేతుఁడ నయి-సురనగరసౌఖ్యసంపదఁ జూఱఁగొందు.

*      *      *      *      *      *

సుర లంతఁ బుష్పవర్షము-గురిసిరి సౌరభ్యభరిత కోమలమరుదం
కురములు వొలయఁ దొడంగెను-హరిదంతము లెల్ల రుచుల నాపాదించెన్.

---

# మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజు కాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి వర్ణక్రమమునను తప్పులు లేకుండ చూచుకొని పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచిపోవునని మనవి.

సంపాదకుడు, 'భారతి'.




చిత్రకారుడు: శ్రీ పి. వి. రామారావుగారు.




తాత కృష్ణమూర్తిగారు, బి. ఏ., యల్. టి.,

ఉదయంనుండీ లక్ష్మిమీద ధుమధుమ లాడుతునే ఉన్నాను. చీటికీ, మాటికీ కోపం ముంచుకొస్తూ వుంది. కాని బహు శాంతం. ఓర్మి వహిస్తున్నాను. ఎంతకని సహించగలడు మనిషన్నవాడు? చీవాట్లు పెడుతున్నాను; తిడుతున్నాను; వెక్కిరిస్తున్నాను; దాన్ని, దానివాళ్లని, అందర్నీ యెత్తిపొడుస్తున్నాను; నన్ను, నా ఉద్యోగాన్ని, నా దరిద్రాన్ని, నా స్వభావాన్ని, నన్ను పుట్టించిన దేవుణ్ణి, కసి తీరా తిట్టుకుంటున్నాను. చెయ్యెత్తి చెంపమీద నాలుగు కొట్టి, లక్ష్మికి బుద్ధి చెప్పాలని వుంది; కాని స్థైర్యం చాలదు. అదిగాక, లక్ష్మి అంటే నాకు ప్రాణం. దాన్ని కొడదామనే తలపు కలిగినందుకే సిగ్గుగా వుంది. కాని,......

మనసుకు శాంతి లేదు. పనిపాట్లయందు శ్రద్ధ లేదు. ఏమీ తోచదు. ఆఫీసులో పని తెమలకపోవడం చాత, యెన్నడూ నన్ను పల్లెత్తుమాట అనియెరగని దొర, యెగిరిపడుతున్నాడు. క్లబ్బులోనైనా విశ్రాంతి లభించకుండావుంది. వార్తాపత్రికలలోని విశేషాలేవో చదివి, నాతో ఒక పెద్దమనిషి పొలిటిక్సు చర్చించబోతాడు. ఏవో పిచ్చిపిచ్చి ప్రశ్నలడుగుతాడు. జవాబు చెప్పకుంటే విసుక్కుంటాడు; చెప్తే అర్థం చేసుకోలేక తెల్లమొహం వేసి చూస్తాడు. బ్రిడ్జిఆటకు కూచునేసరికి, నాపార్ట్నరు నామీద కారాలు మిరియాలు నూరడం ప్రారంభించాడు.

ఇంటికి వచ్చే రావడంతోనే, పిల్లలు కేచుక్కల వలె మీదపడి, నానాఅల్లరి చేస్తున్నారు; యేడుపులు, నవ్వులు, పిరియాదులు, కొట్లాటలు, అసందర్భప్రలాపాలు......బలేచికాకుగా వుంది! ఉయ్యాల్లో వున్న చేతివెధవ నిద్రపోతున్నవాడల్లా లేచి కూర్చుని తేలు కుట్టినట్లు ఒక పెడేడుపు!

"లక్ష్మీ, గ్లాసుతో మంచినీళ్లు తీసుకు రా."

ఎంతసేపటికీ లోపలనుండి లక్ష్మి యివతలికి రాదు. మంచినీళ్లు లేవు. గొంతుక యెండిపోతూవుంది. బూట్సుతో వంటింట్లోకి దూరపడేసరికి, లక్ష్మి యెదురుగా వచ్చి, నావేపు యెగాదిగా చూసి, 'ఏం కావాలి?' అని అడుగుతుంది, కొళ్లు మండుకొచ్చేటట్లు. జవాబు చెప్పకుండా, మడిలో వున్న మంచినీళ్ల బిందె ముట్టుకొని, గ్లాసుతో నీళ్లు ముంచుకున్నాను.

"అది పాలగళాసు. కడిగ లేదు. మరొకటి తెస్తాను, ఆగండి."

"ఎప్పుడో తెస్తావు. దాహంవలన పీకారుకుపోయి, నేను చచ్చినవెనక! గంటసేపటినుంచి అరుస్తున్నాను, నీళ్లో నీళ్లో అని."

"ఈపిల్లలగోలలో నాకు మీమాట వినిపించ లేదు. అన్నం వారుస్తూవుండగా, మీరొచ్చినప్పుడు

విన్నాను. వెంటనే చేతులు కడుక్కొని, రానే వొస్తున్నాను." అంటూ పంచపాత్రతో నీళ్లు అందించింది.

"ఇంకా వంట కాలేదూ? అర్ధరాత్రి కావొచ్చింది! ఆకలిచేత నాకు కడుపులో దహించుకొని పోతూవుంది."

"ఈవాళ ప్రొద్దు గ్రుంకినది మొదలు పిల్లడు చెయ్యి దిగలేదు. ఉయ్యాల్లో వేసి, రెక్కలు పీకేవరకూ ఊపితే యిప్పుడిప్పుడే కన్ను మూశాడు. కాని యీ పిల్లలు వాణ్ణి నిద్రపోనిస్తారా? ఒకటే అల్లరి—కేకలు—పోట్లాటలు. నేనంటేయెవరికీ భయం లేదుకదా!...... మీరు దుస్తులు విప్పి స్నానం చేసేలోపున, వంట అవుతుంది లెండి."

స్నానం చేసి పెరట్లో చల్లగాలికి వెన్నెల్లో పచారుచేస్తున్నాను. ఒళ్లు చల్లపడినా, మనసు మండుతునేవుంది. అంతకంతకూ, లక్ష్మిమీద కోపం రగులుకునేవుంది.

స్వతహాగా నేను కోపదారిమనిషిని కాను. కోపిష్టినని పరిహాసానికైనా నన్నెవరైనా అంటే సహించుకోలేను. బహుశాంతమూర్తినని, వివేకవంతుడనని, చదువుకున్నవాడినని నాకు గర్వం. ఒక్క లక్ష్మే, నన్నప్పుడప్పుడు దెప్పిపొడుస్తూవుంటుంది. నాకు కోపం తెప్పించి, "అదిగో, కోపం వొచ్చింది కదూ? మరి కోపం, తాపం లేనిమనిషినని బడాయి చెప్పుకోవడమెందుకు?" అని పకపక నవ్వుతుంది. లేనితప్పులుకూడా నాలో వెతికి చూపించి నన్ను గేలిచేస్తుంది. "హాస్యానికేమన్నా తప్పు పట్టకూడదు సుమండీ!" అని మళ్లీ బుజ్జగిస్తూవుంటుంది. దానిపెంకెతనానికి హద్దు లేదు. ఇంటి యజమానినని కాని, తనకు భర్తనని కాని పిసరంత లక్ష్యం లేదు. భయం, భక్తి ఉన్నప్పటికీ, పెంకెతనం, చనువు జాస్తీ అయినాయి. తనకంటె నేను అనేకరెట్లు తెలివైనవాడినని, ప్రవీణుడనని, బలవంతుడనని లక్ష్మికి నమ్మకం తగ్గిపోతూవుం దనుకుంటాను. లేకుంటే,.................

చదువుకుంటున్న రోజుల్లో నాకు పెళ్లి, సంసారం అంటే యెట్లాంటి అభిప్రాయాలు ఉండేవని? నాతో సరిసమానమైన యీడూ, చదువుగల అందకత్తెను సంపాదించి, పెళ్లి అనే నిబంధన లేకుండా, ఆమెతో కలసి కాపురం చేస్తూ, స్వర్గానందం అనుభవించగల ననుకునే వాణ్ణి కొన్నాళ్లు. పురుషజన్మ యెత్తినందుకు సార్థకంగా విధవావివాహం చేసికొని, సంఘసంస్కర్తనని కీర్తి సంపాదించాలనుకునే వాడిని కొన్నాళ్లు. బ్రహ్మసమాజంలో కలసి యేకులంపిల్లనయినా సరే, మనసారవలచి పెండ్లిచేసుకుంటానూ, అనుకునేవాడిని కొన్నాళ్లు. డబ్బులేదు కాని, లేకుంటే లండన్ వెళ్లి, దొరసాన్ని వివాహమాడివస్తేకదా జన్మసాఫల్యం అనుకునే వాడిని కొన్నాళ్లు. నా ఉద్దేశాలు, అభిప్రాయాలు, కోర్కెలు అన్నీ క్రమంగా లోలోపనే జీర్ణించుకున్నాను. అబ్బో గొంతెమ్మకోర్కెలు ఎన్నెన్ని ఉండేవని? 'నా కాబోయే భార్య రూపంలో రంభవలె మహా అందమైనదై ఉండాలి. చదువుసంధ్యలలోను, సంగీతంలోను సరస్వతిని మెప్పించాలి. మంచి దేహారోగ్యం, పెద్ద నల్లని జుట్టు, చెంపకి చారడేసి కళ్లు, ఆణిముత్యాలవంటి చక్కని పల్వరుస, వినయప్రవర్తన, పతిభక్తి—అన్నీ ఉండాలి' అనుకునేవాడిని. కాబట్టి మావాళ్లు వెతికి వెతికి, కుదుర్చుకొని వచ్చిన సంబంధాలేవీ నాకు నచ్చకపోవడం సహజమే! వాళ్లు చూసేదల్లా యీడు, రూపం సంప్రదాయం, కట్నం. 'పిల్ల అందంగా లేదని నేను మూతివిరిస్తే 'నీ అందానికి చాలక పోయిందా?' అనబోయి, 'సంసార్లకు అందంతో యేం పని?' అని సమాధానం చెప్పేవాళ్లు. 'భూమికి జానెడు లేదుకదా, యీ అమ్మాయినా పెళ్లిచేసుకోమంటారు?' అని అడిగితే, 'నీ చదువుసంధ్య అన్నీ పూర్తి అయేసరికి యెదగక పోతుందా?' అనేవాళ్లు. ఎలాగైతే నేమి, నా బి. యే. చదువు పూర్తి అయేదాకా, వచ్చిన సంబంధమల్లా తప్పించుకున్నాను.

పెళ్లిచూపులకు లక్ష్మిని చూడడానికి వెళ్లినప్పుడు దానికి 12 యేండ్లు. మనిషి కొంచెం యేపుగా

బలంగా ఉండేది. అంచాత, వాళ్ల అమ్మ మరో రెండేళ్లు మీద వేసింది. "మొన్నటి శ్రావణానికి మాపిల్లకు పదమూడేళ్లు వెళ్లి పధ్నాలుగోయేడు వచ్చింది. ఇక ఆపడానికి వీల్లేదు. ఈవైశాఖంలో పెళ్లి చెయ్యక తీరదు." తెల్లగా, దుబ్బగా, అందంగా ఉన్నపిల్ల, ముస్తాబుమీద మరీ చక్కగా కనిపించిందా నాకళ్లకు.

"మీఅమ్మాయికి యింగ్లీషు వొచ్చునా?"

"రాదు."

"లేసుకుట్టు చేత నవునా?"

"నేర్చుకో లేదు."

"టెన్నిస్ ఆడగలదా? సైకిల్ యెక్కుతుందా?" అని కూడా అడగాలని మొదట అనుకున్నాను. కాని, మరి సాహసించలేకపోయినాను. పల్లెటూరుపిల్ల గనుక, నాగరికత తక్కువ అని యేదోసమాధానం చేసుకున్నాను. కాని, తర్ఫీదు చేసి, క్రమంగా లక్ష్మిని దొరసానివలె చెయ్యాలని నిశ్చయించుకున్నాను. రెండుమూడేళ్లలో నా బి. యే. క్లాసు ఇంగ్లీషంతా దానికి చెప్పేలేనా అనుకున్నాను.

కాపురానికి వచ్చిన ఒక్క యేడాదిపాటు, మహా దీక్షగా చదువు చెప్పేవాడిని, లక్ష్మికి; మొదట యెంతో అణకువతోను, ఆసక్తితోను, ప్రారంభించింది. మంచి చురుకైన తెలివితేటలున్నాయి. కాని, చదువు చెప్పాలని నాకు, నేర్చుకుందామని దానికి, మనసులో యెంత అభిలాష ఉంటే యేం లాభం? పడుచుదాంపత్యం. కొత్తప్రేమ!—చదువు సాగే దెట్లా? కాని, పాపం, నాయిష్టానికి యెన్నడూ వ్యతిరేకంగా నడుచుకుందుకు యత్నించేది కాదు. నవీన నాగరికతకు తర్ఫీదుచేసి, ఆ మెరూపానికీ, ప్రవర్తనకీ, శోభ కూర్చాలని నాసంకల్పం! సబ్బులు, వాసన నూనెలు, ఫేస్‌పౌడర్లు, జాలుదారంకట్టలు, అల్లిక పుల్లలు, కొప్పుపిన్నులు, దువ్వెనలు, సన్నబట్టలు— వీటికి బాగా అలవాటుచేశాను. పసుపు, గోమయం, అలుకుసుడ్డ, చీపురుకట్ట మొదలైనవి తాకనిచ్చేవాడిని కాను. ఇంగ్లీషుముక్కలు నాలుగు నేర్చుకుంది. చద్ది అన్నం తినడం మానేసి, కాఫీ ప్రారంభించింది. మధ్య పాపిట మాని వంకపాపిట తీసేది. సన్నని మస్లిన్‌చీరలు కట్టేది. జాకెట్లకు లేసు తనే కుట్టుకునేది. ఇంట్లో నడిచినప్పుడు సహితం, మొహమల్ జోడు విడిచేది కాదు. పసుపు, కాటుక మానేసింది. బొట్టుమాత్రం మానిపించలేకపోయినాను. రోజుకు మూడుసార్లు దంతధావనం చేసేది. ఉదయం, సాయంత్రం సబ్బుతో వొళ్లు తోముకునేది. గొంతెత్తి, వైదీకంగా అరవకుండా, నెమ్మదిగా ముక్తసరిగా మాటాడేది. మాటికీ చీటికీ, నాతో ప్రణయకలహం కల్పి, కోపం నటించి, నన్ను పిచ్చివాడిని చేసి, బతిమాలించుకునేది. ఇరుగు పొరుగుస్త్రీల అనాగరికతకు, రోత, ఆశ్చర్యం, జాలి పొందేది. ఇట్లా రోజుకు రోజుకు లక్ష్మిలో నాజూకు అధికం కాజొచ్చినకొద్దీ, నా సంతోషానికి మేర లేకుండా ఉండెను. అంతా నాప్రతాపమే కదా, అని గర్వించేవాడిని. తిక్కమనిషి; వీధిలోకి నాతో షికారురమ్మని యెంత ప్రోత్సహించినా వొచ్చేది కాదు. కాని మొగవాళ్లని చూస్తే, మోటారు చూసిన పల్లెటూరుగొడ్డువలె బెదరడం మాత్రం, ఆమె యెన్నడూ యెరగదు.

మా పెద్దవాడు పుట్టినతరువాత, ఉన్న ఊరు నుండి నాకు బదిలీ కావడం, ఇంట్లో దక్కత కెవరూ లేకపోవడం, డబ్బుకు కొంచెం యిబ్బంది కలగడం— అన్నీ ఒక్కసారే తటస్థించాయి. ఇల్లు చక్కబెట్టుకోవడం, పిల్లడిసంరక్షణ చూడడం, నాకు వేళకు వండి పెట్టడం—వీటితో కాలం సరిపోయేది లక్ష్మికి. పన్నాలు, పిన్నులు, జాలుదారాలు, ఇంగ్లీషుచదువు అన్నీ మూల పడినవి. క్రమంగా ఆ మెరూపంలోను, దేహారోగ్యంలోను కొన్ని మార్పులు కనిపించినవి. పని పాట్లతో అలసి, శరీరం మోటుతేరింది. తనఅందం, సౌఖ్యం, కాపాడుకుందుకు దానికి శ్రద్ధ తగ్గిపోయింది. మొహంలో కొంటెనవ్వు, పెంకితనం, యౌవనగర్వం, పోయి ఒకవిధమైన 'సీరియస్ నెస్' వచ్చింది. నామీద పూర్వంవలె యిప్పుడు ప్రేమ చూపడానికి అట్టే ప్రయత్నించేది కాదు. ఇప్పుడామెకు లోకమంతా ఆబిడ్డ;

తన సౌందర్యం, యౌవనం, నిద్ర, బలం, శుభ్రత, నాగరికత, ధర్మ—అన్నీ ఆపనికందుకే అర్పించింది. నేను చెప్పరాని యీర్ష్యతో బాధపడేవాడిని.

పిల్లడికి తల్లిపాలు సమృద్ధిగా ఉండేవి. చనుబాలకంటె హార్లిక్సు మంచివని బోధిస్తే కస్సుమనేది. పాలతల్లిని కుదురుస్తా నంటే వొప్పేది కాదు. లక్ష్మికీ నాకూ యీవిషయమై తరుచుగా యింట్లో యుద్ధం జరుగుతూ వుండేది.

"లక్ష్మీ, నీఆరోగ్యం కాపాడుకోవూ?"

"తెలిసీతెలియని పిచ్చిసిద్ధాంతాలు చెప్పక, నోరు కుందురూ! ఇదేనా యేమిటి, బి.యే.లో చదువుకున్న సయన్సు? బిడ్డకు పాలివ్వకపోతే, ఆతల్లి ఉండి యెవరికి ఉపచరిస్తుంది?"

"దొరసాన్లు చూడూ మరి దాదులు, పాలసీసాలు—"

"వాళ్ల ఖర్మం అది."

నవీననాగరికతాపద్ధతులకు అలవాటుచేయడానికి నే పడిన శ్రమ యావత్తూ బూడిదలో పోసిన పన్నీరైంది. సంసారబాధ్యతలు జాస్తీ అవుతున్న కొలదీ, ఆమెవద్ద శిష్యరికం వహించి, నేనే అనేకసంగతులు నేర్చుకోవలసి వచ్చింది. కడుపున పుట్టిన పిల్లడు బట్టలు మురికిచేస్తే, అసహ్యపడకూడదు—ఇంటిపనులు చేసుకుందుకు కేవలం నౌకర్లమీద ఆధారపడడం పొరపాటు—లేనిపోని షోకులకు డబ్బు తగలపెట్టడం తప్పు—సమయం వస్తే, విసుక్కోకుండా వంట చేయవలసిందే కాని, హోటేలుభోజనం పనికి రాదు—ఇట్లాటి ధర్మసూక్ష్మాలు యెన్నో నేర్పబోయేది నాకు.

రెండోపురిటికి ఆడపిల్ల. ఆతరవాత, యీచేతివాడు. ఈముగ్గురుపిల్లలూ నా లక్ష్మీరాజ్యాన్ని పూర్తిగా తమస్వాధీనం చేసుకున్నారు. పిల్లలంటే నాకు పూర్వం ఉండే బులుపిప్పుడు తీరిపోయింది. పెళ్లాం అంటే కొత్తరికంలో నాకుండే ఇంగ్లీషభిప్రాయాలు మారిపోయినాయి. రోమాన్సు చచ్చింది. నాచదువుసంధ్యల ఫలితం— నా ఉద్యోగం యొక్క గౌరవం— ఇప్పుడింట్లో నా పెద్దరికం— అన్నీ ఒక్కమోస్తరుగానే వెలుసుకున్నాయి! చెప్పకుంటే సిగ్గుచేటు. అన్నివిధాలా దేవుడు నన్ను లొంగదీసి, కాళ్లకూ చేతులకూ సంకెళ్లువేసి, కసి తీర్చుకుంటున్నాడు. స్వేచ్ఛగా విహరించే పక్షి, పంజరంలో పడి తప్పించుకునే సాధనం కానక, ముక్కు నేలకు రాసుకుంటూ, రెక్కలు టపటప కొట్టుకుంటూ వున్నట్లుంది నాఅవస్థ!

పదేళ్ల క్రిందట పెళ్లిపీటలమీద చూసిన లక్ష్మికీ, యిప్పటి పెంకెలక్ష్మికీ యేమైనా సామ్యం వున్నదా? అప్పుడేమీ యెరగని అమాయికురాలు పల్లెటూరుపిల్ల; చదువు లోకజ్ఞానం లేని అనాగరికురాలు. నా యిష్టానికిలోబడి నాచేతికీలుబొమ్మ, నా ఆజ్ఞచొప్పున నడుచుకొనే ముద్దరాలు. నామాటంటే వేదవాక్యంగా భావించే విధేయవతి; నా బుద్ధిబలం అంటే యెంతో విశ్వాసంగల ప్రియశిష్యురాలు. నన్ను సంతోషపరచడమే తనకు ముఖ్యధర్మమని గట్టినమ్మకంగల సాధుశీల! ఇప్పుడో!.........

"లక్ష్మీ......లక్ష్మీ!"

అదిగో, పిలిస్తే వినిపించుకోదు ... ... పిల్లల అల్లరి యింకా అణగినట్లు లేదు. వాళ్లు తిని పడుకుంటే నేకాని, యింట్లో గాలివాన వెలియదు. ఈవాళయేమో కాని ఆకలి ఉపద్రవంగా వేస్తూవుంది. ఈ వెన్నెల, యీ పువ్వులగాలి, యీచల్లదనం— అన్నీ వొంటిని తాకి, హాయి కూర్చడానికి బదులు మెదడుకు కాక పుట్టిస్తున్నాయి.

లక్ష్మి నన్ను బొత్తిగా నిర్లక్ష్యం చేస్తూవుంది. నాసదుపాయాలు యేమీ చూడదు. ఇటు పిలిస్తే, అటు పలుకుతుంది. ఒకటి చెప్తే మరొకటి చేస్తుంది— 'వండవే పోలీ' అంటే 'వండపట్టుకొని నీళ్లకు పోతాను' అన్నట్లు. మీదుమిక్కిలి యేమైనా అంటే, సణుగుకుంటుంది 'ఈమొగాళ్ల నైజమే యింతకాబోలు!' అని. కచేరీవేళకు రెండుమెతుకులు వండిపెట్టడానికి యజ్ఞం

చేస్తుంది. చిరిగిపోయిన పాతచొక్కాలు, పంచలు కాస్త కుట్టిపెట్టవే అంటే, "మీకు లోభత్వం అంత కంతకూ మరీ అధికమౌతూవుంది. చింకిబట్టలు పెట్లో పెట్టి దాచుకోకపోతే పిల్లడిపక్క కిందికి యిచ్చెయ్యరాదూ?" అని యెదురుతిరుగుతుంది. 'కాలరుగుండీ కనిపించదేమి? ...తాళా లేవీ'అని అడిగితే, "పిల్లలు ఆడుకుందుకని తీసి, యెక్కడ పారేశారో!"అని నవ్వుతూ చెప్తుంది. 'ఫౌంటెన్ పెన్‌లో సిరా అయిపోయింది. కొద్దిగా పోసి పెడుదూ'అంటే, "చేతులో పని వుంది. ఈవాళమట్టుకు నన్ను క్షమించి, మీరే పోసుకోవాలి."అని చల్లగా చెప్పేస్తుంది. 'ఆపిల్లడు యెందుకట్లా యేడుస్తాడు? వీడో సమాధానం చేసి, ఊరుకోపెడుదూ' అంటే, 'మా దురికోజాలనుండీ బిస్కట్ డబ్బా ఒకటి తెచ్చిపెట్టమని బ్రతిమాలుతూవుంటే, వినిపించుకోరు గాని,—?ఈవాళ ఆదివారం, సెలవుదినం కదా, కచేరిహడావిడి లేదుకదా, నాకు పనివేళప్పుడైనా పిల్లల్ని కాస్త పిల్చి, ఆడిపించకూడదూ? తప్పా?" అంటుంది. ఎప్పుడూ యింట్లో యిదే నాటకం. ఆఫీసులో నడుం పడిపోయేటట్లు పని చేసి, అధికార్ల చేత మాటలు పడుతూ, ఆరోగ్యం ఆత్మగౌరవం చంపుకుని, యీడుర్చుకుని కాళ్లీడుచుకుంటూ యిల్లు చేరేసిమ్మకైనా, మనసుకు విశ్రాంతి లేదుకదా?

* * * *

పదిగంటలు అయింది కాబోలు. గాలి చల్లగా, ఒళ్లే హాయిగా, వీస్తూవుంది. గోలా రాత్రిళ్లు దోమలు చంపేవి—నిద్ర పట్టనివ్వక. వెన్నెలకూడా యెందు చాతనో, యీవేళ రమ్యంగా వుంది.

పిల్లలు సుఖంగా మైమరచి నిద్రపోతున్నారు. ఇంకా వంటింట్లో యెంగి లెత్తుకుంటూనో పొయ్యి ఏడ పెడుతూనో, అవస్థపడుతూవుంది కాబోలు లక్ష్మి! నిద్రపోదామంటే కళ్లు మూతలు పడకుండా ఉన్నాయి. ఈవాళ, పాపం, నిష్కారణంగా కోప్పడ్డాను దాన్ని. ఇందాకా, అదీ నేను, భోంచేస్తూవున్నప్పుడు మళ్లీ పశ్చాత్తాపం తెచ్చుకొని బుజ్జగించాను; కాని మనసులో యేమనుకుంటూవుందో? నొచ్చుకొని వుంటుంది. నిజమే! భృత్యుంలాగ, నెత్తిమీద పెట్టుకోవలసిన మనిషిని, చాకరీలో పెట్టి నలిపేస్తున్నాను...............

......"ఇంకా మేలుకొనే ఉన్నారూ? ఈసరికప్పుడే గుర్రు తీస్తూ నిద్రపోతూవుండడం మామూలే?"

పను లన్నీ తీర్చుకొని, పట్టుచీర విప్పి, చాకింటి చీరకట్టుకొని, రవికతొడుక్కొని, కాళ్లు చేతులు,ముఖం సబ్బుతో కడుక్కొని, గదిలోకి వచ్చింది లక్ష్మి. టేబిలు మీది దీపం కొంచెం పెద్దది చేసి తమలపాకులు చీల్చుతూవుంది.

"తాంబూలం వేసుకున్నారా? లేక, మీకోసం కూడా నాలుగాకులకి సున్నం రాయమన్నారా?"

పరుపుమీద అటునుండి యిటు వొత్తిగిల్లి, "'అధికస్య అధికం ఫలం'—అన్నారు పెద్దలు. మళ్లీ వేసుకుంటాను నీచేత్తో యిస్తే."అని నవ్వుతూ అన్నాను.

మొహం యెత్తి నావేపు చూసింది, చిరునవ్వుతో. గాలి కా మెచెంపమీది జుట్టు యెగురుతూవుంది.

"ఆ చీల్చినఆకులు చాలునులే......ఇట్లారా!" అని, దగ్గిరకి పిల్చి, ముంగురులు సవరిస్తూ, "తల దువ్వుకోలేదేం, యీవాళ?" అని ప్రేమతో అడిగాను.

"ఏమీ లేదు."

"నీమూర్ఖత, వైరాగ్యపు ముసిలిచేష్టలు, నాకేమీ అర్థం కాకుండా ఉన్నాయి."

"మీ కేవీ అర్థం కావు. మీలోకమే మీది!" అంటూ, ముసిముసినవ్వుతో, "కొంచెం జరగండి......ఆకులు చాలునా?"

"ఇట్లాటి చక్కని రాత్రివేళ, నువ్వే సంగీతం వొచ్చినదానివై యుంటే,—"

"నిజమే!......కాని, దేవు డివ్వనిదానిగూర్చి, లేకపోయిందే, అని కించపడడ మెందుకు? నాకు మరిరెండు చేతులు, మరిరెండు కాళ్లు దేవు డిచ్చివుంటే, యెంతో బాగుండును కదా, అనుకుంటూ వుంటాను."

"ఏం పెంకవు!" అని పక్కన నవ్వి, గట్టిగా వక్షానికి అదుముకున్నాను.

"మీకు కోపం రాదంటే, ఒకటి చెప్పాలని వుంది. వింటారా, శాంతంగా?"

"అంతకంటేనా? చెప్పు."

కొంతసేపేదో ఆలోచిస్తూ ఊరుకుంది.

"చెప్పు మరి." అని ప్రోత్సహించాను.

"అయినదానికీ, కానిదానికీ, యెందుకు నామీద కోపంవొస్తావుంటుంది మీకు? మళ్లీ చదువుకున్నవారు సర్వం తెలిసినవారు, నాకంటె పెద్దవారు కదా,—? భార్య అనగానే, లోకంలో ఉండే సర్వవిధములైన సులక్షణాలు, నేర్పరితనం, పనిపాట్లయందు ప్రవీణత, ఆమెలో అంతర్వ్యాప్తమై ఉంటా యనుకుంటారు కాబోలు మీమొగాళ్లు! కదూ?.........హితవుగా, కావలసిన పదార్థాలన్నీ చేసి, వేళకు వండిపెట్టాలి. క్లుప్తంగా, పొక్తుగా, ఖర్చువెచ్చాలు చూసుకొని, సంసారం గడపాలి. సదుపాయంగా, లెక్కకు మించకుండా, కన్ను ముక్కు తీరైన పిల్ల, పాప, కనాలి. వాళ్లని శ్రద్ధగా పెంచి, సుద్దులు బుద్ధులు నేర్పి సంరక్షణ చెయ్యాలి. చుట్టం పక్కం వస్తే, యింట్లో యేదీ వుందనక, లే దనక, గృహస్థుమర్యాదలకు లోటు రాకుండా జరపాలి. నౌకర్లున్నా, లేకపోయినా, యింట్లో అరవచాకిరీ చెయ్యాలి. మొగుడి సదుపాయాలకి వేటికీ లోటు రాకుండా చూడాలి. ఇంట్లో యెవరికైనా రోగాలు రొష్టులు వస్తే, నిద్రాహారాలు మానుకొనైనా ఉపచారాలు చెయ్యాలి. చింకిబట్టలు కుట్టాలి. మురికిబట్టలు ఉతకాలి. ఇల్లు, వొళ్లు, శుభ్రంగా అందంగా ఉంచుకోవాలి. ఎన్నడూ జబ్బు గిబ్బు లేకుండా, ఆరోగ్యంగా బలంగా ఉండాలి. ఫిడేలో, వీణో వాయించగలిగి హాయిహాయి అనిపించేటట్లు పాడగలిగి ఉండాలి. వార్తాపత్రికలు, అవీ చదివి భర్తతో పొలిటిక్సు చర్చించగల సామర్థ్యం పొంది ఉండాలి— మొత్తంమీద ఆయన అభిప్రాయాలతో యేకీభవిస్తూ చదరంగం, పేక మొదలైన ఆటలు తెలివిగా ఆడుతూ, భర్తచేత ఓడిపించుకునే జ్ఞానం కలిగి ఉండాలి. నగలకు, బట్టలకు డబ్బుకోసం యెన్నడూ బాధించకుండా పుట్టింటివాళ్లనే పీడించుకొ తినాలి. అప్సరస్త్రీల అందం, అరుంధతి పాతివ్రత్యం, లక్ష్మీదేవిసౌభాగ్యం అన్నీ ఆమె యందు ప్రతిబింబితమై ఉండేటట్లు చేసుకోవాలి...... ఇన్ని చాకచక్యాలు, గుణాలు ఒక్కరిలో యెట్లా యిముడడానికి సాధ్యమనుకుంటారో? మళ్లీ ఆడదాన్ని 'అబల' అని, 'సుకుమారి' అని, 'కోమలి' అని వెక్కిరించే వెధవపేర్లు పెట్టి పిలుస్తారు మీమొగవాళ్లు. శక్తికి మించినభారం దానినెత్తిని మోపి తిన్నగా భరించలేకపోతే శిక్షిస్తా మంటారు, యెత్తిపొడుస్తారు, యెగతాళి చేస్తారు — అధికారం ఉంది కనుక! అయితే అజ్ఞానంచేత పురుషుడు యిట్లా ఆచరిస్తున్నాడేమో అనుకుందుకుకూడా వీలులేదు. బుద్ధిపూర్వకంగానే చేస్తాడు. కోడిపుష్టము పొడిచి, ఉప్పు పక్షిని పైకి తీస్తా నంటాడు విపరీతం మనిషి.

"సరే 'నాకు చాత కాదు' అని ఆడది కాళ్లు చాపేయకూడదా? మహాశక్తి సామర్థ్యాలు ఉన్నదానివలె అన్నిటికీ యెందుకు సిద్ధపడాలి? అని అడుగుతారేమో! ఆడదానికి అభిమానం, పౌరుషం యెక్కువ. చెయ్యలేనిపనినైనా చెయ్యనని చెప్పదు. అహంభావం అనుకోకండి. దాని ధర్మం అది. ఈతరాని మనిషిని నీట్లో తోసి, 'ఈత నేర్చుకో—లేకుంటే చస్తావు' అని చెప్తారు మొగాళ్లు. అంతేకాని, మునిగినా తేలినా, చెయ్యి అందించి కాస్తయినా సహాయం చెయ్యరు.

"సృష్టికర్త స్త్రీని నిర్మించడంలో యెట్టి అభిప్రాయంతో చేశాడు? ఆమె యేయే పనులకు తగి ఉన్నది? ఆమెలో యెట్టి లక్షణాలు ఉండుట సహజము? అని ఆలోచించే బుద్ధిమంతుడు ఒక్కడు లేడు. మొగవాడు తను పెళ్లాడేటప్పుడు ఇంటిపని, వంటపని, చాకిపని, పాకిపని, కుట్టుపని, మట్టిపని, బిడ్డలపని, గొడ్లపని—అన్నిపనులకీ తనభార్య తగివుండి తీరా లనుకుంటాడు. న్యాయంపట్టి ఆలోచిస్తే, యిట్టిపనులకు వేటికీ ఆడది పనికేరాదు. దేవుడామె శరీరాన్ని యిట్టి పరి

శ్రమలకోసం తయారు చేయలేదు. కాపురానికి వెళ్లే పూర్వం యిట్టిపనులలో ఆమెకు తరిఫీదుకూడా ఉండదు. ఈపనులే నిజంగా మొగవాడు చేయడానికి శ్రద్ధ వహిస్తే యెంతో బాగా చేసుకోగలడు. ఒప్పుకుంటారా?"

"సరే. కొన్నికొన్ని పనిపాట్లు, యింట్లో ఆడదాన్ని రోకాయించి చేయించడం తప్పేనని వొప్పుకుంటాను. కాని వంట, కుట్టుపని — ఇట్టి పనులమాట యేం చెప్తావు? పెళ్లాం పిల్లలకి మొగుడే వండి పెట్టడం సబబని వాదిస్తావా?" అని అడిగాను.

"ముమ్మాటికీని" అని తొణుకు బెణుకు లేకుండా జవాబిచ్చింది.

"చాల్లే! నెలకి మూడురోజులు అవస్థ పడడమే నాకు యజ్ఞం చేసినంత కష్టం అనిపిస్తూ వుంది. ఇక, నిత్యం రెండుపూటలా నన్నే మడికట్టుకోమంటావు కాబోలు? నీపుణ్యం ఉంటుంది సుమీ —" అని నవ్వుతూ బ్రతిమాలడం అభినయించాను.

"లోకం అంటే మన యిద్దరమేనా యేమిటి? న్యాయం యీవిధంగా ఉన్నది కదా అని మనవి చేస్తున్నాను. అంతే కాని, మీ రిప్పుడే బెంగ పెట్టుకో నక్కరలేదు."

"అంతేకద?"

"కాని నిజం ఆలోచించండి. వంటలో మొగవాడిని మెప్పించగల ఘనురాల్ని యెన్నడైనా కని, విని యెరుగుదురా? పురాణాల్లోకూడా గొప్పవంటకత్తె అని, యెవర్నీ మనకవులు వర్ణించినట్లు లేదు. నలపాకం, భీమపాకం అనే చెప్తారు కాని, ద్రౌపదిపాకం అని వినలేదు. పెళ్లివిందులకూ, సంతర్పణలకూ మొగవాళ్లే వంటకు కుదర్చడం ఆచారం. హోటేళ్లలోను, సత్రములలోను వంటవాళ్లు మొగవాళ్లే ఉంటారు. శాస్త్రరీత్యా, అనుభవరీత్యా, న్యాయరీత్యా, పురుషపాకమే ప్రసిద్ధమైనప్పటికీ, ఇంట్లోమాత్రం ఆడదే వంట చెయ్యాలంటారు. సాధారణంగా స్త్రీలవి పురుషులను మెప్పించతగ్గ అమృతహస్తాలు కావు—వంటలో. చాతనైనట్లు యేదోమోస్తరుగా చేస్తే సంతోషిస్తారా? మీదుమిక్కిలి చీవాట్లు, ఆక్షేపణలు, పరిహాసాలు, రుసరుసలు!......

"కుట్టుపనిలోసహా మగవాడి కుండే నేర్పరితనం ఆడదానికి లేదు. మీదుస్తులు కుట్టే దర్జీవాళ్లు మొగవాళ్లేకద? ఆడదర్జీలకోసం పాకులాడరేం? ఇంట్లో మాత్రం పిల్లలబట్టలూ, పరికిణీలు, చొక్కాలు, లాగులు, చేతిరుమాళ్లు, రవికలు, పాతగుడ్డలకు అతుకులు, చింకిబట్టలకి మాసికలు, అన్నీ పెళ్లామే కుట్టుకోవాలి?"

"పోనీ, ఇక మీదట, సూది దారం నామీద పడెయ్యి. సహాయం చేస్తాను" అన్నాను పెంకితనానికి.

"నమ్మకోవలసినదే!" అని తల ఊపుతూ "మొన్న కుట్టుకున్నారుగా, పంట్లాంగుండీలు? సన్నంగా వుందని, ఒకసూది విరిచేశారు. 'దబ్బనంలాటి సూది నానెత్తిని కొట్టినావు' అని నన్ను తిట్టి, రెండో సూది వేలుకు గుచ్చుకున్నారు."

"అంటే, కుట్టుపని నాకు చాతకాలేదన్నమాట విశదమేగా?"

"చాతగాక కాదు; అభ్యాసం లేక. చేసేవాళ్లుండగా, మనం యెందుకు చేసుకోవాలి, అని. కొన్నికొన్ని పనులలో చాతకానట్లు నటించడమే మొగవాడుగొప్పనుకుంటాడు. డిన్నిటికీ లోటురాకూడదుగా, మరి? అన్నివిధాలా, పురుషుడు మహారాజు సృష్టికర్తకు ముద్దుకొడుకు! ఆడదాన్ని అధోగతికి తెచ్చి, దాన్ని ఓడించి పిప్పిచేసి, యిష్టంవొచ్చినట్లు తనసౌఖ్యంకోసం ఉపయోగించుకొని, బానిసను చేసి, దానిమీద సవారీ చెలాయించగలుగుతున్నాడు. ఆడదానిసహనశక్తికి హద్దు లేకుండా ఉంది. ఎన్నిటికైనా ఓర్చుకుంటూ వంటుంది. ఓర్చుకున్నకొద్దీ, ఆమెమీద అత్యాచారాలు చేస్తూనేఉంటాడు మొగవాడని తెలుసుకోరు. అయితే, నాసంగతి, మీసంగతి దృష్టాంతంగా తీసుకొని చెప్తున్నాననుకోకండి. లోకంతీరుకు వగస్తున్నాను. అంతే కాని—"

ఆమె యిచ్చే ఉపన్యాసం వింటూ, మొహం చూస్తూవుంటే, ఈమె నాలక్ష్మేనా? అనిపిస్తూవుంది. చెయ్యిమీద తల ఆనుకుని, నాగుండెమీదికి కొంచెం వొరిగి, నామొహంలోకి జిగజిగలాడే ఆమెరుపుకళ్లతో చూస్తూ, ఉద్రేకంతో మాట్లాడుతూ వుంది. ఎదురు చెప్పడానికి యేమీ పాలుపోకుండా ఉంది, నాకు. సూటిగా దానిమొహంవేపు చూడడానికే సిగ్గుగా ఉంది. ఉదయంనుండి, యెందుకో లక్ష్మిమీద నాకు కోపంగానే ఉండెను. కాని, నిజంగా ఆలోచిస్తే, తగిన కారణం యేదీ కనిపించకుండా వున్నది.

---

## ఘ నో పా లం భ ము

టి. రంగాచార్యులు గారు

ఒకచోటం బెనుగొండలంబలె సముద్రోదగ్రరూపంబుతో
నొకచో నేనుఁగుపిండుచందమున సద్యోద్భిన్నరూపంబుతో
నొకచోట న్వివిధాకృతు ల్గలుగగా వ్యోమస్థితంబౌ వలా
హకసందోహమ! యైంద్రజాలికపటు వ్యాపారము ల్నేర్చితో!

అఱచేతిమాత్ర మీవాదిని గాన్పించి యంతలో నింగిని నావరింతు
వావరించినయంత నత్యంత వృష్టిచే బుడమి నల్లెడ నీట ముంచివైతు
వొకవేళ బెల్లుగ నుఱుముచు మిన్నుమ న్నొకటిగఁజేసెదు నోజగాఁగ
దండతండములుగ దనరారుచుండియు నంతలోనె యదృశ్య మగుచునుందు
వొకమాఱు మానంబు నూని సువృష్టిచే బ్రాణిసంతతికిని రహిని గూర్తు
విట్టులిచ్ఛావిహారంబు వేడ్కయొనగ - నెఱపుచుండెదు నిను జూడ నెమ్మనమున
మొఱుగుకుక్క యొకప్పుడు గఱవదటులె - కఱచుకుక్క యొకప్పుడు మొఱుగదనెడు
నుడి నిజంబంచు దోచు ఘనోత్కరంబ!

కురిసితి వంగదేశమున గుండలబోసినయట్లు వర్షముల్
పురములు సస్యము ల్నరులు మున్గిరి నీట నటంచు వింటి మీ
వరయుగ బశ్చిమాంధ్రముల వర్షపుజుక్క నొసంగకుండగా
నరతతి జీవరాశి కఠినస్థితి నున్న దిదేమి న్యాయమో!

ఘనుడ వనునామమున నీవు తనరుచుంట - నిట్టి వైషమ్యబుద్ధి నీకెట్టు లబ్బె
నంచు నెంచితిగాని ఘనాఘనాఖ్యయుం గలదుగాదె నీ కంచు నూఱడిలితి.

---

శ్రీమతి జ. రామాబాయమ్మగారు

శ్యామలరావు రాజమండ్రీలో బి.ఎ.కు చదువుచున్నాడు. వారిది కుగ్రామము. తలిదండ్రుల కొకడే కుమారుడు. శ్యామలరావుభార్య పూర్వాచారపరాయణురాలు; పరమపతివ్రతాశిరోమణి, సుగుణరాశి. భారతభాగవతరామాయణాదిసద్గ్రంథములు చదివి, అర్థము చెప్పును. చెప్పుటయేగాక అందందు నీతులను గ్రహించి, ఆప్రకారము చేయుట కుద్యమించును, నిత్యము గౌరీపూజ చేయును. అంతియేగాని, ఆంగ్లభాష ఆమె ఎరుగదు. ఈకాలపు నవీననాగరికలక్షణములు మచ్చునకైన ఆమెకడ కనుపడవు. తల్లిదండ్రుల కేకపుత్రిక. ఆమెపేరు సరస్వతి. రజస్వలై రెండేండ్లు అయినను కార్యం కాలేదు.

ఒకనాడు సాయంసమయమున మలయమారుతము వీచుచుండగా గోదావరీతీరమున ఒకయువకుడు ఒకయువతితో ముచ్చటించుచుండెను. ఆమె ఎవరో? ఆమెయందు ఆధునికనాగరికలక్షణము లన్ని తాండవమాడుచుండెను. ఆయువకుడే మన కథానాయకుడగు శ్యామలరావు. ఆమె వయ్యారముగ నిలబడి వికసితవదనముతో చూచుచుండెను. ఆమె ఒక్కింత మాట్లాడిన తన జన్మ ధన్యమగునని శ్యామలరావు యోచించుచుండెను. అతని బసకు ప్రక్కనే ఆయువతి యిల్లు. తండ్రి వకీలు. బ్రహ్మసమాజమత మనుట కాబోలు పద్దెనిమిది ఏండ్లు నిండినను ఇంకను వివాహము చేయలేదు. యఫ్. ఏ. చదువుచున్నది. పేరు కమల. తండ్రికి కమల గారాబుపట్టి. హార్మోనియము బాగా వాయించగలదు. శ్యామలరావు, కమల ఇద్దరు ఒక కాలేజీలోనే చదువుచుండిరి. శ్యామలరావుకు స్వతహా గర్వము మెండు. దానికితోడు బి. ఎ. చదువుచుండెను. ఇంక చెప్పనేల? తన భార్యకు నాగరికత తెలియదనియు, తనతో ఇంగ్లీషు ధారాళముగా మాట్లాడజాలదనియు మనస్సులో చింతిలుచుండెను. ఈమెను గాంచి నప్పటినుంచి, తనకు ఇట్టిభార్య లేకపోయెనే యన్న విచారము ప్రారంభ మయ్యెను. క్రమేణ ఈమెతో స్నేహము ఎక్కువయ్యెను. దానితో వివాహవాంఛ హెచ్చెను. సరస్వతి పూర్వాచారపరాయణురా లగుటయే ఆమె తప్పు. ధర్మపత్నిని విడనాడవచ్చునాయన్న సందేహమే శ్యామలరావుకు లేకుండెను. అగ్నిసాక్షిగ పెండ్లాడిన ధర్మపత్నిని ఉపేక్షించుట వినాశకరమని తెలియ దాయెను.

వివాహము నిశ్చయమాయెను. సరస్వతితల్లికి, కమలతల్లికి స్నేహ మగుటచే వివాహమునకు కమలతల్లి వచ్చి పసుపు-కుంకుమకు పిలచిపోయెను. వీరి అల్లుడే వరుడని కమలతల్లికి తెలియనే తెలియదు. వీరికిమాత్రము ఎటుల తెలియును? పేరంటకమునకు పోవుటకై సరస్వతియు, తల్లియు బట్టలు ధరించుచుండిరి. ఎక్కడనుంచో తండ్రి కామేశ్వరశాస్త్రిగారు గబగబ లోనికి వచ్చి, వకీలుగారి అల్లుడు తమ అల్లుడే యనియు, తమ పిల్ల కింక అధోగతియే అనియు, రాత్రే వివాహ మయిపోయె ననియు ఖిన్నుడై వచించెను. తల్లి గోలుగోలున దుఃఖించెను. పాపము సరస్వతిసంగతి వేరె చెప్పవలయునా? తన దురదృష్టమున కెంత వగచెనో? ఆపరమేశ్వరునకే ఎరుక. కాని విధిచెయిదముల కెవ్వ రేమి చేయగలరు? కొన్ని దినములకు కామేశ్వరశాస్త్రిగారు ‘వివాహము చేసుకొన్నను మాకుమార్తెను గూడ తీసుకొనివెళ్లుమనియు, ‘మీ ఇద్దరకు సేవకైనను పనికివచ్చునని యు ఎంతో వినయముతో చెప్పెను. కాని ప్రయోజనము లేకపోయెనుసరిగదా, సరస్వతి పేరు తనవద్ద తలపెట్టవద్దని శ్యామలరావు ఖండితముగా చెప్పెను.

శ్యామలరావుగారు పుస్తకము ముట్టుటయే లేదు. కమలయే ఆయనచదువు. అతడు ఆయమచేతి కీలుబొమ్మవలె ఉండెను. సరి, ఇంక చదువుకు స్వస్తియే. ఆ

యేడు పరీక్ష తప్పిపోయెనని వేరె తెల్పవలయునా ? కమల యఫ్. ఏ పాసై బి. యే. జూనియర్ చదువుచుండెను. భర్తను పరీక్ష పోయెనని తూలనాడుట ప్రారంభించెను. చివరకు ఇద్దరు స్నేహితు లుండగా చదువురాని మగవాడు పనికిరాడని కఠినోక్తులు చెప్పుటచే శ్యామలరావు అవమానమును భరింపజాలక ఆనాడే మద్రాసులో చదువుటకై పోయెను. శ్యామలరావు స్నేహితుడు దామోదరరావను వకీలు ఒకడు ఉండెను. అతను నిత్యమువచ్చి శ్యామలరావునుచూచిపోవుచుండెను. శ్యామలరావు మద్రాసు వెళ్లినాడన్న మాటయేగాని మనస్సంతయు కమలమ్మమీదనే. ఒడలిక్కడ, మనసక్కడ నున్న నతిశయోక్తి లేదు. ఆమెకు అతనిచింతయే లేదు. ఆమె జాబే వ్రాయుట లేదు. ఇదంతయు నవనాగరికయువతుల పద్ధతికాబోలు! ఈయన వ్రాద్దామన్నను అభిమానము వెనుకకు లాగుచుండెను. అకస్మాత్తుగా కమలమ్మ భర్తను రమ్మనియు, మిమ్ముల తూలనాడుట ఆలాగయినా చదువుకొందు రేమో యనియు, అట్లున్నందుల కెంతయో కుందుచుంటిననియు, మీరు జాబువ్రాయకపోవుట మనస్తాపమునకు కారణమయ్యెననియు జాబు వ్రాసెను. ఎటులైన ఈనాతప్పిదము క్షమించి ఒకసారి తప్పకరావలెననియు వ్రాసెను. ఇంకేముంది! ఈ ఆహ్వానమునకేకదా అతడు ఎదురుచూచుచుండెను. ఆరాత్రి మెయిల్లోనే రాజమండ్రి వచ్చెను. కమలకు కొంచెము వంట్లో బాగలేదు. అన్నము సరిగా తినుటలేదు. కాని కాలేజీకి లీవు లేకపోవుటచే మూడు దినము లుండి శ్యామలరావు మద్రాసు వెళ్లిపోయెను. కమల వడవడిసరిగ్గాలేదనియు ఆసంగతి నీభర్తకు తెలిపిన నిన్ను తీసుకొనివెళ్లునని కొందరుహితులు సరస్వతికి చెప్పిరి కాని ఆమె వడవడి ఎటులున్నను, వారికి తనంత తెలియవలయును గాని మనము చెప్పిన 'సవతిమత్సరా' మనిపించుకొనునని సరస్వతి చెప్పెను. కోమలస్వభావము గల సరస్వతియాబుద్ధి ఏనారీమణి కుండును ? కమల తన భర్తకు మీరు కొడుకుతండ్రి యయ్యెడు భాగ్యము కల్గునని జాబువ్రాసెను. జాబు చేతిలో నుండగానే స్నేహితుడు వచ్చి అతనిచేతిలోనిజాబు గాంచి మాడ వచ్చునా యని జాబు లాగుకొని చదివి 'ఇంకేమిరా! చెప్పవైతివి. పట్టభద్రుడ వగుటయు, కొడుకు తండ్రి వగుటయు ఒక్కసారేనా? అదృష్టవంతుడ' వని మేలమాడెను.

ఇట్లుండగా కొన్ని దినములకు శ్యామలరావుకు జ్వరమువచ్చి స్పృహ తెలియుటయే లేదు. కొందరు స్నేహితులు కమల తండ్రికి తంతి నిచ్చిరి. మాపిల్లవచ్చుటకు వీలులేదని తగినడాక్టరుని పెట్టమని స్నేహితులపేర కొంతసొమ్ము మనియార్డరుచేసెను. ఈసంగతి కర్ణాకర్ణిగా కామేశ్వరశాస్త్రిగారికి తెలిసి భార్యతో మన అమ్మాయికి ఏసుఖము లేకున్నను పసుపు, కుంకుమ అయినను పెట్టుకొను చున్నది. అదికూడ కరవగును కాబోలు! అల్లునకు మద్రాసులో జబ్బుగా నున్నదని విచారముతో తెల్పెను. 'అయ్యో పాపము! కమలమ్మగారు వెళ్ల లేదా ?' అని ఆయనఇల్లాలు ప్రశ్నించెను. 'గర్భిణియట. సెలవు నిండుటచే పంప వీలులేదని వకీలుగారు చెప్పినారుట !' అని ఆయనచెప్పెను. ఈమాటలన్నియు వినుచుండిన మన సరస్వతి తల్లిని పిలచి 'నేను మద్రాసుకుపోయి వారికి సేవ జేసెదను. నాకోదరి గర్భవతిగా నున్న నాకు విధిగదా ? ఇన్నాళ్లకు వారికి సేవజేయు భాగ్యము కలిగినది. ఈదవ్వంత అవకాశము పోయిన ఇంక నే నెందు'కని చెప్పెను. తల్లి తండ్రిసద్దకు వచ్చి, 'అమ్మాయి పోయెద నను చున్నది. తీసుకువెళ్లండి. కడసారి చూపిరండి. లేకున్న కలకాలము అవసానకాలమందైన చూచుభాగ్య మబ్బలేదని వాపోవుచుండును' అన్నది. కూతురుమాటకు ఎదురు చెప్పలేక కామేశ్వరశాస్త్రిగారు కూతుర్ని తీసుకొని మద్రాసువచ్చి పిల్లవాని బసకు పోయెను. శ్యామలరావు స్పృహ లేకుండా ఒకరూములో పడియుండెను. మంచి డాక్టరుని పెట్టి ఉదారహృదయులగు తండ్రి కూతుళ్లు ఎంతయో సేవ జేసిరి. స్పృహ తెలిసినవెనుక తండ్రి అల్లుని ఎదుటకు వచ్చుట మానెను. జబ్బంతయు నయమాయెను. ఇప్పుడు నీరసముతప్ప మరేమియు లేదు. ఈమె సుశీలయని మారుపేరు ధరించెను. తండ్రి వెళ్లిపోయెను. వివాహమప్పుడు తప్ప మరెప్పుడూ చూడక

పోవుటచే శ్యామలరావు భార్యను గు ర్తింపనే లేదు. ఒక నాడు శ్యామలరావు కుర్చీలో పడుకొన్నాని 'అమ్మా, మీరెవరో కాని భగవంతునివలె అడ్డుపడితిరి. మీ మేలు మరువజాలను. దయయుంచి మీ యునికియు, మీ నామ ధేయము తెల్పి నన్ను కృతార్థుని చేయగోరెద' నని నుడి వెను. సరస్వతియు కొంచెము యోచించి, 'నాభర్త నన్ను దిగనాడి వేరెవివాహము చేసుకున్నారు. నాదుః ఖమునకు మేర లేదు. నేనొక పాపిష్టురాలను. కమలకు నాకు స్నేహ మగుటచే మీ రపాయస్థితిలో నుండుట గాంచి మీకు పరిచర్య చేసితి'నని తెల్పెను. 'అమ్మా, ఆమూర్ఖుడైన మీభర్త ఎవరు? వారి నామధేయ మేమి? వారితో నాయావచ్ఛక్తిని ధారబోసి ఇట్టి సుగుణంబుల ప్రోవును విడనాడుట ధర్మము గాదని తెల్పెదను. ఇట్టి సాధ్విని విడనాడిన పాపిని ఏమి చేసినను దోషము లేదని చెప్పెను. పాపము! ఆపాపి తానే యని ఎరుగడాయెను. సరస్వతి అతిశాంతముతో 'వారికి మీకేమి బుద్ధి చెప్ప దరు? మీరు చెప్పిన వారు విందురా? మీరును ఆకో టిలోనివారేగదా!' అనుట కును. 'అవును, నాకు తగినది గాకపోవుటచే విడిచితి. అదికాకుండా, అప్పుడు ఇంకను చిన్నతనము. ఇప్పుడైన అటుల చేయుదురా? అది వక రోజుల మహిమ' యని యూరకుండెను. మనస్సులో దేనినో యోచించుచుండెను. 'ఆపెతప్పిద మేమియో అడుగవచ్చునా' అని సుశీల ప్రశ్నించెను. 'తప్పిద మేమి యు లేదు. నాతో సమానముగ ఇంగ్లీషుమాట్లాడ లేదని యు, పూర్వాచారపరాయణురాలనియు అంతియే కార ణ' మని శ్యామలరావు నుడివెను. "హిందువుల మగుటచే ఇంగ్లీషు రాకపోవచ్చును. భర్తకిష్టమున్న నేర్పవచ్చునే! దానికొఱకు మీరు విడచుచో మీకొఱకా మె అహోరా త్రములుఎంతదుఃఖించుచున్నదో!ఆసర్వేశ్వరునకేఎరుక.'

'దుఃఖించుట యెందుకు? ఇష్టము లేకపోవుటచే నేను వివాహము చేసుకొంటిని. ఆమెహాడ అటుల చేసు కొనవద్దని ఎవరుచెప్పిరని శ్యామలరా వనెను. 'ఆహా! అటులనా? మీరైతే అనుజ్ఞ ఇచ్చితిరి గాని హిందూ యువతి ఎన్నడును అటుల ఆచరించదు. తన భర్తనే దైవముగా పూజించు'నని సుశీల నుడివెను.

'అందుకు నిదర్శన మేమైన గలదా' యని శ్యామలరా వనుటయు, 'నిదర్శనము వేరె కావలయునా? అయిదుసంవత్సరములై రజస్వలైనను చూడక వేరె వివాహము కావించుకొని యావజ్జీవము తన బ్రదుకు దుఃఖభాజనము గావించిన తన భర్తకు జబ్బుగా నున్న దనగానే తన యావచ్ఛక్తిని ధారపోసి భర్త జబ్బును కుదిర్చి సుశీల యనునామము ధరించి మీపదదాసి యను సరస్వతియే నిదర్శనా'మని విలపించుచు భర్తపాదములపై బడెను. అదివరకే ఆమె సద్గుణములకు, వినయమునకు సంతసించుచున్నవాడు గాన తాను నిరాదరణ చూపిన తన భార్యయే అట్టి సద్గుణపుంజమని తెలిసి పాదములపై నున్న భార్యను లేవదీసి, చెంత చేర్చుకొని చేసిన అప రాధములు క్షమించ వేడుకొనెను. అప్పటి వారి యానం దము పాఠకులే గ్రహింతురుగాక! శ్యామలరావుకు ఇది వరకే కమల నడత మంచిది కాదని కొంచెము తెలిసెను. సరస్వతిని వెంటబెట్టుకొని రాజమండ్రీ వచ్చెను. వచ్చు టయే తడవుగ అందరు కమలకు దామోదరరావుకు సంబం ధము కలిసె నని ఒక్కుమ్మడి చెప్పిరి. ఇంక దానిమీద ప్రేమ ఎటుల నుండును? దానికితోడు పిల్లవాడు తాను రాజమండ్రీవచ్చిన ఆరునెలలకే పుట్టుటయు, అదివరకు జాబువ్రాయక ఆ యనుమానముచేత నేకాబోలు తన్ను రమ్మని జాబువ్రాసెనని శ్యామలరా వూహించెను. 'ఆహా! ఎంతమోసకత్తె! పైమెరుగులు చూచి మోస పోతి' నని విచారించెను. తనకు జబ్బుచేసిన రాకపోవుట సరిగదా, జాబైనను వ్రాయలేదనియు, అట్టిది భార్య యనిన నతనికి కంటకప్రాయముగ తోచెను. తిన్నగా కామేశ్వరశాస్త్రిగారింటికే పోయెను. అత్తకు, మామకు నమస్కారములు చేసి తన తప్పిదములు క్షమింప వేడు కొనెను. ఆనందబాష్పములతో వారు అతనిని లేవదీసి దీవించిరి.

ఇప్పుడు మన శ్యామలరావుగారు మద్రాసులో బి.ఎ., బి. యల్. హైకోర్టువకీలు. ఇంటిలో ముద్దుమూట గట్టు చిన్ని కుమారుడును, తల్లిదండ్రులు, సరస్వతి ఉండిరి. సరస్వతి అత్తమామలకు సేవచేయుచు, సనా

తనధర్మముల నాచరించుచుండెను. శ్యామలరావు పశ్చాత్తాపమునకును, సత్ప్రవర్తనకును తలిదండ్రులు సంతసించి, కోడలి సపర్యలను బొందుచు కొడుకువద్ద కాలముగడపుచుంఢెరి. ఆహా! పరమేశ్వరుని లీలలు అత్యద్భుతములు గదా! రాయి అరగదీసినకొద్దీ ప్రకాశించును. అటులనే సద్గుణసంపన్ను లెంత కష్టపడినను వారి సుగుణముల సువాసన చిరకాలము నిలుచును. వారి స్మృతి కాలగతి వాడినను మొగలిపూరేకువలె సుగంధయుతమై నిలచును.

---

## ఆంధ్రకవిత్వము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

అవని౯ సర్వవిశేషముల్ దెలియఁగా నర్థించువాఁ డెల్ల నాం
గ్లవచో విస్తరసేవ సేయవలయు౯ గాథాగ్రహం బొప్ప నె
ల్లవిశేషంబులు చేర్చి రామెతనయుల్ ప్రజ్ఞాఢ్యుఁ డేఁడీ నను౯
భువి నారీతి నొసర్చువాఁ డనుచు సత్పుత్రు౯ నిరీక్షించు నాం
ధ్రవచోమాత కొ౯అంత నాంధ్రకృతికర్తల్ తీర్చు టర్హంబగు౯.

నవగోప్యము లని హిందువు లెల్ల దేవతార్చనపెట్టెలంద యుంచినవి యెల్ల
పెఱమతస్థులకుఁ జెవిం బడకుండ మహమ్మదీయులు దాఁచినట్టి వెల్ల
పిటకకర్తల కకపటముఁగా బుద్ధుఁ డనుగ్రహించిన సుసామగ్రి యెల్ల
చిరసంప్రదాయప్రసిద్ధమైనట్టి ద్రవిడ భక్తజనుల వివేక మెల్ల
నద్దిరా! ఆంగ్లభాషలో నవతరించె - నట్టిభాగ్యంబు నా కెప్పు డమరెడినని
కుతుకపడు నాంధ్రవాఙ్మాతకో౯అత దీర్ప - నడుము గట్టంగవలయు నాంధ్రకవులెల్ల

ఏభాషలోఁ గల యేవిశేషములైనఁ దెలుఁ గెఱింగినవాఁడు తెలియఁగలఁడు
ఏశాస్త్రములలోని యేరహస్యము నైన, నాంధ్ర మెఱుంగువాఁ డరయఁగలఁడు
ఏచరిత్రలలోని యేయథార్థములైనఁ దెనుఁగు పొత్తములఁ గన్గొనఁగఁ బడెడి
ఏమతంబులలోని యేతత్త్వములునైన నాంధ్రవాఙ్మయమున నగపడెడిని
అనుచు శ్లాఘ్యమైనట్టి విఖ్యాతి గాంచి - యెల్లబాసలలోఁ దలయెత్తి తిరుగ
నాత్మలోన నువ్విళ్లూరు నాంధ్రభాష - కాంక్ష దీర్చుట విధి యాంధ్రకవుల కెల్ల.

---

# దిద్దుపాటు

కడచిన నెల భారతియందు ప్రకటితమయిన 'సాగరసంగం' అనుకథలో ౫౫౧ పుటలో రెండవకలమున విషయము తారుమారయినది. దానినీ క్రింది విధముగ చదువుకొనవలయును.

—భా. సం.

"కొడుకే అని చెప్పలేక పోయావా?"

"అయితే ముందు దారి?"

"కులం కూడు పెడుతుందా? వొక్క కొడుకు మాట తీసెయ్యడం దొరగడు. రాచకొమారుడులాగ వుంటాడు. మొగం చూస్తేనే కడుపు నిండిపోతుంది."

"అంచేతనే సోమాలు కన్నేసి ది."

"అబ్బరమా? నే సెయ్యలేమా నీ మీదా? యకరం భూమి అమ్మగారిదీ, రెండుం భూమి అక్కడిదీ వొదులుకో లేమా నీ కోసం? కోరుకున్న పెనిమిటి దొరికితే కుల మెందుకూ? కూ డెందుకూ?"

పూర్వస్మృతి నరిసీముల్ని గుంజేసి విడిచిపెట్టింది. బొబ్బిలికథ పాడడంలో నరిసీములికి వున్న నేర్పుచూసి పోలమ్మ, చేస్తూ చేస్తూ వున్న పండు నంటి కాపరం విడిచిపెట్టి నరిసీములుమీద వాలింది. నిక్షేపం లాంటి మూడు యకరాల భూమి క్షేమ రెదుట ఆమెకి గడ్డిపరక లాగ కనపడింది. తండ్రి గదిమాడు; అన్నదమ్ములు పాడిచేస్తా మన్నారు. వదినలూ, మరదళ్లూ దెప్పిపొడిచారు. తల్లి గొల్లున గోలపెట్టింది. మొగుడు ధార్జీ యివ్వడానికి సిద్ధపడ్డాడు; కాని పోలమ్మ విన లేదు. జంకనూ లేదు. నరిసీములు అప్పుడు విజయగర్వాన్ని చూపించాడు. అయితే అది కులంలో కులం కనక సరిపోయింది. ఇప్పుడు?

"ఇటు మాలలకీ, అటు మాదిగలకీ కూడా దూరమైపోతాం" అని నరసీములు దీనంగా అన్నాడు.

"అందుకోసం వాళ్ల నిద్దరినీ విడదీస్తే పాపం కాదూ?" అని పోలమ్మ అడిగింది.

నరిసీములు మాట్లాడలేకపోయాడు. ప్రేమోపాసన ఆతని మనస్సుని మృదువుపరిచి వుంది. అయినా అస్థైర్యం పోలేదు. ఇది కని పెట్టి పోలమ్మ "యిక్కడ కాదు" అంటూ అతగాణ్ణి గుడిసెలోకి తీసుకొనిపోయింది

## ౨

పోలమ్మ, నరసీములూ కూడా దీన్ని గురించి చాలా రహస్యంగానే ఆలోచనలు చేశారు. కాని యిది




## పిట్టల కథ

సీరిపి ఆంజనేయులుగారు

౧

అనఁగా అనఁగా ఒక ఊరు. దానిపేరు తాడిమఱ్ఱి. ఆయూరికి ఒకరాజు. ఆయనకు కథలనఁగా బహుప్రాణము. రాజునకు కథలు చెప్పువారు కఱవా? ఎందఱో ఎన్నిరకాలుగానో చెప్పినారు. అయిన నేమి యుపయోగము? అందు ఒక్కటియు రాజునకు సంతోషము గల్గింపలేదు, అన్నాఁడుగదా ఆయన—

"నా కేల యీ పొట్టికతలు? ఇట్టివి గిట్టవు. కడగాననిది గావలె. ఎవ్వఁడు తెగనికథ తెల్పునో వానిది యీ రాజ్యము, ధనము, నా ప్రియమైన కుమార్తెయు, అంతయు వానిదే. కథ ముగించినవానికి ప్రాణాలు దక్కవు. వాని తలగొట్టి ఊరివాకిలికి వ్రేలాడఁ గట్టెదము."

౨

ఈసంగతి చిటుకలో ప్రాకిపోయినది లోకమంతయు. వచ్చినారన్నా, ఒకరివెనుక నొకరు, వరుసగా నెనిమిదిమంది వీరులు. ప్రాణాలపై ఆస లేదేమో వారికి. అందఱు రాజునకు మ్రొక్కినారు. కొలువుదీరినారు సభలో. ఒక్కరొకరుగా ప్రారంభించినారు కథలను.

మొదటివాఁడు సోమవారము మొదలుపెట్టి, విఱుగుతఱుగు లేకుండ చెప్పినాఁడు, ఒకే ధాటిగా. ఎంతో బాగున్నది ఆ కథ. అందఱు సంతోషించినారు. ఆనందించి పోయినాఁడు రాజుగూడ. అయిన నేమి లాభము? శనివారము సాయంకాలానికి అది ముగిసినది. అంతతో ఆయువు మూఁడినది కతగానికి. రాజు చూచినాఁడు తలారివంక. వెంటనే తలారి త్రోసినాఁడుగదా ఒక్కతన్నుతో కతగానిని బయటికి. పాపము! తలారికత్తిచేత కతగాని తల కసిమొగ్గవలె తెగినది కసిక్కున.

రెండవవాఁడు చెప్పినాఁడు ఏఁబదిదినాలు. మూఁడవవాని కథ యేఁబదిమూడు దినాలవఱకు సాగినది. ఇట్లే తక్కినవారి కథలును. ఎన్నఁడైన నొకనాఁడు ముగియవలసినవే కదా? అందఱి తలలు పూలగుత్తులవలె చకచక నెగిరిపోయినవి. అంతియ కాదు. ఊరివాకిలికి పెద్ద

తోరణముగా నేర్పడిన వన్నియు. ఆసరమును జూచి, రాజు సంతోషాన పొంగిపొయ్యెడి వాఁడు.

౩

నగరిసంగతి యిట్లుండఁగా, ఒక్కనాఁడు వచ్చినాఁడన్నా పిల్లజుట్టు పుల్లన్న. దొరిగల్లు వానిది. బక్కపల్చనివాఁడు. బలే ఉపాయశాలి. తెగనికథ వచ్చునో రాదోగాని, ఆస్థానములో రాజునుమాత్రము చూచినాఁ డాతఁడు. రాజు దగ్గఱ నిలుచుండిన ఆమిడిగ్రుడ్లవానిని - చుఱుకుఁ జూపులవానిని - బూరబుగ్గలవానిని - కుచ్చుమీసాలవానిని - తలారిని చూచినాఁడు. పచ్చినెత్తురు కాఱి, కరుడుగట్టినవాని కత్తిగూడ, మనవానికంటఁ బడినది. పెద్దల నందఱను పుల్లయ పాఱఁజూచినాఁడు. ఒక్కమా 'అందఱకు వందనా' లన్నాఁడు.

రాజు నవ్వుకొనె తనలోఁ దాను. ఆనవ్వులో అలక్ష్యభావము నిండుగా ఉన్నది. 'తల కాచుకోవోయి' అనినట్లు ఆ నవ్వున కర్థము. ఆ యర్థము పుల్లయ్యకు అగపడినది. తల ఊఁచినాఁడు ముందుకు వెనుకకు రెండుసార్లు. 'పట్టెదను లే నీపని' అనుకొనినాఁ డేమొ! అలాగే ఉండినది వాని చూపుఁగూడ. తిన్నఁగా రాజుదగ్గఱఁజేరి కథ మొదలెత్తినాఁ డయ్యా చనవుతో—

౪

“దొరా దొరా! విన్నావుగదా? పాముదుర్తి అను ఊరు. ఆయూరిలో బలేవర్తకుఁడండీ. పిసినిగొట్టులలో పేరుమోసినవాఁ డతఁడు. వానియొద్ద ఏమినగలు! ఏమి నాణెములు! ఎన్నిపొలాలు! వాని యింట్లో ఏమూలచూచిన ధనము మూల్గుచు ఉండెడిది అలాటిసావుకారి వాఁడు. 'పోలిసెట్టి' అని వానిపేరు.

“ఒకవత్సరము పోలిసెట్టికి ఎంతో ధాన్యము వచ్చినది. ఆ ధాన్యానికయి కట్టించినాఁడు లంకంత యిల్లు. ఎకరాల పొడవునను అదె. కూరించినాఁడు ఆ యింటినిండుగ గింజలు చీమదైన దూరకుండ భద్రపఱిచినాఁడు దానిని; కాని ఆ యింటిపైన ఒక చిన్న పొగగూఁడు ఉండినది. దాని నెవ్వరు చూచినట్లు లేదు.”

కథ వినుచు ఆనందించి పోయినాఁడు రాజు. కతగాఁ డది కనిపెట్టి, సాగించినాఁడు దానిని ఉత్సాహముతో—

“మఱునాఁడు ప్రొద్దుపొడువకముందే వచ్చినదండీ ఒక పిట్ట. ఆ యింటి పొగగూఁటిగుండ ఒక ధాన్యపుగింజ మెత్తుకొని, ఒకే ఉఱుకు”.

రాజు—(నవ్వుచు) అట్లే అనుకొన్నాను నేనును. ఎంత టక్కరి గువ్వరా అది.

కత—ఇంకొకపిట్ట మఱునాఁటి వేకువనే యింకొకగింజను కఱచుకొని తుఱ్ఱునఁ బాఱినది.

రాజు— వినుచున్నాను. చెప్పు-చెప్పు తర్వాత?

కత—ఇంకొకనాఁడు ఇంకొకపిట్ట మఱొకగింజనుగూడ.

రాజు—ఔను. అదికూడ పోయినది లే. ఆవల?

కత—ఇంకొకనాఁడు ఇంకొకటి మఱొక గింజను

రాజు—అన్నియు నెన్నిపిట్టలో చెప్ప వోయి!

కత—అయ్యో దేవా! ఎన్నియని చెప్పఁ గలను? అదె చూడు. ఆకాశము చీల్చుకొని, మిన్నుమన్ను తెలియకుండ వచ్చుచున్నవే ఆపిట్టలు! వచ్చె వచ్చె. ఇంకొకటి మఱొక గింజను......

తలలో మెదడున్నంతవఱకు యోజించినాఁడు ఆరాజు. ఈకథకు అంతె మున్నట్టే కన్పట్టలేదు. ఇంక తప్పించుకొను ఉపాయమేదిరా అనుకొనినాఁడు. అంతలో కథకుఁ డారంభించినాఁడు పల్లవి—

"ఇంకొకనాఁ డింకొకటి యింకొకగింజను"

ఒళ్లుమండిపోవునంత కోపము వచ్చినది రాజునకు. వేసినాఁడు ఉఱుమంతటికేక-'ఆఁపు' అని. కతగాఁ డన్నాఁడుగదా అతివినయముతో—

"మహాప్రభూ! కొంచె ఓపికపట్టుఁడు. కథ యేమాత్రము కాలేదు. ఇది ముగియుటకు ఏండ్లుఁ బూండ్లు పట్టును. పిట్టలు ఇంక నెన్నిరావలెనో. అదిగో వచ్చె. ఇంకొకటి యింకొక గింజను......ఇంకొకనాఁ డింకొకటి యింకొక గింజను......"

రాజు చల్లఁబడిపోయినాఁడు. తుదకు లొంగిపోవలసియే వచ్చిన దనుకొన్నాఁడు కాఁబోలు. దీనుఁడై మెల్లఁగా అడుగుకొన్నాఁడుగదా రాజు—'ఆఁపవోయి' అని.

కత—దొరగారూ! నే నేమి చేయుదును? పిట్ట లాఁగినఁగదా? అదె-చూడుఁడు. ఇంకొకటి యింకొక గింజను...ఇంకొకనాఁడు ఇంకొకటి ఇంకొక గింజను...ఇంకొకటి ఇంకొకటి ఇంకనొకటి.

విసుఁగెత్తినది రాజునకు. వినలేక పోయినాఁడు. విడుచునట్లులేదు పుల్లయ్య. 'విడిపించుకొనుట యెట్లు దేవుఁడా' అని రాజునకు. ఈలాగు అనుకొనుచున్నట్లే కతగాఁడు నుడువుచున్నాఁడు.

"ఇంకొక"—

రాజు—చాలు చాలు. ఇదిగో, కొనుము ఈగద్దియు, ఈరాజ్యము, ధనము, నా ముద్దుల పట్టినిగూడ నీవే తీసికో; కాని ఆపిట్టలను మాత్రము రానీయకు. ఆఁపు నీకథ. నేనింక వినఁజాలను. ఆఁపు-ఆ.పు. మఱి చెప్పకు.

పుల్లయ్య రొట్టె నేతిలోఁబడినది. పొంగిపోయినాఁడు నేలకు నింగికి. ఆయూఁపున ఒక్కఎగురు ఎగిరినాఁడు. ఏమి వాని సంతోషము! పెండ్లాడెను రాజు బిడ్డను. సింహాసన మెక్కినాఁడు. మహావైభవముగా పాలించినాఁడు రాజ్యము. అనుభవించె నన్ని సౌఖ్యాలు. అంతటితో కథ తెగినది; మనము మిగిలినాము.




చీమలకొండ సూర్యకాంతంగారు

అనగనగా ఒకఊళ్లో ఒక బ్రాహ్మ డుండేవాడు. అతనికి నలుగురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లును. అందరికంటె పెద్దకూతురు చాలా కాలం క్రింకటే కాపురానికి వెళ్లి పిల్లజెల్ల కలిగి సుఖంగా ఉంది. కడసారపుకూతురు క్రొత్తగా కాపురానికి వెళ్లింది. అంతట్లోకే సంక్రాంతి పండుగ రావడంచేత అల్లుళ్లను, కూతుళ్లను రప్పించారు.

క్రొత్తల్లు డవడంచేత అందరూ చిన్నతనిని కొంచె మెక్కువ జాగ్రత్తగా చూచేవారు. చను వెక్కువవటంవల్ల పెద్దతను వారింట్లో వారిలో ఒకడుగానే ఉండేవాడు. తనకు చేసే గౌరవం చూచి చిన్నల్లు డుప్పొంగి తన తోడల్లుడిని, అతని పిల్లలను పరిహాసంచేసి నిరసించటం ప్రారంభించాడు. దీని కసలుకారణ మేమిటంటే పెద్దల్లుడు వేదపండితుడు. ఇక రెండో అల్లుడో, సాహిత్యం బాగా చదువుకొన్నాడు వేదంకంటె సంస్కృత మెక్కువనిన్ని, కాబట్టి తన కెక్కువ గౌరవం జరుగుతోందని అతని ఊహ.

చిన్నతని తీరంతా పెద్దల్లుడికి కిట్టలేదు గాని వయఃసు ముదిరినవా డవడంచేత, పండుగ మూడురోజు లయినతరువాత ఎవరింటికి వారు పోయేవారమే గదా అని ఊరుకున్నాడు. కాని చిన్నల్లుడిగర్వం మరింత అభివృద్ధి పొందటానికి వేరే విశేష మొక టుంది. ఆ బ్రాహ్మడి ఇల్లు చాలా యిరుకవటంచేత ఆరాత్రి ఉన్న ఒక్కగదిలోను మంచము వేసి చిన్నల్లుడికి ప్రక్కవేసారు. వేరే మంచ మొకటి లేకపోవటంచేత పెద్దల్లుడు, పిల్లలు గదిగుమ్మందగ్గరున్న సావిట్లో ఒకచాప వేసుకొని పండుకొన్నారు చిన్నల్లుడిదికూడా తన ఆధిక్యమువలననే అనుకొని మరీ గర్వపడ్డాడు.

ఇల్లా భోగి వెళ్లిపోయింది. సంక్రాంతి పండగనాడు చిన్నల్లుడి కిష్టమయిన తియ్యటి పదార్థాలు చేయుటంచేత అవన్ని తృప్తితీరా

తిన్నాడు. రాత్రి యథాప్రకారంగా గదిలో అతను, సావిట్లో పిల్లలతో పాటు పెద్దల్లుడు పడుకున్నారు. చిన్నల్లు డా రాత్రి తియ్యటిపదార్థాలు బాగా తిన్నందుకు ఫలితంగా నాలుగయిదుసారు ఇవతలకు రావలసి వచ్చింది. మొదటిజాము గడచిపోయాక అతను పావుకోళ్లు తొడుగుకొని టక్కు టిక్కు మంటూ క్రింద సరిగా చూడకుండా నడుస్తూ గదిలో నుండి యివతలకు వచ్చి పెద్దతని కాలిమీద అడుగు వేసి, దానితో అతనికి నొప్పి మెలకువ రావటం చూచి, 'క్షమధ్వం'(క్షమించండి) అని తన సంస్కృతపాండిత్యం వెల్లడిచేసుకున్నాడు. నిద్రకళ్లని చూచియుండకపోవచ్చునని పెద్దల్లు డేమీ అనలేదు. ఇంతట్లో రెండోజాము గడిచిపోయింది. చిన్నల్లుడు మళ్లీ వాకిట్లోకి రావలసివచ్చింది. యథాప్రకారంగా పావుకోళ్లు టక్కుటిక్కుమంటూ నడచి వచ్చి పెద్దతనిని మళ్లీ గట్టిగా త్రొక్కాడు. పైగా, లెంపకాయ కొట్టి క్షమించమన్నట్టు, మళ్లీ 'క్షమధ్వం' అన్నాడు. సరే మళ్లీ పొరపాటు కాబోలు నని పెద్దత నేమీ అనకుండా ఊరుకున్నాడు.

తరువాత మూడోజాము గడచిపోయాక చిన్నల్లుడు మళ్లీ గదిలోనుండి యీవలికి వచ్చాడు. పోనీ, యీసారైన జాగ్రత్తగా చూసుకు రావచ్చా మరి. మళ్లీ టక్కుటిక్కుమంటూ పావుకోళ్లతో పెద్దతని చేతివేళ్లమీద అడుగు వేసాడు. పైగా ఎప్పటిలాగే 'క్షమధ్వం' అన్నాడు. పెద్దల్లు డిది చూచాడు. ఈ సారి కూడా పొరపాటుగా భావించటాని కతని మనస్సు ఒప్పిందికాదు. అంతే కాకుండా, 'క్షమధ్వం' అని అదే పనిగా సంస్కృతం వెలిగించటం యెత్తిపోటులా కనిపించింది. ఇక ఊరుకుంటే వ్యాపారం శ్రుతి మించి రాగాన్ని పడుతుం దనుకొని, చెయ్యి దులుపుకుంటూ లేచి చిన్నల్లుడి జుట్టు చేత దొరకబుచ్చుకున్నాడు. "చదువుకున్నది నీవేకాదు. నేనుకూడా"నని చెప్పేటట్టు అతని 'క్షమధ్వం'కు సరిపోయేటట్టుగా 'దేవా దేవేషు శ్రయధ్వం, ప్రథమా ద్వితీయేషు శ్రయధ్వం......' అని వేదవాక్యాలు చెప్పటం ప్రారంభించి వాక్యాని కొక దెబ్బ చొప్పున యీ లెంప ఆ లెంప దబదబ గుక్క త్రిప్పుకోకుండా వాయించటం ప్రారంభించాడు. అప్పటి కప్పుడే ఉషఃకాల మవటంచేత గది అవతల వసారాలో పండుకొన్న మామగారు, బావమరదులు పెద్దల్లుడు తెల్లవారుగట్ల పనస చెప్పుకుంటున్నా డనుకున్నారు. కాని దొడ్డి తుడుచుకుంటూన్న అత్తగారు దెబ్బలచప్పుడు విని వారిని లేపి తీసుకువచ్చేటప్పటి కప్పుడే, పెద్దల్లుడు తాను ప్రారంభించిన పనసలో ముప్పదిరెండు వాక్యాలు ముగించి ముప్పదిరెండు లెంపకాయలు కొట్టి చిన్నతనిని వదిలేసాడు. చిన్నల్లుడు సొమ్మసిలిపోయాడు. ఎవరు అడగనక్కరలేకుండానే పెద్దల్లుడుజరిగినదంతా మొదటే వారికి చెప్పేశాడు. బావమరదులు చిన్నతనికి తగినశాస్తి అయిం దనుకున్నారు. మామగారుమాత్రం విచారించాడు కాని పెద్దత న్నేమి అనలేకపోయాడు. కాస్త ప్రాణం కుదుటబడ్డంతోటే కనుముకూడా లెక్కచేయక చిన్న

ల్లుడు తనఊరు వెళ్లిపోయాడు, లేకపోతేయింకా పరాభవం జరుగుతుందేమో అని. అప్పటినుండి కూడా 'దేవా దేవేషు'చేయడమంటే లెంపలు వాయగొట్టడమని లౌకికపరిభాషయిపోయింది.

## రేచీకటి అల్లునియుక్తి

దశిక వెంకటరత్నంగారు

ఒకనాడు సాయంకాలమున ఒక రేచీకటి అల్లుడు తన అత్తవారింటికి వెళ్లేడు. అత్తగారు అల్లుడు వచ్చాడని పిండివంటచేసి వంటచేసింది. అల్లుడికి రేచీకటి అని అత్తగారికి తెలియదు. అల్లునికి కాళ్లుకడుక్కుందుకు నీళ్లిచ్చి మసికిట్టుకో మంది. ఆయనకు రేచీకటి. పెరట్లోనికి కాళ్లు కడుక్కుందుకు వెళ్లేడు. అక్కడ తవ్వియుంచిన పాతరగోతిలో పడ్డాడు. ఎంత ప్రయత్నంచేసినా పైకి రాలేకపోయాడు.

అల్లుడు ఎంతసేపటికి రాలేదని అత్తగారు దీపం పుచ్చుకొని పెరట్లోకి వెళ్లింది. అల్లుడు పాతరగోతిలో వుండుట చూచింది. 'గోతిలో పడ్డావా' అని ఓదార్చి పైకి రమ్మంది. 'పాతర గొయ్యి సరిగా త్రవ్వలేదని చూస్తున్నాను. సరిగా త్రవ్వాలి. గడ్డపారతే' మ్మన్నాడు. 'నీకు ఎందుకు? రేపు సరిచేయిద్దాముర'మ్మంది. 'సరిచేస్తేనేకాని రా' నన్నాడు. అప్పుడా వెఱ్ఱిబాగుల అత్తగారు గడ్డపార తెచ్చియిచ్చింది. అల్లుడా గడ్డపారతో మెట్లుత్రవ్వుకొని పైకి వచ్చాడు.

భోజనందగ్గర కూర్చున్నాడు. భోజనం చాలభాగము అయింది. అల్లుడికి పెరుగు వడ్డించింది. అప్పుడు చప్పుడు అయింది. కుక్క వచ్చి విస్తట్లో పడిందనుకొని చేయివిసరేడు. ఆచేయి వంగుని వడ్డిస్తోవున్న అత్తగారి చెంపకు తగిలింది. అత్తగారు సిగ్గుతెచ్చుకొని వెళ్లిపోయింది. భోజనాలు అయాయి.

అల్లుడికి గదిలో మంచం వేసినారు. నగం రాత్రి అయింది. అల్లుడు వాకట్లోకి వెళ్లవలసి తడుముకుంటూ వెళ్లి తిరిగివచ్చాడు. గదిలోనికి దారితప్పి తడుముకొంటూ సావిట్లోకి పోయినాడు. అక్కడ పడుకొనుండిన అత్తగారి మంచం కాలికి తగిలింది. అదే తన మంచం అనుకొని తడుముకున్నాడు. అత్తగారి కాళ్లు తగిలాయి. ఆకాళ్లు తన భార్య వనుకొన్నాడు. అత్తగారికి మెలకువ వచ్చింది.

'ఇదేమిటి యిలావచ్చా' వంది. 'రాత్రి మీరు పెరుగుపోశారన్న కోపంచేత చెంపకాయ కొట్టేను. అందుకు క్షమించాలని బతిమాలడానికి వచ్చా' నన్నాడు. 'సరే దానికేమిలే వెళ్లి పడుకో' మంది. 'అలాకాదు,క్షమించ' మన్నాడు. చివరకు 'క్షమించా' నంది. 'నాకు నమ్మకంలే' దన్నాడు. 'నన్ను నా మంచందగ్గరకు తీసికొనివెళ్లి దిగపెడితే నమ్ముతా' నన్నాడు. అప్పుడు అత్తగారు అల్లుడిని తీసుకువెళ్లి దిగపెట్టివచ్చింది. కొంతసేపటికి తెల్లవారింది. ఇక్కడ యింక వుండకూడదు. మనము వేసిన ప్లాను బాగా పడిందనుకొని అల్లుడు వెళ్లిపోయాడు.

కథ కంచికి, మనం యింటికి.

### ౨ ఆటపాటలు

విద్దెం విద్దెం వరహాల విద్దెం
    విద్దెం చేస్తే గిద్దెడు నెయ్యి
తప్పకచేస్తే తవ్వెడు నెయ్యి
    మళ్లీ చేస్తే మానెడు నెయ్యి.

చల్ల చెయ్యి గొల్లభామ నీ
    సందిట దండలు కదిలేను
వెన్న చెయ్యి అమ్మాయి నీ
    వెండిమురుగులు కదిలేను
పాలుతాగు అబ్బాయి నీ
    పసిడి మురుగులు కదిలేను

చెప్పుకో చెప్పుకో
    చెవులెక్క తీసుకో
మావిడాకిస్తాను మందెట్టుకో

* * *

వేడి అన్నం అప్పడంముక్క
    తినోతినో
చల్ది అన్నం వుల్లిపాయి
    జుర్రో జుర్రో
విశాఖపట్నం పీకెడుబెల్లం
    నీకోపదలం నాకోపదలం
కళింగపట్నం కాసులపేరు
    నీకోపేరు నాకోపేరు
భీముడిపట్నం బిందెలజోడా
    నీకోజోడా నాకోజోడా
చెన్నపట్నం చెరుకుముక్క
    నీకోముక్క నాకోముక్క

ఉసిరికాయకుండ ఊరుపిండికుండ
మెల్లగా దించండి బెల్లాపకుండ
    కుండో కుండ. (౧)

కుండనిండా కందులు
    రంగ సాని బొందులు. (౨)

పీట మీద పిండి పిసుక్కు తినరా
    కొమ్మరటిపండు కోసుకుతినరా. (3)

చెంబు డటుకులు
    దమ్మిడి బెల్లం. (౪)

    అక్కలక్క్ర ముక్కాలిపీట
    కూర్చోవదినా వదినా వదినా. (౫)

    సీమమిరపకాయ చిర్రో బుర్రో
    పాతగుడ్డ చిరిగి తేపర్రోపుర్రో
    దానిమొగుడు దాన్నికొడితే
        మొర్రోమొర్రో (౬)

    చెట్టు కొట్టంగ పాలుకారంగ
    నిన్ను కొట్టంగ నీరు కారంగ. (౭)

    ఉట్టిమీద వూరగాయికుండ
    మెల్లిగాదింపరా మేనత్తకొడకా
        కొడకా కొడకా. (౮)

బూడిద గుమ్మిడికాయ
    బుచ్చెమ్మ తలకాయ

నారదబ్బకాయ
నారమ్మతలకాయ. (౯)
సంకురాత్రిపండ గొచ్చిం దమ్మలార
చంకలెత్తు గాడండమ్మలార.
యజ్ఞోపవీతం 'యేగానిబెల్లం
బుజమెక్కుదజంజం,బుజమెక్కుజంజం.

ఒంటి పిల్లి రాకా సొకచోట
ఇద్దరు ముగ్గురు ఒకచోట

ఆడతారిబొమ్మ పాడతారిబొమ్మ
నక్కేరుచెట్టు కింద బొక్కేరు బొమ్మ
తోలుముక్కవున్న పైతక్కబొమ్మ
బొమ్మాబొమ్మా, బొమ్మా, బొమ్మా.

నాచేతిమాత్ర
వైకుంఠయాత్ర.

సూరీతాపిల్లి
మూరీతాపిల్లి
పడమటక్కల్లార పారిపొండి.

ఓయి వోయి నాయడా
వంగపల్లి నాయడా
నక్కపాలు పితికినావు
చిక్కాన పోసినావు
జోడుగుర్రమెక్కినావు
బొమ్మలాట లాడినావు

కథ కథ కంగు
మూతాత చెంగు
నూనె పోసుకుని దిగమింగు

---

# మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భారతి.'



## ఆకు చిలుక

కొ. నరసింహాచారిగారు

టెంకాయ ఆకుతో చిలుకను చేయవచ్చును.

మిక్కిలి ముదురుగాని యొక ఆకును దీసికొని (చిత్రము 1) దాని మొదటిని సమముగా నుండునట్లు కత్తిరించవలెను. ఆకుయొక్క నడిమి ఈనెను (చిత్రము 2 d) తలలేక మొదటినుండి a' అను గుర్తువఱకు 'b c' అనురెక్కలు వేరుగా నుండునట్లు చీల్చుకొనవలెను. 'e' అను కొనకును 'a' అను భాగమునకును గల దూరము 7 లేక 8 అంగుళము లుండవచ్చును. ఈభాగమే చిలుకకు తోకయగును. 'd' అను నడిమిఈనెయొక్క విడికొనను వెనుకకు 'e' వైపునకు వంచవలెను (చిత్రము 3 b). పిమ్మట 'b' అను ఎడమప్రక్కయందలి రెక్కయొక్క కొనను ఈనెక్రిందుగాచుట్టి పైకితెచ్చి మరల అదేరెక్కకును ఈనెకును మధ్యదూర్చి లాగవలెను (చిత్రములు 3, 4, b) పిమ్మట 'c' అను కుడిప్రక్క ఆకునుగూడ ఈక్రిందుగాచుట్టి పైకి దీసికొని ముందువిధముగనే అదే ఆకునకును, ఈనెకును మధ్యదూర్చి లాగవలెను. 'c'అను ఆకుయొక్కచుట్టు 'b' అను ఆకుయొక్కచుట్టునుకప్పియుండును. పిమ్మట 'b' యొక్క కొనను కుడిప్రక్కకు చిత్రము 5 నందలి విధముగ 'c' యొక్క చుట్టునకు మీదుగాను, మరల ఎడమప్రక్కకును మడిచి (చిత్రము 6) అదే ఆకునకును, ఈనెకును మధ్యదూర్చి లాగుకొనవలెను. మరల కుడిప్రక్కనుండు 'd' అను రెక్కను మొదట ఎడమప్రక్కగాను (చిత్రము 7) పిమ్మట వెనుకకును మడిచి (చిత్రము 8) రెక్కకొనను, పూర్వము'b'ని దూర్చిన విధముగ దూర్చి లాగవలెను (చిత్రము 8). మరల'b'ని పూర్వరీతిగ నేమడిచి చుట్టిలాగుచు, పిమ్మట 'c'నిగూడ నదేవిధముగ మడిచి, చుట్టి లాగుచు రావలెను. ఈవిధము'b c'లను మార్చి మార్చియల్లుచు, రెండురెక్కలయొక్క కొనలు 2-3 అంగుళములుమాత్రము మిగులునట్లు చేయవలెను (చిత్రము 10 'b c').

పాతిక యంగుళము వెడల్పును 3-4 అంగుళముల పొడవును గల యొక అకు తునకను




(టెంకాయఆకు) (చిత్రము 9 f) తీసికొని, దానిని సగమునకు మడిచి, (9 g)) చిత్రము '9 h' యందు జూపినవిధముగ ముడివేయవలెను. పిమ్మట తునుకయొక్క కొనలు క్రిందికిని మడత పైకిని ఉండునట్లు ఈనెయొక్క మడత గుండా దూర్చవలెను. (చిత్రము 10 h).

అప్పుడది చిలుకకు ముక్కుగా నేర్పడును. తర్వాత ముక్కును గట్టిగా పట్టుకొనునట్లు ఈనె కొనను లాగి ముక్కుపైనగల మడతగుండా దూర్చినయెడల చిలుక పూర్తియగును (చిత్రము 10).

(All rights reserved)

# లేపాక్షి

కల్లూరి సుబ్బరావుగారు

రాయలసీమయందు ప్రసిద్ధిగాంచిన క్షేత్రములలో లేపాక్షి యొకటి. ఇయ్యది అనంతపుర మండలమున హిందూపురమునకు తొమ్మిది మైళ్ల దూరమున నున్నది. స్కాందపురాణమున పేర్కొనబడిన శైవక్షేత్రములలో లేపాక్షీపాపనాశేశ్వర మొక్కటి. ఈ పాపనాశేశ్వర లింగము అగస్త్యమహర్షిచే ప్రతిష్ఠింపబడినదని నానుడి. ఇయ్యది పురాణగాథ. చారిత్రకముగా గూడ లేపాక్షి ప్రసిద్ధిగన్న గ్రామము. విజయనగరసామ్రాజ్యము వైభవోన్నతుల వెలసిన నాడు లేపాక్షి యొక వాణిజ్యకేంద్రమై యుండినదనుటకు నిదర్శనములు పెక్కులు గలవు. కృష్ణశెట్టి రాయనిమంత్రిభాస్కరుని యాజ్ఞపత్యమున నానాదేశవణిక్కులు లేపాక్షీయందు సమావేశమై సుంకములను లేపాక్షీవీరేశ్వరాలయమునకు సమర్పించినటుల ఒక శాసనము గలదు. నేడు ఆ వాణిజ్యశ్రీ లేపాక్షిని విడనాడినది. వాణిజ్యము నశించినను అపూర్వశిల్పకళానిలయమైన ఆలయముమాత్రము అనేకుల నాకర్షించుచున్నది.

ఆలయమును నిర్మించినది అచ్యుతరాయలకాలమున పెనుగొండలో కోశాధిపతిగా నుండిన లక్కిశెట్టికుమారుడైన విరుపణ్ణ. విరుపణ్ణకాలమునకు నేటి ఆలయమున్న కూర్మశైలము శ్రీనాథుడు వచించినట్లు 'చిన్నచిన్న గుళ్లు చిల్లర దేవుళ్ల'తో మాత్రమే నిండియుం



M. K. R.

(౧) దేవాలయమున వాయవ్యమూలగల ప్రాకారమంటపములు, కొలను.

డెను. అన్నిటిని ఒక్క మండపములో నిమిడ్చి తన యిష్టదైవమైన వీరభద్రుని పతిష్ఠించినాడు విరుపణ్ణ. ఈ దేవాలయ పోషణమునకు అనే కాగ్రహారముల దానముచేసినట్లు పెక్కు శాసనములు కలవు. దేవాలయ నిర్మాణము అతని కాలమున పూర్తికాలేదు. తొల్దొల్త శ్రీపాపనాశేశ్వరాలయమని పురాణ ప్రసిద్ధి గన్నను విరుపణ్ణ వీరభద్రుని ప్రతిష్ఠించిన తర్వాత శ్రీ వీరేశ్వరాలయమని శాసనములు బల్కుచున్నను జనులలో మాత్రము లేపాక్షి దుర్గమ్మ



(౨) రంగ మంటపము. ౹ఇంను రా స్తంభములుకలవు. శివతాండవకేళి ఇం దత్యద్భుతముగా చిత్రింపబడినది.



(3) రంగమంటపమునందలి మరొక భాగము. తుంబురుడాదిగాగల విగ్రహము లిందు కడుమనోజ్ఞముగ నున్నవి.

గుడి యని నేడు వాడుకొనుట తటస్థించినది. దుర్గయొక్క విగ్రహము అపూర్వముగ ఒక స్తంభమున చిత్రింపబడినది. అంతియేకాక దుర్గ ఆ స్తంభమున ఆవిర్భవించి ఒకమహాభక్తునకు సాక్షాత్కార మొసగెనని యొక కథయు కలదు. కారణమేదియైన నేమిగాని దుర్గమ్మపేరు వాడుకలో నున్నందున వైష్ణవాలయ పక్షపాతియైన మన్రోగారు లేపాక్షి దేవాలయమున కున్న మడిమాన్యముల నూడబీకి ఏడాదికి ముప్పైఅయిదురూపాయల బత్యమును మాత్రము మంజూరుచేసినారు.



(౮) రంగమంటపము - వెలుపలి భాగము. ఇందుగల స్తంభములలో నొకటి భూమిపై మోపక వ్రేలాడుచున్నది.



(౯) దేవాలయ గోపురములు.

ఈ దేవాలయముననే రామాలయము గూడ నున్నది. ఇయ్యదిగూడ అగస్త్యముని ప్రతిష్ఠించినదని వాడుక. ఈమూరరామభక్తులే లేపాక్షి రామాయణ మను యక్షగానమును వ్రాసి ఆంధ్రలోకమునకు కర్పించినది. తెలుగు నేర్చిన ప్రతివారును లేపాక్షిరామాయణము పేరు వినియుందురని తలచెదను. ఈప్రసిద్ధదేవాలయములో నున్న కొన్నిభాగముల ఛాయాచిత్రము లిందు ముద్రింపబడినవి.

ఇంతియేకాక విజయనగర కళాప్రావీణ్యమునకు నిదర్శనము లెన్నియేని కలవు. లోపలి మండపమున నొక స్తంభమున చిత్రింపబడిన పద్మినీ జాతిస్త్రీ - పాంచాల పురుషుడు అను చిత్రముల మనోజ్ఞత వర్ణనాతీతము. దేవాలయపు పైభాగమున స్కాందపురాణము చిత్రింపబడియున్నది. వన్నె లావంతయేని నేటికిని తరుగక కనుపించుచున్నవి. ఆచిత్రముల సొబగు చెప్ప నలవికానిది.



M. K. R.

(౮) ఆలయమునకు వెనుకనున్న ఒక పెద్దరాతినుండి నిర్మించబడిన నాగేంద్రుడు. సుమారు ౧౫ అడుగులఎత్తు గలదు.

లేపాక్షి నేడు సహకార సంఘములవారిచే నేర్పాటుచేయబడి యుండు గ్రామ పునర్నిర్మాణ కేంద్రములలో నొక్కటి. ఇప్పుడు శ్రీవార్తకవి రామచంద్రరావుగారు ఆగ్రామములలో పని జేయుచున్నారు. న్యాయవాదవృత్తిని విసర్జించి గ్రామజనుల క్షేమమునకై శ్రద్ధతో పనిచేయుచుండు రామచంద్రరావుగారు జీర్ణమయిన విజయనగరశిల్పికళానికేతనమును పునరుద్ధరింప, ఆయూరి ప్రముఖులు శ్రీయుతులు శ్రీ లేపాక్షి కిరణం-రామచంద్రప్ప, వెంకటనారణప్ప-వెంకటనారయ్య శ్రేష్ఠి గార్ల సహాయముతో చాలా శ్రద్ధతో కృషి సల్పుచున్నారు.



(౭) లేపాక్షికి తూర్పున ఒకఫర్లాంగుదూరమునయున్న బసవన్న. ఇయ్యదికూడ ఒకే గుండున చెక్కబడినది. దక్షిణహిందూస్థానమున ఎచటను ఇంత పెద్దబసవన్న లేదు. పెద్దదియేకాక కడుముద్దుగకూడ నున్నది. అలంకారముల సమర్చుటలో శిల్పి చూపిన నేర్పు చూచి ఆనందింపవలసినది.
బసవన్న ఎత్తు శిరోభాగమువరకు సుమారు ౨౦ అడుగులు, పొడుగు ౩౦ అడుగు లుండును.
ఇప్పటికిని పశువుల కనారోగ్యము కలిగిన చుట్టుముట్టువారు వెన్న నారగింపుపెట్టి యీ బసవన్నను పూజింతురు.

(౮) దేవాలయమునకు చేరిన మరియొక మంటపము, అసంపూర్ణము.		M. K. R.

# ఏమి నాకలలు?

తురగా వేంకటరామయ్యగారు (కవితాసమితి)

౧

నేడరాడా మోము చూడనే చూడడా?
ప్రేయసీ! యనినన్ను పిలువ నేపిలువడా
ఏరులై పారుక
న్నీరైన దుడువడా
యుగయుగమ్ములనుండి
బిగబట్టియున్న నా
యెద జీల్చు ఈ ప్రేమ
నేనిగుర్తింపడా
ఏమి నాపరితాప, మేమికాలమ్ము!

౨

ఈ దుఃఖమున తోటలేదిరుగ గలనా
ఈ మొండలకు పూవు లెండిపోకుండునా
నామనసులో రూపు
నాయెదుట నిల్చునా
పూలుదోసిళ్ల తో
బోసినవ్వింతునా
నా రాజకనులలో
నానీడ జూతునా
ఏమి నాయున్మాద మేమినాకలలు?

౩

నాపుణ్యభూమిలో నాపూలతోటలో
నాబాహువల్లిలో నావలపుపాటలో
కరగి మరగి జగమ్ము
మరచి తన్మయుడైన
హృదయేశు నెదయందు
నిదురించి నిదురించి
నన్ను నేనే మరచి
నాగెలుపు చూతునా?
ఏమి నాభావాలు? ఏమినాకలలు?

౪

ఈరోదసము మింటి కెగసి మార్మ్రోగునా?
నేలనే చీల్చి పాతాళాన కేగునా
ఆయఖాతసముద్ర
మడుగంట వెదకునా?
వెలుగునో గాలినో
నిలిపి పలికించునా
నామనోహరుగాంచి
నాగతులు దెల్పు నా?
ఏమిలోకాలు? నాకేటిస్వర్గాలు?

---




౭. మహాత్మునకు లండనున స్వాగతము (Central News)



కీ. శే. పూండ్ల రామకృష్ణయ్యగారు
వీరు నెల్లూరునుండి చాల సంవత్సరములు ప్రచురించిన అముద్రిత గ్రంథ చింతామణి పత్రిక
ఆంధ్ర మాసపత్రికలలో చాల ప్రసిద్ధి గాంచినది.

# పూండ్ల రామకృష్ణయ్యగారు

అడవి శంకరరావుగారు, బి. ఏ., యల్. టి.,

ఆంధ్ర ప్రబంధములను చాలవరకు మొట్ట మొదట నచ్చొత్తించి యాంధ్రవాఙ్మయ మునకు మహోపకార మొనర్చినవాడు పూండ్ల రామకృష్ణయ్యగారు. వీరి 'అముద్రిత గ్రంథ చింతామణి' పత్రికసాయమువలననే "తాళీ దళసంపుటప్రకర కాంతారంబులం" దణగి యుండిన మహాకవు లనేకులు మొదట తమ చెలినిడుటయు, ఆంధ్రలోకమున పాఠకవర్గము నకు వారి పరిచయము సులభసాధ్య మగు టయు దటస్థించినది.

రామకృష్ణయ్యగారు నెల్లూరునకు పదు నైదుమయిళ్ల దూరముననున్న దువ్వూరను గ్రామమున ౧౮౬౦-వ సంవత్సరము జూలై ౧౫-వ తేదిని (రౌద్రినామ సంవత్సర ఆషాఢ బహుళ ద్వాదశిని) జన్మించిరి. ఈ నెల్లూరు మండలము కవి తిక్కన (కొట్టరువు తిక్కన) ఖడ్గ తిక్కనల జన్మస్థానము. రామకృష్ణయ్య గారు భారద్వాజసగోత్రుడు. ఆపస్తంబసూ త్రుడు. అప్పయ్య వీరితండ్రి. అమ్మక్కమ్మ వీరి తల్లి. ఆంగ్లేయమున వీరి పరిచయము బహుస్వల్పము. నెల్లూరుననున్న మిషనువారి యున్నత పాఠశాలలో నైదవతరగతి వరకు మాత్రమే చదివి, తరువాత సంస్కృతాంధ్ర ములయం దభిరుచి యెక్కువ యగుచుండు టచే, ఆపాఠశాలలో చదు వీయన మానివైచి నెల్లూరులోనే శ్రీపుల్లిగుండము రామచంద్ర రావుగారివద్ద శిష్యుడుగనుండి సంస్కృతాంధ్ర కావ్యములు గాఢముగ బఠింప దొడగెను.

రామకృష్ణయ్యగారు తొమ్మిది సంవత్సర ముల బాలుడై యుండగనే, తండ్రిని గోల్పోవు దురదృష్టము సంభవించెను. అందువలన జీవ నోపాధికై మార్గము లరయవలసిన యవస రము వారికి గ్రమముగ దప్పని సరియయ్యెను. ఈ సమయమున రామకృష్ణయ్యగారికి శ్రీ వాడతూరు వీరనాగయ్యగా రనువారితో గాఢ మైన మైత్రిగల్గెను. వీరనాగయ్యగారు సం స్కృతాంధ్రములదగుపాటి పరిచయము గల్గిన వారును, చాలకాలమునుండి రామకృష్ణయ్య గారి కత్యంత క్షేమాభిలాషులు నై యుండిరి. తనకు పరిచితమైనచోట్ల గొన్నిటియందు చాల విలువగల తాళపత్రగ్రంథము లున్నవనియు, అవి శిథిలముగాకపూర్వమే వానిని సేకరించి ముద్రించినయెడల పండితలోకము మెప్పునందు టయేకాక వాఙ్మయమునకు శాశ్వతమైన సేవ చేయుట యనియు, వలసినచో దానెంతయు నీ పనికి సాయమొనర్తుననియు వీరనాగయ్యగారు రామకృష్ణయ్యగారిని ప్రోత్సహించిరి.

కాని చాల ధనవ్యయముచేతను ప్రయాస ముచేతను సాధింపవలసిన యీ ఘనకార్యము రామకృష్ణయ్య, వీరనాగయ్యలవంటి యుత్సా

హామే ముఖ్యాధారముగాగల సాధారణులకు సాధ్యమగునెట్లు? దీనివిషయమై వారిరువురు తీవ్రముగ నాలోచించిరి. నెల్లూరి మండలములోని వెంకటగిరి సంస్థానము సుప్రసిద్ధకవుల కాశ్రయమొసంగి వారి ప్రాబల్యమున గీర్తి గాంచినది. అప్పటికి వెంకటగిరి సంస్థానాధీశ్వరులైన శ్రీ వెలుగోటి రాజగోపాలకృష్ణయాచేంద్ర బహాదరుగారుకూడ కవిపోషణమునను, వాఙ్మయ పోషణమునను నుత్సాహ మగుపరచుచునే యుండిరి. అందుచే రామకృష్ణయ్యగారును, వీరనాగయ్యగారు నాలోచించి శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్ర బహాదరుగారిని తమ ప్రయత్నములకు దగినసాయము చేయవలయునని ప్రార్థించిరి. సంస్కృతాంధ్రభాషాభిమానులును, గవితాపోషకులునైన వెంకటగిరి ప్రభువు వీరి సంకల్పమును గౌరవించి, యుత్సాహమును గుర్తించి వారికండయై నిల్చుట కంగీకరించిరి. పూండ్ల రామకృష్ణయ్యగారు ప్రచురించిన 'అముద్రితగ్రంథ చింతామణి పత్రిక' కు వెంకటగిరి ప్రభువే ప్రధానపోషకులు.

'అముద్రితగ్రంథ చింతామణి' యొక్క పరమావధి అముద్రితములైన యాంధ్రప్రబంధముల గ్రమముగ బ్రకటించుటయని వేరుగ చెప్పనక్కరలేకయే తెలియుచున్నది. ఈపత్రిక ౧౮౮౫-వ సంవత్సరము జూను నెలలో ప్రారంభమై ౧౯౦౪-వ సంవత్సరము యేప్రిల్ నెల వరకు సాగుచునే యుండెను. రామకృష్ణయ్యగారు పండితుడేగాని కవి కాడు. వీరు స్వయముగ రచించినగ్రంథ మొక్కటియు లేదు. వీరు ముద్రించిన పూర్వకావ్యములలో బాఠముల నవరించుటకును, వాటికి వ్యాఖ్యానము చేయుటకును కందుకూరి వీరేశలింగము పంతులు, కొక్కొండ వెంకటరత్నము పంతులు, వావిలికొలను సుబ్బారావు, మండపాక పార్వతీశ్వరకవి, మచ్చా వెంకటకవి, వేదము వేంకటరాయశాస్త్రి, ధర్మవరము కృష్ణమాచారి మున్నగువారు రామకృష్ణయ్యగారికి చాల దోడ్పడిరి. ౧౯౦౪ సం॥ సెప్టెంబరు ౧-వ తేదిని రామకృష్ణయ్యగారు స్వర్గస్థు లగువరకు భాషాసేవయందే వారి కాలమంతయు గడచినది. వీరి మరణానంతరము తగిన ప్రోత్సాహము లేక, సమర్థుడైన యధిపతిలేక, 'అముద్రితగ్రంథ చింతామణి పత్రిక' మరల ప్రకటింపబడలేదు. చాల వ్యయప్రయాసల కోర్చి దీక్షతోను, స్వార్థత్యాగముతోను రమారమి ఇరువది వత్సరములు నిరుపమానమైన వాఙ్మయ సేవచేసిన పూండ్ల రామకృష్ణయ్యగారి కాంధ్రులు మిక్కిలి కృతజ్ఞులై యుండవలయును.

---

# వనదృశ్యము

శ్రీరంగం శ్రీనివాసరావుగారు, బి. ఏ. (కవితాసమితి)

౧

కాననశోభ లీమెడే వి
కాసిల లే సెలయేటి యొడ్డునన్
నే నొక రాగరేఖ కర
ణిన్ తిరుగాడుదు, లోల భావనా
పానపథాలలో మలయ
మారుతసేవ ఘటిల్లగా, తరం
గానత గద్గదస్వనర
హఃకథికామధువారు లానుచున్.

౨

గగన విటంక మందఃకోన
గా పరువెత్తు నగాంచలమ్ములన్
సొగసుల ప్రోవుల క్లైగురు
చున్, వలమూవళులన్ రచించుచున్
దగకొనియున్న నాశ్రవణ
తత్పరతా పరితృప్తికిన్ సుఖ
మ్మగ నెలు గెత్తి పాడుకొను
పుల్గులె నాఎదమెచ్చు నెచ్చెలుల్.

౩

ఈ యెడ విస్తరిల్లు ప్రతి
హృద్యలతాంత పరిమళాల నా
లో యువకానుభోగ సర
ళుల్ పులకించు, రసప్రమోదపున్
తీయదనాలు నించుకొను
తీరన దత్ప్రితి క్రమవాయువుల్
నాయెద భావతంత్రుల ని
నాదిలచేయు నెవో కవిత్వముల్.

౪

ఈ వనదృశ్యమే కుముది
నీశ్వర భాస్వరహాసమై కళా
ప్రావరణమ్ములన్ తొణకు
లాడు, పురాస్మృతి సౌహృదమ్ములే
క్రోవలు తేరు నిచ్చట ని
గూఢ మనశ్శుభతోరణమ్ములై
దైవకృపాస్ఫటిద్యుతిని
ధానములే వికసించు పూవులై.

---

# గాంధీ - కృష్ణులు

మున్నంగి లక్ష్మీనృసింహ శర్మగారు

[కృష్ణుఁ డవతారపురుషుఁడని, ఎనమండుగురు భార్యలతోఁ, పదునాఱువేల గోపికలతోఁ వర్తించెనని, యమునాసికతాతలముల యందు వెన్నెల రేలలోఁ వేణుగానముతోఁ దమాలద్రుమముల మాటున రాధతోఁ డాఁగురుమూఁత లాడెనని, వెన్నలు దొంగిలెనని, కాళియుని మర్దించెనని, రాసక్రీడలు నెఱపెనని, గోవర్ధన మెత్తెనని, గోపికావస్త్రాపహరణము చేసెనని, కంసాదుల సంహరించెనని, భారతరణరంగమున నిలిచి పదునెనిమిది యధ్యాయముల గీత పార్థునకుఁ బాఠము సెప్పెనని, లోకాతీతుఁ డని చెప్పెడి గాథలను, వాని యంతరార్థములను అటుంచి ప్రకృతమునకు బద్ధుఁడ నగుదును.]

## గాంధి - కృష్ణుఁడు.

కృష్ణుఁడు ద్వాపరపురుషుఁడు; గాంధి కలియుగపురుషుఁడు. ఆతఁడు పురాణకథితుఁడు; ఈతఁడు సద్యఃప్రవర్తకుఁడు. ఆతఁడు పరోక్షము; ఈతఁడు ప్రత్యక్షము. ఆతని విద్యమానము గతము, వివాదగ్రస్తము; ఈతనిది వర్తమానము, ఆద్యారంభ ప్రతివాద రహితము. ఆతఁడు వ్యాసమహర్షి భావనాప్రవాహ సంభూతమగు నొక కెరటము; ఈతఁడు ప్రకృతిలీలాజాలకమునందలి యొక తరఁగ. ఆతఁడు యాదవుఁడు; ఈతఁడు వైశ్యుఁడు. ఆతఁడు సుందరుఁడు, బలవంతుఁడు; ఈతఁడు మామూలుమనిసి, దుర్బలుఁడు. ఆతఁడు భోగి, ప్రభువు; ఈతఁడు యోగి, పరివ్రాజకుఁడు. ఆతని విహారములు ఉద్యానవాటికలు, అంతఃపురములు, రథారోహణములు, రాజసభాభవనములు; ఈతని ప్రచారములు బీదల ఆకుగుడిసెలు, పొలములు, కాలినడకలు ఆశ్రమోపాంతములు.

## నీతి - ధర్మము

కృష్ణుఁడు నైతికప్రవణుఁడు; గాంధి ధార్మికబద్ధుఁడు. వాఁడు లౌకికుఁడు, చతురుఁడు; వీఁడు అలౌకికుఁడు, ఛాందసుఁడు. వానియందు రాజసము ప్రభుత్వముచేసినది; వీనిలో సత్త్వము పరాక్రమించినది. కర్తృత్వ రహితమైన హింసాచరణము కర్మయోగమని వాని యాదేశము; కర్తృత్వ-భోక్తృత్వాదికము భౌతికమునకుఁ దప్పనివగుట అహింసాచరణమే అనుష్ఠేయమని, అదియు కర్మయోగ మని వీనిమతము. నీతిపథమున ధర్మము సురక్షితమని వాని యుపదేశము; ధర్మమార్గమున నీతి సురక్షితమని వీని యనుభూతి. వాఁడు పాండవపక్షపాతి. విలయద్వారమున విజయము సాధింప నిశ్చయించినవాఁడు వాఁడు; తపస్సున సత్యపరాక్రమమున నార్జించినదే అవినశ్వరమగు విజయమని నమ్మినవాఁడు వీఁడు.

### కృష్ణుఁడు, నీతి - హింస

దుర్యోధనుఁడు పార్థుఁడును తన సాయముఁ గోరివచ్చినపుడు తనవంటివారిని గోపాలురను పదివేవురను జూపి, తన తాటస్థ్యమును, వారి సమరకోవిదబాహాటోపాభిరామత్వమును, వారి చాపాద్యాయుధకళావైశారద్యమును వివరించినాఁడు; దుర్యోధనుఁడు తన్నుఁ గోరికొనునేమో యని శంకించినాఁడు; పిన్నవాఁడు అర్జునుఁడు మును గోరపాడి యని పాడి తెలిపినాఁడు; మోహపెట్టినాఁడు—కృష్ణుఁడు; ఇది యొకనీతి.

"భూరిపరాక్రములను నారాయణాభిధానులను గోపాలురను దుర్యోధనుఁడు గోరికొనెఁగదా, నన్ను సంగ్రామారంభరహితునిఁ గోరికొనుట నీకు మేలగునా?" అని పార్థునిఁ బ్రశ్నించినాఁడు—కృష్ణుడు; -ఇది బావమఱఁదుల సరసము, అహంకారసమన్వితము, మానవత్వము—ఇదియు నొకనీతి.

"......ఇఁక నెడసేయక ప్రాణము లఱచేత నిడికొని యుద్ధమునకు నడవుఁడు......ఇట్టి నేను తేరుగడిప......కిరీటి నేఁడో రేపో ఎత్తివచ్చును. అపుడు మీ కెందుఁ బోవచ్చును?" అని కౌరవులకుఁ దెలుపుమని సంజయునిఁ జెప్పిపుచ్చినాఁడు—కృష్ణుఁడు; ఇది, సంధి యూతని కొడబాటు కాదని, రణమే కర్జమని తచ్చిత్తవృత్తి ప్రకటించినది; - ఇదియు నీతి.

"నిక్కముగా నే నలిగిన రణకేళికి మార్మొన నొక్కఁడేని గలఁడా?...... దైన్యము విడువుము. అరివర్గమును జయించుటవలన ఇహపరములును, చిరకీర్తియుఁ గలుగును.... అంతచేసియు నెన్నఁడును కౌరవులు పశ్చాత్తప్తులు గారు. అట్టిచోట కృపయు, బంధుత్వమును దలంపకుము......క్రూరాత్ములగు కౌరవు లెవ్వరికేని వధ్యు లగుదురు. అట్టివారు నీ కేల అవధ్యులు? పాపాత్ము లగు హింసకులను పాములనువలె నిర్విచారముగా వధించుట కర్తవ్యము......" అని ఎన్నియేని రోషములం బోసి ధర్మజాదులను బురిగొల్పినాఁడు; తన రాయబారము ఫలోన్ముఖము గా దని, యుద్ధమే నిశ్చితమని, కృష్ణుఁ డిరుతెఱఁగులకుఁ బొందుపఱుపఁ బ్రయత్నింపఁ డయ్యెనని అజ్ఞలనుకొందురని తా నిట్లు నటించుచున్నా నని, ద్రౌపదితో కుంతితో విదురునితో వెలువరించినాఁడు—ఇదియు లౌకికనీతిక్రమము.

నైతిక విజృంభణమున ధర్మదేవత దవ్వైనది. కపటము- అసత్యము- హత్య- హింస- పరిపాటియైనవి. భారతము పెద్ద పీనుఁగులపెంటయైనది. భీష్మద్రోణాది వీరులను కర్ణుని కౌరవశతమును తుదకు మేనల్లుని నభిమన్యుని వధావిధానమునకుఁ గృష్ణుఁడు విధియైనాఁడు. అది యాసుర నైతికయుగము.

మఱియు, చతురంగబల సమేతుఁడై రాజనీతికిఁ గొఱఁత లేకుండ రాయబారమునకు బయలుదేరినాఁడు కృష్ణుఁడు. ఆవేశము, ఆపరిభవము, ఆభాషణము, ఆచాతుర్యము-సర్వము నీతిసంపన్నము. అలౌకికమున లౌకికమే ఈపట్టునఁ గృష్ణునియందుఁ దోచువడినది.

యుగసంధి

ఈ యుగసంధియందు అసుర నైతికతంత్రములనడుమ నంకురించిన బుద్ధుని యహింసాధర్మము గానుఁగలలో నలిగిపోయినది. ఆ విలయమునుండి మొలచి మొక్కయై ప్రాకనుండిన జీససు భూతకారుణ్యము కంటక శిరస్త్రాణముతో శిలువను గ్రుచ్చఁబడెను. నైతిక తంత్రము మురిగినది. రక్తతృష్ణ సీమగడచినది. వైశ్యత్వము తలసూపినది; సాగినది. దాని యవసానదశ యంతయు దల్లి ప్రసవవేదనము-ప్రాణగండము. ధర్మోదయ మైనది. ప్రథమపాదము ప్రారంభమైనది.

గాంధి

గాంధి యవతరించినాఁడు. అతని తపస్సు పండినది. వైముఖ్యయోగము, సత్యపరాక్రమము అను దివ్యాస్త్రములను సాధించినాఁడు. వానిచే హింసాది క్రూరసత్వములను మార్కొన్నాఁడు. విశ్వరూపమును జూపినాఁడు. లోకమును నిర్వ్యాజపఱచినాఁడు. ధిక్కరించి పాలకులను రాయబారమున కొడఁబడినాఁడు. విమతుని విశ్వసించినాఁడు. పిలిపించుకొని వెడలినాఁడు.

ఆనుషంగికముగ నలవడిన వంచకత్వమును, హింసను గర్హించుచున్నాఁడు. వాని నిరంకుశము జేయఁ బ్రయత్నించుచున్నాఁడు. ధర్మప్రతిష్ఠాపనము వాని లక్ష్యము; వాని జీవనపరాకాష్ఠ. 'కత్తి నొకఁడు వ్రేసినను వేఱొకఁడు చందనం బలఁదిన నొంద మ య్యిరువుర మొడ నసమమ'. వ్యక్తులమొడఁ గ్రోధ మూని యొఱుఁగఁడు. అబిచ్చగాని వేసముతో, అకొల్లాయగుడ్డతో లండను రాయబారము నడపఁబోయినాఁడు. లార్డులతో సన్నిధి సేయుచున్నాఁడు. రాజసభలో ముప్పదియాఱుకోట్ల భారతీయులకుఁ బ్రవక్తయై, ప్రభువై కూర్చున్నాఁడు. అధికారమందిరము లన్నియు ధర్మదేవతాలయములు గావలయునని హెచ్చరించుచున్నాఁడు. సహజసాధువాదమునఁ బాశ్చాత్య వైశ్యనీతిని, అసురకృత్యములను పరాస్తము చేయుచున్నాఁడు. శాంకే ప్రభుఁడు, ప్రధానామాత్యుఁడు, రామ్సెమెగ్డానోల్డు, స్టేట్ సెక్రెటరీ హోర్ ప్రభృతులు, ఇర్విన్ ప్రభుఁడు, ఒకదేల బ్రిటీషునీతిని గాపాడుటకుఁ గంకణము గట్టిన 'లండన్ టైమ్సు' మొదలగు పత్రికలును ఆతని ధర్మవాదము నగ్గించుచున్నారు. బ్రిటీషుప్రజలు ఆతని ధర్మనిష్ఠకు, బుద్ధివైశద్యమునకు, వాదసారళ్యమునకు నివ్వెఱ గందినారు. లౌకికమున అలౌకిక సంపత్తినిఁ జూపినాఁడు.

లక్ష్యము - సామ్యము

కృష్ణుని లక్ష్యము ఆశ్రితవాత్సల్యము. విశ్వకల్యాణము గాంధిలక్ష్యము. ఆతని శృంగారజగత్తునకు విలాసునిగ, రాజ్యాంగమున నీతికళానిపుణునిగ, పతాకావలంబిగ, రణాంగణమున శూరునిగ, ధార్మికప్రపంచమునకు ఉపదేశికునిగ, ప్రకృతిని రాణివాసమునుగఁ జేసికొని మధురభావమున భోగించినవానిగ-వ్యాసుఁడు చిత్రించినాఁడు.

గాంధి బ్రహ్మచర్యగార్హస్థ్యములఁ దరించినాఁడు, బారిష్ట రైనాఁడు, ప్రకృతియందలి

శోకమయ ప్రపంచము తనదిగా భావించినాఁడు. ఆత్మశాంతికిఁ బ్రేమకన్న సంజీవని మఱియొకటి లేదని యెఱిఁగినాఁడు. ప్రకృతిని మాతృస్థానమున నుంచి పూజించుచున్నాఁడు. వానప్రస్థము స్వీకరించినాఁడు. ప్రభుని జీవనమున విలుప్తమైన తనివి తుష్టి శాంతి కష్టజీవిజీవనమునఁ గనిపట్టినాఁడు. అందు వానికి సాయుజ్యము.

కృష్ణుని సాధనవిధానములు సమయానుగుణములగు నీతులు శస్త్రాస్త్రములు. గాంధి సాధనవిధానములు వైముఖ్యయోగము, సత్యపరాక్రమము. ఆతఁడు హంతకుఁడు, హత్యాచరణముఁ బ్రోత్సహించెను; ఈతఁడు హత్యను గూర్చి వినునపుడు తల్లడిలువాఁడు. ఆతని రాయబారము హత్యలకు దారితీసినది; శేషించినవి రాజ్యము పేరిట నెత్తురుకూడు, తరింపరాని దుఃఖము; ఈతని రాయబారము ఫలోన్ముఖమైనను గాకున్నను తదుపక్రమిత సిద్ధాంతము సర్వప్రపంచమునఁ బరివ్యాప్తమైనది. ఆత్మరక్షణమునకు లోకభద్రతకు ఆ మహాస్త్రమే శరణ్యమని మానవకోటి గ్రహించుచున్నది.

పురాణాదుల పరమార్థములను, ఇతిహాసములయందలి సంవిధానములను, పూర్వ-పర సందర్భములను పరిశీలింతుమేని గాంధికిఁ గృష్ణసామ్య మెంతయుఁ జెల్లదని, వాఁడు యుగపురుషుఁడని, వానియుద్యమముఅజరామరమని, ఫలితము నిశ్చితమని తెలియఁగలము. ఆతఁడు కృతకృత్యుఁడు; సంకల్పసిద్ధుఁడు.

---

# వర్షాకాలము

కోరిబిల్లి వీరసోమ సత్యనారాయణ గారు

శ్రీమహితేంద్ర చాపమును జేకొని తోల్కరిరాముఁ డంబుద
శ్యాముఁడు గ్రీష్మరావణు శరావళిచేతను రూపుమాపి సౌ
దామని సీతతోడ వియదంచితపుష్పక మెక్కియేగ భూ
కామినితాప మారెను జగజ్జనముల్ ముదమంది రెంతయున్.

అరయ ఘనుండు మున్ను తనకై తరివేచిన చాతకద్విజో
త్కరముల తృప్తిజేసి పరితాపభరంబున ధూళివారు భూ
తరుణికి శాంతిగూర్చి ప్రజ తాలిమి జెందఁగఁ జేసె జీవనం
బిరవుగఁ దాల్చినందు కిదియేకద సార్థక మన్నరీతిగన్.

తన ప్రియుఁడైన భానుఁడు వితాకున తేజము దూలియుండ ప
ద్మిని కడుమోమువంచి సముదీర్ణమృదుచ్ఛదపాళి వానసీ
టిని తడిగొన్న తానటమటించుచు నట్టులయుండెఁగా దె దు
ర్దినములు వోవఁజూచుచు పతివ్రతకట్టుల నైజమేకదా.

మును తమలేములం దొలఁగి పూర్ణత బొందఁగనిచ్చు నుబ్బి, యొ
జ్జను కడునోంచి, భవ్యతరులన్ జలియింపఁగఁ జేసి వాహినుల్
జనియెడు వేగ నంబుకణ చంచలభాగ్యము శాశ్వతంబె! దు
ర్జను లిటు త్రుళ్లుచుందురు ధరన్ సదుమంత్రపుకల్మి గల్గినన్.

ప్రాకట్యజన్మభూమి నెడబాసి యనేకవిదేశసంచరో
ద్రేకభరంబుచేత చనుదెంచు నదీతతికెల్ల తాను ప్రా
పై కడు నాదరించె తనవారిగ పూర్ణకృపారసాప్తి ర
త్నాకరుఁ డౌర నైజమకదా సుగుణాఢ్యుల కిట్టి చందముల్.

ఆరయ నభ్రమధ్యసముదగ్రనగస్తననిర్గళత్పయో
ధారలు వొంగ తొల్కరిలతాంగి యొసంగిన పొట్టలుబ్బఁగా
కోరికఁ గ్రోలి పైరుపసుఁగుల్ మృదులానిలసంచలన్మనో
హారదళాగ్రహస్తములనల్లఁ గదల్చుచు కేరుచుండెడున్

పచ్చనిచేలతో తళుకు వన్నె మెఱుంగుల సూపులీలతో
నచ్చపు శక్రచాపమహితాకృతి కన్బొమ సోయగంబుతో
హెచ్చగు మబ్బువేణి తులకింపులతో, విరజాజితావితో
ముచ్చట గూర్చుచున్ ప్రకృతి ముద్దులగుమ్మ తనర్చె నెంతయున్.

కలకలనవ్వు లీనెడు మొగంబులు, సంపెఁగపూలమేలి క్రొ
వ్వలపులు గ్రుమ్మరించు కచభారములున్ జలతారురంగుడాల్
వలువ లెసంగ శ్రావణపు వాసరవేళల వాయనంబులన్
నెలతలు గొంచుఁబో ప్రకృతి నిత్యశుభాకృతిఁ దోఁచె నెంతయున్.

వేలారహితసముత్తాలామితవిశాల నీలాంబరవితాన కీలితంబు
వ్యాలోలసత్ప్రభా వాలోల్లసత్తటి న్మాలాసమీచీన మండనంబు
హేలాహరితసస్య జాలైకకంబళ శ్రీలాలితాయత క్షితితలంబు
లీలామృదుకలాప పాళీలసత్కేకి లీలావతీనాట్య లాలితంబు
కాలకవివర్య విరచిత కందశబ్ద - జాలనిస్తులప్రతిరావ సంభృతంబు
సరసమార్గానుసంగత తన్మధరంబు - నగుచుఁ గనుపట్టె ప్రకృతిసభాంతరంబు.

---

# పూర్ణపురుషుడు*

భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు

"బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర ధర్మము లన్నియు చుట్టచుట్టుకొని వచ్చి యీయనయందు మూర్తీభవించినవి. అట్టి పురుషుఁడు గాంధిమహాత్మ డొక్కడే. రెండవగాంధి మున్నెన్నడు లేడు."

లోకమునకు మార్గదర్శియగు పురుషుడు సర్వతోముఖముగ శక్తిమంతుడై యుండవలెను. అటులైనగాని అతడు లోకమును ఋజుపథమున, జయప్రదముగ నడపింపలేడు. అతనిసుగుణము లెట్లో అట్లే అతని విజ్ఞానసంపత్తియు అమూల్యమగు సహాయకారిగ నుండగలదు. ఈ రెంటికిని మకుటప్రాయమైనది స్వమత-మూలధర్మములందు గాంధిమహాత్మునకు పట్టుదల. హెచ్చు; లోకనియంతృత్వమునకు ఈపట్టుదల అవసరమే. అవసరమే గాక, నాయకత్వమునను ఇదే మూలాధారముకూడాను. అయితే, గాంధి విజయమునకు ఇది ఒక్కటే కారణము కాదు. అహింసాసత్యములందీయనకు అనన్యమగుభక్తి గలదు. వేయేల? ఆయన మతసార మంతయు ఇందే యిమిడియున్నది. అయితే గాంధివిజయమునకు యిది ఒకటే కారణము కాదు. ప్రతి పక్షీయెడ పూజ్యభావమును గాని, అతనివాదనయెడ సహనమునుగాని గాంధి ఎన్నడును వీడడు. ఇట్టి అసాధారణగుణవిశేషము మామూలు రాజ్యతంత్రజ్ఞులందు గానము. అయితే, గాంధి విజయమునకు కారణము ఇదికూడ కాదు.

గాంధివిజయమునకు కారణము ఆయన నమ్రగుణము; ఆయన నిరహంకృతి—ఆయనయం దుండు సహనము; అపారమగు కష్టసహిష్ణుత, నిస్తంద్రత; "సత్య మెన్నటికైన జయించగలదు. నేడు గాకున్న రేపైనను జయించగలదు. తొందరయేమి? అంతవరకు వేచియుండెదను"—అను ఓపిక; ప్రతివాదిని తనవైపునకు త్రిప్పుకొనగల నను అకుంఠితవిశ్వాసము. ఇవి ఆయన విజయమునకు కారణములు.

## లక్ష్యము మూలధర్మములందే!

ప్రతివాదిని భ్రూభంగములచే క్రుంగదీయడు. ప్రతివాదివాదనను సహానుభూతితో గ్రహించి, తన మోహనగుణముచే ఆకర్షించును. ఈసమ్మోహనాస్త్రము నెవరును ఎదిరించలేక లోబడుదురు. "ఇది యేమిరా, మూలసిద్ధాంతమునే వదలివేసినాడు"—అని గాంధి యనుచరులు తరచు విభ్రాంతు లగుచుందురు. కాని, కొంత దూరము పోయి పారజూచునప్పటికి మూలధర్మమునందు గాంధికి గల లక్ష్యము చెదరలేదనియు, అది అతినిర్మలమగను, ఋజుపథమందును గలదనియు గ్రహించుచుందురు. గాంధిలీలలను పరిశీలించి చూచినట్లయితే, యీ లక్షణము లన్నియు అందు గాన్పించును. పూర్ణపురుషుడు, రసజ్ఞుడు, చమత్కారి, వ్యవహారదక్షుడు, నిగ్రహానుగ్రహసమర్థుడు నగు గాంధిమహాత్ముని తత్తల్లీలలయం దీగుణగణము లన్నియు గానవగును. ఒక్కొక్క గుణవిశేషమునుగూర్చి పరిశీలింతము.—

## ౧. గాంధి - పూర్ణపురుషుడు:

లోకసంగ్రహార్థమై మహాపురుషు లుద్భవించినారన్నప్పుడు, వారి యవతారమునకు పూర్వము లోకమేస్థితియం దున్నది? ఏయేధర్మముల నాదర్శముగ

* ఈవ్యాసము ఆంగ్లమున 'బొంబాయి క్రానికిల్'లో ప్రచురింపఁబడినది. అదియే యిప్పుడు శ్రీమానికొండ సత్యనారాయణగారిచే తెలుగున వ్రాయబడినది.

గొన్నది? ఈ మహాపురుషులు వీనిని సంస్కరించుట కెట్లు పూనుకొనిరి? అను సంశయములగూర్చి తెలిసికొనవలసియున్నది. హిందూసంఘము యుగములకు పూర్వము కొన్ని పునాదులపై నిర్మింపబడెను; సర్వగ్రసనుడగు కాలపురుషుని ధాటికిని, అసంఖ్యాకములగు నితర దండయాత్రలకును చెక్కుచెదరక నిలిచినది. గాంధిమహాత్ముడు భారతజాతిని పునర్నిర్మాణ మొనర్ప అవతరించినా డని చెప్పినప్పుడు, ఈ జాతికి పూర్వము వేసిన పునాదు లెట్టివి? ఇప్పుడు గాంధిమహాత్ముడు వీని నెట్లు బలపరచదలచుకొన్నాడు? అను సంశయములగూర్చి వివరించుట మన విధియై యున్నది.

యుగములకుపూర్వము భారతఋషులు మానవులు చేయవలసిన కార్యములను ఐహికమనియు, పారలౌకికమనియు రెండువిధములుగ విభాగించి సంఘములో ఆయాతరగతులవారికి వీనిని విధించిరి. దేశధర్మముల నిర్వహించు బాధ్యతను బ్రాహ్మణులపై పెట్టిరి. వానిని అమలుజరిపి, అవి చెడకుండ కాపాడు బాధ్యతను క్షత్రియులపై పెట్టిరి; దేశసంపదను సేకరించుపని వైశ్యులకు పెట్టిరి. దేశసంపదను ఉత్పత్తిచేయు పని శూద్రుల దనిరి.

### తలొకపనిని నిర్ణయించిరి :

సంఘధారణకు కావలసిన కార్యముల నన్నిటిని విడివిడిగ విడదీసి వారివారికి పంచిరి. అయితే, విజ్ఞానముగాని, ధనముగాని, తమసొమ్మే యని ఎవరును విర్రవీగకుండుటకై, ఇందువల్ల ఒకరు ఎక్కువనిగాని, ఒకరు తక్కువనిగాని, అహంకృతితో నుండకుండుటకై, ఒక యేర్పాటు చేసిరి. అదే దనగ:—ఒకటి ఉన్నవానికి యింకొకటి లేకుండజేసిరి. విజ్ఞాన మున్నవానికి ధనము లేకుండజేసిరి; ధన మున్నవానికి విజ్ఞానము లేకుండ జేసిరి. ఇందులో ఏది కావాలో కోరుకో మనిరి. "పేదరికము స్వీకరించి సంఘస్థుల మెప్పుతో తృప్తిపడివుంటావా, లేక ధనధాన్యములతో తులతూగుచు అజ్ఞానములో వుంటావా? ఈరెంటిలో యేది కావలెనో కోరుకో" మనిరి.

కాని, కాలములు మారినవి. పూర్వపు అరలు—పూర్వపు పరిహద్దుగోడలు-కాలగతిని కరగిపోవొచ్చినవి. ఇవి చిరకాలము నిలువజాలవని తెలిసినది. కులములు, వర్ణములు ఒకదానిలో ఒకటి చొచ్చి, సంకరము లయినవి. దేశధర్మముల సంరక్షించు క్షాత్రశక్తి శిథిలమైనది. సంఘమునుండి యీశక్తి యెప్పుడైతే తరలినదో, బ్రాహ్మణునకు సంఘమునుండి వచ్చుచున్న మనోభృతి (Maintenance = మనోవర్తి) నిలిచిపోయినది. వాని బ్రతుకుతెరువు వాడు చూచుకోవలసివచ్చెను. తక్కిన సంఘస్థులతో పాటు వీడును నౌకరీ చేసియో, కూలినాలి చేసియో, పొట్టపోసుకొనవలసివచ్చెను. ఈకారణముచే సంఘములో విజ్ఞానసంపద నశించుటయే గాక, బ్రాహ్మణులు ఏధర్మములనైతే ఆదర్శముగ గొనిరో, అవన్నియు నీచదశ నొందినవి. బ్రాహ్మణుడును ఇతరులతో పాటు అధికారవాంఛకు, దురాశలకు, విషయలంపటతలకు, అందుకు సంబంధించిన సమస్తదుర్వృత్తులకు లోబడి పోయెను. సంఘము ఒక త్రోవ తెన్ను లేక, తెగిన హారములోని ముత్యములట్లు, చెల్లాచెదరైపోయెను. సంఘము అరాచక మయ్యెను. యంత్రములమీద తయారైన సరుకులు వచ్చి చేతివృత్తులు నశింపుచేసినవి. పరిశ్రమలు పాడైనవి; విజ్ఞానము శిథిలమైనది; కులములు నామమాత్రావశిష్టమైనవి.

### నేటి పౌరధర్మము :

కాబట్టి, హిందూసంఘమును ఇప్పుడు పునర్నిర్మాణ మొనర్పవలసివచ్చెను. వెనుకటి అరలనే తిరిగి నిర్మించుటకు వీలు లేదు. మానవులు సంఘధారణ కొనర్పవలసిన కార్యములను విడివిడిగ - కేటాయింపుగ - విడదీసి వెనుకటివలె పంచుటకు - వర్ణవిభాగ మొనర్చుటకు - సాధ్యము కాదు. వాంఛనీయమును కాదు. విజ్ఞానము, ధనము, చేతివృత్తులు, చదువులు — అన్నియు కలిసి యుండవలెను. ఇది నేటి పౌరుని ఆదర్శము. ఇది పూర్ణమును, అవిభాజ్యమును నైన పౌరవృత్తి. ఒకే పౌరుడు అటు ధర్మమును నిర్వహించుకొనవలెను, ఇటు అధర్మమును కాపాడుకొనవలెను, అతడే దేశసంపదను ఉత్ప

త్తియు చేయవలెను, దానిని సేకరించి అందరికి అంద జేయనువలెను. అనగ, ఒకేపౌరుడు బ్రాహ్మణుడై యుండవలెను; ఆతడే క్షత్రియుడై యుండవలెను; ఆతడే వైశ్యుడును, శూద్రుడునుకూడ నై యుండవలెను. ఇప్పు డున్న స్థితి యేమనగ అందరును శూద్రు లైరి; కాబట్టి, కొందరేమనుచున్నారనగ "అందరిని బ్రాహ్మణు లనుగ జేయవలె" ననుచున్నారు: కాని,

## బ్రాహ్మణుడు పూర్ణపురుషుడు కాడు :

బ్రాహ్మణుం డగుట యనగ, పూర్ణపురుషు డగుట కాదు. విరాట్పురుషుని శిరస్సునుండి బ్రాహ్మణుడును, భుజములనుండి క్షత్రియుడును, ఊరువులనుండి వైశ్యుడును, పాదములనుండి శూద్రుడును పుట్టినారని పురాణగాథలు చెప్పినప్పుడు, ఇందలి రహస్యము వవి విస్పష్ట మొనర్చియేయుండెను. వీ రందరు ఆపూర్ణ పురుషునిలో-విరాట్పురుషునిలో భాగములే గాని- మొం డెములే గాని—ఎవరిమట్టుకు వారు సంపూర్ణులు కారని పురాణములు ఖండితముగ — సంశయమున కెక్కడను తావు లేకుండ—తెగగొట్టి చెప్పిరే యున్నవి. కాబట్టి, "దేశా న్నంతా బ్రాహ్మణులను చేసివేస్తా" నని బయలు దేరుట తప్పు. దీనిబట్టి యేమి ధ్వనించుచున్నది ? బ్రాహ్మణుడు తక్కినవారికంటె అధికుడని ధ్వనించుట లేదా ? ఇది తప్పు. వర్ణములలో-కులములలో- ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ అనే భేద మేమియు లేదు. బుజాలకంటె తల యెక్కువ యని గాని, పాదాల కంటె తొడ లెక్కువ యని గాని, ఉన్నదా ? ఏ ఒక్కటి గాని, తక్కిన మూడు లేనిది, రాణించదు— తక్కిన మూడు లేనిది ఎందుకు పనికిరాదు. అందు చేతనే, "అన్నికులాలను బ్రాహ్మలను చేసివేస్తా" నని చెప్పడం తప్పని చెప్పుచున్నాను.

## అపూర్వసమ్మేళనము :

సరియైన పునర్నిర్మాణసూత్ర మేమి ? ప్రతి పౌరుని (ఒక్క-బ్రాహ్మణునిగానే గాక) సంపూర్ణమాన వునిగ చేయుటయే సరియైన మార్గము. ప్రతిపౌరుడు సర్వతోముఖముగ, సంపూర్ణముగ, పూర్ణపురుషుడుగ— వికాసము నొందవలెను. ఇట్టిపౌరుడు గాంధి. ఇట్టి పరిపూర్ణవికాసమునే లోకమునకు తేవలెనని గాంధి పాటుపడుచున్నాడు.

## గాంధి బ్రాహ్మణుడు :

ఆతడు హిందూధర్మసారమును నిర్వచించి, తన యందు నిక్షేపించుచున్నాడు.

## గాంధి క్షత్రియుడు :

ధర్మరక్షణకై తన ప్రాణములను దేశమాత పాదకమలములందు సమర్పించుచున్నాడు. క్షత్రియు డంటే మరి యింకేమడు ?

## గాంధి వైశ్యుడు :

జన్మచేతనే గాక, చేయుకర్మయందును వైశ్యుడు. దేశసంపదను సేకరించి, దేశప్రజలకు అన్నవస్త్రాదిక ములనొసంగుటకై పూనుకొన్నాడు. ఇదే వైశ్యధర్మము.

## గాంధి శూద్రుడు :

అన్నవస్త్రాదికములను సేకరించి పంచుటయే గాక, అన్నవస్త్రాదికసంపదను ఆతడు ఉత్పత్తి చేయుచున్నాడు. అతిసమర్థతతో, భక్తి, ప్రేమలతో మానవసేవ చేయుచున్నాడు: ఇది శూద్రధర్మము. ఈ సేవా ధర్మ మందే ఆయన కెక్కువ ప్రీతి.

ఒకసభలో ఒక గాంధిభక్తుడు గాంధిని 'నీవు బ్రాహ్మణునకంటె అధికుడవు' అని పొగడినప్పుడు- "అయ్యో, నన్ను నీవు 'శూద్రులలో కెల్ల శూద్రుడ' వని పొగడెద ననుకొంటిని ? ఇదేల నా కాశాభంగము చేసితి" వని చెప్పెనట !

ఇదిగో పూర్ణపురుషు డనగ నీతడు ! ఈతడు బ్రాహ్మణులలో కెల్ల బ్రాహ్మణుడు, క్షత్రియులలో కెల్ల క్షత్రియుడు, వైశ్యులలో వైశ్యశిఖామణి, నిత్య మనుష్ఠించుమానవసేవాధర్మముచే శూద్రులలోని కెల్ల శూద్రుడు. "నేను రైతును, నేతగాడిని" అని ఒకచోట చెప్పుచున్నాడు. రైతును, నేతగాడు నుమాత్రమే కాదు. ఈతడు ఋషియు, సైనికుడును. ఋషిగ నుండి "ఋక్కులను", "సూత్రము"లను ఉద్ఘాటించెను. సైనికుడుగ

నుండి తన జీవితమును వీక్షణమందైనను పర లోకరక్షణకై బలి యివ్వ కంకణము కట్టుకొన్నాడు. వడుకు, నేత, వృత్తిని పునరుద్ధరింప బూని, లోకమునకు అన్న వస్త్రాదికముల నిచ్చుటకై, దేశసంపదను సేకరించుచు, దానిని పంచుమ రైతులలో రైతై, కోమటులలో కోమటిరై మెలగుచున్నాడు.

ఈపూర్ణపురుషుడు, ఈ సంపూర్ణ ఈశ్వరవ్యక్తి, ఈనూతన యోగపురుషుడు అల్లదిగో! నేడు మన చర్మచక్షువులకు గోచరమగుచున్నాడు. మిత్రసఖ్య భావములతో మనతో కలిసిమెలిసి తిరుగుచున్నాడు. మనమీద చెయివేసి చెట్టాపట్టాలు పట్టుకొని తిరుగుచున్నాడు. మనతో మాట్లాడుచున్నాడు. మనను చూచుచున్నాడు. మనము ఆయనను చూచుచున్నాము. అలనాడు శ్రీకృష్ణావతారములో రేపల్లెలో బృందావన వీధులందు కలిసిమెలిసి తిరిగిన గోపకులదే భాగ్యము; నేడు మనదే భాగ్యము.

పూర్వకాలమున అవతారములు వచ్చినవి, పోయినవి. మనము చూడలేదు. ఆరోజులలో ఆసంగతి కొలది మందికే తెలిసెను. నేడు ఈనూతనావతారము, మన మధ్య అవతరించి, హిందూసంఘములో నింతకాలము నుంచి పట్టినపాచిని కడిగివేసి కళంకమును క్షాళనమొనర్చి క్రొత్తగ తిరిగి గట్టిపునాదులను వేయుటకై మనతో కలిసిమెలిసి పనిచేయుచున్నాడు. ఈఅవతారమూర్తి కీర్తి భరతఖండమును దాటి, విశ్వమున కంతకును తెలుపు పూత గావించినది.

[వెనుకటి యవతారములలో రామావతార మొక్కటే సంపూర్ణావతార మని చెప్పుట కలదు. ఈశ్వరుడు తన సర్వసంపూర్ణకళలతో ఈలోకమునకు రామరూపమున వచ్చివేసెనట. అందుచే వైకుంఠము పాడువడెనట! అట్టి సంపూర్ణావతారమును నేడు తిరిగి మనము గాంధిరూపమున చూచుచున్నాము.]

### ౨. గాంధి—ఖచితమైన మనిషి:

నూతనభారతజాతినిర్మాతగ మహాత్ముని వర్ణించితిమి. పూర్ణపురుషుని లక్షణము తాను జన్మించిన దేశములోని సభ్యత నొక్కదానినే గ్రహించుట కాదు. పరిపూర్ణత కిది చాలదు. ప్రపంచములో ఏ ఒక్కజాతికి గాని పరిపూర్ణత, సర్వజ్ఞత కలుగజాలదు. అట్లని ఏ జాతిగాని గర్వింప వీలులేదు. పాశ్చాత్యులు పౌరస్త్యుల నుండియు, అట్లే పౌరస్త్యులు పాశ్చాత్యులనుండియు నేర్చుకొనవలసినవి ఎన్నియో కలవు. కాలము విలువ పాశ్చాత్యు లెరిగినట్లు ఇంకెవరు నెరుగరు. ఇది వారి సుగుణములలో ప్రధానమైనది. అందుచే వారు అనుకొన్నపనిని అనుకొన్నవేళకు తప్పక చేయుదురు. (మనవలె వారు "అతిథులు"—'వేళాపాళా లేనివారు' కాదు.) ఇంతే గాక వారి భావములును నడవడియుకూడ ఖచితముగ నుండును.

### ఒక్కొక్కప్పుడు ఎదుటివానిని ఎక్కువగ నమ్మును:

అనుకొన్నపనిని అనుకొన్నవేళకు ఒకనిమిషము కూడ అటునిటు తప్పకుండ చేయుటలోనే గాక, యితర నడవడులలో సైతము చాల ఖచితమైనవాడు. ఖచితమైన మనిషి, అతి మెత్తదనమును గాని, అతి కారుణ్యమును గాని చూపజాలడు. సమయము వచ్చినప్పుడు ఖచితముగ మాట్లాడవలెను. లాల్లీకి లోబడక కరారుగ నిలబడవలెను. ముఖప్రీతిమాటలు ఆయనకు పనికిరావు. మనస్సులో ఉన్నమాటను ఖండితముగ పైకి చెప్పవలెను. ఇదియే త్రికరణశుద్ధి. ఇట్టి త్రికరణశుద్ధి గాంధికి గలదు. ఇట్టి మనిషి ఎదుటివానినిగూర్చి అనుమానించరాదు. అయితే అతిగ నమ్మనురాదు. గాంధి ఎవరిని అనుమానించడు. కాని, ఒక్కొక్కప్పుడు ఎదుటివానిని ఎక్కువగ నమ్మును. అది ఒక పెద్ద తప్పు కాదు. వీల యనగ, నమ్మకుండ ఉండడానికి వీలు లేనప్పుడు, ఇక గత్యంతర మేమి? నమ్మవలెను. నమ్మవలెననగ సగము సగముగ నమ్మడమనునది లేదు. కాబట్టి పూర్తిగానే, మనఃపూర్తిగానే నమ్మవలెను. అయితే ఎదుటివానిని నమ్ముచున్నాడనగ కళ్లు మూసికొని గోతిలో పడుచున్నాడని అర్థము కాదు. అందు విచక్షణయు గలదు.

3. గాంధి వ్యవహార్త —

రాచకీయముకూడ గొప్ప వ్యాపారమే. కాని వ్యాపారమును రాజకీయమును సాధారణముగ కలిసి యుండవు. ఏలయనగ, ముఖ్యముగ మన దేశములో రాజకీయమందు త్యాగము కావలసి యున్నది. అయితే వ్యాపారములలో, వర్తకసరళిలో, ఇది పనికిరాదు. వ్యాపారమునకు లాభసాటి దృష్టి కావలెను గాని, త్యాగదృష్టి పనికిరాదు. వ్యాపారములో అణాలు దమ్మిడీలు కడ మంచి లెక్క వేసి చూచుకొనవలెను. ఇట్టి వ్యవహారములో త్యాగ మెట్లుండును? ప్లీడరు తన వృత్తిని మానుకోవలసి వచ్చినప్పుడు, శాసనసభకు నిలువబడిన యతడు తన అభ్యర్థిత్వమును మానుకొని తన అధికార వాంఛల నన్నిటిని చంపుకోవలసి వచ్చినప్పుడు, వర్తకుడు తన కెంతో లాభకారిగ నున్న సీమబట్టల వర్తకమును మానుకోవలసి వచ్చినప్పుడు, కల్లు యిజారాదారుడు తనకు వచ్చుచున్న అపారద్రవ్యలాభమును మానుకోవలసివచ్చినప్పుడు, ద్రవ్యలాభమును గుణించుకొనుచు కూర్చున్నచో ఇక అందు త్యాగమునకు తా వెక్కడ నున్నది? ఇట్టి త్యాగ మున్న గాని మన దేశముయొక్క ప్రస్తుతస్థితిలో రాజకీయములో అడుగిడుటకే వీలు లేదు. కాబట్టి మన దేశపు రాజకీయములో వ్యాపారసరళి కెక్కడను తావు లేదు. ఇంతకంటె అతీతమైన త్యాగశక్తి కావలెను. స్వతంత్రము ననుభవించుచున్న దేశములలో రాచకీయ మేవిధముగ నున్నను అస్వతంత్రముగ నున్న మన దేశములోమాత్రము రాచకీయమందు త్యాగశక్తి కావలెను. లాభనష్టముల గుణకారము పనికిరాదు. ఈలాభనష్టముల గుణకారము రాగానే తెగించి ముందుకు పోవు సాహస ముండదు. ఇట్టి సాహసము లేనిచో రాజకీయమందు- ముఖ్యముగ ఇండియావంటి పరాధీనదేశములో- రాజ్యపరివర్తనమునకు కావలసిన రాజకీయమందు- ప్రవేశించుటకే వీలు కలుగదు. ఇది సాధారణముగ లోకములో జరుగుచున్న వ్యవహారము.

కాని, గాంధీ అసాధారణపురుషుడు. విప్లవ రాజకీయమునకును వ్యాపారమునకును చక్కగ సామరస్యము కుదిర్చినాడు. ఇది ఎట్లు సాధ్యమైనది? ఎట్లనగ, గాంధి పూర్ణపురుషు డని చెప్పితిమి. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర లక్షణము లన్నియు నీయనయందు సమ్మేళనమైయున్నవి. కావుననే రాజకీయమునకును వ్యాపారమునకును తనయందు సామరస్యమును కుదుర్చుకొన గలిగినాడు. పూర్ణపురుషు డిట్టి అసాధారణసమ్మేళనమును కుదుర్చుటలో అతిశయోక్తి యేమియు లేదు. ఇదియే పూర్ణపురుషునకు సహజమగు లక్షణము. ఇట్లు చేయజాలనిచో అతడు పూర్ణపురుషుడే కాజాలడు. గాంధి గర్వితుడగు పండితుడు గాడు. గ్రుడ్డిగ ముందుకు దూకు సైనికుడు గాడు. కేవలము నీచముగ రూపాయి అణాల లాభమునే చూచుకొను కోమటి కాడు. లోకజ్ఞానము లేని మోటురైతు కాడు. గాంధి పూర్ణపురుషుడైనాడనగ బ్రాహ్మణున కుండవలసిన విజ్ఞానము, పారలౌకిక భక్తి, క్షత్రియున కుండవలసిన త్యాగము, దేశభక్తి, వైశ్యున కుండవలసిన లాభనష్టముల గుణకారము, శూద్రున కుండవలసిన అపారకష్టసహనము, పరిశ్రమ, యీలక్షణము లన్నిటిని తనయందు మూర్తీభవింపజేసికొన్నాడనియే భావము. ఈచాతుర్వర్ణ్యలక్షణముల సమ్మేళనము, ఈసామరస్యము ఈతనియందే చక్కగ కుదిరినది. దీనివలన అత్యాశ్చర్యకరములగు ఫలితములు గలిగినవి. ఈయన విజ్ఞానము కేవలము కంటికి కనబడని పరలోకమునకే గాక యిహలోకమునకుకూడ ఉపకరించునది యయ్యెను. ఈ విజ్ఞానము క్రియారూపమున లోకోపకారముగ వినియోగపడినది. ఇది ఆయనయందున్న క్షాత్రశక్తిని విచ్చలవిడిగ ఎగిరిపోకుండ, చక్కగ నిగ్రహించి, మంచిత్రోవలలోనికి త్రిప్పినది. ఆయనయందున్న లాభనష్టముల గుణకారమును అత్యున్నతస్థాయిలోనికి తీసికొనిపోయినది. కాయకష్టమును విజ్ఞానములో కూడిన ఉన్నతాదర్శములకు ముడిపెట్టినది. ఇట్టి లక్షణములు ఆయనయందు ఏకీభవించి యుండుటచేతనే, గాంధి మహాత్ముడు భరతఖండమునకు గణితశాస్త్రరీత్యా ఖచితమైనదే గాక, సర్వవిధముల ఆచరణయోగ్యమైన—లాభనష్టముల గుణకారములకు అగగలిగిన—మంచి పటుత్వమైన—కార్యప్రణాళికను ప్రసాదింపగలిగెను.

### బార్డోలీ యుదంతము :

తొందర పనికిరాదని గాంధి అనేకసార్లు దేశమునకు చెప్పియున్నాడు. ఆయన వెనుక బార్డోలీలో ఉద్యమమును నిలిపివేసినప్పుడు, అప్పుడు చెరసాలలో నున్న లాలాలజపతిరాయి, మోతీలాల్ నెహ్రూ, మహాదేవదేశాయి, జార్జి జోసఫ్ మున్నగు నాయకు లందరు గాంధిమీద పటపట పండ్లు కొరికిరి. కాని గాంధి చెదర లేదు. తానేమి పనిచేయుచున్నాడో ఆయనకు తెలుసును. అహింసాసిద్ధాంత మనునది ఆయన కేవలము అధికారుల దౌర్జన్యమునకు జంకి, దానినుండి దాగుకొనుటకై చెప్పిన టక్కరిమెత్తు కాదు. ఆయన ఉద్యమమునకు అసలు మూలసిద్ధాంతమే యిది. ఈమూలసిద్ధాంతమునే ప్రజలు పాటించనప్పుడు, ఆయన తన ఉద్యమమును ఆపివేయవలసినదే. ఇది చాల సున్నితమైన వ్యవహారము. ఇందు ఆత్మవంచనకు తావు లేకుండ చూచుకొనవలసియున్నది. తనకు పిరికితనము తోచినప్పుడు, అహింస యను మాటను అడ్డమువేసుకొని, దానిక్రింద కొందరు దాగుకొనవచ్చును. వెనుక బార్డోలీలో ఉద్యమమును ఆపివేసినప్పుడు గాంధిగారు కేవలము పొరపడిరనియే గాక, యీ పిరికితనమును సహా ఆయనకు చిన్నలును, పెద్దలును అంటగట్టిరి. కాని,గాంధిగారికిగల సహజజ్ఞానము ఇట్టి భ్రమలకు లోబడునది కాదు. బుద్ధి కల్పించు కుతర్కములకు గాని, మనస్సాక్షి తీయు తప్పుత్రోవలకు గాని లోబడక, అతీతమై యీశ్వరప్రేరితమై వెలుంగు సహజజ్ఞానము ఆయనకు గలదు. లోకులు సాధారణముగ బహుళసిద్ధాంత రాద్ధాంతములచే తేల్చు సమస్యను గాంధిగారు ఒక్క చిటికెలో తన యంతర్దృష్టిచే పసిపట్టి కనుగొందురు.

### గాంధి జూదరి కాడు :

కడచిన పదిసంవత్సరములనుండి గాంధిగారు ఎందఱో మనుష్యులతోను ఎంతో డబ్బుతోను కూడ మెలగవలసివచ్చెను. ఈ రెంటిలోను కూడ ఆయన చాల ఖచితముగ నుండెను. ఒడుదొడుకులేమియును లేవు. డబ్బును జూదరి కోరుతనముగ నిర్లక్ష్యముగ పాడుచేయలేదు. తన యనుచరులనుండి దమ్మిడీ దగ్గరనుంచి లెక్క పుచ్చుకొనును. ఒక్కక్షణము కాలము వృథ కానివ్వడు. రాత్రి ఎంత ప్రొద్దుపోయిన సరే లెక్క తేల్చనిది యేయనుచరుడు గాని నిద్రపోవుటకు వీలు లేదు. ఇది బహుళకఠినమైన సాధన; అసిధారావ్రతము. అయితే తప్పు చేసినవానిని ఆజన్మాంతము వేధించి చంపుతునే వుంటాడని కాదు; పరులను విమర్శించుటలో ముక్కోపితనము గాని, దీర్ఘవైరమును గాని పూనడు. పరుల తప్పులను బయట వేసి, అదేపనిగ టముటమా వేయుట అతని పని కాదు. అదేపనిగ కత్తిపూనడు; కుట్టేపురుగు వలె పగపట్టడు. అట్టిపనులు చేయతగినవైనచో చిన్నకుర్రవాళ్లు చేయవలసినవే. కాని, గాంధి చేయడు. తప్పు కనిపించితే, "ఇదిగో, యిది తప్పుసుమా" అని మొగమోటమి లేక చెప్పిచూపి యూరకుండును. అంతే. అయితే, నిజమాడిన నిష్ఠురమన్నట్లు, ఆయన చెప్పిన ధోరణిని కొందరపార్థము చేసికొనుటయు కలదు.

### ఆయనమాటల తీరు :

"జాతీయవిద్యాలయములను తీసికొనిపోయి, గవర్నమెంటుసంస్థలలో చేర్చుట మంచిదని మీకు తోస్తే-అట్లాగే చేయవచ్చును"—అని గాంధిగా రందురు. ఈమాట కర్థ మేమి? వీనిని గవర్నమెంటులో చేర్చడానికి గాంధిగారు ఒప్పుకొన్నారని అర్థమా? అట్లెన్నడును కాదు. నిష్పక్షపాతముగ, నిర్మలమైన దృష్టితో, చూచినట్టయితే యిట్టిపనికి గాంధి యెన్నడు ఒప్పుకొనడని స్పష్టము కాగలదు.

"సమష్టిశాసనోల్లంఘనమునకు ఢిల్లీలో విధించిన షరతులు మీజిల్లాలో పూర్తియైనవని మీరు తలచినట్టయితే,-మరియు, ఇది జయప్రదముగ కొనసాగుటకు సహేతుకమైన అవకాశము లున్నవని మీకు తోచినట్టయితే,-'కా'దని చెప్పుటకు నాకు హక్కు లేదు. కానివ్వండి-భగవంతుడు మీకు తోడ్పడునుగాక"- అని వెనుక పల్నాడులో పన్నుల నిరాకరణముగూర్చి గాంధిగారు వ్రాసిరి. ఈమాటల యర్థ మేమి? పల్నాడులో పన్నుల నిరాకరణమునకు గాంధిగారు ఒప్పుకొన్నా రనియా? ఎంతమాత్రము లేదు. పైవాక్యములో ప్రతిమాటకు అర్థ మున్నది. "మీరు తలచినట్ట

యితే", "మీకు తోచినట్టయితే" అనుమాటలలో ఢిల్లీషరతులు పూర్తికాలే దనుశంక, జయమున కవకాశము లేదను శంక గాంధిగారు ధ్వనింపజేసిరే యుండిరి. చివరి వాక్యములో "మీకు ధైర్య ముండి మీరు చేయ దలచుకుంటే, వద్దనడానికి నా కేమి హక్కు వున్నది" అనిరి. అంతే—ఇట్టి సందర్భములో నైతికముగను, న్యాయముగను గాంధిగారు చెప్పవలసిన మాట అంతే—ఆమాటనే చెప్పెను.

## క్షమించుట కేమి ఉన్నది?

గాంధిగారి మాటలలో ఎంతసూటి వున్నదో ప్రవర్తనలోకూడ అంత సూటి వున్నది. వ్యాపారస్థుడు గుణకారము వేయునే గాని, సాధారణముగ ఉత్సాహముతో ముందుకు రాడు. ఇందులో వున్న చిక్కు యిది. కాని, యిట్టిలోటు గాంధిగారిలో లేదు. ఆయనయందు అత్యుత్సాహము, సాహసము కలదు. ఆయనహృదయము అతివిశాల మైనది. ఆయన క్రోధమును మనస్సులో పెట్టుకొనడు. పరులు తనకు చేసిన అపకారమును, అవమానమును అదేపనిగ మనస్సులో పెట్టుకొని విచారగ్రస్తుడు కాడు. అట్టివానిని మరచిపోయి, అపకారిని క్షమించును. ఇదియే ఆతని జీవితమును నడిపించు మూలసూత్రము. అంతదూర మెందుకు?—నిజ మాలోచించినచో, ఆయన "క్షమించ" వలసినదే లేదు—ఏల యనగ, "పరులు నాకంటె తక్కువవారు, నేను గొప్పవాడిని. కాబట్టి, నేను వారిని క్షమించవలెను" అను అహంకారమే ఆయనకు లేదు. నేను ఒకరిని క్షమించుచున్నా ననగ, పరులకంటె నేను నాయం దేదో ఆధిక్యమును ఆరోపించుకొనుచున్నా నన్నమాటయేగద! ఇట్టి ఆరోపణను గాంధి ఎన్నడును చేసికొనడు. కాబట్టి, ఆయన క్షమించుట కేమి వున్నది? ఆయననాయకత్వము సౌభ్రాత్రమే గాని వేరొండు కాదు. ఇదియే ప్రజానాయకలక్షణము. గాంధి అందరియెడను గౌరవము చూపును. అయితే, తనకంటె పెద్దలయెడ చూపు గౌరవము నమ్రతగను, భక్తిగను పరిణమించును; తనతో సమానులయెడ చూపు గౌరవము మర్యాదగ గన్పట్టును; తనకంటె పిన్నవారియెడ చూపు గౌరవము బుజ్జగింపుగను, ప్రేమగను, ఆశీస్సుగను గన్పట్టును. బిసెంటమ్మ, మాలవ్యాలను గాంధి పూజించును; లాలాజీ, దేశబంధుదాసులను మర్యాదగ జూచును; వల్లభభాయి, జవహర్‌లాలులను బుజ్జగించును.

## ౪. గాంధిగారి చమత్కారము, రసజ్ఞత:

చమత్కార మనుదానిని గ్రహింపవలెనే గాని, విప్పి చెప్పుట చాల అసహ్యముగ నుండును. పరులను నవ్వించలేనివాడు తాను నవ్వ లేని వాడు, వట్టి కూబి. వాని స్థితి నిజముగ జాలిగొలుపును. ఎప్పుడు మొగము తుమ్మలలో ప్రొద్దుగూకినట్లు, దశాహశ్రాద్ధములలో భోక్తగా కూర్చున్నట్లు, చిట్టాముదపు పుచ్చు వండినట్లు, ఉండువాడు కుటిలతంత్రములకు, కుట్టిపురుగు బుద్ధులకు పనికివచ్చునే గాని సర్వసంపూర్ణకళలను చక్కగ మేళవించి ప్రజలకు నాయకుడై, అగ్రేసరుడై నడచు ధీరోదాత్తనాయకునకు పనికిరావు. అయితే, వెకిలితనము గాని, వికటహాస్యము గాని పనికివచ్చుననియు చెప్పము. హాస్యములో ఉన్నతమైన హాస్యము కలదు. నీచమైన హాస్యమును కలదు. నీచమైన హాస్యము అసభ్యము; గ్రామ్యము. ధీరోదాత్తనాయకులు దానివంక బోరు. హాస్యరసమును సూచించి, మందహాసము మోమునందు చిందులాడజేయవలెను. ఇది రసజ్ఞుని లక్షణము. రసమును ఆనందింపజేయవలెనే కాని, రసాభాసము చేయరాదు. రసజ్ఞత ధీరోదాత్తనాయకలక్షణము. "ఈలక్షణమే, యీహాస్యరసజ్ఞతయే నాకు లేనిచో, నే నెన్నడో క్రుంగిపోయియుందును" అని గాంధిగారొకప్పు డనిరి.

చమత్కృతి ఒకప్పుడు ఎదుటివానికి చివుకున ముల్లు గ్రుచ్చుకొన్నట్లగును కాని, చక్కని హాస్యరసముతో కూడిన పరిహాసము— నవ్వుటాలకనిన మాట—ఎదుటివానిలో మంచు రసమును చిప్పిలచేయును; ఊరించును. ఎదుటివాని మనస్సు నొచ్చునట్లు యద్దేవా చేయుట అందరికి సులభమే గాని, ఎదుటివానిలో మందహాసమును కల్పించు—హాస్యరసమును ఊరించు—పరిహాసము చేయుట మాత్రము అందరికి చేతకాదు. యద్దేవా చేయుట బుద్ధి

చమత్కారము—తెలివిగలవాడెవడైనను ఇది చేయవచ్చును. ఇది బుద్ధిలక్షణము. కాని, మందహాసమును కల్పించుట విశాలహృదయము గలవాని లక్షణము. ఇది మంచి మనస్సుయొక్క లక్షణము. చమత్కారముగ మాట్లాడబోయి, యెదుటివానికి నొప్పి కలిగించవచ్చును. ఒక్కొక్కప్పుడు కొంచెము నొప్పియే మిగులును గాని, చమత్కార మేమియు కనిపింపక పోవచ్చును. (అప్పుడే నవ్వులు నువ్వులగును.) వయస్సుబట్టి, ఆయవస్థితిబట్టి, పలుకుబడినిబట్టి, ఒక్కొక్కప్పుడు ఆయన చమత్కార వాక్యములలో కొంత చురుకుదన మున్నప్పటికి, ఆయన అంతర్యశుద్ధినిబట్టి అవి ప్రేమవాక్కులుగను, ఆశీస్సులుగను పరిగణింప బడుచుండును.

"విఠల్ భాయిని వర్కింగుకమిటీలోనుండి మాన్పించవలెనంటే నేను మాన్పించవలెను గాని, ఆయన మానుకొనుటకు వీలులేదు" అని వెనుక 1921 సం.లో అహమ్మదాబాదులో వర్కింగుకమిటీలో నుండవలసిన మెంబర్లనుగూర్చి మాట్లాడుచు గాంధి చెప్పెను. ఇది ఎదుటివానికి ముల్లుగ్రుచ్చుకొనుమాట. కాని, యీముల్లు చివర విషము లేదు. ఇది విషలిప్తమగు బాణము కాదు. అది యీప్రక్కను గ్రుచ్చుకొని ఆప్రక్కను పోవును. దానివల్ల హాని యేమియు లేదు. దెబ్బతిన్నవానిని మరింత హుషారీచేయవచ్చునే గాని, హానిచేయదు. ఇంతకంటె మెచ్చుకోదగినది, తక్కువనుకుకైనది, యింకొకమాట వున్నది. "విఠల్ భాయిచేతిలో ఎంత మంచి రాజ్యాంగ ప్రణాళికనైనా పెట్టండి. దానిని ఒక్కక్షణములో తుంపులు తుంపులు చేసిపెడతాడు" అన్నాడు గాంధిగారు ఒకమాటు. నిజమే. ఇందుకు సందేహమేమియును లేదు. ఈసంగతి గవర్నమెంటువారికి బాగా తెలిసివచ్చినది. మాంటేగ్యు ఇచ్చినప్రణాళికను విఠల్ భాయి అసలు వెనుకనే చింపిపారవేస్తాడనుకున్నాము. కాని ఎందుకనో, ఆయనకూడ ఆకిరాతకార్యము చేయడానికి జంకినాడు.

౫. "తలలు పోవడం":

"ఇవ్వాళ్లి ప్రొద్దున్న బయలుదేరడానికి రెండు నిమిషాలు ఆలస్యమెందుకైనది" అన్నాడు గాంధిగారు వెనుక ఆంధ్రదేశసంచారానికి వచ్చినప్పుడు ఒకరోజు ఉదయాన. కొంచెము భయపడుతూ, భయపడుతూ, "......పలానివారి చేతిసంచి పోయింది. కనబడలేదు. అందుకోసం ఆలస్యమైంది" అని ఎవరో సమాధానము చెప్పారు. "ఓ! అట్లాగా కొందరికి తలకాయలే పోతయి, చేతిసంచులే కాదు" అన్నాడు గాంధి గారు. ఈ మాట అనడంతోటే ఎదుటివారి భయముఅంతాపోయి వారుకూడ హాస్యానికి దిగడానికి బలే హుషారుగా వుంటుంది.

తననుగురించి తాను తక్కువగ చెప్పుకోవడం ఒకవిధమైన హాస్యం. ఇంతకంటె ఎక్కువైన హాస్యము ఒకవిధముగ పైకి కనబడకుండ తనను గురించి తాను ఎక్కువగ చెప్పుకోవడము. గాంధిగారితో కలిసిమెలసి మాట్లాడడమే గొప్పఆనందము. గొప్పవిద్యాసముపార్జనావిధానము. ఏలయనగ, ఆయనమాట లెల్లప్పుడు మంచి రసవత్తరముగ నుండి తత్తత్కాలోచిత మగు రసముతో చిప్పిలుచుండును. ఈమధ్య చమత్కారపు మాటలు, పరిహాసవాక్యములు గాంధిగా రెక్కువగ మాట్లాడ మొదలిడినారు. దీనికి ఎదుటివారి ప్రవర్తనయే కారణము. వారి చొప్పదంటుప్రశ్నలను, విపరీతప్రవర్తననుచూచి, గాంధిగారు వేళాకోళము చేయక ఏమి చేయుదురు? ఇది ఎదుటివారి ప్రవర్తనను సరిచేయుటకు చేయు వేళాకోళమే గాని, బుద్ధిపూర్వకముగ ఎదుటివారిని నొప్పింప జేయుటకు ఉద్దేశించినది కాదని ఎల్లరకును తెలిసినవిషయమే. ఇటీవల తన "మహాత్మ"బిరుదమును గూర్చికూడ ఆయన పరిహాసముగ చెప్పుకొన మొదలిడినాడు. "మరి నేను మహాత్ముణ్ణి ఊరికే అయినా ననుకున్నావా?" అని అనేకమారులు గాంధిగారు వేళాకోళముగ బల్కిరి. ఈమాట చెప్పిచెప్పడముతోనే, అక్కడనుంచి ఊరుకొనడు, నీఆలోచన కేమియు తా విన్నడు. అప్పుడు పరిష్కారము కావలసిన ఒకానొక మహాసమస్యనుగూర్చి భావతరంగములలో నిన్ను ముంచి లేవనెత్తును.

గాంధి, వ్యాహారచనాపటిష్ఠుడు:—

గాంధి యుద్ధము చేయగలడు; శాంతిని నెలకొల్పను గలడు. రెంటియందు ఈయనకు సామర్థ్యము కలదు—

ఈకెంటియందు ఎట్టెట్టి వ్యూహములు పన్నవలెనో ఆయనకు తెలిసినట్లు ఇంకెవరికి తెలియదు. పెద్దపెద్ద ఫ్యాక్టరీలలో 'బెల్టు'ను చక్రమునకు తగిలించి, యంత్రమును త్రిప్పి ఒక్క క్షణములో యావత్తుఫ్యాక్టరీ హోరెత్తించునట్లు, దేశమునంతను ఒక్క క్షణములో యుద్ధరంగమునకు దింపి, ప్రపంచమంతయు హోరెత్తించునట్లు చేయనుగలడు. ఆ 'బెల్టు'ను చక్రమునుండి దింపి, యంత్రమును ఆపివేయునట్లు దేశమును యుద్ధమునుండి విరమింపజేసి, శాంతిని నెలకొల్పనుగలడు. ఇందుకు కొన్ని ఉదాహరణముల మాత్రము:

1929 సం. నవంబరు నెలలో ఢిల్లీలో గవర్నమెంటుతో సంధి చేసుకొనబోయినప్పుడు, ఆయన కోరిన చిట్టచివరషరతు ఏమి? "ఈసంధి యీరోజునుండియే అమలులోనికి వచ్చినట్టుగ, గవర్నమెంటు యావత్తు—కడనుండి చివరకు—ఈరోజునుండియే మారి పోవలెను. ఈస్థితిని పుస్తకములలో రికార్డు చేయుటకుమాత్రమే బ్రిటిష్‌పార్లమెంటు చట్టమొనర్చవలెను"—ఇది ఆయన కోరిన షరతు. ఇంగ్లండు, ఇండియాలకు జరుగవలసిన సంధియొక్క పునాది యీవాక్యములందే కలదు. ఇట్టి సంధిని యేర్పాటుచేయుటకే గాంధిగారు తదుపరి దేశమును తరిఫీయతుచేసిరి. ఈసంధిషరతులోని తఫ్సీళ్లను గూర్చియే గాంధిగారిప్పుడు లండనులో మాట్లాడుచున్నారు. ఎరవాడా జెయిలులో నుండగ చెప్పిన సంధిషరతులలో ఏమి కోరినాడు? గవర్నమెంటుకు, ప్రజలకు మధ్య కాంగ్రెస్ మధ్యవర్తియని చెప్పినాడు. దీనినే యీరోజున నొక్కి చెప్పుచున్నాడు. ఈమాటను త్రోసివేయడానికి ప్రయత్నించుటచేతనే యీమధ్య గవర్నమెంటుకు చావు దప్పి కన్ను లొట్టపోయినది. ఇర్విన్‌తో సంధి కుదుర్చబోయినప్పుడు, పోలీసుదుండగముల విచారణనుగూర్చి గాంధిగారు వదలుకొన్నాననిరి. ఈమాట ఆయన యనుచరులకు ఆశ్చర్యవిషాదముల గలిగించెను. అప్పుడాయన యేమని సమాధానము చెప్పెను? "నాకు శృంగభంగము చేయవద్దు" అని ఇర్విన్ చాల వేడుకొనెనట! అది గాక "ఈవిచారణ పెడితే, ఒకరిమీద ఒకరు నేరారోపణలు చేయుచు కూర్చుంటే, దేశములో మనము కోరే శాంతి ఎట్లా వుంటుంది—కాబట్టి, యిప్పుడిది వదలుకోవలసిన" దని ఇర్విన్ ప్రాధేయపడెనట!—ఆహా యేమి గాంధిఔదార్యము. ఈమాటలు గాంధిగారు చెప్పునప్పటికి అందరికి సంతృప్తి అయినది.

## విల్లింగ్‌డన్‌కు టెల్లిగ్రాము:

మొన్న ఆగష్టునెలలో లండన్ ప్రయాణమునకు భంగము గలిగినప్పుడు, గాంధిగారు బొంబాయిలో వర్కింగ్ కమిటీసభ్యులమధ్య కూర్చుని వైస్రాయియైన విల్లింగ్‌డన్ ప్రభువునకిచ్చిన టెల్లిగ్రాములోని వాక్యములు చిరస్మరణీయములు—"అట్టె ఆలోచింపగ, నేను యింగ్లండు వెళ్లడం యీసివిలియన్ పెద్దలకు యిష్టము లేనట్లు నాకు తోచుచున్నది. ఇంగ్లండు, ఇండియాలు చిరకాలము మైత్రితో, కలిసిమెలిసి వుండవలెనంటే, ఈ సివిలియనులు కొందరింకా కొంతకాలము ఇండియాకు సేవచేస్తూ వుండవలసినట్లు నాకు తోచుచున్నది. కాబట్టి యీసివిలియనుల సంపూర్ణసానుభూతి, వారి మనఃపూర్తియైన తోడ్పాటు లేకుండ, నేనిప్పుడు లండన్ వెళ్లియు ప్రయోజనము కన్పట్టదు"—ఈవాక్యములందే ఆయనజీవితసారము, ఆయనకార్యప్రణాళిక యావత్తు యిమిడియున్నది. ఇట్టివాక్యములు అహింసాధర్మప్రవక్తయగు మహాత్మునకొక్కనికే చెల్లును.

"చెడుగును మంచిచే జయింపుము"—"విశ్వాసము కొండలను కదల్చును"—"దెబ్బకు దెబ్బ కొట్టకు"—"అపకారికి ఉపకారము చేయుము"—ఈ ధర్మవాక్యము లన్నియు మనము రోజూ వినుచునే యున్నాము. ఇవే సత్యాగ్రహోద్యమమునకు పునాది. గాంధితత్త్వరహస్యమును తెలిసికొనుట కివే కీటుకులు.

## సహజప్రేరిత (ఈశ్వర) జ్ఞానమే మార్గదర్శి:

అగ్నివర్షములో ముందు తాను నిలువబడి "రండి" అని గాంధి తన యనుచరులను పిలుచును. అంతే గాని, అగ్నివర్షమునకు వెనుక పదిమైళ్ల దూరములో దాగియుండి, "పొండి" అని టెల్లిఫోనుద్వారా ఉత్తరము జారీచేయడు. గాంధిగారికిని, ఇతరనాయకులకును గల

లేదా యిది. అంతరాత్మయందు ప్రతిష్ఠిత మైయున్న యీశ్వరప్రేరితజ్ఞానముచేతనే ఆయన సమస్తవిషయ మును పరిష్కరించును. మహాపురుషుల నడిపించు శక్తియే యిది. ఇది ఎన్నడును తప్పుత్రోవలకు పోనీయ దు. ఈశ్వరశక్తిప్రేరితమైన తీర్మానమునకు ఆయన హేతువాదముల ననుసంధించి సమర్థించును. అయితే, ఈరహస్యమును గుర్తింపలేక సామాన్యతార్కికులు ఆయనవాక్యముల దిద్దబోయెదరు. ఆయనవాక్యములు చిన్నవిగను, సూత్రప్రాయముగను నుండును. వానిలో ఒక అక్షరమైనను, ఒకపొల్లయినను దిద్దుటకు వీలుండదు. వానియందు పరిపూర్ణత, ఏకీభావము, సమన్వయము, సమ్మిళితమై ఏ ఒక పొల్లు తీసివేసినను, అంతయు అందవికారముగ గన్పట్టును. అట్లే, గాంధి ఏసలహా చెప్పినను, ఏతీర్పు చెప్పినను, ఏభావిసూచన చేసినను, మిక్కిలి జాగ్రత్తగ—కట్టుదిట్టమైన వాక్యములతో చెప్పును. పూర్వోత్తరసందర్భముల పరకాయించి చెప్పును. "త్రివిధబహిష్కారములను మీరు సాగించినచో మీకు సంవత్సరములో స్వరాజ్యము వచ్చును" అని గాంధిగారనిరి. ప్రజ లందరు మొదటివాక్యమును వదలివేసి, రెండోమాటను పట్టుకొని, "ఏది మాకు స్వరాజ్యం"అని అహమ్మదాబాదులో 1921 సం. లో గాంధిగారి నడిగిరి. ప్రజలు తమకు రావలసిన హక్కులనే జ్ఞాపక ముంచుకొందురు గాని, తాము చేయవలసిన విధులను జ్ఞాపక ముంచుకొనరు. హక్కులను జ్ఞాపక ముంచుకొని విధులను మరచిపోదురు. గాంధి గారితో కలిసి పదేండ్లు పనిచెయ్యండి; పదేండ్లు వద్దు—ఒక్క సంవత్సరము—ఒకరోజు పనిచెయ్యండి. ఆయనయందు మీ కున్న గౌరవభావము అంతలో పూజ్యభావముగ మారి, అక్కడనుండి వెంటనే నిన్ను భక్తిపారవశ్యములో ముంచివేయును. అబ్బా! అదేమో గాని, ఆయన సత్యసంధత, ఋజుప్రవర్తన అంటురోగము వలె వచ్చి నిన్నంటుకొనును.

ఇర్విన్ప్రభుని మొదటి షరతులు:—

1931 సం.రం ఫిబ్రవరి 22 వ తేదీని ఇర్విన్ కాంగ్రెసువారికి మొదట కొన్నిషరతుల పంపించెను. అందలివాక్యములు కఠోరముగను, కాంగ్రెసుకు అవమానకరముగను వుండెను. వర్కింగుకమిటీ మెంబర్లు యావన్మంది అతిరోషావేశముతో ఈ షరతుల నిరాకరించిరి. తదుపరి యీషరతులను వ్రాసిన కాగితమును తనకు తిరిగి యిచ్చివేయవలసినదని ఇర్విన్ ప్రభువు కబురు పంపించెను. తక్షణమే, దాని నకలయినను తీసికొననీయకుండ గాంధి దానిని యిచ్చివేసెను. ఏమి! శత్రువునందు క్షమాగుణము! ఈ కాగితపు నకలు యీరోజున కాంగ్రెస్ రికార్డులలో లేదు. ఇట్టిపనినే వెనుక గాంధిగారు 1917 సం.లో చంపరాన్ తోటల తగాదాలో చేసెను. అప్పటికిని యిప్పటికిని గాంధిగారిది ఒకటే మతము. ఒకటే విజయధాటి. ఆయన విజయయాత్ర చంపరాన్ తో ప్రారంభమై ఢిల్లీ, లండనులవరకు వ్యాప్తి గాంచెను.

ఈప్రపంచములో దాదాభాయి నౌరోజీగారికి తెలియని విషయములు లేవని ప్రతీతి. అట్టి విజ్ఞానసర్వస్వము గాంధిగారికి లేదనుకున్నారా? గోఖ్లేగారికి అపార మేధాశక్తి గలదని ప్రతీతి. అట్టి అపార మేధాశక్తి గాంధిగారికి లేదనుకున్నారా? లోకమాన్య తిలక్ గారికిగల బుద్ధిచతురత గాంధిగారికి లేదనుకున్నారా? సురేంద్రనాథబెనర్జీగారి కున్న వాగ్ధాటి గాంధిగారికి లేదనుకున్నారా? సర్ ఫిరోజిషా మెహతాగారి కున్న వ్యూహరచనాపటిమత గాంధిగారికి లేదనుకున్నారా? ఇవన్నియు ఆయనయందు మూర్తీభవించియున్నవి. లేవనుకొనుట పొరపాటు.

గాంధిగారు ప్రపంచమంతా తిరిగినారు. అనుభవము వీరినాయకత్వమునకు ఎంతో సహాయకారిగ నున్నది. వీరి మేధాశక్తి ఎవరికిని తీసిపోదు. వీరి వాగ్ధాటి సత్యదేవత పలికించు వాగ్ధాటి—నిర్మల హృదయాంతరాళమునుండి ప్రవహించు అనర్గళగంగాలహరి. గాంధిగారి బుద్ధిచాతుర్యము వర్తకుని బుద్ధిచాతుర్యము—లాయరుది కాదు. ఈయనవ్యూహము పన్నినట్టయితే అది చక్కగ టంకము అతికినట్లు అతుకును. అతి నిశితమైన దృష్టితో పన్నును. ఈగుణము లన్నిటిని, ఈలక్షణముల నన్నిటిని కలిపి ముద్దజేసి, దానికి పవిత్రత యను మెరుగుపెట్టినచో లోకనియంత యగు గాంధివిగ్రహము తయారగును.

# బ్రిటీషు డొమినియనుల ప్రభుత్వ స్వాతంత్ర్యము

దిగవల్లి వేంకట శివరావుగారు, బి. ఏ., బి. యల్.,

స్వతంత్రరాజ్యముల కన్నిటికిని ప్రభుత్వస్వాతంత్ర్య ముండును. ప్రభుత్వస్వాతంత్ర్య మనగా తన పరిపాలనమునందలి వ్యవహారము లెల్ల తానే చక్కబెట్టుకొను అధికారము. దీనినే ఆంగ్ల రాజనీతిజ్ఞులు "సావర్నిటీ" (Sovereignty) అని వ్యవహరించుచున్నారు. సావర్నిటీ అనుమాటకు వ్యుత్పత్త్యర్థము 'ప్రభుత్వము'. అయితే ప్రభుత్వ మనుపదమును ప్రభుత్వము యొక్క అధికారమునకుగాక దాని రాజ్యాంగ స్వరూపమునకే వాడుట పరిపాటి యైనది. అందువలన ప్రభుత్వముయొక్క అధికారగుణమునకు ప్రభుత్వస్వాతంత్ర్యము లేక ప్రభుత్వాధికారము అని పిలువవలసి వచ్చినది.

ప్రభుత్వస్వాతంత్ర్యము రెండువిధములు. ఆంతరంగికముగ తన వ్యవహారముల నెల్ల చక్కబెట్టుకొనుటకు వలసిన స్వేచ్ఛయగు పరిపాలనాధికారము, శాసన నిర్మాణాధికారము, బాహ్యముగ పరరాజ్యములతో శాంతియుద్ధముల నొనరించుకొనుటకు రాజతంత్రము నెరపుకొనుటకు వలసిన స్వతంత్రశక్తి. పరరాజ్యమునకు లోబడకుండగ నీరెండువిధములైన శక్తులు కల రాజ్యమే స్వతంత్రరాజ్యము (Sovereign State). ఐరోపాలోని పెద్దదేశములగు బ్రిటీషుదీవులు(ఇంగ్లాండు, స్కాట్లండు), ఫ్రాంసు జర్మనీ రష్యారాజ్యములును, చిన్నదేశములగు స్విజర్లాండు, హాలండు పోర్చుగలు రాజ్యములును, ఆశియాఖండమున చైనా జపాను పెర్షియా ఆఫ్ఘనిస్థానము స్వతంత్రరాజ్యములే.

స్వతంత్రరాజ్యము లెంతచిన్నవైనను ప్రపంచ రాజ్యమండలిలో గౌరవము కలిగియుండును. అందలి ప్రజలకును గౌరవ ముండును. ఈసంగతి భారతీయు లెఱుగనిదికాదు.

బ్రిటీషు డొమినియను లని పిలువబడు అధినివేశములు పేరునకు సామ్రాజ్యాంతర్భాగములే యైనను నిజముగ స్వతంత్రరాజ్యములకుగల ప్రభుత్వస్వాతంత్ర్యము వీనికిని గలదని చెప్పవచ్చును. బ్రిటీషు డొమినియనులు ప్రధాన బ్రిటీషురాజ్యమగు ఇంగ్లాండుతోపాటు సామ్రాజ్యముతో సరిసమానమగు (Co-equal) స్వతంత్ర రాజ్యములని అంతర్జాతీయవ్యవహారములం దంగీకరింపబడినది. కనడా, ఆస్ట్రేలియా దక్షిణాఫ్రికా న్యూజీలాండు న్యూఫౌండ్లాండు దేశములు మొదట బ్రిటిషువారి వలస రాజ్యములు అస్వతంత్రరాజ్యములుగ నుండి క్రమక్రమముగ సంపూర్ణస్వపరిపాలనమును బడసి నేడు పైన చెప్పబడిన రీతిని స్వతంత్రరాజ్యములగు డొమినియనులుగ నున్నవి. ఐర్లాండు బ్రిటీషుదీవులలో నొకటిగ నుండి స్వాతంత్ర్యము కొరకు పోరిపోరి తుదకు బ్రిటీషువారికిని ఐరిషువిప్లవనాయకులకును మధ్య ౧౯౨౧ లో జరిగిన సంధినిబట్టి తక్కిన డొమినియనులతోపాటు స్వతంత్ర రాజ్యమైనది. బ్రిటీషు రాజనీతిజ్ఞులు కొందరు డొమినియనుల ప్రభుత్వస్వాతంత్ర్యము పూర్ణ స్వతంత్రరాజ్యముల కుండునట్టిది కాదని వాదించుచున్నను ఆచరణమున, గౌరవమున దానికిని దీనికిని నిసుమంతయు భేదము లేదు.

బ్రిటీషుపరిపాలనముక్రింద మొదట వలసరాజ్యములుగ నుండి ప్రాతినిధ్యము లేనిది పన్నులు విధింపరాదని ప్రతిఘటించి నిలిచి తుదకు యుద్ధముచేసి స్వాతంత్ర్యముపొందిన అమెరికాసంయుక్తరాష్ట్రముల ఉపమానము ప్రపంచములోని సామంతరాజ్యముల కెల్ల స్వతంత్రేచ్ఛను కల్గించెను. అమెరికాసంయుక్తరాష్ట్రముల కుత్తరభాగమున నున్న కనడాదేశము బ్రిటీషు వలసరాజ్యమే. కనడాదేశములోని వివిధరాష్ట్రములకు

ప్రజాప్రాతినిధ్యముగల శాసనసభ లుండెనుగాని బాధ్యతాయుతస్వపరిపాలనము లేకుండెను. ఫ్రెంచి బ్రిటీషు జాతులకుగల పరస్పర వైషమ్యములవలన కల్లోలములు కలుగుచుండుటయు అణంపబడుటయు జరుగుచుండెను. వీనిని విమర్శింపుమని డర్హాముప్రభువును బ్రిటీషువారంపిరి. బ్రిటీషువారికి తమ్మ స్వదేశమున గల స్వపరిపాలనాసౌఖ్యములనె వలసరాజ్యములలోనివారికిని కల్గించుటయె రాజకీయాందోళనమున కౌషధమని డర్హాం ప్రభువు నివేదికలో వ్రాసెను. బ్రిటీషు పార్లమెంటువారట్టికేల కంగీకరించి ౧౮౪౭-౪౮లో కెనడాదేశములోని రాష్ట్రీయులకు ప్రజాప్రతినిధులకు బాధ్యతకల స్వపరిపాలనము నొసగిరి. కొన్నాళ్లకు ఆస్ట్రేలియాకును న్యూజీలాండుదేశములకు నొసగిరి. దక్షిణాఫ్రికాలోని ఆదిమవాసుల సమస్యవలన నది యొసగుట యాలస్యమయ్యెను. ప్రధానరాజ్యమగు బ్రిటీషుదీవుల ప్రజలవలెనే వలసరాజ్యముల ప్రజలును తమ వ్యవహారములను చక్కబెట్టుకొనుటకు గావలసిన కార్యనిర్వహణాధికారమును శాసననిర్మాణాధికారమును కలిగియున్నా రనుసూత్రము వచ్చినంతనే ఇంగ్లాండురాజ్యముతో సమానగౌరవస్థానమును పొందవలెనను కోరిక జనించుటలో వింత లేదు. అధినివేశములకు బాధ్యతాయుతప్రజాప్రాతినిధ్యస్వపరిపాలనము కలిగి ఆంతరంగిక స్వాతంత్ర్యము పరిపూర్ణము కెందుపట్ల నీడగు ప్రభుత్వాధికారములు స్వతంత్రముగ నిర్నిరోధముగ చలాయించు హక్కు అధినివేశములకు కలిగెను. పూర్వ మీ శాసనముల నింగ్లీషుపార్లమెంటువారుమాత్రమే చేయుచుండుటయు వానిని అధినివేశములవారు అనుకరించుటయు నాచారము.

౧. శాసననిర్మాణము, రాజ్యాంగవ్యవస్థ నిర్నిరోధముగ, సంపూర్ణముగ చేసికొనుట.

౨. ప్రత్యేకజాతీయత పూర్తిగ అంగీకరింపబడుట.

౩. దేశములోని ఆదిమవాసులపైన సంపూర్ణాధికారము కలుగుట.

౪. వలసవ్యవహారములు పూర్తిగ తమవశము లగుట.

౫. అధినివేశరాజ్యముయొక్క (Status) స్వాతంత్ర్యము, వ్యక్తిత్వము పరరాజ్యములందు గౌరవింపబడుట.

౬. దేశములోని భూమినిగూర్చి, పౌరహక్కులనుగూర్చి నిర్ణయించు నిర్నిరోధాధికారము కలుగుట.

౭. దేశముయొక్క వర్తకము చెలామణినిగూర్చి నిర్నిరోధముగ వ్యవహరించుకొనుట.

౮. వాణిజ్యనావికావ్యవస్థ.

౯. దేశరక్షణము.

౧౦. మతస్వేచ్ఛను కలిగియుండుట.

ఆంతరంగికవ్యవహారములందు స్వాతంత్ర్య మిచ్చినచో బాహ్యప్రభుత్వాధికారములు అనగా పరదేశములతోడి రాజనీతిసంబంధములు, వర్తకవ్యాపారసంబంధములు బ్రిటీషుప్రభుత్వముచేతిలో నుంచి వలసరాజ్యములు తృప్తిజెందియుండునని డర్హాము తలచెను. కాని ఇది సాగలేదు. కెనడావారు పరాయిదేశములనుండి దిగుమతియగు వస్తువులపైనమాత్రమె గాక బ్రిటీషుదీవుల నుండి వచ్చు వస్తువులపైనగూడ సుంకములు విధించి తమ వర్తకము కాపాడుకొనవలెనని ప్రయత్నించిరి. బ్రిటీషువారు వాదించిరికాని లాభము లేకపోయెను. ఈహక్కు ఎట్టకేలకు ౧౮౫౯లో అంగీకరింపబడెను. నాటినుండి నేటివరకు వలసరాజ్యములు, అధినివేశములు అభివృద్ధిజెంది బ్రిటీషురాజ్యముతోపాటు సమానగౌరవమును పొందుటకు చేయుప్రయత్నముల కెట్టి యభ్యంతరమును కలుగలేదు.

వలసరాజ్యములు సంయుక్తజాతీయప్రభుత్వము లేర్పరచుకొని డొమినియనులు లేక అధినివేశములగుట వాని స్వాతంత్ర్యచరిత్రలో ప్రథమసోపానము. మొదటచిన్న చిన్నవిగ నుండి బలహీనముగ నుండిన వలసరాజ్యములట్లు కలిసి సంయుక్తప్రభుత్వము లేర్పరచుకొనినందువలన బాహ్యస్వరూపమున అనగా వైశాల్యమందును, బల

ముసంధుమ మాతృరాజ్యముతో సాటి వచుటకు వీలు కలిగెను. అట్లు కలిసినందువలన నొక జాతీయభావముకూడ వానియందు వర్ధిల్లెను. ఈ విషయమున కెనడాదేశమే తక్కిన వలసరాజ్యములకు దారిచూపెను. ౧౮౬౭ లో కెనడాలోని నాలుగు ఉత్తర-అమెరికా రాష్ట్రములు బ్రిటీషుప్రభుత్వముయొక్క అనుమతితో 'కెనడాడొమినియను' అనుపేరుతో సంయుక్తరాష్ట్ర మయ్యెను. అప్పటినుండి 'డొమినియను' అనుమాట రాజ్యాంగశాస్త్రమున వాడుకలోనికి వచ్చినది. తరువాత ఇంక కొన్ని రాష్ట్రములు సంయుక్త రాష్ట్రమున జేరెను. ౧౯౦౦ లో ఈవిధముగనే ఆస్ట్రేలియా ఒకసంయుక్త ప్రభుత్వము నేర్పరచుకొనెను. ౧౯౦౯ లో దక్షిణాఫ్రికాసమితి ప్రభుత్వము నేర్పరచుకొనెను.

దేశరక్షణ (Defence) విషయమున అధినివేశ రాజ్యములకు మొదట ఎట్టిప్రసక్తిలేదు. వలసరాజ్యములు తమ రక్షణ వ్యయమును భరించిగాని, సైన్యమున జేరిగాని బాధ్యతవహించవలె ననునియమము లేకుండెను. ౧౮౫౭ లో దీనికొరకు బ్రిటీషుప్రభుత్వము ౪౦ లక్షల పౌనులు వ్యయముచేసియుండెను, అందువలన ౧౮౬౨ లో కామన్సుసభవారు స్వపరిపాలన సౌఖ్యముపొందు వలసరాజ్యములు తమ ఆంతరంగిక శాంతికిని, క్రమపరిపాలనమునకును, దేశరక్షణమునకును ప్రధాన బాధ్యత వహింపవలెనని తీర్మానించిరి. అంతట వలసరాజ్యములలోని సామ్రాజ్య సైన్యములను క్రమక్రమముగ తీసివేయసాగిరి. ఏదేశమైనను కోరినచో వానికి బదులిచ్చి స్వంత సైన్యములను సృజియించుటలో సహాయము చేయసాగిరి. ౧౮౬౮ లో కెనడా సైనిక చట్టమువలన సైన్యనిర్మాణ మారంభమయ్యెను. ఆసంవత్సరముననే న్యూజీలాండునుండి బ్రిటీషు సైన్యములు తీసికొనిపోయి అప్పుడు ఆదిమ ఖాసులతో యుద్ధము జరుగుచుండినను సరకుగొనక వలసరాజ్య సైన్యములనే తంటాలుపడమనిరి. ౧౮౭౦ లో ఆస్ట్రేలియాలోనుండి సైన్యములు పూర్తిగ తీసివేసిరి. ౧౮౭౧ లో కెనడాలోనుండి తీసివేసిరి. సామ్రాజ్యక్షేమముకొరకు గావలసిన సైనికవ్యయములుమాత్రమె బ్రిటీషువారు చేయుచున్నట్లు ౧౮౭౩ లో ప్రకటింపబడెను. తరువాత బ్రిటీషువారు సామ్రాజ్యరక్షణమునుగూర్చి విచారించుట కొక సంఘము నేర్పరచుకొనగా నది ౧౮౮౨ లో నివేదికను ప్రకటించెను. వలసరాజ్యముల సైన్యములు మొదటలో బలవంతములు కట్టుదిట్టములుగలవి కాకుండెను. తరువాత ౧౯౦౮, ౧౯౧౦ లో ఆస్ట్రేలియా న్యూజిలాండురాజ్యములవారు నిర్బంధసైనికబోధనాభ్యసన శిబిరముల నేర్పరచు శాసనముల జేసి బాగుగాచేసికొనిరి.

## నావికాదళము సముద్రరక్షణము

౧౮౬౫ లోవలసరాజ్యములవారు నావికాదళములను నిర్మించి అవసరమైనచో వానిని సామ్రాజ్యప్రభుత్వమువారివశమున నుంచుకోవచ్చునను శాసనము చేయబడెను. వలసరాజ్యముల ప్రతినిధుల సభయొకటి ౧౮౮౭లో జరిగెను. ఆస్ట్రేలియా న్యూజీలాండులు బ్రిటీషునావికాదళమునందలి తమశాఖలకొరకు కొంత సొమ్ము చెల్లించుట కంగీకరించిరి. ౧౮౯౭ లో దక్షిణాఫ్రికాలోని బ్రిటీషు వలసరాజ్యములగు కేపుకాలనీ నేటాలు రాజ్యములు కొంతసొమ్ము చెల్లింపసాగెను. న్యూఫౌండ్లాండు నట్లే చెల్లించెను. ఈకప్పము ౧౯౦౨ లో హెచ్చుచేయబడుట చూచి కెనడా స్వంతనావికాదళము నిర్మించుకొన ప్రయత్నించెను. అప్పటినుండియు తక్కిన రాజ్యములుకూడ అట్లే చేయసాగెను. జర్మనీ బలవంతమగుటచూచి ౧౯౦౯ లో ఆస్ట్రేలియా నౌకలు నిర్మించుకొనెను. న్యూజిలాండు ౧౯౧౩ లో స్వంతనౌకలు నిర్మించుకొను పద్ధతి నవలంబించెను. ఐరోపామహాసంగ్రామమువలన కప్పముల గట్టుపద్ధతి మాని స్వంతనౌకాదళనిర్మాణపద్ధతి హెచ్చెను. బ్రిటీషుప్రభుత్వమువారు మొదట ౧౮౮౬లో నియమించిన వలసరాజ్యముల రక్షణ సంఘములో వలసప్రతినిధులు లేకుండిరి. తరువాత ౧౯౧౧-౨లో సామ్రాజ్యరక్షణసంఘమున వలసప్రతినిధులు చేర్చుకొనబడిరి. బ్రిటీషుప్రధానామాత్యుడే దాని కధ్యక్షుడు. బోయరుయుద్ధమునాటికి (౧౮౯౯-౧౯౦౨) వలసరాజ్యముల సైన్యములు సామ్రాజ్యయుద్ధములందు సహాయము చేయుపద్ధతి వచ్చెను.

పరరాజ్యములతోడి సంబంధముల విషయమున, శాంతి యుద్ధములవిషయమున బ్రిటీషువారు జరుపు వ్యవహారములలో వలసరాజ్యములు మొదట పాల్గొన లేదు. ౧౮౯౭లో జరిగిన వలసప్రతినిధుల సభలో పరరాజ్యములతోడి రాజతంత్రము చర్చింపబడలేదు. తరువాత సభలయందైనను దేశరక్షణమును గూర్చి, సుంకములను విధించుటనుగూర్చి, రాకపోకల సాధనములనుగూర్చి చర్చించిరేగాని దీనినిగూర్చిన చర్చ లేదు. ౧౯౦౭ సభలో వలసప్రతినిధుల సభకు 'సామ్రాజ్యసభ' (Imperial Conference) యని నామకరణ మీయబడెను. పూర్వమువలె వలసరాజ్యాంగ కార్యదర్శి గాక ప్రధానామాత్యు డగ్రాసనాధిపత్యము వహింపవలెననియు వలసరాజ్యముల ప్రధానామాత్యులు సమానగౌరవముగల సభ్యులుగ నుండవలయుననియు తీర్మానించిరి. నాల్గుసంవత్సరముల కొకమారు సభ కూడవలయు ననిరి. ౧౯౧౧లో జరిగిన సామ్రాజ్యసభలో అధినివేశరాజ్యముల ప్రధానమంత్రులు పరరాజ్యతంత్రముల రహస్యాలోచనమున మొదటి పర్యాయము పాల్గొనిరి. అప్పుడు న్యూజీలాండు ప్రతినిధి అందరికి గావలసిన పరదేశములతోడి సంబంధమునుగూర్చిన విషయములో వానిని పరిష్కరించుటకు ఒక సామ్రాజ్యప్రభుత్వమును పార్లమెంటును స్థాపింపుడని కోరగా పరరాజ్యములను గూర్చిన రాజ్యతంత్రబాధ్యత నట్లు విభజింపవీలు లేదని బ్రిటీషుప్రధానామాత్యు డనెను. సామ్రాజ్యపరిపాలనమున సమిష్టి సహకారపద్ధతులనుగూర్చి సామ్రాజ్యమున పలువురు చర్చించుకొనుచుండిరి గాని ఐరోపాసంగ్రామమువరకు ఏమియు ఆచరణయోగ్యకార్యము జరుగలేదు. అధినివేశములు తమ ఆంతరంగికస్వాతంత్ర్యమునుగూర్చియు గౌరవమునుగూర్చియుమాత్రము పాటుపడుచుండెను. దీని కనుగుణముగ ౧౯౧౨లో నొక ముఖ్యమగు అవకాశము కలిగెను. ఇదివరకు అంతర్జాతీయసభలకు బ్రిటీషుసామ్రాజ్యాధీశుని పక్షమున నొక ప్రతినిధిసంఘముమాత్రమే పోవుచుండెను. అందు వలసప్రతినిధు లుండిన నుండవచ్చును, లేకుండిన లేకపోవచ్చును. ఆసంవత్సరమున జరిగిన రేడియోటెలిగ్రాఫిక్కుమహాసభకు రాజుగారి తరపున బ్రిటీషు ప్రతినిధిసంఘముతోపాటు అధినివేశప్రతినిధిసంఘమునకు వారితరపున ప్రత్యేకముగ మాట్లాడుట కవకాశ మీయబడెను. ఇట్లే ౧౯౧౩-౧౪లో జరిగిన సముద్రముపైన ప్రాణక్షేమమునుగూర్చిన సభలో ప్రత్యేక ప్రాతినిధ్య మొసగబడెను.

ఐరోపామహాసంగ్రామ మాకస్మికముగ ౧౯౧౪ ఆగస్టు ౪ తేదిన ప్రారంభమయ్యెను. యుద్ధారంభమునకుపూర్వము అధినివేశములతో నాలోచించుట కవకాశము లేకపోయెను. కాని అవి యెల్ల తగుసహాయము చేయుటకు వాగ్దానముచేసి సైనికులను, ధనమును పంపెను. యుద్ధప్రారంభమున సామ్రాజ్యసభను జరుపుటకు వీలు లేకపోయెను. ౧౯౧౬లో లాయిడుజార్జిగారు ఇంగ్లండులో ప్రధానమంత్రి యయ్యెను. యుద్ధమున యావచ్ఛక్తిని వినియోగింపవలసిన తరుణము వచ్చెను. అందువలన మొదట ౧౯౧౭లో సభ్యత్వము లేని భరతఖండమునుగూడ బ్రిటీషుప్రభుత్వముతో కార్యాలోచనమున పాల్గొనమని ఆహ్వానించిరి. అంతట ౧౯౧౭-౧౮ సంవత్సరములందు యుద్ధరంగములోని వ్యవహారములను గూర్చియు, శాంతినిగూర్చియు సామ్రాజ్యయుద్ధాలోచన మంత్రిమండలి (Imperial war cabinet) వలనను తక్కిన విషయములు సామ్రాజ్యయుద్ధసభ (Imperial war Conference) వారివలనను చర్చింపబడుచుండెను. ఈసామ్రాజ్యయుద్ధాలోచన మంత్రిమండలిలో బ్రిటీషు ప్రధానమంత్రిఅగ్రాసనాధిపత్యమువహించెను. ఈమండలి బ్రిటీషు రహస్యాలోచనమంత్రిమండలి (Cabinet) వారికిని పరస్పరసంబంధ ముండెను. వీరి తీర్మానములు ఆయాప్రభుత్వముల మంత్రిమండలివా రంగీకరింపవలెను. అందుకు లోబడి యుద్ధాలోచన మంత్రిమండలి తీర్మానములకు అధినివేశ ప్రతినిధులు అంగీకరించుచుండిరి. యుద్ధపరిస్థితులవలన నిట్లు సామ్రాజ్య రాజనీతియందు పాల్గొని దమ అభిప్రాయములను దెలుపు అవకాశము అధినివేశములకును భరతఖండమునకును లభించెను. సామ్రాజ్యమునందలి వివిధరాజ్యభాగముల తోడి సంబంధ

మునుగూర్చి శాంతి స్థాపింపబడిన పిదప వేరొక ప్రతినిధులసభను పిలిచి పరిష్కరింపబడగలదని ౧౯౧౭ లో అంగీకరింపబడెను. అట్లు నిర్ణయింపబడు నూతన విధానమున ప్రస్తుతము అధినివేశములకున్న స్వపరిపాలనాధికారము లెల్ల అట్లే యుండవలెననియు మఱియు సామ్రాజ్యసమ్మేళనమునందలి స్వతంత్రజాతులుగ అంగీకరింపబడవలయుననియు తీర్మానింపబడెను.

౧౯౧౮ లో సామ్రాజ్య యుద్ధాలోచన మంత్రిమండలి రెండవమారు సమావేశమయ్యెను. తరువాత జర్మనీతో సంధినియమముల నాలోచించుటకు మరల సమావేశముచేసి ౧౯౧౯ లో సంధిసభకు సామ్రాజ్య ప్రాతినిధ్యముగ మార్చిరి. ఒక్క సామ్రాజ్య ప్రాతినిధ్యమును మాత్రమే బ్రిటీషువారు మొదట పంపదలచిరిగాని అధినివేశములు ప్రత్యేకప్రాతినిధ్యము కోరగా వానినిగూర్చిన విషయములందు వానికి ప్రత్యేకప్రాతినిధ్యము లుండునట్లును ఇతరసమయములందు సామ్రాజ్య ప్రాతినిధ్యము ద్వారా చర్చలు జరుపునట్లును తీర్మానించిరి. సామ్రాజ్య ప్రాతినిధ్యమునగూడ అధినివేశముల ప్రతినిధు లుండిరి. అట్లు కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా, న్యూజీలాండులకును, ఇండియాకును యుద్ధమున పాల్గొనిన ఇతర స్వతంత్రరాజ్యములకు వలెనే సంధిసభలో ప్రాతినిధ్యమొసగబడెను. ఇదిగాక సామ్రాజ్యప్రాతినిధ్యము బ్రిటీషు ప్రధానమంత్రియు సామ్రాజ్యము తరఫున మాటాడునప్పుడుకూడ వీని యభిప్రాయములకు గౌరవ మొసగుచుండుటయు తటస్థించెను. జర్మనీతోడి జరిగిన వర్సైలిస్ సంధిపైన చేవ్రాళ్లు చేయుటలో అధినివేశముల గౌరవ మినుమడించెను. బ్రిటీషు ప్రతినిధులు సామ్రాజ్యముపక్షమున సంతకముచేయగా అధినివేశముల ప్రతినిధులు తమతమరాజ్యముల పక్షమున వేరువేరుగా సంతకములు చేసిరి. తమతమ ప్రభుత్వముల శాసనసభలు సమ్మతిని దెలుపువరకు నీసంధినంగీకరింపవలదని అధినివేశప్రతినిధులు బ్రిటీషు ప్రభుత్వమును కోరిరి. వారు మొదట ఆలస్యమగునని నసికిరిగాని తరువాత అంగీకరించిరి. తరువాత ౧౯౨౧ లో జరిగిన సముద్రాధికార సభయందుకూడ నీయంతర్జాతీయాధికార మంగీకరింపబడెను.

## ప్రపంచరాజ్య సమ్మేళనమున ప్రత్యేకసభ్యత.

వర్సైలిస్ సంధి జరిగినపిదప ఐరోపాఖండమున స్థాపింపబడిన ప్రపంచరాజ్యమండలియగు 'లీగ్ ఆఫ్ నేషన్సు' (League of Nations)సభలో బ్రిటీషు అధినివేశరాజ్యములును భరతఖండమును సభ్యత్వమును వహించినవి. అట్లు బ్రిటీషుప్రభుత్వముతో ప్రసక్తి లేకుండగ భిన్నగ అంతర్జాతీయ వ్యవహారములందు సహితము పాల్గొను నధికారము దీనికి కలిగెను. ఆ సమ్మేళనముయొక్క కార్యనిర్వాహక సంఘమునకు నధినివేశముల ప్రతినిధు లెన్నుకొనబడవచ్చునని నిశ్చయింపబడెను. ౧౯౨౭ లో కెనడా అట్లెన్నుకొనబడెను. అధినివేశ ప్రతినిధులు తమతమ యిచ్చవచ్చినట్లు మాటలాడి సమ్మతి నిచ్చుటకు వీలున్నను సాధారణముగ బ్రిటీషుప్రభుత్వముతో ముందుగ సంప్రదించి ఏకీభావముతోనే వర్తించుచున్నారు. అయినను ౧౯౨౫లో లోకార్నో సంధిలోని కొన్ని బాధ్యతలు అధినివేశములకును భరతఖండమునకును అంగీకారము కానందున, వాని ప్రభుత్వము లంగీకరింపనిది వారి నవి బాధింపవని తీర్మానింపబడెను. అయితే సంధిషరతులలో కార్మికపరిస్థితులను గూర్చిన విధులు అధినివేశములయొక్కయు, భరతఖండముయొక్కయు ప్రత్యేకవ్యక్తిత్వము నంగీకరించినందున ఆషరతుల నీదేశములు బాగుగ గమనించెను. శత్రు రాజులతో సంధి యొనరించుటయందును తక్కిన సందర్భములలోను అధినివేశరాజ్యముల ప్రత్యేకవ్యక్తిత్వ మిట్లంగీకరింపబడినందున కెనడా రాజ్యము తన కావశ్యకమని తోచిన పరరాజ్యములతో- అందు ముఖ్యముగ అమెరికాసంయుక్తరాష్ట్రములతో- రాయబారములను రాజతంత్రవ్యవహారములు (Deplomatic relations) తమ ప్రతినిధిద్వారా సలుపుకొను అధికారమును కోరసాగెను. సంయుక్తరాష్ట్రములు కెనడాతో ప్రత్యేకముగ రాజతంత్రవ్యవహారములు జరుపుట కంగీకరించినచో తమ కభ్యంతరము లేదని బ్రిటీషు ప్రభుత్వమువా రనిరి. ప్రపంచరాజ్యమండలియగు లీగ్ ఆఫ్ నేషన్సుసభలో సామ్రాజ్యాంతర్భాగములకు ప్రత్యేకప్రాతినిధ్యమిచ్చుటకు సంయుక్తరాష్ట్రములకు మొదట

యిష్టముగ లేకుండినందున కెనడాతో వ్యవహారములు తిన్నగ జరుపుకొనుట కంగీకరింపదని బ్రిటీషు ప్రభుత్వము మనుకొనెనుగాని అట్లు జరుగలేదు. ఈయధికారమును పురస్కరించుకొని ౧౯౨౬ లో కెనడా ప్రభుత్వము వారు అమెరికాసంయుక్తరాష్ట్రముఖ్యపట్టణమగు వాషింగ్టనులో తన ప్రతినిధిగ నుండుట కొకమంత్రిని నియమించిరి. ఈ అధికారము తక్కిన అధినివేశములకుగూడ నొసగబడగ ఐరిషుఫ్రీస్టేటు ప్రభుత్వమువారు ౧౯౨౪ లోనే వాషింగ్టనులో తమమంత్రి నొకనిని ప్రతినిధిగ నియమించిపంపిరి. ఈ ప్రతినిధిమంత్రులు తమతమ అధినివేశముల యోగక్షేమములనుగూర్చిన రాజకార్యములను గూర్చిమాత్రమే వ్యవహరించుచుందురు. వీరు బ్రిటీషు సామ్రాజ్యరాయబారితో కలిసిమెలిసి వర్తింపవలెకాని వానికి వ్యతిరేకముగ నడచుకొనరు. ౧౯౨౭ లో కెనడావారు ఫ్రెంచిదేశమున ప్యారిసునగరమునను జపానులో టోకియోనగరమునను తమ ప్రతినిధుల నియమింపబోవుచున్నామని ప్రకటించిరి.

## ౧౯౨౧ సం. పు సామ్రాజ్యసభ

ప్రపంచయుద్ధమనదగు ఐరోపామహాసంగ్రామము వలన నానారాజ్యములందు కలిగిన జాతీయభావము అధినివేశరాజ్యములందుకూడ వర్ధిల్లి స్వాతంత్ర్యగౌరవము కొరకట్లు పాటుపడునట్లు చేసెను. యుద్ధానంతరము సామ్రాజ్యాంతర్భాగపరస్పరసంబంధమును గూర్చి విచారించుటకు సభను పిలువవలెనని ౧౯౧౭ లో తీర్మానింపబడియుండినను పైన చెప్పబడిన రాజకీయ గౌరవములతో అధినివేశములు తృప్తిజెందె, ౧౯౨౧ లో జరిగినసభ పరస్పరసంబంధములనుగూర్చి వేరుగా నాలోచింపవలసిన యావశ్యకత లేదని తీర్మానించెను. సామ్రాజ్యప్రతినిధులసభను సమావేశపరచి కార్యాలోచనము చేయు నవీనరాజతంత్రముయొక్క లాభము స్పష్టపడసాగెను. ౧౯౨౨-వ సంవత్సరపు వాషింగ్టను సభ వలన జపానుతో సంధిని కుదుర్చుకొనుటలో నిది విదితమయ్యెను. అయితే అధినివేశముల కన్నిటికిని ఏకీభావముండకపోవచ్చు ననుసంగతి ౧౯౨౨ లోనే మధ్యధరా సముద్రరక్షణమునుగూర్చి బ్రిటీషు ప్రధానామాత్యుడు తన చనక్ విధానము (Chank Policy) నకు అంగీకరింపుమని అధినివేశములవారిని కోరినప్పుడు విదితమయ్యెను. అప్పుడు తమవర్తకమునకు లాభకారి యని ఆస్ట్రేలియా న్యూజీలాండు లాయనపద్ధతి కంగీకరించెను. తమకు లాభింపదని దక్షిణాఫ్రికా కెనడా లుపేక్షాభావము వహించెను. ౧౯౨౩ లో నొక క్రొత్తపరిస్థితి కలిగెను. ఇదివరకు అధినివేశములకును పరరాజ్యములతో సంధి జరిగినప్పు డధినివేశ ప్రతినిధియే కాక సామ్రాజ్యప్రతినిధికూడ చేవ్రాలు చేయుట యాచారము. ఇప్పుడు కెనడాదేశము అమెరికా సంయుక్తరాష్ట్రములతో పెద్దచేపలనుగూర్చి చేసికొనిన సంధిలో ఆ సంధి తమదేశ మొక్కదానికే సంబంధించినది గనుక తమ ప్రతినిధి సంతకము చేసిన చాలునని కెనడా వాదించెను. ఈ సూత్ర మంగీకరింపబడెను.

## ఐరిషు సంధి.

బ్రిటీషుసామ్రాజ్యము స్వతంత్రరాజ్య సమ్మేళనమను సంగతి ౧౯౨౧ లో ఐరిషు సంధివలన స్పష్టమయ్యెను. బ్రిటీషు ప్రభుత్వము తనతో బహిరంగముగ యుద్ధము చేయుచుండిన విప్లవకారుల ప్రతినిధులతో ఒడంబడిక చేసుకొనగా నది 'సంధి 'యని వ్యవహరింపబడెను. ఐర్లాండుయొక్క నివేశగౌరవము అంగీకరింపబడెను. ఈసంధి అంతర్జాతీయసంధివంటిది కాదనియు, దేశమునకు అధినివేశస్వాతంత్ర్య మిచ్చితిమిగాని పూర్ణస్వాతంత్ర్య మొసంగలేదనియు, ప్రపంచరాజ్యసమ్మేళన(League of Nations) విధిప్రకారము రిజష్టరుచేయవలసిన సంధి కాదనియు బ్రిటీషువారనిరి. ఐర్లాండువారిందుకు విరుద్ధముగ వాదించిరి. ౧౯౨౩లో ఐర్లాండు సామ్రాజ్యమువారి అనుమతిపైన 'లీగు ఆఫ్ నేషన్సు'లోన సభ్యత పొందెను. ప్రత్యేకఐరిషుజాతీయపతాకమును, పౌరస్వత్వములను వారి స్వపరిపాలనా స్వాతంత్ర్యప్రకటనమును స్పష్టపరిచెను. ౧౯౨౧లో కెనడారాజ్యమువారు తమపౌరుల ప్రత్యేకపౌరస్వత్వములను స్పష్టీకరించి బ్రిటీషుసామ్రాజ్యపౌరు

లకును కెనడా బ్రిటీషు పౌరులకును గల తారతమ్యము నిర్ణయించవలసిన యావశ్యకత అంతర్జాతీయన్యాయస్థానముల పదవుల సభ్యులనెన్నుకొనుసందర్భమున కలిగెను. ౧౯౨౭లో చాలతగవులు కలిగి ఎట్టకేలకు రాజీ జరిగిన పిదప దక్షిణాఫ్రికా ప్రభుత్వమువారు తమ కొక ప్రత్యేక జాతీయపతాకము నేర్పఱచుకొనియు సామ్రాజ్యాంతర్భాగ మనుభావమును చూపుటకు బ్రిటీషుపతాకమును గూడ నిలుపుట కంగీకరించిరి.

౧౯౨౩ సం.రం సామ్రాజ్యసభ:—ఈసభకు ఐరిషు ప్రతినిధికూడ వచ్చెను. సామ్రాజ్యభాగములందు దేనికి సంబంధించిన వ్యవహారములందా ప్రభుత్వప్రతినిధిసార్వభౌముని అధికారముక్రింద సంధిచేసి చేవ్రాలుచేయవచ్చుననియు, ఇతరప్రభుత్వమున కేమైన సంబంధించిన విషయము లున్నచో • ఆప్రభుత్వప్రతినిధుల నాహ్వానింపవలెననియు తీర్మానింపబడెను. అంతర్జాతీయవిషయములందెల్ల బ్రిటీషుప్రభుత్వమును అధినివేశరాజ్యప్రభుత్వములు నొండొరుల క్షేమములను గమనింపవలె నను సూత్ర మామోదింపబడెను. రాజ్యసమ్మేళనమునకు తోడ్పడుటకును అధినివేశరాజ్యములు తమ స్వరక్షణకు వలయు బలములను సమకూర్చుకొనుటకును సామ్రాజ్యమున రక్షకరంగములను(base)స్థాపించి పోషించుటకును తీర్మానించిరి• అధినివేశముల సంపూర్ణస్వాతంత్ర్యమును నొక్కి వక్కాణింపబడెను.

తురుష్కరాజ్యములో బ్రిటీషుప్రభుత్వమువారు చేసిన లానేన్‌సంధి అంగీకరింపవలసినదని అధినివేశములను కోరగా కెనడావారు సంధి కంగీకరింతుముగాని ఆకార్యాలోచనమున తాము పాల్గొననందున అందువలన బాధ్యతలను బ్రిటీషుప్రభుత్వమువారుమాత్రమే పాల్గొనవలయు ననిరి. ఈసూత్రమును ౧౯౨౪ సంవత్సరమున జరిగిన లండను 'రిపారేషనుసభ' విషయమునను కెనడా స్పష్టపరిచెను. పరరాజ్యములతో జరుపు రాయబారములందు మంత్రాలోచనమున అధినివేశములు పాల్గొనవలసిన పద్ధతులను నిర్ణయించుట కొక సభ నేర్పాటునేయుదుమని బ్రిటీషుప్రభుత్వమువా రనిరికాని ఇంతలో నింగ్లాండులో క్రొత్తప్రభుత్వము వచ్చెను. లండనులో నొక అధినివేశప్రతినిధిమంత్రి నుంచుపద్ధతిని కొందరు సూచించిరికాని దానివలన లాభము లేదనిరి. పూర్వమువలెనే తంతిమార్గమున అధినివేశముల యభిప్రాయమును కనుగొని ౧౯౨౪ లో జనీవా ప్రొటకాల్ సంధిని, ౧౯౨౫ లో లోకార్నొ సంధిని బ్రిటీషుప్రభుత్వమువారే నిర్వహించి అందులో చెప్పబడిన బాధ్యతలను అధినివేశ ప్రభుత్వము లంగీకరింపనిచో అది వానిని బాధింప దనునియమమును చేర్చిరి. సామ్రాజ్యముపక్షమున బ్రిటీషుప్రభుత్వమువారు యుద్ధమును ప్రకటింప నగ్గు లేయని అంగీకరించినను యుద్ధము జరిగినచో సహాయము చేయుట చేయకపోవుట అధినివేశప్రభుత్వముల యిష్టమునుబట్టి యుండు నను సూత్రము ఐరిషు ఫ్రీస్టేటు-రాజ్యాంగమున ౪౯ వ నియమము ప్రకారము నిర్ణయింపబడెను. అందున తన స్వదేశములోనికి దాడివచ్చి తప్ప ఐరిషుపార్లమెంటువారి అంగీకారము లేనిది ప్రభుత్వమును యుద్ధమున దింపరాదని విధింపబడెను. ఈసూత్రమునకు కెనడా ఆమోదము తెల్పెను. తక్కిన అధినివేశము లంగీకరించెను.

### ౧౯౨౬ సామ్రాజ్యసభ

ఇట్లు అన్నివిషయములందువలెనే పరరాజ్యమంత్రాలోచనమునకూడా పురాతనరాజ్యమగు బ్రిటీషుదీవులతోపాటు అధినివేశములు సమానస్థానము కాకపోయినను సమానగౌరవమును పొందినవి. ఇందు కనుగుణముగ ౧౯౨౫ లో వలస రాజ్యమంత్రి గాక ప్రత్యేకముగా నొక అధినివేశ వ్యవహారమంత్రి (Secy. of State for Dominian Affairs) నియమించి ప్రధానమంత్రి కార్యస్థానమున వలసవ్యవహారముల కొకశాఖను, అధినివేశముల వ్యవహారముల కొకశాఖను నియమించిరి. తాత్కాలికముగ వలస రాజ్యాంగమంత్రియే క్రొత్తపదవి నలంకరించెను. అయినను క్రొత్తగా ప్రభుత్వమున కెన్నుకోబడిన దక్షిణాఫ్రికాలోని జాతీయవాదులు హెర్టుజానుగారి నాయకత్వమున అధినివేశములు బ్రిటిషుదీవులకు లోబడిన రాజ్యము లనుభావము ప్రబలముగ కలదని సూచించిరి. అందువలన ౧౯౨౬లో సామ్రాజ్యాంతర్భాగము పరస్పర సంబంధమును గూర్చి

ప్రాతిమూలము చేయదలచి బాల్ఫరుప్రభువు అధ్యక్షత క్రింద నొక ఉపసంఘమును నియమించిరి. బ్రిటీషుదీవుల యొక్కయు అధినివేశముల యొక్కయు పరస్పరసంబంధమును, స్థానమును (Position) వా రిట్లు సూచించిరి. "తమ ఆంతరంగికవ్యవహారములందుగాని, బాహ్యసంబంధములందుగాని నైవిధముగను ఒకదాని కింకొకటి లోబడకుండి చక్రవర్తి మకుటమునకు భక్తిగలిగి యుండుట మూలముగా సంశ్లిష్టత కలిగి బ్రిటీషుజాతుల సమ్మేళనమున స్వేచ్ఛసభ్యతకలిగి సమానగౌరవముగల స్వపరిపాలనముగల జన"సమూహములు" సామ్రాజ్యమునందుస్వపరిపాలనములు ప్రతిభాగమును తన పరిణామమునకు తానే కర్త. స్వరూపమున గాకపోయినను స్వభావమునుబట్టి వాని కెట్టినిర్బంధమును లేదు." ఈనివేదికనుచూచి హెర్ట్జాను గారును సామ్రాజ్యములోని యితర రాజనీతిజ్ఞులును హర్షించిరి. బాల్ఫరు సంఘమువారు అధినివేశములలో గవర్నరుజనరలుగారికి బ్రిటీషుదీవుల రాజుగారి కుండు నట్టి రాజ్యాంగ గౌరవము, హక్కులు నుండుననియు, అతడు బ్రిటీషుసామ్రాజ్యప్రభుత్వముయొక్క ప్రతినిధిగాని యేజెంటుగాని కాడనియు, బ్రిటీషు ప్రభుత్వమునకును తన ప్రభుత్వమునకును మధ్య రాయబారిగ దూతగ ప్రవర్తింపరాదనియు, ఆప్రభుత్వములు రెండును తిన్నగనే ఉత్తర ప్రత్యుత్తరములను జరుపుకొన వలయుననియు తీర్మానించిరి. మరియు అధినివేశరాజ్యముల శాసనములను బ్రిటిషుమంత్రుల సలహాపైన రాజుగారు నిలిపియుంచు పద్ధతియు, నిరాకరించు పద్ధతియు ఆచరణయోగ్యము కాని ప్రాతపద్ధతులనియు, రాజకీయసిద్ధాంతము ప్రకారము బ్రిటీషురాజు పేరుననే పరిపాలింపబడు అధినివేశరాజ్యముల మంత్రుల సలహానుబట్టి జరుగు వ్యవహారములకు విరుద్ధముగ బ్రిటిషుమంత్రుల సలహానుబట్టి రాజువర్తించుట అనుచితమనియు తీర్మానించిరి. మరియు బ్రిటీషుప్రభుత్వముతో సమానమగు శాసననిర్మాణాధికారనిర్ణయమునుగూర్చి యోచించుటకును ఇతర చిల్లర సంస్కరణములకొరకును సలహా నొసగుటకు వేరొక ఉపసంఘమును నెలకొల్పుటకు తీర్మానించిరి. బ్రిటీషుదీవులతో సమానగౌరవము కలదని చెప్పుచు అధినివేశరాజ్యములలోని న్యాయస్థానపుతీర్పులపైన బ్రిటీషుదేశములోని ప్రీవికవున్సిలువారికి ఉపర్యభియోగములను (appeals) తీసుకొనివెళ్లుట సమంజసముగ లేదని ఐరిషుఫ్రీస్టేటువారును కెనడావారును వాదించుచున్నందున ఈవిషయమును అధినివేశరాజ్యములయొక్క అభిప్రాయానుసారముగ పరిష్కరింపవచ్చుననియు, అయితే యిది సామ్రాజ్యములోని అన్నిభాగములకు సంబంధించిన విషయ మగుటవలన సమాలోచనమును చర్చను చేయనిది పరిష్కరింపరాదనియు తీర్మానించిరి. పరరాజ్యములతోడి వ్యవహారముల విషయమున సంఘులను గూర్చి యీసంఘమువారు ౧౯౨౬ సామ్రాజ్యసభతీర్మానము నామోదించుచు పరరాజ్యవ్యవహారము రాజనీతిలోను, సామ్రాజ్యరక్షణవిషయమునను నింకకొన్నాళ్లవరకు ప్రధానబాధ్యత బ్రిటీషుప్రభుత్వమునకే వదలవలసియుండుననియు, అయితే ఆయా అధినివేశరాజ్యప్రభుత్వముయొక్క సమ్మతి లేనిది ఆరాజ్యమును యుద్ధములోనికి దింపరాదనియు తీర్మానించిరి. ప్రస్తుతము ఉత్తరప్రత్యుత్తరమూలమున జరుగుచున్న సామ్రాజ్యఅధినివేశరాజ్యములు కార్యాలోచనపద్ధతికితోడు లండనునగరమునను అధినివేశరాజ్యముల ముఖ్యపట్టణములలోను పరస్పరకార్యాలోచనమున కనుకూలించు పద్ధతులను యేర్పాటుచేయవలయుననియు తీర్మానించిరి. ఆప్రకారము ౧౯౨౮ లో న్యూజీలాండులో బ్రిటీషుప్రతినిధిగ నొక ఉద్యోగి నేర్పరచిరి. ౧౯౩౦లో దక్షిణాఫ్రికాలోను కెనడాలోను బ్రిటీషుద్యోగప్రతినిధుల నేర్పరచిరి.

ఈసంఘమువారి నివేదికలో నిట్లు సూచించిరి:—
"స్వతంత్రసంస్థలే బ్రిటీషుసామ్రాజ్యముయొక్క ప్రాణాధారము. స్వేచ్ఛయగు సహకారపద్ధతియే దాని ధర్మశాసనము. శాంతి, సౌఖ్యము, అభివృద్ధియు దాని యుద్దేశ్యములు. తన సహకారపద్ధతిని పరిమాణమును నిర్ణయించుకొను స్వతంత్రము ప్రతిఅధినివేశమునకు నున్నను దీనివలన సామ్రాజ్యముయొక్క సమిష్టిక్షేమమునకు సంబంధించిన ఏవ్యవహారమునకును నష్టకరము కాదని మాయభిప్రాయ"మనిరి.

డొమినియనులకు గవర్నరుజనరలునుగాని గవర్నరునుగాని నియమించుట, డొమినియనుపార్లమెంటు వారి తీర్మానమెుక్కొకప్పుడు సార్వభౌము డంగీకరింపక పోవుట, ఇంగ్లాండులోని "ప్రీవీకవున్సిలు" సభకు డొమినియనున్యాయస్థానములపైన ఉపర్యభియోగములను తీర్మానించు అధికార ముండుటయు డొమినియనురాజ్యాంగ పరిస్థితులందు కొన్ని స్వల్పపుమార్పులు చేయుటకు బ్రిటీషుసామ్రాజ్యమువారి కధికార ముండుట—ఇవిమాత్రమే డొమినియనులపైన బ్రిటీషుసామ్రాజ్యమునకు గల నామావశిష్టమగు నధికారములు. ఈఅధికారములుకూడ అధినివేశములవారు తిరస్కరింపసాగిరి. ప్రీవీకౌన్సిలుకు అప్పీళ్లను పంపరాదని ఐరిషుఫ్రీస్టేటు వారనిరి.

ఇటీవల డొమినియనుల శాసనాధికారములను గూర్చి విచారించుటకు సార్వభౌమ-పార్లమెంటువారేర్పరిచిన సంఘమువారు (Dominion Law's Conference) డొమినియనులకు నిర్నిరోధప్రభుత్వాధికారములు కలవని శాసనమూలమున స్పష్టీకరింపవలసినదనియు, డొమినియనుల శాసనములను బ్రిటీషుసార్వభౌముడు ప్రతిషేధింపరాదనియు, వానికి దేశాంతరములందుకూడ గౌరవ ముండవలయుననియు, డొమినియనులు తమ నౌకావ్యవస్థను వ్యాపారమునుగూర్చిన శాసనములను తమ యిచ్చవచ్చినరీతిని చేసికొనవచ్చుననియు తీర్మానించిరి. ఇట్లు డొమినియనుప్రభుత్వస్వాతంత్ర్యము పరిపూర్ణతజెందెను.

---

## సీతారావణ సంవాదము*

విస్సా అప్పారావు గారు, M. A.

రా. శుక్లగిరి పర్వతము చూచినంతటిలోను
  కవలేశపురి నీకు కలుగున ఓ సీత!

సీ. పొంగకురోరి దుర్మార్గ రావణ నీవు
  నీపొంగు శ్రీరాము బాణముతో కుంగేను.

రా. చుట్టూ సముద్రాలు మధ్యను నాలంక
  లంక కొచ్చినవాడు నరు డెవ్వడే సీత!

సీ. నరుడుగాడురోరి నరసింహోధరూడు
  భూమినీ నిన్ను బరిమార్చినవాడు.

రా. నరు డొంటివాడు నల్లనివాడు సీత
  నరుడు నాకు ఎంత, కాలుడకు సీత
  పది శిరస్సూలు గలవాడనే ఓ సీత
  వంటి సిరసూవాడు నీనాథుడే సీత
  నరుడు ఎంత గలడే నాకు ఓ సీత.

సీ. నరుడు గాడురన్నా నారాయణామూర్తి
  అవతారపురుషూడు ఆదివిష్ణుమూర్తి
  నామీద చైవేసి నావద్ద నిలచుంటె
  పక్కన నీతల వేలును గాదటర
  పొంగకురోరి నీ వేల పొంగేవు
  నీపొంగు మా రాము బాణాన కుంగేను.

---

* కొలదికాలముక్రిందట పెద్దాపురపు గ్రామములో పిచ్చిబిచ్చగాడు పాడగా విన్నపాట.

# ఋష్యాశ్రమములు—గుహాలయములు

ఎ. వి. రత్నముగారు

బౌద్ధయుగమున విహారములు గుహాలయములు వలె, వేదకాలమున ఋష్యాశ్రమములు భారతవర్ష సభ్యతయందును, ధర్మజీవిత ప్రబోధమునందును విశేష ప్రాధాన్యమును గలిగియుండె ననుటకు పురాణేతిహాసాది ప్రాచీనవాఙ్మయము ప్రబలనిదర్శన మొసగును. కావున, ప్రాచీన హైందవసభ్యతయం దీయాశ్రమముల పరిశ్రమ మెంత గలదు? ప్రాచీనధర్మవికాసమునం దవి యెట్టి భాగమును గైకొనెను? ఈయాశ్రమములు పాలించిన మహర్షు లాచరించిన దేమి? వారి ప్రతిభావిశేషము లెట్టివి? అని విచారింపనయ్యెడిని.

ప్రకృత్యారాధనపరులగు నార్యసంతతివారు చీలిపోయి దేశాంతరములకు వలసపోయినపిమ్మట, వారి యారాధనవిధానమును ధర్మజిజ్ఞాసయును వేర్వేరుత్రోవలు పట్టెను. మొదట ఆర్యుల కెల్లరకు సర్వసామాన్యమయిన యీప్రకృత్యారాధన మితరార్యసంతతివారియందు కాలక్రమమున క్షీణించి, వారి రాజ్యసంపదలతోపాటదియు నంతరింప, వారు పరధర్మమునకు పాలైరి. తమ పూర్వుల యారాధనవిధానమును గాని, ఆచారధర్మములను గాని, యనుసరించు రోమనులు గాని గ్రీకులు గాని నే డెవ్వరును లేరు. పార్శీకులలో కొందరు మాత్రము పరధర్మముదాడినుండి తప్పించుకొని, యీ దేశము చేరి తమ పూర్వారాధనవిధానమును గాపాడుకొనగల్గిరి. ఇక హైందవార్యులం దది యపూర్వముగ బరిణామవికాసములను జెంది, హిందూసభ్యత కొక విశిష్టత జేకూర్చెను.

మధ్యధరాసముద్రతీరవాసు లగు హెల్లార్యులు (గ్రీకులు), రోమనులు చిన్న చిన్న రాష్ట్రములను నిర్మించుకొని, ‘అరాజకులై’ నవీనరాజకీయప్రభుత్వములకు మూలములగు ప్రజాస్వామికపరిపాలనోద్యమములందును, రాజ్యతంత్రమునందును ధీరప్రవృత్తు లగుచుండ, మధ్యాసియార్యులు (పార్శీకులు) ప్రపంచములోని కెల్ల చరిత్రప్రసిద్ధమగు ప్రథమార్యసామ్రాజ్యమునకు పునాదులు వేయుచుండిరి. ఇక మొదటినుండియు హైందవార్యు లనశ్వరమగు ధర్మసామ్రాజ్యము చేపట్ట సమకట్టుచుండిరి. ఈధర్మానుష్ఠానమున గృహస్థులు వైదికకర్మమార్గప్రవృత్తులై కర్మకాండను శాఖోపశాఖలుగ పెంచుచుండ, బ్రహ్మజిజ్ఞాసువులు, తపోధనులగు మహర్షులు వనౌకసులై, పుణ్యనదీతీరములం దాశ్రమములు నిర్మించుకొని, జ్ఞానమార్గాన్వేషణప్రవృత్తచిత్తవృత్తు లగుచుండిరి. ఇతరార్యజాతులందు జ్ఞానులు పౌరసభ్యతయందు బాల్గొని తత్త్వాన్వేషణము చేయుచుండ, భరతవర్షమున జ్ఞానులు పురములను జేరక వనములను జేరి తత్త్వాన్వేషణమునకు గడంగుట హైందవార్యులందే కన్పట్టును. ఈయాశ్రమజీవితమునుండియే, హిందూధర్మమునకును ముఖ్యముగ హిందువుల యాధ్యాత్మికచింతనమునకు నొక వైశిష్ట్యము గల్గినది. హిందూదేశముయొక్క ప్రకృతిరామణీయక ప్రభావమో, లేక హైందవార్యుల ప్రతిభావిశేషమో, తత్త్వాన్వేషణపరులు, ఋషులు నాగరికజీవనమును విడిచి ఆరణ్యజీవనము నవలంబించుట హైందవసభ్యతయందు గుర్తింపదగిన యొక యద్భుత విషయము. వీరు వనవాసులయి ప్రకృతితో సాహచర్యము నొంది సృష్టిమహిమంబును గాంచి యేమి కనుగొనిరి? వీరు గాంచిన తత్త్వదర్శన మేమి? వీరి దివ్యదృష్టి, దివ్యజ్ఞానము నెటువంటిది?

ఇమ్మహర్షులు సృష్టియొక్క యద్భుత మహిమంబును గన్నులార గాంచి, తన్మయులై యానంద గీతములను గానముచేసిరి గాని, సృష్టిసిద్ధాంతములను గావింపలేదు. ప్రకృతియందు లీనమై కనుగొన్నది, వెలువరించినది నేటి ప్రకృతిశాస్త్రజ్ఞానమువంటిది గాదు, జీవితపరమార్థజ్ఞానము. అప్రతిష్ఠమగు తర్కముమీద ప్రతిష్ఠింప

బడిన తత్త్వశాస్త్రములును గావు. రాజనీతికిని, అర్థార్జనమునకును భోగాభివృద్ధికిని నుపయుక్తము లగు నీతి శాస్త్రములును గావు. ఇట్టిశాస్త్రవాదములందు గాదు, వారు దృష్టి నుంచినది. వారు కనుగొన్నవి యిట్టివి గావు. అవి శాశ్వతములు నమోఘములును పవిత్రములు నగు జీవితసత్యములు. ఆ సత్యములనే యుపనిషత్తు లందు గానముచేసిరి. లతాంతములు వోలె ఉపనిషత్తులు వేదాంతము లయ్యెను. మహర్షులు గాంచిన యీ యపూర్వతత్త్వదర్శనము మరి యేరికి నేదేశమున నేకాలమున లభించియుండలేదు. "తత్త్వ మసి; సర్వంఖ ల్విదం బ్రహ్మ; సత్యం జ్ఞానం ఆనందం బ్రహ్మ; ఆనందరూప మమృతం య ద్విభాతి; రసోవై సః; యదేతన్ హృదయం మమ తదస్తు హృదయం తవ." ఇత్యాది శ్రుతి వాక్యము లీయపూర్వ తత్త్వదర్శన ఫలితములే. విశ్వవిశాలహృదయులు నమేయప్రతిభాశాలులు నగు నీమహనీయులు పిపీలికాదిబ్రహ్మపర్యంతమైన సృష్టి నేదృష్టితో గాంచిరో యదియే వారి దివ్యదృష్టి. వారు వెలువరించిన యేతత్త్వజ్ఞానము గలదో యదియే వారి దివ్యజ్ఞానము. ఇదియే వారి తపఃఫలము. అంతే కాదు. తత్త్వాన్వేషణమునకే విహితశ్రములై, బ్రహ్మజిజ్ఞాసయందే నిమగ్నులై మానవత్వమును మరచి, తత్త్వగోష్ఠియందే తమజీవితము నంతయు గడపలేదు. వీరి యాశ్రమ ధర్మము, తర్వాత భరతవర్ష దౌర్భాగ్యమున గల్గిన సన్న్యాసుల మఠధర్మము వంటిది కాదు. వీరి వైరాగ్యము శుష్క హృదయులగు విరాగులదివంటిది గాదు. ఉత్తమాశ్రమనిష్ఠితులయ్యు భిక్షువులు గారు. ఆరణ్యకులయ్యు ననుపమ తేజశ్శాలులు. నివృత్తిమార్గమునం దున్నను శస్త్రాస్త్రములు చేతపట్టగల ధర్మవీరులు గాని, నిర్వీర్యులును ధర్మభీరువులును గారు. వీరి యాశ్రమములు వేదపాఠశాలలుమాత్రమే గావు, వీరుల నుత్పత్తిచేసెడు ఉత్తమ విద్యాలయములు. మానవత్వమును దివ్యత్వమునకు గొంపోజాలిన ధర్మసంస్థలు. ఈ యాశ్రమములను పాలించు కులపతులు బ్రహ్మజ్ఞానులు, ఆత్మారాములు, కవిద్రష్టలుమాత్రమే కారు; వారు "కరుణానిరతులు, ధర్మస్వరూపులు". వారి యాశ్రమములు భూపాలురకు ధర్మశిక్షణము నొసగు ధర్మస్థానములు; దుఃఖితుల కాశ్రయమగు శరణాలయములు. ప్రాచీనభారత వర్షముయొక్క యాధ్యాత్మిక సంపత్తికిని జీవిత వైభవమునకును గారణములైన యీ యాశ్రమములనుండి యార్ష తేజ మెట్లు ప్రసరించుచుండెడిదియు దెలిసికొనుటకు ముఖ్యమయిన రెం డుదాహరణములను జూడవచ్చును.

పురాణబ్రహ్మవాది, జగద్విఖ్యాత తేజుడగు రామాయణమహాకవి జీవితదృష్టి యేమి? ఇమ్మహర్షి యాశ్రమ మెవ్వరి కాశ్రయ మయినది? ఈపరమకారుణ్యమూర్తి, ఈయార్తత్రాణపరాయణుడు కేవలము ఛాందసవృత్తియందే మునిగియుండలేదు. రామాయణకావ్యరచనయందే తన కాలమునంతను గడపలేదు. కావ్యసృష్టికొరకే తన యావజ్జీవము ధారపోయలేదు. యోగసమాధియందే నిద్రాముద్రితుడు కాలేదు. కన్నులు మూసికొని ఏకదీక్షతో జపముచేయుచు కూర్చుని యుండలేదు. మరేమి చేయుచుండెను? జగచ్చక్షువువలె, కన్నులు విప్పి లోకమును కరుణాదృష్టితో కనుగొనుచుండెను. లోకబాంధవునివలె దీనజనబంధు వయ్యెను. ఇదియే యమ్మహర్షి దివ్యదృష్టి. ఆకరుణాదృష్టియందే దివ్యజ్ఞానము ప్రకాశించుచున్నది. అంతియ కాని, వేలకొలది మైళ్లదూరమున నేమి జరుగుచున్నదో తెలిసికొనుటకు తనదృష్టిని, జ్ఞానమును బ్రయోగింపలేదు. పరకాయ పరహృదయప్రవేశాది యక్షిణీవిద్యలందు దృష్టిని పోనివ్వలేదు. ఇట్టి క్షుద్రవిద్యలతో మహర్షులకు నిమిత్తము లేదు. వారు కరుణానిరతులు, ధర్మస్వరూపులు. వారి కరుణారసైకదృష్టియే వారి దివ్యదృష్టి. వారి ధర్మజ్ఞతయే వారి దివ్యజ్ఞానము. వారి దయాధర్మము లనన్యసామాన్యములై మానవులను దివ్యులను జేయునట్టివి గాన, వారిజ్ఞానదృష్టులు దివ్యము లని కొనియాడబడినవి. కరుణాసత్యములు రెండే ధర్మదేవతయొక్క నేత్రములు. అట్టి ధర్మదేవతకు నిలయములైన యీ ఋష్యాశ్రమములు, విద్యాలయములు శరణాలయము లయ్యె నన్నచో నిక వారి దివ్యప్రభావమును గూర్చి యేమి చెప్పవలెను? వాల్మీకిమహర్షియొక్క కరుణారసమునందే రామాయణ ముద్భవించినది. దాని

చేతనే పోషింపబడెను. అందే ముగిసినది. అది వట్టి పేలవమగు కరుణము గాదు; జీవితపదార్థసత్యములు మీఱిపోవునపుడు చూపింపవలసిన కారుణ్యము. ఆశ్రమధర్మమునందే, కరుణాయత్తజీవనమునందే, ధర్మారాధనమునందే ఆత్మశాంతియు లోకకల్యాణమును గలవు; వాగాడంబరమునందు గాదు, రాజనీతియందు గాదు, రాజ్యభోగములందు గాదు, రాజబోధములందు గాదు, దిగ్విజయములందు గాదని నిరూపించుటకో యనునట్లు రామాయణకథ మొదటనుండి చివరవరకు నడచినది. పారలోక మెల్ల నేకమై, కరుణాలేశము లేక యొక్క మహాపవిత్రవ్యక్తిని బురము వెడల నడిచినపుడు, నే నున్నానని చెప్పి దయార్ద్రదృష్టితో నాదరించినవా రెవరు? ఎవ్వరి యాశ్రమ మాశ్రయ మయినది? ఎవ్వరు శరణ్యమయిరి? ఎవరు దీనావను లైరి? రామాయణమహాకావ్యసృష్టికై వాల్మీకిమునిపుంగవుని గీర్తింపవలెనా? లేదా, ఆతని విశ్వవిశాలకరుణార్ద్రహృదయమునకా? సమకాలికసజ్జనాళి వాల్మీకిమహర్షి యొక్క యేఘనకార్యమునకై వేనోళ్ల నాతని బ్రశంసించి బహూకరించిరి?

ఇక రెండవది: ఈయాశ్రమములందు వినీతులగు స్త్రీపురుషుల సభ్యతాసంస్కారములు గాంచినచో, ప్రాచీనార్యుల జీవితవైభవ మేతీరున బ్రకాశించినది విస్మయము గొల్పును. ఇమ్మహర్షుల దివ్యదృష్టి యెందున్నదియు గానవచ్చును. కృతయుగధర్మమునకు నిధానమై సత్యతేజమును బ్రస్ఫురింపజేయు కణ్వమునీంద్రు నాశ్రమము కేపి చూడుడు. ఈకరుణానిరతుడు, ధర్మస్వరూపుడెవరిని బెంచి పోషించుచుండెను? ఆతని దివ్యాశ్రమంబున బ్రకాశించుచున్న తేజ మేమి? తన విమల దివ్యజ్ఞానముచే నొకయపూర్వపుణ్యసర్గ నుత్పత్తిచేసెను. ఆపుణ్యసర్గయే వేదమూర్తియగు శకుంతల. మహారాజాస్థానమున, అమ్మహాజనసభమధ్య, శకుంతల తన దివ్యతేజమును వెదచల్లుచు, సభ్యుల హృదయములు కంపించునట్లు—

"మన్యతే పాపకం కృత్వా న కశ్చి ద్వేత్తి మా మితి,
విదంతి చైనం దేవాశ్చ యశ్చై వాంతరపూరుషః.
ఆదిత్యచంద్రా వనిలానలౌచ
ద్యౌ ర్భూమి రాపో హృదయం యమశ్చ,
అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్."

ఇట్లు తన గంభీరసత్యవాణిని వినిపించునపుడు, సభ్యులు పులకితగాత్రులై, ఎక్కడిది యీదివ్యతేజము! ఈ యపూర్వశ్రుతిబోధ యేమి! గంగాప్రవాహమువలె నీ పవిత్రవాగ్జలధార, హృదయములకు పట్టిన త్రుప్పును కడిగివేయునది, యేస్వర్గలోకమునుండి యిందుల కవతరించెనని యచ్చెరువు నొందవలదా? వేదములందు గాక, ఇట్టి సత్యశ్రుతి మరల నేవాఙ్మయమున నెచ్చట వినబడును? పంచభూతములే మనలను వెంబడించుచుండును. అవియే మనకర్మలకు సాక్షి. మన వృత్తములను విచారించుటకు బరలోకమున వేఱెదేవు డొకడు లేడు. మనుజుల కర్మలకును దగినరీతి పుణ్యలోకములు స్వర్గనరకములు నిర్మింపబడియుండ లేదు. ఇహలోకమున మానవుల సాక్ష్యము గాదు, నోట్లు కావు, దస్తావేజులు కావు, లాకోర్టులు గావు నరులను రక్షించునవి. నరుని నెప్పుడును వెంటనంటి కనిపెట్టుకొనియుండెడు "మహాపదార్థములివి యుండగా నరుడు దక్కొన నేడ్పునే తన్ను మ్రుచ్చిలన్?" కావున "నాత్మవంచకుడవు, ఆత్మఘాతకుడవు కాకుము." అను శ్రుతిబోధ నిట్టి యపూర్వరీతిని శకుంతల పేరోలగమున నిర్భయముగ వెల్లడించినది అన్నచో, ప్రాచీనార్యస్త్రీల ధీరత, సభ్యతాసంస్కారముల వైభవస్ఫురణము నేమని కొనియాడగలము? ఇట్టి సత్యస్వరూపిణులను, దివ్యతేజోమూర్తులను తయారుచేసిన యమ్మహర్షుల ప్రభావము నెంతని ప్రశంసింపనగును? ప్రాచీనఋష్యాశ్రమములం దుదయించిన యిట్టి తేజోమూర్తు లేసర్వకళాపరిమత్తులం దేధర్మసంస్థలయం దేయుగమున బొడముట గాంచనగును? ఆకృతయుగమునందు, ఆర్ష యుగమునందు తప్పిన, మరల నేయుగమున శకుంతలవంటి వేదమూర్తులను గాంచగలము? శకుంతల పెరిగినది యొక మునిపల్లె, నాగరికులమధ్య గాదు. కట్టినది వల్కలాంబరములు గాని, చీనిచీనాంబరములు గావు. భుజించినది వన్యఫలములు గాని, పరమాన్నములు గావు.

నివసించినది కుటీరము గాని రాజసౌధము గాదు. కాని యందుండి వెలువడిన యాదివ్యతేజ మేమి? కణ్వమహర్షి యొక్క దివ్యదృష్టి యిట్టి దివ్యతేజోమూర్తిని లోకమునకు సమర్పించుటయం దున్నది గాని, తన పరోక్షమున జరిగిన "యంతవృత్తాంతమును వెలుంగుట"యందు లే దది. ఇట్టి "దివ్యదృష్టి"యెల్లరకు సులభసాధ్యము. (ఇక్కాలమున నిట్టి దివ్యదృష్టి చాలమందికి చాల అద్భుతముగ గలదుగదా!) కాని, ఆదివ్యదృష్టిమాత్రము కలియుగమువారికి సాధ్యము కాదు.

ఇంకను నీయాశ్రమధర్మ మెట్టిది? ధర్మసాధనమునకు మూలమగు కాయకష్టమునందే, ఆయురారోగ్యానందభాగ్యములు గల వనునట్లు కణ్వమహర్షి కానకేగి సమిత్కుసుమకందమూలఫలములు స్వయముగ మూపున బెట్టికొని మోసికొనివచ్చును. శకుంతల యెదురుగ బోయి వాని నందుకొని లోన బెట్టును. శకుంతల యతిథిసత్క్రియల నప్రమత్తురాలై, వనదేవతవలె వనాంతరముల సంచరించుచుండును.

ప్రాచీనకాలమున ఋష్యాశ్రమములందు నెలకొల్పబడిన జీవితపథ మిట్టిది. సత్యాశ్రయములైన యీయాశ్రమములు పవిత్రజీవితధర్మములను, మహోన్నతాదర్శములను బోషించుచు, చక్రవర్తులుగూడ కన్నెత్తి చూడలేని మహాతేజముతో ప్రకాశించినవి. ప్రాచీనార్యుల యాధ్యాత్మికవైభవ మిట్లు కార్యరూపమున లౌకికజీవనమునందునుగూడ బ్రకాశించినది గాని, శుష్కవేదాంతదాంభికజీవనము చేయుటయందును, బండ్లకొలది వేదాంతగ్రంథముల రచించుటయందును వెలుగలేదు. ఈప్రాచీనార్యవైభవము, కృతయుగధర్మము, మహాభారతయుద్ధముతో నస్తమించును. ఋష్యాశ్రమములు మహాభారతయుద్ధమునాటికే యదృశ్యము లయినట్లు కన్పట్టును. అర్జునుని తీర్థయాత్రాప్రదక్షిణమునం దతడు చూడని తీర్థంబు లేదు. చూడని యాశ్రమము లేదు. మరియు మహాభారతయుద్ధమునందు, ధర్మనియంతలగు గురువులు, ప్రజానాయకులు, వీరులు, ౧౮ అక్షౌహిణుల వీరభటులు నిహతులైనపిదప, మిగిలిన పెద్దలును కొద్దికాలమునకే దివంగతులైనపిమ్మట, ఆర్యావర్తమున ధర్మోపప్లవము కలిగిన దనుటకు సందియము లేదు. మహాభారతయుద్ధము కలియుగము పుట్టుటకుగాను పుట్టిన యొక ప్రళయ మనదగును. ఇంతనుండియు ప్రాచీనార్యధర్మము, ఆర్షదృష్టి, ఆనందము, జీవితవ్యాపారమునుండి నిర్గమించును. ఇక నుద్గమించునది తేజోవంతమగు నాశ్రమధర్మము గాదు, తమఃపరివృతమగు సన్న్యాసధర్మము. ఇక వినబడునది సత్త్వపూరితమగు నుపనిషద్గానము గాదు, అసత్పూరితమగు వైరాగ్యాలాపము. 'అసతో మాగమయ స' దను శ్రుతివాక్యము కాదు ధర్మపథమును జూపునది. 'సర్వంఖల్విదం బ్రహ్మ' యనునది జీవితదృష్టియం దేమి, ఆచరణమునం దేమి 'సర్వంఖల్విదం దుఃఖం'గా మారినది. జీవిత మానందమయమునకు మారుగ దుఃఖమయముగా గనుగొనబడును. ప్రాచీనధర్మము తారుమారై జీవితపరిస్థితులు తమఃపరివృతము లైయున్న సమయమున ధర్మసంస్థాపనమున కవసరము గల్గెను. కాని, దేశకాలపరిస్థితులు ప్రాచీనార్షధర్మమును తిరిగి యుజ్జీవింపజేయదగినవిగా నుండలేదు. బహుశః ప్రాచీన ధర్మవిధానమే మరచిపోబడి యుండును. కావున నిట్టితరి బయలుదేరిన ధర్మసంస్థాపకుల దృష్టి కేవలము సన్న్యాసమువైపునకు మ్రొగ్గినది. కాలచక్రమును యుగధర్మమును సరికట్ట నేరితర మనునట్లు ధర్మచక్రమును బరివర్తించినది. కావున బౌద్ధయుగమున నందరు సన్న్యాసము పుచ్చుకొన్న బౌద్ధమత ప్రచారకులే. ఆచార్యయుగమున నెల్లరు నాయాయాచార్యుల మత ప్రచారకులే. వారి బోధనలు, వారి వ్యాఖ్యానములు, వారి భాష్యములే మార్గదర్శకములు. భక్తియుగమున నెల్లరు భక్తులే! ఎన్ని మతములు! ఎన్ని ప్రచారములు! ఎందరు భక్తులు! ఎన్ని భక్తిమత సంప్రదాయము లుద్భవించినవి! కాని, యీమతసంప్రదాయములందు, ఈ ధర్మప్రచారప్రతిష్ఠాపనములందు ఆప్రాచీనార్ష ప్రతిభ, ఆ సత్యదృష్టి, యొక్కింత వెలసినచో జీవితము సత్యప్రకాశమై యుండెడిది. జీవితము దుఃఖమయముగా కనుగొనబడియుండెడిది కాదు. జీవిత ధర్మములు దుఃఖకరములుగా నుండెడివి కావు. కలిప్రవేశమున కవకాశ ముండె

డిది గాదు. "ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతి." ఆనందమును పట్టజాలక పరమాత్మయనంతవిశ్వరూపమును దాల్చుచున్నాడు. 'ఈ భూతకోట్లన్నియు నానందముచేతనే పుట్టుచున్నవి; ఆనందముచే జీవించుచున్నవి. ఆనందమును గూర్చి పోవుచున్నవి. ఆనందధామమునందు ప్రవేశించుచున్నవి' యని చెప్పుచున్నారు. ఇటువంటిశ్రుతిని, ఇట్టి యానందమయ జీవితగానమును, వాస్తవ జీవితమునందు గాకున్నను, గ్రంథములందయినను ధర్మప్రబోధమునందైనను, మరల నెవ్వరు వినిపించిరి? వినిపింపగల్గిరి? మరి దేనిని విందుము? ఏప్రబోధమును గాంతుము? పుట్టుకయే పాపము. జన్మమే దుఃఖము. సంసారమే నరకము. కావున మానవుడయినవాడు జన్మరాహిత్యమునకై సర్వసంగ పరిత్యాగియై, సంసారమునుండి దూరముగ తొలగిపోయి, ముక్తికై యత్నించుటయే ముఖ్యకర్తవ్యము. ఈవిధముగానైనను జన్మ లేకుండ తిరిగి నర-పురుగు పుట్టకుండ జేయగల్గినట్లయితే లోకమున కెంతయో మేలు కల్గెడిది. అట్లు కాలేదు. ఈసన్న్యాసబోధవలన జన్మరాహిత్యము కలుగలేదు, సంసారబాధ తప్పలేదు గాని, జీవితము సత్త్వరహితమై, నిరానందమై, మరింత దుఃఖభారమయినది. బుద్ధుడు జీవితమును గూర్చి కనుగొన్న గొప్పసత్యము, 'ఆనందాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయన్తే'యను నట్టిది కాదు, జన్మదుఃఖమనేది. దుఃఖముచేతనే జంతువులు పుట్టుచున్నవి. దుఃఖముచేతనే జీవించుచున్నవి. దుఃఖమునందే గిట్టుచున్నవి. "జీవిత మనిత్యము, అనర్థము,దుఃఖము." ఇదియే బుద్ధుడు కనుగొన్న పరమసత్యము. ఇందుండియే బౌద్ధధర్మ ముత్పన్న మగుచున్నది. ఇట్టిదియే తర్వాత పుట్టిన మతములును. భగవద్గీతా ప్రతిపాదిత కర్మసన్న్యాసమునకును, బుద్ధుని కర్మసన్న్యాసమునకును గల భేద మీదృష్టి ననుసరించియే యున్నది. మొదట, జీవితచారిత్రమునందే శ్రీకృష్ణభగవానునకును బుద్ధదేవునకును చాల వ్యత్యాసము గలదు. ఒకరిది అనురాగప్రవృత్తి; ఒకరిది వైరాగ్యప్రవృత్తి. లోకదుఃఖనివారణార్థమై, అజ్ఞాతవృత్తిని నాత్మబంధువులను, విడువరానివారిని దుఃఖమున ముంచిపోయెడిబుద్ధుని సంసారపరిత్యాగము మహర్షు లెవ్వరును మెచ్చుకొనునట్టిది కాదు. బుద్ధుడు బోధించిన ధర్మము జీవితకళాపరిపూర్ణమయిన నిండుధర్మము గాదు. ఆకాలపు పరిస్థితులే యందులకు కారణము. అది ఋషులవంటి ధర్మాభిజ్ఞులను గాంచని యుగము. వసిష్ఠునివంటి గురువులు గాని, జనకునివంటి రాజులు గాని లేనికాల మది. అందుకు తగినట్లు భూపాలురు, ప్రజలు భోగపరాయణులై, ప్రాచీనధర్మమును గోల్పోయియుండిరి. అందుచే, ధర్మలోపము గల్గిన యాకాలమున బుద్ధుడే యొక ధర్మపరావతారు డయ్యెను. ఆయుగమునకు బుద్ధుని ధర్మోపదేశముకంటె గొప్పదయినది మఱొకటి లేదు. కావున ప్రాచీనధర్మమును గోల్పోయి జీవచ్ఛవముగ నున్న హిందూత్వమునందు కడకు బౌద్ధధర్మ ప్రభావమే ప్రబలమయ్యెను.

ఈనూతన హిందూత్వమునందు జీవితమును నిర్వీర్యముగను కళాహీనముగను జేయు నీతిబోధ యెంతేని జేరెను గాని, ధర్మయుతముగను జేవోవంతముగను జేయు సత్యప్రభమాత్రము లేదు. దీనియొక్క సత్యాసత్యములను నిరూపింప నక్కాలపు వాఙ్మయప్రపంచమే నిదర్శనము. బౌద్ధ జైన వాఙ్మయములతో నేమి, పౌరాణిక వాఙ్మయముతో నేమి, కావ్యకలాపములతో నేమి, హైందవవాఙ్మయము హిమాలయములవలె నన్నివైపుల పెరిగిపోయినది. కాని, యిం దన్ని మంచుగడ్డలే గాని, రత్నములు గానరావు. ఇటీవల గుట్టలుగుట్టలుగా త్రవ్వి ప్రోవు పెట్టబడుచున్న యీ వాఙ్మయ నికాయమున, మహాభారతమునందలి కథారత్నములవంటి కథ యొకటియైనను గలదా? మహాభారతము తులకించునట్టి వీర మహిమ కొంచెమయిన నిం దెచ్చటనయిన గన్పట్టునా? ఏది యాప్రాచీనజీవితవైభవస్ఫురణము వంటిది యిందు? ఎచ్చట కౌరవవీరులవంటి వీరులు? ఏరి ధర్మజునివంటి ధర్మవీరులు? ఏరి భీష్మునివంటి ధర్మాభిజ్ఞులు? ద్రోణునివంటి యాచార్యోత్తములు, ధౌమ్యునివంటి పురోహితులు? ఇది యుమగాదంతయొక్కవ గణింపవలసినది. స్త్రీలయొక్క సభ్యతా వైభవమును గాంచవలసియున్నది. "దేవతామూర్తి", "మహానుభావురాలు" కుంతీదేవివంటి వీరమాత.

"పండితి" బిరుదమును గాంచిన పాంచాలివంటి ప్రాజ్ఞురాలు, సుభద్రవంటి సౌమ్యమూర్తి—కొందరినిమాత్రమే యుదాహరించుటకు—ఇట్టి వనితారత్నముల నిటీవలి వాఙ్మయమునందు గాంచనయ్యెదునా? ఈ తేజఃపుంజము మహాభారతయుద్ధకాలమునాటిది. ఇంకను వెనుకవెనుకకు బోయినచో గాంచనగుదృశ్యము, అతిమనోహరము. కృతయుగధర్మముయొక్క దివ్యతేజోమూర్తులుగ నడయించిన శకుంతల, సావిత్రి, దమయంతివంటి స్త్రీరత్నములు ప్రాచీనభారతవర్ష మహోన్నతసభ్యతకు నిదర్శనములు. వేదమూర్తులయి, దేవతలకుగూడ స్పృహణీయచరితలై, నిరభిభవమగు సత్యస్వరూపమును తమ జీవితములచే ప్రకాశింపజేయుచు, స్వర్గసోపానములను నిర్మించుచు బోవునట్టి యిట్టి దివ్యవనితారత్నములను బోలెడు వారు మరల భారతీయవాఙ్మయప్రపంచమున గన్పట్టరు. ఎట్లు కన్పట్టుదురు? ఆదివ్యాశ్రమము లంతరించె. ధర్మమును నడపు ఋషు లదృశ్యు లయిరి. కావున నింతనుండి కన్పట్టు దృశ్యము: ధర్మప్రతిష్ఠాతలు, ధర్మోపదేష్టలు మహర్షులు గారు, సన్న్యాసులు, భిక్షువులు, స్వాములు మున్నగువారు. పుణ్యనదీతీరముల, సూర్యరశ్మియందు బహిరంగముగ నిర్మింపబడు ఆశ్రమములు గావు; జనావాసములకు గడుదవ్వుల నుండు కొండగుహాలు. ఏరికి కనబడకుండునట్లు కొండచరియలలో బిలములు చేసికొని గబ్బిలములవలె వసించుట కనుకూలములగు గుహాలయములు. కాన, నిట్టి గుహాలయములనుండి యెట్టి ధర్మము వెలువడును? గుహాధర్మమే! చీకటిధర్మము, వెలుతురుధర్మము గాదు. ఈగుహాలయధర్మమే, అంధకాసురునివలె దేశము నంతయు నాక్రమించినది. సుప్రసిద్ధములగు అజంతా, ఎల్లోరా, నాసిక్, కార్లి మున్నగు గుహాలయము లెట్టి తేజమును ప్రకాశింపజేసెను? ఇంతకు నీగుహాలయములలోని కెన్నడయినను రవిరశ్మి చొరబారినదా? సంధ్యారాగము, ఉషాదర్శనము పోనిండు, ఉదయభానుని దివ్యప్రభయేనియు గుహాలయవాసు లెన్నడయినను గాంచియుండిరా, వైదికఋషులవలె నానందభరితాత్ములై వారివలె దివ్యగానము నేయుటకు? కొండలమధ్య తొలువబడిన యీయాలయముల కట్టి దివ్యదర్శనభాగ్య మెట్లు లభించును? దీని కితోడు, ఈగుహాలయముల దరిని కొండకాలువలే గాని, యేపుణ్యనది గలదు? తమసానదియొక్క, మాలినీనదియొక్క మనోహరత్వములను గాంచుడు. ఈకొండకాలువలను గనుగొనుడు. భేదము విశద మగును. ఈగుహాలయముల పుణ్యమును గాదు, వైపుణ్యమును మాత్రమే మెచ్చుకోదగియున్నది. ఈగుహాలయములు తమఃపరివృతములు, ఆశ్రమప్రకాశము గలవికావు. కావుననే యీగుహాలయముల నుండి వేదగానమువంటి యత్యంతమనోహరమగు నొక గానమైనను ప్రభవింపలేదు. వేదర్షులు సృష్టిసౌందర్యమును గ్రోలి నిర్భరానందభరితులై పాడిన పాటవంటి ఒక్క పాటను, ఏది చూతము గుహాలయములనుండి వెలువడినదేమో! గుహాగానము తప్ప గుహలనుండి మరేమి గానము వినిపించును? ఇవి ఋష్యాశ్రమములవలె నెవరిని పోషించినవి? ఎవ్వరి కాశ్రయ మయినవి? ఇం దుండువారి జీవితదృష్టి యేమి? ఈగుహాలయములు, 'విహారము'లు అంతకాలము వెలిగినను, శకుంతలవంటి యొక్క లోకమనోహర తేజోమూర్తిని నుత్పత్తిచేయగల్గెనా? వనవాసనిరతులై, పుణ్యనదీతీరములందు విహరించిన మహర్షులు మనోహరములగు శ్రుతులనే కాదు, మనోహరచరిత్రులగు స్త్రీ పురుషులను గూడ లోకమున కిచ్చిరి. ఈగుహాలయము లేమి యిచ్చినవి? 'ఇచ్చియుండలేదో నే దెల్లదేశముల కళాభిజ్ఞులచే నాకసమునకంట పొగడబడు శిల్పచాతురీమహిమంబును? శిల్పకళారసజ్ఞులను విస్మయచిత్తులను జేయు శిల్పకళాకోశములను? సమకాలికజీవితస్పందమును, విభ్రమవిలాసములను రూపింపజేయుటయందు రసమూర్తులు కాలేదా? అంతే కాదు; ఉపనిషత్తులందలి భావములను నపూర్వకళాప్రభావమున విగ్రహములందు తక్కొత్తజేయలేదా? "రసోవైసః" అనుశ్రుతిని విశ్రుతముగ రంగునందును రాతియందును మూర్తీభవింపజేయలేదొకో?' యని యడుగవచ్చును. కాకేమి? కాని, ఇవి సమకాలికదేశీయజీవనమునందును, రాజధర్మమును నడిపించుటయందును నెట్టి ప్రభావము గల్గియుండె ననునది విచారింపవలసియున్నది. జీవితమును నుజ్జ్వలముగ జేయు ప్రభావమే యున్న

వో నీసభ్యతాసంస్కారములందు, మహాభారతకథా రత్నములవంటివి యెట్లనో యుద్భవమయ్యెడివి యీ యుగమునను. కావ్యకన్యయొక్క పాటవము, పరిమళము దివ్యకన్యకవలె నుండెడివి. ప్రాణము లేని దేవతావిగ్రహములు గాదు, ప్రాణము గల దేవతామూర్తు లుద్భవించెడివారు. ఈగుహాలయముల సంగతి పాశ్చాత్యులు తెలియపరచువరకు నేకావ్యకథలందును చేర్కొనబడక, అంత నిగూఢముగ నుండుటనుబట్టి సన్న్యాసుల మతములుగా, సన్న్యాసప్రభావముగా దక్క, మరొక్కవిధముగ నివి సమకాలికజీవితముమీద నెట్టిప్రభావమును గలిగియుండలేదని చెప్పవచ్చును. వీరుమిక్కిలి, ఆకాలపు తమోంధకారపరీతమగు జీవితము, గూఢధర్మముల ప్రాబల్యము, గుహాలయముల యుత్పత్తికి తోడ్పడెనని చెప్పవచ్చును. అటు గాక, పౌరాణికహిందూధర్మము, ప్రాచీనధర్మమువలె, వీర్యవంత మైయుండిన వంతియు నార్యవశ మయియుండి, హిందూదేశచరిత్రగతి వేరువిధముగ నుండెడిది.

జీవితమును సత్త్వవిలసితముగ జేయలేని సభ్యత, కావ్యకళావిజ్ఞానవిభవములతో నలరారునదియైనను, మృగతృష్ణవంటిది. కళోపాసకులను గాదు, విద్యావంతులను గాదు, విజ్ఞానఘనులనుగాదు, కుబేరులను గాదు, వీరులను, సత్త్వమూర్తులను నేసభ్యత యుత్పత్తిచేయునో యదియే మెచ్చుకొనదగినది. అదియే గొప్పది. అదియే లోకకల్యాణమును సమకూర్చునది. అదియే మానవత్వమును దివ్యత్వమునకు గొంపోజాలినది. అట్టి మానవసభ్యతయందు, కావ్యకళాసంపత్తి లోపించినను లోపము లేక, జీవితమే యొక సుందరకావ్యమై, కళావంతమై, యానందమయ మగును. ప్రాచీనార్షదృష్టి, సభ్యత యిట్టి మహోన్నతాదర్శజీవితమునే ప్రకాశింపజేసెను గాని, జీవితమును శ్మశానవాటికవలె గావించి యందుపై కావ్యకళారామముల నిర్మింప దొరకొనలేదు.

---

# "కలికి, యెవ్వఁడతండు నిక్కముగ చెపుమ?"

శ్రీ తి. వ. నారాయణస్వామిగారు

తో॥ లికారుమొగులు వన్నెలనెగ్గులాడెడు చెలువంబు నెమ్మేన వెలయువాఁడు
తెలిగండుమీాల బెళ్కులఁ జుల్కనగఁజేయు కలికికన్దోయిసొం పెలయువాఁడు
మొలనిండ జాళువా వలిపంపుదుప్పటి మలయువాఁ డలఁతిన వ్రోలయువాఁడు
నలువైన నెమ్మికన్నులనెట్ట మాదల నెలకొల్పి యాలలో మెలఁగువాఁడు
కలితనమ్మున నాలలో నిలుచుచెలుల - వలపువలలఁదగుల్కొన మెలఁగి; తనదు
చెలువమునుజూపి వలపించు చిన్నెలాఁడు - కలికి, యెవ్వఁడతండు నిక్కముగఁ జెపుమ?

---

# చోడభక్తిరాజు మద్రాసు మ్యూజియం తామ్రశాసనము

## కొన్ని వివరణములు

టి. యస్. రామచంద్రన్‌గారు, యమ్. ఏ.

౬

ఈ తామ్రశాసనమును ప్రతిలోత్పత్తి ఆషాఢ మాసపు భారతిసంచిక (పుట 120-138) లో ప్రకటించి తిని. నే నాతామ్రశాసనమును ప్రకటించుతరి గమనించ దగిన కొన్నివిషయములు నాకప్పుడు స్ఫురింపకపోవుట చేత వాటిని ఈవివరణమునందు దెల్పుకొనుచున్నాను.

మొట్టమొదట తామ్రశాసనపుకాలమును గూర్చిన మార్పు.* ఆషాఢమాసపు భారతిసంచికలో చెప్పబడిన శక 1277 మహాకార్తిక సోమవారమును "వర్తమాన" శకవత్సరములని తలచి క్రీ. శ. 1355 అక్టోబరు 21 ది సోమవారమని తెల్పినాడను. అయితే ఆశక సంవత్సర ములను "అతీత"ముగా భావించినచో స్వామికన్నుపిళ్లె గారి గణనము ననుసరించి ఈక్రింద తెల్పబడిన మూడు విధములగు తేదులు లభించుచున్నవి. అవియేవనగా:—

| వారము | తేది | నెల | సం. | తిథి |
|---|---|---|---|---|
| ౧. సోమవారము | 24 | అక్టోబరు | 1356 | అమావాస్య .40 |
| ౨.(ఎ) ,, | 7 | నవంబరు | ,, | 14.60 |
| (బి)మంగళవారము | 8 | ,, | ,, | పూర్ణిమ .67 |

శాసనములో కనబరచిన "మహాకార్తిక" అను పదమునకు అమావాస్య యని అర్థ మయ్యేనేని మొదట నిల్చియుండు 1356 అక్టోబరు 24 సోమవారము అను టకు వీలున్నది.

౨. (ఎ), (బి) లో గుర్తించిన తేదులలో సోమ వారమునాడు పూర్ణిమ సంధ్యాకాలమునం దారంభించి మరునాడు .67 వఱకుండుటంబట్టియు, కార్తిక సోమ వారసహిత సంధ్యాకాలవ్యాపిని యగు పూర్ణిమయందు ప్రజలు దీపోత్సవమును కొనియాడుట యాచారముగా నుండుటచేతను, మంగళవారము దీపోత్సవమున కనర్హ మగుటచేతను 1356 నవంబరు నెల 7 తేది సోమవారమునే దానార్హమైన తేదిగా భావించు టుచిత మగుచున్నది. కావున శకసంవత్సరమును మన్మథ లేక దుర్ముఖిగా తీసి కోవలయును.

మూలమునకు సంబంధించిన మార్పుల నీక్రింద వివరించినట్లు చదువుకొనవలయును:

| పుట. | పంక్తి. | తప్పులు. | ఒప్పులు. |
|---|---|---|---|
| 125 | 7 | "మహైవ" | "మహోవ" |
| 126 | 19-20 | "భా [బా] స్వధీ య్యం" | "భానవీ యం" † |
| 130 | 34 | "యదేషాం" | "యజాషాం" |

అనువాదములో సవరించి చదువుకొనవలసిన మార్పులు:—

| పుట. | పేరా. | మార్పులు. |
|---|---|---|
| 131 | 4 | ఉష్ణరశ్మిగల సూర్యుడును, శీత రశ్మిగల చంద్రుడును తమయందు జనించిన [సూర్యవంశము లేక చంద్రవంశములో జనించిన] రాజుల సత్కీర్తివృద్ధికై విజయము నిత్తురు గాక. |
| ,, | 10: పంక్తులు 6, 7, 8: | అతడు [కరికాలుడు] భోజరాజుచే ప్రతిదినమును సూర్య |

* ఈ మార్పును దెల్పిన డెప్యూటి డైరెక్టర్ జనరల్ ఆఫ్ ఆర్కియాలజి పదాలంకృతు లగు శ్రీయుత కే. యన్. దీక్షితులవారికి నాకృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాడను.

† ఈ మార్పులను నాకు దెల్పిన శ్రీయుతులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారికి నా కృతజ్ఞతా పూర్వకవందనంబులను సమర్పించుచున్నాడను.

నకు పంపబడిన పూజాద్రవ్యములు గల భాజనమును సూర్యునకు చెంద కుండునట్లుగా నడ్డగించెను.

132 18 : 3 వ బంతి : "కీర్తి కాస్పదుడును" అనుటకు బదులు "యజుర్వేదమునకు నిధానము — అనగా యజుర్వేదపారంగ తుడు" అని.

పై జెప్పియుండునట్లుగా భోజునిచే బంపబడిన పూజాపాత్రమును కరికాలుడు అడ్డగించె ననుటనుగూర్చి వివరించెద. ఈవిషయమున కాధారములు రెండు – ౧. లింగనకృతమగు నవచోళచరిత్ర, పుట 16, 17 (ఆంధ్ర పత్రికవారిచే ప్రకటితము). ౨. విభవ సం. పుష్యమాసపు భారతిసంచిక, పుట 90, 91 లో గల డాక్టరు యన్. వెంకటరమణయ్యగారిచే ప్రకటింపబడిన "కరికాలుని పులవర్తి శిలాశాసనము."

౧. నవచోళచరిత్రలో జెప్పబడిన కథాంశము గమనించదగిన దగుటచే ఈక్రింద వివరించుచున్నాను.

"కరికాలుడు రాజ్యపరిపాలనము చేయుచుం డగా సూర్యోపాసకుడగు భాస్కరచోడు డనురాజొక డుండెను. అతడు ప్రార్థనావసరమున సూర్యునికి పూజా ద్రవ్యములను పళ్లెరములం దుంచి వాటిని సూర్యునికి నివే దించుచుండెను. సూర్యభగవాను డాద్రవ్యములను స్వీక రించి సంతృప్తుడై యాభాస్కరచోడుని దీవించుచుం డెను. ఇట్లుండగా నొకప్పుడు శివారాధనతత్పరు డగు కరికాలుడు కావేరినదికి వంతెనకట్టుటకై భాస్కరచో డుని సహాయమును గోరి అతనికి కబురుపంపెను. అందుల కాభాస్కరచోడుడు తా నారాధించుచుండుసూర్యుని సహాయముచేత దృప్తుడై కరికాలుని యాజ్ఞను నిరాకరిం చెను. కరికాలు డీసంగతి నెరిగి సూర్యుని ఇట్లాజ్ఞాపించెను: "భాస్కరా! నేనొసంగిన శాసనమును భాస్కరచోడు డుల్లంఘించెగాన వానిచే నీకు బంపబడు పూజాద్రవ్యము లను నీవు స్వీకరించకూడదు. అట్లు నీవుస్వీకరింతువేని శివా పరాధము నీకు వాటిల్లునుసుమా!" అని. సూర్యుండును కరికాలుని మాటల నంగీకరించెను. మరునా డాభాస్కర చోడుడు యథావిధిగా సూర్యదేవునికి పూజాద్రవ్యపు బళ్లెరములను బంపించెను. అతడు వాటిని స్వీకరింపక పోవుటచే నాపళ్లెరము లట్టే కొంతతడ వంబరస్థములై యుండి భాస్కరచోడు నొద్దకు మరలివచ్చినవి. అందు కై యాభాస్కరచోడుడు సూర్యుని నడుగగా "కరికా లుడు శివభక్తుడు. వాడు నీ కొనర్చిన శాసనము నంగీక రించక ఉల్లంఘించితివి. కావున శివాపరాధము తటస్థిం చెను. అందుచేత నేను పూజాద్రవ్యముల నంగీకరించక మరల్చితిని. కనుక నీవు కరికాలుని యాజ్ఞ ననుసరింతు వేని నాకు తృప్తి కలుగును" అని సూర్యభగవానుడు చెప్పెను. అంత నాభాస్కరచోడుడు కరికాలునికి లోబడెను. వెంటనే కరికాలు డాభాస్కరచోడుని కరుణించి యాలింగన మొనర్చి ఆనందపూర్వకముగ సమ్మానించెను."

౨. పులవర్తి శిలాశాసనములోనుండి ఈవిషయ ములు తెలియవచ్చుచున్నవి :—

'భోజపూజార్ఘ్యపాత్రాణి త్రీణి సూర్యార్పితానిచ,
నిజాజ్ఞ యాంబరస్థాని చక్రే తం దాసవన్నృపమ్.

భోజరాజుచే సూర్యున కర్పింపబడిన పూజార్ఘ్య పాత్రములు మూడిటిని తన యాజ్ఞచే నాకాశమున నిలిపివేసెను. ఇట్లు చేయుటచేత ఆభోజుని తన దాసునిగా జేసికొనెను."

పైజెప్పినయాధారములు రెండింటిలో రెండవది యగు పులవర్తిశిలాశాసనపు టాధారమే అంగీకరించదగి యున్నది. ఎందుకనగా—

1. ఈకరికాలుని విషయము మన తామ్రశాసన ములో చెప్పియుండుటకు సరియై యున్నది. రెంటి యందును రాజు పేరు భోజు డని తెల్పబడియున్నది. నవచోళచరిత్రలో మాత్ర మారాజుపేరు భాస్కర చోడుడని తెల్పబడియున్నది.

2. పులవర్తిశాసనము క్రీ. శ. 11 వ శతాబ్ది యందలి శిలాశాసనముగుచున్నది.

నవచోళచరిత్ర యన్ననో క్రీ. శ. 15 వ శతాబ్ది కడపట నుండిన లింగనకవికృత మగుచున్నది.



పి. విశ్వనాథన్ గారు

రంగవల్లీరచనము చిత్రకళాశాఖలలో నొకటి. నిదుట మంగళకరముగ తలపబడుచున్నది. అట్టి యీ ప్రతి హైందవగృహము ముందట నిట్టి రంగవల్లుల పురాతన కళను ప్రస్తుత ముపేక్షింపబడుచుండుదానిని



వైణికశిఖామణి

బ్ర. శ్రీ ములుగు శివానందశాస్త్రిగారు



వీరు గుంటూరుమండలమునందలి తెనాలి నగర వాస్తవ్యులు. హేవళంబినామ సం॥రమున వీరి జననము. పదిసంవత్సరముల వయసునందే తమతండ్రిగారగు బ్ర. శ్రీ నందనారాధ్యులవారియొద్ద సంగీతవిద్య నభ్యసించిరి. తరువాత మైసూరునకు బోయి సుప్రసిద్ధ సంగీతవిద్వాంసులగు శ్రీవీణా శేషణ్ణగారియొద్ద వీణాగానము నేర్చి లలితమును హృద్యమును నగు వాదనసామర్థ్యము నలవఱచికొని యాంధ్రదేశమునగల సుప్రసిద్ధసంగీతవిద్వాంసులలో నొకరుగ ప్రసిద్ధివడయుచున్నారు. శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులవారి పుత్త్రికా పరిణయమహోత్సవమునను, శ్రీ శ్రీ శ్రీ దర్భాంగ మహారాజావారు బెజవాడ విచ్చేసినప్పుడును, శ్రీ చల్లపల్లి జమీందారుగారి పట్టాభిషేక మహోత్సవమునను, శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరాయబహద్దరుగారియింట జరిగిన వివాహమునను, శ్రీ వెలాతే నరసింహరాయ, కృష్ణరాయ జమీందారులయిండ్లను ప్రత్యేకముగ నాహ్వానింపబడి సమ్మానింపబడిరి. శ్రీ శ్రీ శ్రీ దర్భాంగ మహారాజావారు వీరి లలితగానమునకు గడు నలరి తమ దర్బారునకు వీరి నాహ్వానించిరి. ౧౯౨౯ సం.రము మేనెల ౨౯, ౩౦ తేదులందు విజయనగరమున జరిగిన ప్రథమాంధ్ర సంగీతపరిషద్వార్షిక సభయందు వీరి వీణాగానమును మెచ్చి శ్రీ నారాయణదాసప్రభృతులు 'వైణికశిఖామణి' బిరుద మొసంగి సత్కరించిరి. ఆంధ్రదేశమున వీణాచార్యులు శ్రీ తుమురాడ సంగమేశ్వరశాస్త్రులవారి పిదప వీరే ప్రసిద్ధిజెందుచున్నారు.

కో. వెం. శ.

## నిమిషకవి వెంకయ్యపంతులుగారు



శ్రీస్వామి నిమిషకవి వెంకయ్యపంతులుగారు మహానుభావులు. ౮౫ వత్సరముల వయోవృద్ధులు. విశేష ప్రపంచానుభవముగల ఉత్తమపురుషులు. రాజభక్తికలిగి అసిధారావ్రతులై, న్యాయమార్గమున ముప్పదివర్షములు ప్రభుత్వోద్యోగ మొనరించి, ఉపకారవేతనమునందుచు, తమ విశ్రాంతికాలమును వ్యర్థపరుపక, దైవభక్తి, సర్వజీవానురక్తియు గల్గి వర్తించు వీరి సుగుణసంపత్తికి మెచ్చి పరమేశ్వరుడు స్వప్నములయందు వీరి కుపదేశించిన అద్వైతసిద్ధాంతామృతమును గ్రోలుచు, పవిత్రజీవనము చేయుచున్న పరమయోగి.

ఆధ్యాత్మ తత్త్వపారంగతులగు శ్రీపంతులువారి లేఖినినుండి ఇంతవఱకు దిగువ నుదాహరించిన మహత్తరమగు వేదాంతగ్రంథములు వెలువడినవి:—

౧. స్వప్నలబ్ధాద్వైతబోధిని ౩౦౦ పుటలు డిమ్మీసైజు
౨. బ్రహ్మమార్గ ప్రదీపిక ౧౦౦ ,, క్రౌను ,,
౩. ప్రపత్తిమార్గ ప్రదీపిక ౩౦ ,, ,, ,,
౪. విష్ణునామానందశతకము ౧౦౦ ,, ,, ,,
౫. దివ్యప్రబంధసార్గప్రదీపిక ౩౦౦ ,, డిమ్మీ ,,

‘ఏకమత్యము’ అను హృద్యమగు సర్వజన సమాదరణీయమైన గ్రంథరాజము త్వరలోనే వెలువడనున్నది. దైవజ్ఞానబోధకములగు పుస్తకములు విక్రయింపకూడదని మనశాస్త్రములును, మహామ్మదీయులఖొరానును నిషేధించుటచే, ముద్రణాదికములకై వేయిరూప్యములకు పైగా వెచ్చించి, కుతూహలురగు సత్యార్థులకును, గ్రంథాలయములకును పైపుస్తకములెల్ల నుచితముగనే బంపుచున్నారు. శ్రీవారు తమపొత్తములను కేవలము పారమార్థికచింతతో లోకోపకారార్థమే ఇటులు పంచిపెట్టుచున్నారుగాని భాగ్యవంతులగుటచే గాదు.

ముముక్షువులు, ఆస్తికమహాజనులు, వేదాంతజిజ్ఞాసువులు ఈ యమూల్యావకాశమును జారనొట్టుకొనక, శ్రీపంతులవారి గ్రంథరాజముల పూర్తిసంపుటము తెప్పించుకొని, తత్త్వశ్రవణలాభము పొంది ధన్యులగుదురుగాక! గ్రంథములు కోరువారు తపాలువ్యయము నిమిత్తము ౧-౧౪-౦లు (పదునాలుగణాలు) కర్తగారికి మనియార్డరు చేయవలయును. వారివిలాసము—శ్రీ నిమిషకవి వెంకయ్యపంతులుగారు, రిటైర్డు మేజస్ట్రేటు, వెండ్రప్రు, కొత్తపేట పోస్టు, తూర్పుగోదావరిజిల్లా.

ము. వి.



చిత్రము ౭

ఈ ఏడు బొమ్మలు P. P. A. వారివి.

'డొరోతి స్టాడర్డు కన్య' ఈతకత్తియ

ఉత్తర అమెరికాలో లాస్ ఏంజెలెస్‌నందు నీటిలో దుముకుచున్నప్పటి చిత్రము.



చిత్రము ౮

ఈమె ౧౯౩౬-వ సంవత్సరమున గనచ జరుగనున్న ఒలింపిక వ్యాయామములందు పాలుగొనుటకై తయారగుచున్నది.

[G. S. A.]

# కలగూరగంప

## టైపు-యంత్రచిత్రములు

నెల్లూరు మండలమునందలి గూడూరున నున్న బోర్డు-ఉన్నతపాఠశాలలో సాంకేతిక విద్యాబోధకులు (Commercial Instructor)



శ్రీయుత వి. సత్యనారాయణమూర్తిగారు రెమింగ్టను-పండ్రెండవ నంబరు టైపు-యంత్రముతో కొన్ని రేఖాచిత్రములను చిత్రించినారు. అందు రూపచిత్రములు, జంతుచిత్రములు, ప్రకృతి చిత్రములు గలవు. చిత్రకారుడు తూలికతో చిత్రములను చిత్రించునపుడు తన భావములకు సరిపోవునట్లు వానిని చిత్రింప తూలిక నుపయోగించుకొనగలడు. ఈచిత్రములను చిత్రించుటకు అన్యథాకరింపరాని యంత్రనిర్మాణవిధానము చిత్రకారున కడ్డుదగులును. కాన నాతడు స్వమనోగతభావానుసారముగా చిత్రములను చిత్రింపజాలడు. అటులయ్యు నీసంచయమునందలి మహాత్ముడు, తులసీదాసు, రామకృష్ణపరమహంస అను రూపచిత్రములయందు కూడినంతవరకు వ్యక్తులపోలిక యుండుట యీచిత్రకారుని కౌశలమునకు నిదర్శనము. మరియు పక్షి - పుష్పము, కుక్క, సింహము అను చిత్రములును ఎన్నదగియున్నవి. ఈసంచయమును ఈ 1931 సం. మార్చినెలయందు పాలఘాటున (కేరళ మండలమునందలిది) జరిగిన సారస్వత మహాసభ మెచ్చుకొని, చిత్రకారుని వెండిపదకముతో బహూకరించినది.

ప్రపంచకళాసౌధారోహణమునకు ఆంధ్రదేశము నిర్మించుకొనుచున్న సోపానములలో నేతచ్చిత్రరచనావిధాన మొకటి. ఇట్టివే శ్రీ బి. వి. రంగారావుగారిచేత చిత్రింపబడినవి కొన్ని వెనుక ప్రమోదూత సంవత్సర చైత్రమాస భారతి సంచికయందు ప్రకటితములయినవి. మరల నీనాడు శ్రీసత్యనారాయణమూర్తిగారి చిత్రకళాకౌశలఫలములగు నీచిత్రములు భారతియందు ప్రకటితములగుచున్నవి. ఆంధ్రదేశీయులగు చిత్రకారులెల్లరు నిట్టి చిత్రములను చక్కగా చిత్రించి తమ కళావైదుష్యవికాసములను ప్రపంచమున జాటదగుదురు. శ్రీసత్యనారాయణగారు తమ కౌశలము నింకను వృద్ధిచేసుకొని కళాభిజ్ఞుల యాదరమునకు పాత్రులయి వెలయుటకు కళాధిదేవత యగు భారతి యనుగ్రహించును గాక! ఈ సంచయమునుండి మూడుచిత్రములు ఈ సంచికయందు ప్రకటితములయినవి. తక్కినవి తరువాతి సంచికలయందు ప్రకటితములు కాగలవు. తమ చిత్రములను భారతియందు ప్రకటింపనొసగిన శ్రీ సత్యనారాయణమూర్తిగారికి కృతజ్ఞతాపూర్వకవందనములు.

—సం. భారతి.




## రసవాద సర్వస్వము

గ్రంథకర్త: ఆయుర్వేదవిశారద, కర్రా అప్పారావుగారు. ప్రకాశకులు: యేటికూరి రామభద్రరాజుగారు, కాకినాడ. వెల రు ౧.

ఈగ్రంథమునకు పండిత పంద్రంగి సుబ్బారావుగారు పీఠికను వ్రాసియున్నారు. అందు వారు జీవచ్ఛక్తిని వృద్ధిచేయుద్రవ్యములలో రసవంతములైన ఖనిజములన్నియు పాదరసముతోనే పరిపోల్చబడినప్పటికి పారదమునకు రసేంద్రత్వ మారోపింపబడినదనియు, ఖనిజజాతులన్నియు రససంయోగ సంస్కారములవలననే బీజవంతములై రసాయనము లగుచున్నవనియు, టుట్టి రత్నమణి పాషాణాదిధాతువులకు రససంయోగముచే బీజవంతములుగ జేయు సంస్కారమునకే రసవిద్య యనియు, రసవాదమనియు గ్రంథనామమును వ్యక్తీకరించిరి. కాని వైద్యగ్రంథములకు, అందును ముఖ్యముగ రసగ్రంథములకు, రసవాదావశ్యకత, ఉద్దేశ్యము, ఇత్యాదివిషయములను గూర్చి ఉపోద్ఘాతము వ్రాయుట మిక్కిలి అవశ్యకము. ఈగ్రంథమున కట్టిలోపము విశేషము.

ఇందు రసోపరసము లన్నిటి ఉపయోగవిధానములు లేవు. గ్రంథకర్తగారు వారి కిష్టమైన వాటిని మాత్రము అక్కడక్కడ వారి అనుభవముల జేర్చి వ్రాసియున్నారు. వారి ప్రయత్నము సమ్మోదార్హమేగాని, యింతకన్న 'రసజలనిధి' యిత్యాదిగ్రంథములవలె వ్రాసిన యుపయోగముగా నుండెడిది. ఈగ్రంథమందు ప్రమాణములుగ తీసుకొనబడిన సంస్కృతమూలములు ఏగ్రంథములనుండి యెత్తి వ్రాసినది తెలుపలేదు. అందుచే పాఠకులకు వారిసొంతములో, ప్రాచీనములో తెలియదు. రసవాద సర్వస్వమందు వంధ్యా నిదానము, తచ్చికిత్సలు తెలుపుటకు గల కారణములు తెలుపలేదు. పీఠికయందు గ్రంథకర్త స్వానుభవయోగములు తెలిపియున్నారని కలదు. కాని స్వానుభవము లేవో తెలుపరైరి. సంస్కృతమూలములు లేనివి స్వానుభవములా? లేక గ్రంథవిస్తరభీతిచే మూలములు వదలివేయబడినవా? గ్రంథకర్త వేమనయోగి పద్యములలోని రసవాదవిషయములను పరిశోధనలలో వెల్లడిపరచినారు; కాని వారిపరిశోధనలు విశేషశ్లాఘనీయములుగ లేవు.

గ్రంథకర్తగారి స్వానుభవ యోగము లన్నిటిని పీఠికాకర్తలు తమ రిసర్చి లాబొరేటరీలో ఇంజక్షనుల కవలంబనీయముగ జేయుటకు పరిశోధనలు ప్రారంభింపబడినవని వ్రాసినారు. ఆయుర్వేదము ఇంజక్షనుల సిద్ధాంతము నంగీకరించునా?

వ. సు.

---

## Thyself Thy Doctor

గ్రంథకర్త: 'The Recluse'

ప్రకాశకులు: సరస్వతీసంఘము, ౨౮ పిడారియార్కోవెలవీథి, జి. టి. మద్రాసు. పుటలు ౧౦౪. వెల రు ౦-౮-౦.

ఇది యొక చిన్న (ఆంగ్ల) వైద్య గ్రంథము. డాక్టరు పరాసెల్సస్ (Paracelsus) గారు తెలిపినటుల "Nature is the Physician, not thou. Thou must learn of her, not of thyself". దేశీయారోగ్యమునకు ప్రకృతిచికిత్స లావశ్యకములని గ్రంథకర్త హెచ్చ

రించుచున్నారు. ఈ గ్రంథములోని విషయము లన్నియు మద్రాసులో ప్రచురింపబడు 'సండే టైమ్సు' పత్రిక యందు ప్రకటింపబడిన వనియు వీటిని గ్రంథముగా ప్రచురించిన బాగుండునని చాలమంది కోరినందున ఇట్లు వ్రాసితినియు గ్రంథకర్త తెలుపుటచేతనే ఈ గ్రంథము ముఖ్యముగ చదివితీరవలసి యున్నదని అర్థము కాక మానదు. గ్రంథకర్త వ్రాతలు మిక్కిలి ప్రశంసనీయములు. అందరికి సులభముగా అందుబాటులో నుండ గలందులకై వెల స్వల్పముగా ఉన్నది.

వ. సు.

---

## सेवादल सप्तपदी

(సేవాదల సప్తపదీ)

సంగ్రహకర్త: ప్రొ. వి. ఆర్. దేవధర. గారు. మూల్యము రెండణాలు.

ప్రకాశకులు: డా. నా. సు. హార్డీకరు గారు, సంచాలకమంత్రి, హిందూస్తానీ సేవాదలము, హుబ్లీ (కర్ణాటకము).

ఇందు హిందూస్తానీ సేవాదళమువారు పాడెడి ఏడు (హిందీ)గీతములు,స్వరవిన్యాసముతో (నాగరలిపిని) కూర్చబడ్డవి. అవి రాష్ట్రగీతము (అనగా జాతీయగీతము), ధ్వజారోహణగీతము, ధ్వజావతరణగీతము, మాతృవందనము, రెండు ప్రస్థావగీతములు. ఈగీతములు గ్రామోఫోను రికార్డులుగా నిప్పించు నేర్పాటు సేవాదళమువారు కావించుచున్నారట. అందువలన ఎల్లరకును ఒక్కమాదిరి వరుసలు సులభములగును. ఇందు జవాహర్ లాల్ నెహ్రూ గారు 'రెండుమాటలు' వ్రాసిరి. శ్రీహార్డీకరుగారు తక్కిన పరిచయమంతయు నిచ్చుచున్నారు. ఇందు తొలుత స్వరములను, స్వర, స్థాయి, మాత్రాది చిహ్నములను క్రొత్తవారికిసహా పరిచితి కలిగించుటకుగాను వివరించి పిదప ఒక్కొక్క గీతము సాహిత్యమును, దాని లయ స్వరముల తెలుపుకూర్పును చూపినారు,

ఈ అఖిలభారత జాతీయగీతములకు సమగ్రమగు ఔచిత్యము నెఱపవలె నన్న, వీరింకొక్క పనికి పూనవలయును. సంగీతమున ఔత్తరాహ, దాక్షిణాత్య పద్ధతులు భిన్నములు గదా! ఇందు ఔత్తరాహపద్ధతి ననుసరించి శాస్త్రము ననుసంధించియున్నారు. దాక్షిణాత్య పద్ధతి ననుసరించియు తగినవారిచే ఇట్టి కూర్పు కూర్పించి నచో దక్షిణభారతము తనపాలు తాను పొందిన దగును.

కొం. జ.

---

## అళియరామరాయలు (వచనము)

క్రౌను ౮ పుటలసైజు, పు. ౨౪౩, వెల తెలియరాదు.

గ్రంథకర్త : శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు.

ప్రకాశకులు : యస్. ఏ. నరసింహముగారు, రాజమహేంద్రవరము.

'చరిత్రపంచానన' బిరుదాంచితులగు శ్రీవీరభద్రరావుగా రాంధ్రలోకమునకు చిరపరిచితులు. వీరు రచియించిన యాంధ్రులచరిత్రము, ఇతర చరిత్రగ్రంథములు ఆంధ్రుల ప్రాచీనౌన్నత్యమును చాటుచు నాచంద్రార్కము వెలయగలవు. శ్రీ వీరభద్రరావుగారు చక్కని ఉపజ్ఞ గలవారు. వీరి చరిత్రజ్ఞానము సత్యాన్వేషణతత్పరము. కావుననే ఆంధ్రచరిత్రనిర్మాణమునకు వీరిరచనలు గట్టిపునాది యయ్యెను.

శ్రీ వీరభద్రరావుగారు వయోవృద్ధులు. స్వార్థదూరమయిన వీరి జీవిత మంతయు చరిత్ర పరిశోధనమునకే సమర్పిత మయినది. నేడును వీరు చరిత్రగ్రంథముల నోపిక మెయి రచియించుచుండు టాంధ్రుల యదృష్టము. ఇంకను నాంధ్రదేశమునకు చరిత్రసంపదను సమకూర్ప వీరికి పరమేశ్వరు డాయురారోగ్యముల ననుగ్రహించుగాక!

ఈ 'అళియరామరాయలు' అను గ్రంథము వీరి క్రొత్తరచనము. అళియరామరాయలు విజయనగర సామ్రాజ్యమును చివరనాళులను మహోన్నతదశ నందించిన వీరాగ్రణి. ఈవీరునిచరిత్ర ముపలబ్ధమయినంతవరకు

కొక్కచో నింతదనుక నాంధ్రులకు లభింపకుండెను. నేడు శ్రీ వీరభద్రరావుగారీగ్రంథమును రచియించి యాకొఱంతను దీర్చి యాంధ్రుల కృతజ్ఞతకు పాత్రులయినారు; వీరికి ధన్యవాదములు.

ఈగ్రంథమున నేడు ప్రకరణములు గలవు. ఒకటవ ప్రకరణమున అళియరామరాయలకు పూర్వు లగు తద్వంశ్యుల చరిత్రము; రెండవ ప్రకరణమున సలకము తిమ్మరాజు వినాశనము, సామ్రాజ్యపరిపాలనారంభము; మూడవ ప్రకరణమున సదాశివరాయల పట్టాభిషేకము, మహమ్మదీయరాజన్యులతో పోరాటములు, సామ్రాజ్యవిస్తరణము; నాలవ ప్రకరణమున నళియరామరాయలపయి గల యపనిందలు, తన్నిరాసము; అయిదవప్రకరణమున దక్షిణదేశమునందు సామ్రాజ్యాభివృద్ధి; ఆరవ ప్రకరణమున రక్షస్తంగిడి (తల్లికోట) యుద్ధము, రామరాయల నిర్యాణము; ఏడవ ప్రకరణమున రామరాయల సామ్రాజ్య పరిపాలనవిధానము వివరింపబడినవి.

సంస్కృతాంధ్రవాఙ్మయములందలి గ్రంథములు, స్థానికచరిత్రలు, కైఫీయతులు, శాసనములు, బిరుదావళులు, మఱియు పెక్కు ప్రాచీన చారిత్రక లేఖనములు మొదలయినవానిని క్షుణ్ణముగా పరిశోధించి, వానియందుపలబ్ధములయిన చరిత్రాంశములను చక్కగా సమన్వయించి యీ యమూల్యగ్రంథమును గ్రంథకర్త రచియించినారు. ఫెరిష్టా మున్నగు మహమ్మదీయ చరిత్రకారులు, ఇతర విదేశీయచరిత్రకారులు వ్రాసిపెట్టిన వ్రాతలను ప్రమాణములుగా గొని సత్యచరిత్రాంశములను దెలుపు నితరగ్రంథములు, లేఖనములు పెక్కుండి యున్నను వానిని దెలియక, తెలిసియు పరికింపక, ఒండు రెండిటి పరికించియు వానిని విశ్వసింపక, ఏయొక్క యంశమునో విశ్వసించియు తమముక్కునకు మాటిగ లేదని దానిత్రోసిపుచ్చి యుదాసీనతమలగు కొందఱు చరిత్రకారులు కావించిన యపసిద్ధాంతములను గ్రంథకర్త సత్యబుద్ధితో, సప్రమాణముగా ఖండించి తమ పరిశోధననైపుణ్యమును, ఉపజ్ఞను ఆంధ్రలోకమునకు మరల నొకమారు చాటినారు. వీరు ఖండించిన యపసిద్ధాంతములలో నధికాంశము హీరాసుఫాదిరిగారు 'ఆరవీడు వంశము' నందు కావించినవి. అభిమానగ్రస్తములగు వ్రాతలు ఎప్పుడును సత్యదూరములు కాకమానవు. హీరాసుఫాదిరిగారు తమ రచనమున కాధారముగ గొనిన సాధనములు అభిమానగ్రస్తములు. కావుననే వారి యుపజ్ఞ 'కూపస్థమండూక' న్యాయమునకు నిదర్శనమయి యపసిద్ధాంతముల ఉత్పత్తిస్థానమయినది పాపము!

చరిత్రకారులు వలసిన గ్రంథాదిసామగ్రిని సమకూర్చుకొని, యందలివిషయముల నొక్కచో పొందుపఱచుకొని, వాని ప్రామాణ్యమును సత్యదృష్టితో, సమబుద్ధితో గుర్తించి తదనుగుణముగ చరిత్రగ్రంథముల రచియించుట యుక్తము. అట్లు కాక విశ్వాస్యములో, అవిశ్వాస్యములో తెలియు సామర్థ్యము లేక, ఎవరో వ్రాసినవ్రాతలను పరమప్రమాణములుగా గైకొని చరిత్రములను రచియించు టనర్థదాయకము. అట్లు విరచితములయిన చరిత్రగ్రంథములు పాఠకులను పెడత్రోవలకు ద్రిప్పి వారికి వానియెడ ప్రమాణబుద్ధి లేకుండ చేయును.

ప్రాచీన రాజ్యములయు, తత్పాలకులగు రాజులయు, మహాపురుషులయు, వీరాగ్రణులయు చరిత్రములు దేశీయుల హృదయసీమలం దుత్సాహబీజములను మొలకలెత్తించి, వారిని దేశాభ్యుదయ ప్రయత్నమునకై పరుగులువారజేయును. కావున తచ్చరిత్రములు సత్యసంబద్ధములుగ నుండజూచుట చరిత్రకారుల ధర్మము. ఈ 'అళియరామరాయలు' ఉపర్యుక్తచరిత్రగ్రంథ లక్షణములకు లక్ష్యమగును. కాని యిందు రామరాయలు తన పుత్రుడు మృతుడుకాగా ఆలీఆదిల్షాను అతనిప్రార్థనమున పుత్రునిగ నంగీకరించి కొన్ని దినము లంతిపురమునందుంచుకొనుట మొదలగు కొన్ని విషయములమాట కానరాదు. ఇట్టులగుటకు కారణ మనూహ్యము. దోషములేదైనను పేర్కొని ఖండించుట పాత్రమునకు మెరుగెక్కించుట యగును. మఱియు అళియరామరాయలు కృష్ణదేవరాయల కల్లుడు. కావున కృష్ణదేవరాయల

కాలముననే యాతని చరిత్ర మారంభించియుండవలెను. తరువాత అచ్యుత దేవరాయలకాలమున ఇతని చరిత్రము నకు ప్రాముఖ్యమును గలిగియుండును. ఇదియంతయు సమకూడినగాని యీతని చరిత్రము సమగ్రముకాజాలదు.

కాలగర్భమున నణగిపోయిన ప్రాచీనచరిత్రము యథావృత్తముగను, సమగ్రముగను లభించుట అరిది. కావున నింకను గల కొరతను చరిత్రపరిశోధకులు పలసిన పరిశోధనములను గావించి 'అళియరామరాయల చరిత్రము సమగ్రముగావించెదరుగాక.

ఇట్టి యమూల్యగ్రంథమును ఈ చిరుపలివయసున రచియించి తన కాదరముతో నొసగిన శ్రీ వీరభద్ర రావుగారి ఋణము నాంధ్రలోక మెట్లు తీర్చుకొనునో చూడవలెను.

ఈగ్రంథమున నచ్చు తప్పులు గల పనలసివచ్చెను. ప్రకాశకు లిక నించుక జాగరూకత వహించియుండిన బాగుగనుండి యుండును

'X'

---

రేఖాగణితము

గ్రంథకర్త: కీ. శే. చాగంటి భీమశంకరరావు గారు (2-9-1907 — 1-6-1928). ప్రకాశకులు: హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయము, కపిలేశ్వరపురము, తూ. గోదావరి. క్రౌనుప్లైజు: ౮౯ + ౩౧౯ పుటలు. వెల: రూ. ౨.

స్కూలు ఫైనలు తరగతివఱకును గల పైతరగతు లకు పలయు రేఖాగణితము నాంధ్రమున (ఇంతవరకు లేకుండుటచే) వ్రాయవలయునను కోర్కెయే యీగ్రంథ రచనకు ప్రధానోద్దేశము. ఇందు మొదట ప్రాథమిక భాగ ముగూడ క్షిప్తముగ చేర్పబడ్డది. గ్రంథకర్త పిన్నవయ స్సున సంస్కృత, హిందీ, బెంగాలీ, కర్ణాటక భాషల యందు పరిచయము గల్గించుకొని ఆ భాషలయందలి గణితగ్రంథములను చదివి, ఆంగ్లరచనల ననుసరించి మిక్కిలి నేర్పుతో, కడు సుబోధముగ ఈగ్రంథము రచిం చినాడు. పలసిన చిత్రములతో ఇది యింత అందముగ ముద్రించి ప్రకటించిన ప్రకాశకులు నెంతయు ప్రశంసా ర్హులు. ఆంగ్ల ఆంధ్ర మిశ్రసూచి పారిభాషికపదముల పట్టి కలు ఈగ్రంథము తుదిభాగమున కూర్పబడ్డవి. ఆంధ్రమున శాస్త్ర పరిభాషావ్యవస్థ కుదుర్చుకొనుటలో ఈగ్రంథ మెంతయు సాయపడగలదు.

ప్రకాశకులు రచనావిధానమును తెలుపుచు, పరి చితమైన ఆంగ్ల పద్ధతిని తెలిగించుట యందలి చిక్కులను వివరించిరి. అందు సంకలన వ్యవకలనాదుల చిహ్నములను స్వీకరించు విషయ మొకటి. ఆంగ్లమున వాడుక చేయు +, — మున్నగు చిహ్నములు వాడుకొన్న, సౌకర్యమే కాని, వానిని 'ప్లస్, మైనస్' అని కాక తెలుగున చదు వు టెట్లన్నది మిగులును. ఈ విషయమున పలుకుబడి మూడేసిపద్ధతులుగా చూపినారు.

Angle A B C = angle D E F: —

(౧) కచట కోణము, సమం, గజడ కోణము;

(౨) కచట కోణము ఈజ్ ఈక్వల్ టు గజడ కోణము;

(3) కచట, గజడ కోణములు సమములు.

Angle A B C + Angle D E F = angle C A B + angle F D E: —

(౧) కచట కోణము, యుతం, గజడ కోణము, సమం, చకట కోణము, యుతం, జగడ కోణము;

(౨) కచట కోణము ప్లస్ గజడ కోణము ఈజ్ ఈక్వల్ టు చకట కోణము ప్లస్ జగడ కోణము;

(3) కచట, గజడ కోణముల మొత్తము, చకట, జగడ కోణముల మొత్తమునకు సమానము.

—మొ.

ఇందు తుదిపద్ధతియే యిందు సాధారణముగ అవ లంబించినారు. తుదిప్రకరణములందు ఈపద్ధతికి తోడు చిహ్నపద్ధతి కుండలీకృతముగ మాత్రము జోడించినారు.

ప్రాచీన సంస్కృతశాస్త్ర గ్రంథములందు గుర్తుల వాడుకవిషయమున అంత సులభమై సుసంస్కృతమగు పద్ధతి కానరాదు. అందులకే క్రింది ఉదాహరణములు చూడవగును:—

(౧)

| ౧ ౧ | ౧ ౧ ౧ |
|---|---|
| ౧ ౨ | ౧ ౨ ౩ |

$= ౧ \times \frac{౧}{౨} + ౧ \times \frac{౧}{౨} \times \frac{౧}{౩}$.

(౨)

| ౧౦ | ౧౬౩ | ౪ | ౯ ౧౬౩ |
|---|---|---|---|
| ౧ | ౬౦ | ౧ | ౧౫౦ |

$= ౧౦ : \frac{౧౬౩}{౬౦} :: ౪ : \frac{౧౬౩}{౧౫౦}$.

పై రెంటను నిలువుగీతలకు సందర్భానుసారముగా మనము అర్థము సంధించుకొనవలెను.

(౩)

| |
|---|
| ౧ |
| ౧ |
| ౧ |
| · ౨ |
| ౨ |
| · ౯ |
| ౧ |
| · ౪ |
| ౬ |
| · ౧౦ |

$= (౧-\frac{౧}{౨})(౧-\frac{౨}{౯})(౧-\frac{౧}{౪})(౧-\frac{౬}{౧౦})$.

(౪)

| |
|---|
| ౪౦ |
| ౧ |
| ౧/౩ + |
| ౧/౪ + |
| ౧/౫ + |

$= ౪౦ (౧-\frac{౧}{౩})(౧-\frac{౧}{౪})(౧-\frac{౧}{౫})$

ఋణాంకమును తెలుపుటకు అంకెపై చుక్క పెట్టుచుట కలదు. కాని (౪) నందలి పద్ధతి భిన్నమైనది. పాశ్చాత్యుల విశ్లేషణపరత్వమునకు భిన్నముగు ప్రాచ్యుల సమీకరణ పరత్వము ఇట్టి పరిణామములకు ఉత్తరదాయిత్వము వహించును.

(౫) మన బీజగణితము ననుసరించి AX + BY = C అన్నది

AX + BY }
C } —ఇట్లు వ్రాయవలసియుండును.

మొదటి ఉదాహరణములును ఇదియు కూడి, ఒక రాశి (quantity) క్రింద మఱియొకటి వేసిన దాని యర్థమును చెఱియొకపై పునకును లాగును,

పైయుదాహరణములను చూడ కేవలము మన శాస్త్రగ్రంథములందలి లేఖనపద్ధతినే స్వీకరించు ప్రయత్నమునకంటె నేటి పరిచితములైన గుర్తులనే వాడి, పలుకుబడి తగురీతి కుదుర్చుకొనుటయే యుక్తముగ కాన్పించు ననుట స్పష్టము.

గుర్తులకు పలుకుబడి నిర్ణయించుటలో ఒక్క చిక్కు పడ నున్నది. ఆంగ్లమున నామవాచకమునకు పూర్వము చేరిన preposition (ప్రత్యయము) తెలుగున నామవాచకము తరువాతకు గంతివేయును. కావున,—

కచట కోణము, ప్లస్, గజడ కోణము, ఈజ్ ఈక్వల్ టు, చకట కోణము, ప్లస్ జగడ కోణము అన్నది

కచట కోణము, గజడ కోణయుతమై, చకట కోణము, జగడ కోణయుతమైనదానికి సమము అని సహజముగ నగును కాని,

కచట కోణము, యుతం, గజడ కోణము, సమం, చకట కోణము, యుతం, జగడ కోణము అని చెప్పిన సమంజసముగ కాన్పింపదు. అందులకే కాబోలు ఇందు తొలుపద్ధతినే సాధారణముగ వాడిరి. సమ్రాట్ జగన్నాథాదుల రేఖాగణిత గ్రంథములందును ఇట్టి వాక్యరచనము కానవచ్చును. ఆంగ్లమువలె, తెలుగునను భాషాసంప్రదాయము నతిక్రమింపని పలుకుబడి గుర్తులకు కల్గుట వాంఛింతుము. కాని, రెండురాసులకు గల సంబంధమును నడుమ గుర్తుతో చూపుచు నడుమనే పలుకుటకు ఆంగ్లమున భాషాపద్ధతి తోడ్పడుచుండ, తెలుగున తుదిని పల్కవలెను. ఈగ్రంథమున 'సమానము' అనుటకు 'స॥' అని చిహ్నించుట సహజముగు సంస్కారము. అయిన, అట్లు కొసను గాక నడుమనే సంబంధమును గుర్తించు 'ప్లస్, మైనస్సు'లు మనకు వచ్చు టెట్లు? వానిని 'ప్లస్, మైనస్' మున్నగు పేర్లతో వాడిన, భాష అభివృద్ధియగును గాని చెడిపోవదనియు నొకవాదము. ఆగుర్తులను స్వీకరించి ధన, ఋణాదినామములతో వ్యవహరించుటకు లొంగుబాటుగ కాన్పింపదు.

జగన్నాథసమ్రాట్టు రేఖాగణితమునను (పూనా, సంశోధితముద్రణము), 'కాయేగారి '*Indian Mathematics*' అను గ్రంథమునను, 'బీజగణితము' పై ఎస్. జేవిస్ గారి జ్ఞాపికలందును కొన్ని పరిభాషాపదములు వీరు గమనింపదగినవి యున్నవి. Figure = క్షేత్ర. Solid Figure = ఘనక్షేత్ర. Pyramid = సూచీఫలకఘనక్షేత్ర (ఇందు, గోపురాకృతి). Cylinder= సమతలము స్తకశంకు క్షేత్ర (ఇందు,కూపాకృతి). Prism = ఛేదితఘనక్షేత్ర (ఇందు, త్రిభుజాకృతి, త్రిపార్శ్వ); 'హిందీ సయంటిఫిక్ గ్లాసరీ' అను గ్రంథము 'త్రిపార్శ్వ' మిచ్చుచున్నది. Any = అభీష్ట. Magnitude = ప్రమాణ. Chord = చాపకర్ణ. Unit = రూప. Segments of the base=ఆబాధ. Side = పార్శ్వ. Right-angled (triangle) = జాత్య (త్రిభుజ). ప్రత్యేకము జాత్యత్రిభుజవిషయమున (బీజగణితమునుండి) దేవిసుగా రిచ్చినవి: Base = భుజ. Side = కోటి. Hypotenuse = కర్ణా, కర్ణి.

ఈపట్టికలో వీరి ప్రయోగములకంటె కొన్ని అదనముగ నున్నవి; కొన్ని మాత్రము క్రొత్తవి. వీరు శ్రమపడి చక్కని పరిభాషాపదములు సేకరించినారు. (వీరికి తో ద్పడ్డగ్రంథము లేవేవియో తెలిపిన బాగుండెడిది.) కొన్ని మాత్రముసంస్కారాపేక్షములు. 'Opposite (angles) =అభిముఖ, సంసక్తేతర(కోణములు). Non-adjacent= సంసక్తేతర, దూరస్థ.' ఈరెంటను 'సంసక్తేతర' పదము వాడుట యుక్తేతరము. 'Non-adjacent' కే ఈపదము సరిపోవును. 'Interior opposite (angles) = అంతర్గత సంసక్తేతర (కోణములు)'. 'అంతర్గతప్రతిముఖ (కోణములు)' అన్న బాగుండును. 'Vertically opposite (angles) = విపరీతముఖ,శిఖరాభిముఖ, అనభిముఖ (కోణములు).' నిజమున కవి అభిముఖ కోణములు, అనభిముఖములు కావు. కావున 'అభిముఖ' కోణము లన్ననే బాగుండును.

Pythagoras Theorem అనబడు సూత్రము మన శుల్బసూత్రములలో కానవచ్చుటచే దానికి 'శుల్బసూత్ర' మనియే వీరు నామకరణము గావించిరి.

ఈగ్రంథమును మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారు పాఠశాలోపయోగమునకు అనుమతించినారు. ఇది శుభావహము. ఈగ్రంథమాలవారు ఇట్టి శాస్త్రగ్రంథములను జాగరూకతతో సిద్ధపఱిచి ప్రచురింతురను ఆశ జనియింపజేసిరి. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము, కొన్నెమారా లైబ్రరీ మున్నగు పెన్నిధులతోడ్పాటు ఇట్టి శాస్త్రగ్రంథముల రచనమునకు చాల ఆవశ్యకము.

—కొం. జ.

---

## మాధవశతకము

కర్త: గంధం నరసింహాచార్యులుగారు, కొల్లాపురం, జటప్రోలు సంస్థానం. శైలి ధారాళము. వెల ౩ అ.

---

# గ్రంథస్వీకారము

## ప్ర జ రా ణి

గ్రంథకర్త: ప్రేమచంద్రుడు. అనువాదకుడు: కోటంరాజు సీతాపతిగారు. ప్రకాశకులు: సరస్వతీగ్రంథమండలి, రాజమహేంద్రవరము.

డెమ్మీసైజు ౨౦౬ పుటలు. వెల రు. ౧-౮ అ.

---

## శారీరకశాస్త్రము

(అనుబంధములు: గ్రంథకర్త వంశచరిత్ర; ధారకము; ద్రవ్యవర్ణనము.) గ్రంథకర్త: శ్రీరాజా మాన్లా కందుకూరి డాక్టరు నాగమల్లికార్జునరావు పంత్ గారు, H.M. B. & A. V. R. జమీందారు, యినోలిచకు, మధ్యరాష్ట్రములు. ప్రకాశకులు: శ్రీరాజా మాన్లా కందుకూరి వీరేశలింగంపంత్, సమ్రాట్, విశ్వామిత్ర ఆశ్రమము, బెజవాడ. క్రౌనుసైజు (మొత్తము) ౧౧౩ పుటలు. వెల (విద్యార్థులకు) (?) రు. ౧.

---

## ఉత్కలపతనము

(కలా పహాడ్.) శ్రీ అశ్వినీ కుమారఘోషుగారి 'కాలాపహాడ్' అను ఉత్కలనాటకమునకు తెలుగు. అనువాదకులు: పురిపండా అప్పలస్వామిగారు, కవితా సమితి కార్యదర్శి, విశాఖపట్నము.

డెమ్మీసైజు ౧౬౫ పుటలు. వెల ౧౨ అ.

---

## ఆంధ్ర ధ్వని

ఆంధ్రీకర్త: అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సాహిత్యోపాధ్యాయులు, ఆంధ్రగీర్వాణవిద్యాలయము, కొవ్వూరు, ప. గోదావరి.

క్రౌనుసైజు ౫౨ పుటలు. వెల ౮ అ.

---

## భరతుండు

గ్రంథకర్త: వి. రంగస్వామిఅయ్యంగార్, బోర్డు మిడిల్ స్కూలు, పాకాల, చిత్తూరు.

క్రౌనుసైజు ౬౨ పుటలు. వెల ౬ అ.

---

## రసవాదసర్వస్వము

గ్రంథకర్త: ఆయుర్వేద విశారద, కర్రా అప్పారావుగారు. ప్రకాశకులు: యేటిపూరి రామభద్రరాజుగారు, కాకినాడ.

క్రౌనుసైజు ౧౦౮ పుటలు. వెల రు. ౧.

---

## గాంధి మహాత్ముడు

పద్యములు. గ్రంథకర్త: ఆదిపూడి సోమనాథరావుగారు, ౧౪, ప్రసన్నవినాయకర్ కోవెల వీధి, మైలాపూరు, మదరాసు.

క్రౌనుసైజు ౪౮ పుటలు. వెల ౪ అ.

---

## ఆంధ్ర భగవద్గీత

గ్రంథకర్త: ఆదిపూడి సోమనాథరావుగారు. క్రౌనుసైజు ౮౦ పుటలు. వెల రు. ౧.

---

## మారుతి విజయము

(లంకాదహనము) నాటకము. కర్త: జీలపాటూరు సుబ్బారావుగారు. 65, తులసింగపెరుమాళ్ కోవెల వీధి, తిరువళిక్కేణి, మద్రాసు. డెమ్మీ సైజు ౮౦ పుటలు. వెల రు ౧.

---

## స్వరాజ్యసోపానము

పాటలు. గ్రంథకర్త: వంగిపురం వెంకటరంగాచారియరు, కాకినాడ. క్రౌను సైజు ౧౨ పుటలు, వెల ౨ అ.

---

## శాంతి సంగ్రామము

పద్యములు. బాలకవి, వేదాంతం వెంకటసుబ్రహ్మణ్యశర్మగారు, ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణా జిల్లా. డెమ్మీ ౨౨ పుటలు. వెల 3 అ.

---

## భారతీయ ప్రబోధము

పద్యములు, గేయములు. కర్త: సాయం వరదదాసు. ప్రకా: ఆదర్శగ్రంథమండలి, ఎలమఱ్ఱు, కృష్ణా.

క్రౌను ౧౬ పుటలు. వెల ౧ అ.

---

## ఉత్తరాకల్యాణము

స్త్రీపాత్రప్రవేశమే కల చిన్న నాటకము. గ్రంథకర్త: బులుసు పాపయ్యశాస్త్రిగారు, అనకాపల్లి.
డెమ్మీ ౧౬ సైజు 3౪ పుటలు వెల ౨ అ.

---

### అంబికపల్ల్యగ్రహార చరిత్రము

పద్యకావ్యము. కర్త: పెండ్యాల రామశాస్త్రి గారు. సంపాదకులు: పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు. ప్రకాశకులు: రెడ్డిసోదరులు, రాయవరము, తూర్పుగోదావరి జిల్లా.

---

### The Charkha—Its Immense Economic Possibilities.

(ప్రఫుల్లచంద్రుని ఉపన్యాసము)

(ఆంగ్లము.) తిరుచినాపల్లియందు ౧౯౩౧ మార్చి ౨ తేది జరిగిన అఖిలభారత జాతీయప్రదర్శనమున శ్రీ ఆచార్యప్రఫుల్లచంద్రరాయిగారొసగిన ప్రారంభోపన్యాసము. డెమ్మీసైజు ౧౩ పుటలు. వెల ఆఱుపైసలు. మురుగవిలాసజనానుకూల ముద్రాలయమ్ము, తిరుచినాపల్లి.

---

### 'బంధుసేవ' మహాసంచిక

౧౯౩౦-౧౯౩౧. సంపాదకులు, ప్రకాశకులు: బి. శ్యామసుందరరావుగారు, బరంపురం, గంజాంజిల్లా. డబిల్ డెమ్మీసైజు ౧౨౪ పుటలు. (వెల తెలియదు.)

---

### తన్త్రజ్యోత్స్నా (సంస్కృతము: తెలుగులిపి)

జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహాస్తాచార్య స్వామి విరచితము.

ప్రకాశకులు: వంగిపురపు జగన్నాథరావుగారు, శ్రీ సీతారామాంజనేయపేట, తెనాలి. క్రౌనుసైజు ౧౬౪ పుటలు. వెల రు. ౧-౨-౦.

---

### (౧) భౌతికశాస్త్రము

పదార్థవిజ్ఞానశాస్త్రము; రసాయనశాస్త్రము.

గ్రంథకర్త: వేమూరి శ్రీరాములుగారు, బి. ఏ., ఎల్. టి. క్రౌనుసైజు. పుటలు ౧౩౦+౬౧.

### (౨) ప్రకృతిశాస్త్రము

ప్రథమభాగము: జంతుశాస్త్రము; వృక్షశాస్త్రము.

గ్రంథకర్త: బి. పట్టాభిరామయ్యగారు, ఎం. ఏ., ఎల్. టి., లెక్చరర్, ట్రెయినింగుకాలేజి, రాజమండ్రి. క్రౌనుసైజు: పుటలు ౧౪౦.

### (3) ప్రకృతిశాస్త్రము

ద్వితీయభాగము: శరీరశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, ప్రథమచికిత్స. పుటలు ౧౦౪.

పై మూడుగ్రంథములకు ప్రకాశకులు: ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ, హిందూప్రెస్, మచిలీపట్టణము.

ఈగ్రంథములు ఎస్. ఎస్. ఎల్. సి. క్రొత్త ప్రణాళిక ననుసరించి రచించినవి.

---

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచ పరిస్థితు లతిదారుణముగ నున్నవి. శాంతిసమరములు పందెమువేసి పరువిడుచున్నవి. వ్యక్తులు, జాతులు కలహమునకు కాలు దువ్వుచున్నారు. ప్రపంచమునందు భోగమునకు గల గౌరవప్రతిష్ఠలు యోగమునకు గలుగకున్నవి. భాగ్యభోగార్థమై ప్రపంచయాత్రయందు ప్రచండమైన సంరంభము సంప్రాప్తమగుచున్నది—జాతులు, సంఘములు, కులములు, కుటుంబములు, వ్యక్తులు, స్త్రీలు, పురుషులు, వృద్ధులు, యువకులు భాగ్యభోగాభిలాషయందు మహాసంరంభమునకు బూనుచున్నారు. దేశాభిమానము, జాత్యభిమానము, మతాభిమానము, సంఘాభిమానము, వంశాభిమానము, కులాభిమానము, ధనాభిమానము, విద్యాభిమానము మొదలుగాగల యభిమాన పరంపరలు స్వధర్మారాధనవ్యాజమునను దురభిమానపరములై మహాసంక్షోభమునకు మూలములగుచున్నవి. వివిధరాజ్యములందును, జాతులందును, సంఘములందును, మతములందును నీ సంక్షోభము దినదినప్రవర్ధమానం బగుచున్నది. ఒక కాలమునందు మానవధర్మవికాసమునకై స్థాపితము లైన రాజ్యములు, జాతులు, సంఘములు, మతములు వర్తమానసమయమునందు మానవధర్మవినాశనమునకు వినియోగపడుచున్నవి. పెద్ద చిన్న రాజ్యములకు తెల్ల నల్ల జాతులకు, హిందూ మహమ్మదీయ క్రైస్తవ బౌద్ధాదిమతస్థులకు, అగ్ర నిమ్న జాతులకు, సంపన్న సామాన్యులకు, పండిత పామరులకు ప్రతిఘటనము ప్రవర్ధమానం బగుచున్నది. స్వప్రయోజనము సర్వత్ర ధర్మప్రయోజనముగను బరిణమించుచున్నది. ప్రపంచపరిస్థితులు వివిధసందర్భములందును మహాసంరంభమును ప్రత్యక్షము చేయుచున్నవి. ప్రపంచమునందు శాంతిని స్థాపించుటకును, రక్షించుటకును నేర్పడిన నానాజాతిసమితి ధర్మసంస్థాపనమునకును శాంతిసంరక్షణమునకును నామమాత్రముగ నున్నది.

* * * *

### ధర్మసంస్థాపనము - శాంతిసంరక్షణము

మహాభారతమునందు యుద్ధపర్వానంతరము శాంతిపర్వమును తదనంతరము అనుశాసనికపర్వమును వేదవ్యాసుడు వినిర్మించెను. వర్తమానకాలమునందు యుద్ధపర్వము ముగిసినను శాంతిపర్వారంభమునకు నిమిత్తములగోచరంబులు. శాంతిపర్వారంభము గాకను అనుశాసనికపర్వారంభ మసంభవము. ప్రపంచపరిస్థితులు యుద్ధపరోద్ధతములను నిరూపించుచున్నటులు శాంతిపర్వారంభమును నిరూపించుట లేదు. మంచూరియాయందు చీనా, జపానురాజ్యములకు సమరము ప్రవర్ధమానమగుచున్నది. నానాజాతిసమితి నిర్ణయించినటులు జపానుప్రభుత్వము ఆక్రమించిన దేశమును నవంబరు ౧౬-వ తేదిలోపలను ఖాళీ

చేయుటకు నిరాకరించుచున్నది. చీనాప్రభుత్వము జపానుసైన్యము లాక్రమించిన దేశమును ఖాళిచేయనంతవరకును సంధిప్రయత్నములు దుస్తరములని విస్పష్టము చేసినది. జపానుప్రతినిధిమాత్రము నానాజాతిసమితి నిర్ణయమునకు వ్యతిరేకాభిప్రాయమును దెలిపెను. జపానుప్రభుత్వము చూపిన ప్రతిఘటన మెటులు పరిణమించునదియును కాలము దెలుపగలదు. నానాజాతిసమితి ఏకగ్రీవముగను జేసిన నిర్ణయమును జపాను అంగీకరించుట ధర్మసంస్థాపనమునకును శాంతిసంరక్షణమునకును సాధనము. సిద్ధాంతమునందు శాంతియును కార్యములందు సంగ్రామమును శాంతిస్థాపనమునకు సాధనము గాదు.

మంచూరియాయం దారంభమైన సంగ్రామాంకురములు రాగల సంవత్సరమునందు మహాసంగ్రామరూపమును దాల్చుటయును సంభవము. జపాను సంగ్రామవిజయములతో మదించియున్నది. చీనా పరివర్తన జ్వరముతో బాధపడుచున్నది. రుష్యా మహాపరివర్తనోన్మాదముతో తాండవమాడుచున్నది. జర్మని పరాజయమానభంగముతో పరితపించుచున్నది. ఫ్రాన్సు విజయ బలసంపదలతో నుప్పొంగుచున్నది. గ్రేట్బ్రిటను విజయవిషాదములతో ధర్మసమ్మూఢభావమును దాల్చుచున్నది. హిందూస్థానము పారతంత్ర్యపంజరమునం దాత్మావలోకనమును జేయుచున్నది. శేషించిన దేశములును ప్రపంచరాజ్యాంగ నాటకరంగమునందు స్వీయసంస్కారమున కనురూపముగను నటించుచు భయసంభ్రమములకు పాల్పడుచున్నవి. అమెరికా సంయుక్తరాష్ట్రములు రాజ్యాంగనాటక సూత్రములను సడలించుచు బిగదీయుచు ధర్మ సమ్మూఢభావమును బూని విషాదానందముల ననుభవించుచున్నది. ప్రపంచ మంతయును ప్రళయతాండవరూపమును దాల్చుచున్నను ధర్మజిజ్ఞాస దుస్తరముగ నున్నది.

వివిధరాజ్యములకును అనిత్యములైన భాగ్యభోగములందు గల సంకల్పపరాకాష్ఠలు నిత్యమైన ధర్మారాధనమునందు గలుగకున్నవి. మంచూరియాయందు జపా నొకవైపునను, రుష్యా రెండవవైపునను సైన్యములను సమకూర్చుచున్నవి. పరివర్తన ప్రసవవేదన ననుభవించుచున్న చీనారాజ్యస్థితి దుర్భరముగ నున్నది. లోపలిస్థితిని చక్కబెట్టుకొనజాలని చీనాప్రభుత్వము బయటిస్థితిని చక్కబెట్టుకొనుట యసంభవము. విషయపరిశీలనమును జేయుట కమెరికా ప్రతినిధిని బంపినది. యుద్ధశాంతులు గ్రేట్బ్రిటను ఫ్రాన్సుప్రభుత్వము లవలంబింపనున్న రాజనీతిమీద నాధారపడియున్నవి. ఫ్రాన్సు బలసంపదలతో తాండవమాడుచున్నది. గ్రేట్బ్రిటను విషాదవ్యాకులమై తల్లడిల్లుచున్నది. గ్రేట్బ్రిటనునందు గతమాసమునందు ఎన్నికలయందు జాతీయపక్షమునకు గలిగిన పూర్ణవిజయమునకు ఫలమును ప్రస్తుతము నిర్ణయించుట దుస్తరముగ నున్నది. జాతీయప్రభుత్వము ఎన్నికలయందు గలిగిన మహావిజయమున చతుర్విధోపాయములను దేశావృతమైన పరమవిషాదావస్థను బోగొట్టుటకు విశ్వప్రయత్నములను జేయబూనునని విశ్వసింపదగియున్నది.

* * * *

## జాతీయప్రభుత్వము

ఎన్నికలయందు కార్మికపక్షమునకు గలిగిన పూర్ణపరాజయమును, కన్సర్వేటివుపక్షమునకు గలిగిన పూర్ణవిజయమును బ్రిటీషుప్రజాహృదయమునకును ప్రపంచపరిస్థితులకును లక్ష్యముగ నున్నవి. ఎన్నికలందు ౧౪౫ లక్షల వోటరులు జాతీయపక్షమునకును, ౭౦ లక్షలమంది కార్మికపక్షమునకును సమ్మతుల నిచ్చిరి. ౫౫౪ సభ్యులు జాతీయపక్షమునకును, ౬౧ సభ్యులు ప్రతికూలపక్షమునకును నెన్నుకొనబడిరి. జాతీయపక్షమునందు ౪౭౦ సభ్యులధికముగను గలరు. ఇంతబలాధిక్యము గల జాతీయపక్షము సాహసకార్యములకు బూనుకొనుట నిస్సందేహము. అతిబలమునందే దౌర్బల్యమంతర్గర్భితమైయుండుట ప్రకృతిధర్మము. కన్సర్వేటివుపక్షమునకు గలిగిన బలము విపరీతవ్యవహారములకు గారణభూతము గావచ్చును. జాతీయపక్షమునందు గల ౫౫౪ సభ్యులందును ౪౭౩ మంది కన్సర్వేటివుపక్షమునకు జెందియున్నారు. కన్సర్వేటివులు సుంకముల పద్ధతి నవలంబించుట బహిరంగరహస్యము. ఇంతటితోను తృప్తి పొందక దండయాత్రలకు బయలుదేరుటయును సంభవము. విషాదముపాలైన దేశమునందు సాహసకార్యములు ప్రజామోదమును బడయుట సహజము. నవంబరు ౧-వ తేదినుండి ఒకసంవత్సరము పర్యంతమును అమెరికా, ఇటలీ, ఫ్రాన్సు, గ్రేటుబ్రిటను మొదలగు దేశములు యుద్ధసన్నాహములను విరమించుట కంగీకరించినవి. ఈప్రమాణములను మంచూరియాయందలి పరిస్థితులెంతవరకు మార్చునో కాలము విశదము చేయగలదు. నవంబరు ౧౦-వ తేదియందు జాతీయపక్షము నిర్వహింపదలచిన వ్యవహారవిధానమును ప్రధానమంత్రి రామ్సే మాక్డొనాల్డుగారు విశదము చేయగలరు.

కన్సర్వేటివు పార్లమెంటునందు కార్మికపక్షనాయకుడు మాక్డొనాల్డుగారు ప్రధానమంత్రియై వ్యవహారములను నిర్వహించుట విచిత్రవిషయముగ నున్నది. లేబరుపక్షమును ధ్వంసముచేసిన మాక్డొనాల్డుగారు కన్సర్వేటివుపక్షమున కెంతయుపకారముచేయగలరో కాలము విశదము చేయగలదు. మాక్డొనాల్డుగారు కన్సర్వేటివుపక్షహస్తములందు కీలుబొమ్మవలెను మెలగవలసియుందురు. స్వతంత్రముగను వ్యవహరించుట కవకాశములను గలిగియుండరని రాజ్యాంగవాతావరణము విస్పష్టము చేయుచున్నది. స్వేచ్ఛావ్యాపారధర్మమును పోషించెడి పక్షనాయకుడు వ్యాపార నిరోధపక్షమునకు ప్రధానమంత్రిత్వమును వహించుట విపరీతదైవఘటనగ నున్నది. మాక్డొనాల్డుగారు స్వయముగ నేమి చేసికొన్నను పక్షమును ముంచివేయుట పరమాన్యాయముగ నున్నది. కార్మికపక్షనాయకులు హెండర్సను, వెడ్జివుడుబెన్ను గారులు మొదలగువారు పరాజితు లగుటవలనను బ్రిటీషువ్యవహారములకును ప్రపంచవ్యవహారములకును విశేషమైన నష్టము సంప్రాప్తము గాగల విధమును భావికాలవ్యవహారములు విశదము చేయగలవు. సామ్రాజ్యాభిమానమునకు విజయమును, సామ్రాజ్యాభిమాన ప్రతిఘటనమునకు పరాజయమును గలిగినవి. సామ్రాజ్యాభిమాన విజయమునందు ప్రపంచము నావరించిన ప్రళయావస్థ గోచరంబగుచున్నది. జాతీయపక్షవిజయము పరదేశములకువలెనే భరతవర్షమునకును ప్రయోజన

రహితముగ నుండునని యూహింపదగియు న్నది. లండను నగరమునందు ఫెడరలుకమిటి యందు జరుగుచున్న సంగతి సందర్భము లీ విష యమును విస్పష్టము చేయుచున్నవి. ఈసంది గ్ధసమయమునందు గాంధిమహాత్ముడు లండను నగరమునం దుండుట ధర్మసంస్థాపనమునకు, శాంతిసంరక్షణమునకు శుభచిహ్నముగ నున్నది.

* * * *

గాంధిమహాత్ముడు - శాంతిరక్షణము

ప్రపంచేతిహాసములందు గాంధిమహాత్ముని ఇంగ్లండుప్రవాస మ పూర్వచరిత్రముగ నుండ గలదు. అంగవస్త్రధారియైన గాంధిమహా త్ముడు జనాదరణమును బడయుచున్న విధ మాశ్చర్యమును గలిగించుచున్నది. రామా యణకథను "కట్టె, కొట్టె, తెచ్చె" అను మూడుమాటలతో ముగించినటులు గాంధి మహాత్ముని శాంతియాత్రను "వెడలె, చూచె, జయించె" అని మూడుమాటలతో ముగింప వచ్చును. గాంధిమహాత్ముని శాంతిసందేశము నందు విశ్వాసము లేని బ్రిటీషురాజ్యాధికారు లకును, పాశ్చాత్యప్రపంచమునకును భారతీ యులకు గాంధిమహాత్మునిపట్ల గల భక్తివిశ్వాస ములు లేకపోయినను, గాంధిమహాత్ముని అఖండవిజయము సర్వత్ర ప్రత్యక్ష మైనది. మతగురువులు, పండితులు, సామాన్యులు, వృద్ధులు, బాలురు, విద్యార్థులు, కార్మికులు గాంధిమహాత్మున కపూర్వమైన స్వాగతంబు నొసంగి ధర్మవిజయమును స్థాపించిరి. గాంధి మహాత్ముడు నిర్భయముగను కాంగ్రెసు నిర్ణ యించిన పూర్ణస్వరాజ్యాశయమును ప్రతిపా దించి స్వాతంత్ర్యప్రియుల ప్రశంసలకు పాత్ర తను బడసెను ఫెడరలు కమిటియందును, అల్పసంఖ్యాకుల యుపసంఘమునందును భేదా భిప్రాయములు ప్రబలి సంయోజనము కుదుర కపోవుట సంతాపకరము. విభేదములకు గాంధి మహాత్ముడు తెలిపినటులు ప్రభుత్వతంత్రమును, ప్రతినిధులును బాధ్యులు. ప్రభుత్వనియమితులు ప్రభుత్వవిధానమును పోషించవలసియుందురు.

జిన్నాగారును, అంబెడుకరుగారును నేమి చెప్పినను, గాంధిమహాత్మునిపట్లను మహమ్మదీ యులకును, నిమ్నజాతులకును గల విశ్వాసగౌ రవములలో సహస్రాంశమైనను ప్రజలకు వారి పట్ల లేదని నిర్భయముగను చెప్పవచ్చును. సంస్థానముల పక్షమునను, హైదరిగారు ఇస్మా యిలుగారును దెలిపిన భావములు విమర్శనా ర్హములైనను, బికనీరు మహారాజాగారు మొద లగువారు తెలిపిన భావములు సంకుచితములై నిరర్థకములుగ నున్నవి. భేదాభిప్రాయములను బూని దేశారిష్టమునకు గారకులైన భారతీయ ప్రతినిధులకు బ్రిటీషుఎన్నికలు జ్ఞానోదయ మును గలుగజేయవలసి యున్నది. బ్రిటీషు ప్రజలవలెనే భారతీయులును దేశక్షేమము విషయమున భేదాభిప్రాయములను విడ నాడవలసిన యవసరమును గ్రహించవలసి యుందురు. కాని పారతంత్ర్యము ననుభవిం చెడి దేశములందు భేదతంత్రమునకు గల బలము మిత్రతంత్రమునకు గలుగజాలదు.

ఫెడరలుకమిటి నిర్ణయించిన ఆర్థికవిధా నము కొంత సంతృప్తికరముగ నున్నటులు నివేదిక తెలుపుచున్నను గాంధిమహాత్ముడు తెలిపినటులు స్వరాజ్యము నిర్ణయము గానపు డితర నిర్ణయము లన్నియును నిరుపయోగ

ములు. ఆర్థికస్వాతంత్ర్యము, సైన్యము, రక్షణములు, ఉద్యోగములు, కేంద్రాధికారము నిర్ణయింపబడక, ఇతరవిషయములు నిర్ణయింపబడుటనిరుపయోగమని సామాన్యులును గ్రహింపగలరు. సర్ సామ్యుయేలు హోరుగారిదివరకే జాతీయప్రభుత్వ నిర్ణయములను సూచించిరి. ఆసూచనలు గాంధిమహాత్మునకును, నితరులకును నిరాశను గలుగజేయుచున్నవి. గాంధిమహాత్ముడుమాత్రము నిరాశను బూనక చివరవరకును వ్యవహారక్రమమును నడుపదలచినవిధము వారు నవంబరు ౧-వ తేదినాడు కేంబ్రిడ్జియందు జేసిన క్రింది ప్రసంగము విశదము చేయుచున్నది.

"రౌండుటేబిలు సభ విఫలమైనచో భారతదేశమున మరల సత్యాగ్రహమును ప్రారంభించుట నిశ్చయమేగాని అది వెంటనే జరుగదు. సత్యాగ్రహమును ప్రారంభింపక తప్పదు అని కాంగ్రెసువారికి తోచినచో వారు బాగుగా నాలోచించిన పిమ్మటనే నిర్ధారణ చేసెదరు. అటుపిమ్మట నా విషయమును ప్రకటించెదను. అటుపిమ్మటనే సత్యాగ్రహము ప్రారంభమగును."

గాంధిమహాత్ముని నిశ్చయము భారతపూర్ణస్వరాజ్యసంపాదనమునకును ప్రపంచశాంతికిని భారతీయులును, ప్రపంచమును, ననుష్ఠింపవలసిన అహింసాసాధనమును విస్పష్టముచేయుచున్నది. ప్రపంచావృతమైన దౌర్జన్యసాధనమును విసర్జించి శాంతిసాధనము నవలంబించవలసిన యవసరమును ప్రపంచావృతమైన ప్రళయావస్థ విశదముచేయుచున్నది.

* * *

సత్యాగ్రహము - దౌర్జన్యము

ప్రపంచవ్యవహారములందు ధర్మసంస్థాపనమునకును, శాంతిసంరక్షణమునకును, సత్యాగ్రహసాధనమునకును దౌర్జన్యసాధనమునకును ప్రవర్ధమానం బగుచున్న సంరంభమును ప్రపంచావృతమైన మహాసంక్షోభము వేయిముఖములను చాటుచున్నది. ప్రపంచయాత్రయందు సకలజీవులకును శాంతివలెను సంరంభము సహ్యము గాదు. పార్థుడు శ్రీకృష్ణపరమాత్ముని విశ్వరూప సందర్శనమును జేసినపుడు భయపడుటయును, తదనంతరము సౌమ్యరూపమును జూచినపుడు ఆనందించుటయును సకలజనులకును నిత్యానుభవమునందుగలవిషయము. ఈయనుభవమునే గాంధిమహాత్ముడు ప్రపంచమునకు నిత్యవ్యవహారములందు ప్రత్యక్షము చేయుచున్న విధము ప్రపంచమునందు సంచలనమును బుట్టించినది. సంకల్పసిద్ధి కాత్మార్పణమునకు గల సామర్థ్యము పరపీడనమునకు లేదు. దౌర్జన్యము పరమానర్థములకు మూలమగుచున్నది. నిరపరాధులెందరో ఒకదౌర్జన్యకార్యమునకు బలియగుచున్నారు. దౌర్జన్యమున కనురూపమైన ఫలము గలుగకున్నది. దౌర్జన్యమున కభ్యాసమైన ప్రపంచపరిస్థితులును, గాంధిమహాత్ముడవలంబించిన సత్యాగ్రహపరిపాకమును నీ పరమార్థమును పరిస్ఫుటము చేయుచున్నవి. సత్యాగ్రహనాయకుడైన గాంధిమహాత్మున కింగ్లాండునందు గలిగిన ధర్మవిజయ మహింసాప్రభావమును విశదము చేయుచున్నది. అహింసాప్రభావ మెటులున్నను స్వరాజ్యసంపాదనమును శాంతియుత ధర్మ

సాధనముల మూలమునను జేయుటకు భారతజాతీయమహాసభ నిర్ణయించినది. ఆనిర్ణయానుసారముగాను స్వరాజ్యస్థాపనమునకు గాంధిమహాత్ముడు చేయుచున్న ప్రయత్నములు ప్రపంచాదరణమును బడయుచున్నవి. గతసంవత్సరమునందు సత్యాగ్రహసమరమునందు కాంగ్రెసు పడసినవిజయము భారతీయులకనుభవసిద్ధము. అనుభవసిద్ధమైన శాంతిసాధనమును విడిచి ఘోరమైన దౌర్జన్యమార్గము నారాధించుట యనర్థదాయకము. విశ్వప్రవృత్తియందు శాంతిబీజములు శాంతిఫలములను, దౌర్జన్యబీజములు దౌర్జన్యఫలములను ఫలింప జేయుట ప్రకృతిధర్మము. వంగదేశమునందు గతవారమునందు విల్లియర్సు మూర్నోగార్లను జంపుటకు జేసిన దౌర్జన్యప్రయత్నములు పరమానర్థములకు మూలమగుచున్న విధమును దేశావృతమైన దండయాత్ర విశదము చేయుచున్నది. ప్రభుత్వము, యూరపియనులు, ప్రజలు చూపుచున్న నిరసనభావము నిరపరాధు లనుభవించుచున్న కష్టములు దౌర్జన్యమువలనను గలిగెడి బీభత్సమును వేయినోళ్లను చాటుచున్నవి. దేశస్వాతంత్ర్యప్రియులీపరమార్థమును గ్రహించి అహింసాదీక్షను బూని కామితార్థములను బడయుట దేశక్షేమమునకును ప్రపంచకళ్యాణమునకును శ్రేయోదాయకము. గ్రేటుబ్రిటనునందు జాతియప్రభుత్వము వ్యవహారవిధానము నెటులు నిర్ణయించునో దురూహ్యముగ నున్నది. రామ్సెమాక్డొనాల్డుగారు రౌండుటేబిలుసభ్యులతోను, గాంధిమహాత్మునితోను జేయుచున్న సంప్రతింపులాశాజనకములుగ నున్నవి. పార్లమెంటుసమావేశము కాగానే వారికాలమును భారతరాజ్యాంగసమస్యను నిర్ణయించుటకును, నిరూపించుటకును వినియోగించునటులు మాక్డొనాల్డుగారు చెప్పుచున్నారు. మాక్డొనాల్డుగారి యూహాపోహ లెటులున్నను, వారి నిర్ణయములను కన్సర్వేటివుసభ్యు లెంతవరకు బలపరచునదియును సంశయాస్పదము. మాక్డొనాల్డుగారిని కన్సర్వేటివుపక్షమువారి నిర్ణయముల ననుసరింప జేయుట యథార్థము. గాంధిమహాత్ముడుమాత్ర మొకవైపునను కాంగ్రెసు నిర్ణయములను ప్రతిపాదించుచు రెండవవైపునను మంత్రులతోను, సభ్యులతోను, ప్రతినిధులతోను సంప్రతింపులను జేయుచు, స్వధర్మనిర్వాహణమును జేయుచున్నవిధము స్వాతంత్ర్యప్రియులకును సేవాపరాయణులకును నాదర్శప్రాయముగ నుండగలదు.

ప్రపంచపరిస్థితులందు యుద్ధపర్వమంతరించి శాంతిపర్వమును, అనుశాసనికపర్వమును సాధ్యముచేయుటకు ప్రభుత్వములును ప్రజలును త్రికరణశుద్ధిగను సత్యాహింసాధర్మముల నారాధించుట యవసరము. పారతంత్ర్యస్థితియం దన్యోన్యవిశ్వాసమును, నాత్మవిశ్వాసమును లేకను దుఃఖవేదన ననుభవించుచున్న హిందూస్థానమునందు సత్యా హింసాధర్మారాధన మత్యంతావసరము. హిందూస్థానము వివిధమతస్థులకును, సాంఘికులకును, ప్రజలకును, ప్రభుత్వమునకును నాత్మవిశ్వాసము లేకను ప్రళయమార్గమునకు బలాత్కారముగ నీడ్వబడుచున్నది. హింసాదండనసాధనములు శాంతిస్థాపనమునకు ప్రభుత్వమునకును ప్రజలకును నిరుపయోగములు. గతసంవత్సరమునందు సంప్రాప్తమైన సత్యా

గ్రహప్రస్థాన మీావిషయమును ప్రభుత్వమున కును ప్రజలకును సువ్యక్తముచేసినవి. ఇంగ్లాం డునందు గాంధిమహాత్మునకు గలుగుచున్న ధర్మవిజయమును నీపరమార్థమును విశదము చేయుచున్నది. శాంతిధర్మప్రియులైన ప్రభు త్వాధికారులును ప్రజలును గాంధిమహా త్ముడు ఆత్మవిజయరూపమున నారాధ్యము చేసిన అను శాసనములను విని మననధ్యాన సంకీర్తనములను జేసి స్వరాజ్యమునకును ప్రపంచశాంతికిని సత్యాహింసా ధర్మముల నారాధించుట శ్రేయస్కరము.

* * * *

నిరంకుశాధికారము-దౌర్జన్యము

పరస్పరాశ్రయములేని నిరంకుశాధికార మును, దౌర్జన్యమును దుఃఖానుభవమునకు సాధనములైన విధమున సుఖశాంతులకు సాధనములుగావు. శాంతిసంరక్షణమునకు ప్రేమత్యాగసాధనములవలెను దండనాయుధ ములు నిరుపయోగములు. పరప్రభుత్వము, జాతి మతభేదములు గల దేశమునందు దండ నోపాయము గలుగజేసెడి బీభత్సము వర్ణనా తీతము. ప్రభుత్వనిర్మితములైన దండనాస్త్ర ములు దౌర్జన్యవ్యాపనమునకు దోడ్పడుచు న్నటులు దౌర్జన్యసంహారమునకు వినియోగ పడకున్నవి. దౌర్జన్యపరాయణు లవలంబిం చెడి హింసాకార్యములు నిర్బంధవ్యాపనము నకు వినియోగపడుచున్నవి. శాంతికి ప్రతి కూలములైన నిర్బంధ దౌర్జన్యసాధనములు పరి త్యాజ్యములు. గాంధిమహాత్ముడు ప్రజల దౌర్జ న్యములవలెను, నధికారుల నిరంకుశత్వమును నిర్భయముగను ఖండించుచు శాంతికి మార్గ దర్శకుడుగ నున్నాడు. చిట్టగాంగు హిజిలి దురంతములు ప్రజాదురంతములకు గారణము లగుటవలనను దురంతములు వ్యాపించును గాని, శాంతి వ్యాపింపజాలదు. విషమవృత్తము నందు పరితపించుచున్న భరతవర్షమునకును, ప్రపంచమునకును తరణోపాయము గాంధి మహాత్ము డారాధించుచున్న ఆత్మవిజయము నందును సత్యాగ్రహమునందును గలదని సకలదేశములందును—ముఖ్యముగను భరత ఖండమునందు ప్రజాప్రభుత్వములు గ్రహించి స్వధర్మనిర్వహణమును జేయుటకు భగవ దనుగ్రహము గలుగుగాత! కష్టభూయిష్ఠమైన ఆంధ్రరాష్ట్రమునందును ప్రజాధికారులును నీ పరమార్థమును గ్రహించి స్వధర్మారాధన మును జేయుట సంకల్పసిద్ధికి సాధనము.

* * * *

ఆంధ్ర రాష్ట్రము-ప్రజల కష్టములు

దేశావ్యాప్తమైన విషాదావస్థ ఆంధ్రరాష్ట్ర మును సంపూర్ణముగ నావహించినది. ఆంధ్ర రాష్ట్రమున గణనీయమైన పరిశ్రమలు లేవు; వ్యాపారము లేదు; ధనాగారములు లేవు. ప్రజాపోషణమునకు మూలమైన వ్యవ సాయపరిశ్రమము దురవస్థల పాలగుచు న్నది. ధాన్యములధరలు పడిపోయినవి. రయితులకు పరపతిని గల్పించుటకు ధనా గారములు దుర్లభములు. అతివృష్టి అనా వృష్టిదోషము లీదురవస్థకు దోడ్పడుచున్నవి. ఈదురవస్థకు దోడుగను, కృష్ణాగోదావరిమండ లములందు ప్రభుత్వము తరమును వృద్ధి చేయుటకు బూనుకొనుచున్నది. భూమిసిస్తును వృద్ధిచేయుట విషయమై ప్రబలమైన ప్రతిఘట నము గతించిన ౨౦ ఏండ్ల నుండియును దేశము నందు చెలరేగియున్నది.

భూమిసిస్తును తగ్గించుటకు బదులు వర్తమాన విషమపరిస్థితులందు పన్నును వృద్ధి చేయుట రాజనీతిగాదు. రయితుల దుర్భర దారిద్ర్యస్థితియందు రిసెటిలుమెంటు విషయమై దేశమునం దంతటను ప్రబలమైన ప్రతిఘటనము బయలుదేరుటయందు విచిత్రము గనుపడదు. ఈప్రతిఘటనమును ప్రభుత్వాధికారులు సామోపాయమునను శాంతింపజేయుట వివేకముగాని దండనోపాయమునను శాంతింపజేయబూనుట వివేకముగాదు. ఏలూరు సభయందు సభాధిపతి మేజస్ట్రేటు అధికారమును బూని శ్రీయుత నారాయణరాజు, అంజయ్య, పట్టాభిరామయ్యగార్లమీాదను దండనాయుధముల ప్రయోగించుట యన్యాయము. బహిరంగ సభలయందు సభాధిపతికి ఉపన్యాసకుల నంగీకరించుటకును ప్రతిషేధించుటకును నధికార మున్నను దండించుట కధికారము లేదని నాగరక ప్రపంచవ్యవహారములు చాటుచున్నవి. సభాధిపతి తన దండనాధికారమును వినియోగించుటయును, రివిన్యూశాఖామంత్రి దానిని సమర్థించుటయును న్యాయసమ్మతము గాజాలదు. రిసెటిల్మెంటువిషయమై ప్రజలయందు గలిగిన యుద్వేగము దీక్షాదినమునను, దేశమునం దంతటను జేయబడిన సభలును తీర్మానములును విశదము చేయుచున్నవి. గవర్నరుగారును క్యాంబెలుగారును వారిప్రసంగములందు ధరప్రతుల ననుసరించి తరము వసూలు నిర్ధారణ చేయబడునని సూచించిరి. ధరలు గతసంవత్సర మంతయును తగ్గియున్నవి. వర్తమానసంవత్సరమునందు కొంచెము పెరిగినను హెచ్చుపన్నును వసూలు చేయదలచుట యనర్థదాయకము. అధికారు లనవసరముగను నిర్బంధాయుధములను ప్రయోగించుటయును శాంతికిని క్షేమమునకును సాధనముగాదు. ప్రజలును వారిశక్తి సామర్థ్యములను సభలకును తీర్మానములకును వినియోగించి సంతృప్తిని జెందుట కార్యసిద్ధికి సాధనముగాదు. కాంగ్రెసుపక్షము వారు వారిశక్తి సామర్థ్యములను స్థానికసంస్థలం దధికారలాభమునకై వినియోగించుటయును నిరుపయోగము. ప్రజలందరును గాంధిమహాత్ముడును, కాంగ్రెసుమహాసభయును నిర్ణయించిన నిర్మాణకార్యవిధానము నాచరింపవలసిన యవసరము నాంధ్రదేశపరిస్థితులును ప్రపంచపరిస్థితులును విశదము చేయుచున్నవి. ప్రజలు రిసెటిల్మెంటు దీక్షాదినమునందుజూపిన యుత్సాహకార్యపరత్వములను నిర్మాణకార్యవిధానమునందుజూపుట ప్రయోజనకరము. ప్రజాశయపూరణమునందుసామాన్యాశయములును ప్రయోజనములును సులభముగను సఫలముగా గలవు. రయితుల సమస్యకును స్వరాజ్యసమస్యయే మూలాధారముగ నున్నది. ప్రజలందరును వారిశక్తిసామర్థ్యములను సాంఘిక ప్రయోజనములకును, స్థానిక ప్రయోజనములకును, ప్రత్యేక ప్రయోజనమునకును, స్వప్రయోజనములకును వినియోగించి విభేదముల నభివృద్ధి చేయుటకన్నను సమగ్రమైన కాంగ్రెసు ప్రయోజనములకును, దేశప్రయోజనములకును, వినియోగించుటవలనను, సత్యాగ్రహసాధనమునను, ప్రత్యేకలాభములతోపాటు పూర్ణస్వరాజ్యమును నయితము పొందగలరు. గాంధిమహాత్ము డాత్మరూపమున నారాధించుచున్న సత్యాగ్రహానుశాసనము నాంధ్రులును, యథాశక్తి నారాధించి కామితార్థములను బడయుదురుగాత!

Printed and Published by K. Nageswara Rao, at the Andhra PatrikaPress, No.7, Thambu Chetty St., Madras